# హరవిలాస కావ్య విమర్శనము

పి. హెచ్. డి. సిద్ధాంతవ్యాసము
మద్రాసు విశ్వవిద్యాలయము

డాక్టర్ శ్రీమతి ఎం. కె. జయభారతి, ఎం.ఏ., పి. హెచ్. డి.
ఆంధ్రోపన్యాసకురాలు, తెలుగుశాఖ
డి. ఆర్. బి. సి. పి. సి. హిందూ కళాశాల,
మద్రాసు - 600 072.

# Haravilāsamu - A Critical Study

Doctoral Thesis of
**Dr. (Mrs) M. K. Jayabharathi**
Professor & Head of the Dept. of Telugu
D. R. B. C. C. C. Hindu College, Madras-600 072.



*First Edition:* 1991

*Copies:* 1000

*Cover Design:* Bapu

*Price:* Rs. 60





*For Copies:*
**Mrs. M. K. Jayabharathi**
8, Perambur High Road, Ist Street,
Madras-12.

*Printed at:*
Kranti Press, Madras - 600 001,

# హరవిలాస కావ్యవిమర్శనము

పి. హెచ్. డి. సిద్ధాంతవ్యాసము
మద్రాసు విశ్వవిద్యాలయము

డాక్టర్ శ్రీమతి ఎం. కె. జయభారతి, ఎం.ఏ., పి.హెచ్.డి.
ఆంధ్రోపన్యాసకురాలు, తెలుగుశాఖ
డి. ఆర్. బి. సి. సి. సి. హిందూ కళాశాల,
మద్రాసు - 600 072.

# కృతజ్ఞతాంజలి

పరిశోధనాంశమును నా అభిరుచి ననుసరించి నిర్ణయించి తమ అమూల్యమగు సలహాలతోను, సమధిక ప్రోత్సాహముతోను పరిశోధనా పర్యవేక్షకులుగ నా కొసగి ఈ సిద్ధాంత వ్యాసము నామూలాగ్రముగ పరిశీలించి, నా కృషి నభినందించిన మద్రాసు విద్యాలయ తెలుగు శాఖాచార్యులు శ్రీయుతులు డా॥ జి. వి. ఎస్. ఆర్. కృష్ణమూర్తికి నా కృతజ్ఞతాభి వందనములు.

పరిశోధన కనుమతించి తమ సౌహార్ద్ర సహాకారముల నందించిన మాన్యులు డా॥ అప్పారావుగారికి నా నమోవాకములు.

ఎడనెడ వలసిన సలహాలతో పరిశోధనకు తోడ్పడిన డా॥ శ్రీ రామచంద్రగారికి, డా॥ శ్రీ అక్కిరెడ్డిగారికి నా ధన్యవాదములు.

ప్రారంభదశలో సిద్ధాంత వ్యాసరూప నిర్దేశ మొనర్చి పరిశోధనా జిజ్ఞాసువుగా నొనర్చిన కీ॥ శే॥ డా॥ తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారి కివే నా శ్రద్ధాంజలులు.

తెలుగుశాఖలో పరిశోధన గావించుటకనుమతించిన మద్రాసు విశ్వవిద్యాలయము వారికిని, ధర్మమూర్తి రావ్ బహద్దూర్ కలవల కణ్ణన్ చెట్టి హిందూ కళాశాల నిర్వాహకులకును నా కృతజ్ఞతలు.

నా పరిశోధన నిరాటంకముగ సాగుటకు తోడ్పడిన కన్నడ సంస్కృత శాఖాధ్యాపకులకులకు ధన్యవాదములు.

సంస్కృత తమిళ మూలగ్రంథముల నర్థము చేసికొనుటకు తోడ్పడిన శ్రీ శ్రీనివాస పద్మనాభన్, డా॥ నాగలింగంగార్లకు, వ్రాతపతిని రూపొందించిన మధుసూదనరావుగార్లకు నా కృతజ్ఞతలు.

అన్నిటికిమించి ఆశీర్వాద మొసగి పరిశోధనను ప్రోత్సహించిన మా తండ్రిగారు కీ॥ శే॥ యం. కె. లక్ష్మణ శర్మగారికి నా నివాళులు. మిత్రురాలు, శ్రేయోభిలాషియైన డా॥ ఎం. వి. నళిని గారికి నా ధన్యవాదములు.

ముద్రణ కార్యభారమును చేపట్టి సకాలమునకు ముద్రించి ఇచ్చిన క్రాంతి ప్రెస్సు, రత్నం అధినేతలకు నా కృతజ్ఞతలు.

అడిగినంతనే నా పరిశోధనా వ్యాసమును పరిశీలించి తమ అమూల్యాభిప్రాయ మిచ్చిన ఆచార్య డా॥ శ్రీ సాళ్వ కృష్ణమూర్తికిని, డా॥ శ్రీ జి. వి. యస్. ఆర్. కృష్ణమూర్తిగార్లకు నా వందనములు.

డా॥ జి. వి. యస్. ఆర్. కృష్ణమూర్తి,
రీడర్
తెలుగుశాఖ, మద్రాసు విశ్వవిద్యాలయం.

# ఆమోదం

కవిసార్వభౌమ కృత కావ్య కుసుమావళిలో ఒక కుసుమం హరవిలాసం. ఈ కావ్య పరామర్శనం గావించిన పండితశ్రేష్ఠు లనేకులు. పునః కావ్య పరిశీలనం చేయాలంటే శక్తిసామర్థ్యాలతో పాటు, ధైర్యంతో కూడిన పరిశోధనాసక్తి కావాలి. శ్రీమతి జయ భారతి ఈ కావ్య సమగ్ర పరిశోధనకు ఉపక్రమించి, సిద్ధాంత వ్యాసాన్ని వ్రాసి, పరిశీలకుల మన్ననలను పొంది, 1984 లో మద్రాసు విశ్వవిద్యాలయం నుండి పి. హెచ్. డి. పట్టాను పొందింది. ఆ సిద్ధాంత వ్యాసానికి అచ్చు ప్రతే ఈ గ్రంథం.

పాండిత్య ప్రకర్ష రహితంగా శ్రీనాథుని కావ్యపరిశీలనం దుస్సాహసం. కాని రచయిత్రిది దుస్సాహసం కాదు. సాహసమే. అంతేకాదు బహు భాషా పరిచయం కూడా అవసరం. రచయిత్రికి గల సంస్కృత, తమిళ, కన్నడాది భాషల పరిచయం ఈ పరిశోధ నకు సమగ్రతను చేకూర్చింది.

హరవిలాస గ్రథిత ఇతివృత్తాలు ఏకకాలికాలు కావు. అంతేకాదు. ఏక ప్రక్రియా సంబంధులూ కావు. చిఱుతొండ నంబి కథ చారిత్రకం కాగా, మిగిలిన కథలు పౌరాణికాలు, ఐతిహాసి కాలు. అందుకే హరవిలాసం అసలు కావ్యమా? అనే విషయం మీదనే అనేక విమర్శనాత్మక చర్చలు జరిగాయి. రచయిత్రి చివరి అధ్యాయంలో సహేతుకంగా చర్చించి 'హరవిలాసం' కావ్యమేనని నిరూపణ కావించింది.

చారిత్రకమైన చిఱుతొండనంబి కథకు మూలం వివాద గ్రస్తం. ఈ కథా సంబంధ కథలు తమిళ పెరియపురాణంలోనూ,

భీమయ కన్నడ బసవపురాణంలోనూ, సోమన తెలుగు బసవ పురాణంలోనూ కన్పిస్తున్నవి. ఇంతేకాదు. జానపదుల్లో కూడా ఈ కథ ప్రాచుర్యాన్ని గడించింది. రచయిత్రి అన్ని ఆకరాలను సమగ్రంగా పరిశీలించి, విమర్శనాత్మకంగా తులనాత్మక పరిశోధన గావించి భేదసాదృశ్యాలను ఉట్టంకించింది.

గౌరీకల్యాణ ఘట్టానికి ప్రాతిపదిక కాళిదాసకృత కుమార సంభవం కాగా, కన్నడ గిరిజా కల్యాణంలోనూ, నన్నెచోడుని కుమార సంభవంలోనూ కొన్ని అనుసరణలు కన్పిస్తున్నాయి. రచయిత్రి అన్ని గ్రంథాలను ఆమూలాగ్రంగా పరిశీలించి, సవిమర్శనాత్మక పరిశోధన గావించింది.

దేవదారు వనవిహార సంబంధ గ్రంథాలు అనేకం. అందులో స్కాంద, బ్రహ్మాండ, వామన, శివలింగ, కూర్మపురాణాలు ముఖ్యమైనవి. ఉత్ప్రేక్షావల్లభుని భిక్షాటన కావ్య అనుసరణలు కూడ పెక్కు తావుల్లో కనిపిస్తున్నాయి. అన్ని ఆకరాలను సమగ్రంగా పరిశీలించి ఎక్కడ నుండి ఏ విషయాన్ని గ్రహించిందీ సహేతుకంగా ఉట్టంకించడం జరిగింది.

వార్ధి మథనవృత్తాంతానికి మూలం పురాణ ప్రథితం. అంతేగాక సంస్కృత, తెలుగు భీమఖండాలు ఆధారాలు. సంస్కృత భాగవతం హరిలీలకు సంబంధించినదైనప్పటికీ తదనుసరణ కొన్ని తావుల్లో కనిపిస్తుంది. ఈ విషయాలన్నింటినీ దృష్టిలో పెట్టుకొని ఈ అధ్యాయంలో పరిశీలించడం జరిగింది.

కిరాతార్జునీయ ఘట్టానికి మూలాలైన సంస్కృతాంధ్ర భారతాలనూ, భారవి కిరాతార్జునీయాన్ని సమగ్రంగా పరిశీలించి తులనాత్మక పరిశోధన గావించడమే కాకుండా, అవాంతర కథా కల్పనా ప్రయోజనాన్ని కూడ తెలియజేసింది రచయిత్రి.

ప్రయోజనరహిత పరిశోధన వ్యర్థం. కాగా ఈ ప్రాచీన కావ్య పరిశోధనా ప్రయోజన మేమిటనేది ప్రశ్నగా ఉదయిస్తుంది. బాహ్యారూపాన్ని మాత్రం గమనించినప్పుడు ఈ పరిశోధన ప్రయోజనరహితంగానే కన్పిస్తుంది. కాని అంతర్గత విశేషాలను అవగాహన చేసుకున్నప్పుడు ఈ పరిశోధన సామాజిక ప్రయోజనాలను సాధించేదిగా కన్పిస్తుంది. చిఱుతొండ నంబి కథ చార్రిత్రక సత్యాలను వ్యక్తం చేస్తుంది. తులనాత్మక పరిశోధన భిన్నభాషా సమాజాల సంబంధ బాంధవ్యాలను వెలువరిస్తుంది. అది జాతీయ సమైక్యతకు దోహదకారి. ఈ రచనలో శ్రీనాథ సమకాలీన, తత్పూర్వ సామాజిక విశేషాలనేకం చోటు చేసుకున్నాయి. వివాహ సంబంధ విషయాలనేకం గౌరీ కల్యాణ ఘట్టంలో కన్పిస్తాయి. రచయిత్రి వేదకాలంనుండీ గల వైవాహిక వ్యవస్థను వివరించి, పార్వతి పరమేశ్వరుల వివాహ సందర్భంగా ద్యోతకమయ్యే వివాహ విధుల నన్నింటినీ చక్కగా తీర్చి దిద్దింది. కావ్యం మూఢభక్తికి సంబంధించింది అయినప్పటికీ, ఈ పరిశోధన మతసామరస్యానికి ఉపకరించేదిగా కన్పిస్తున్నది.

సిద్ధాంతవ్యాసభాష సునిశిత సులభ గ్రాంథికం. పాఠకులను ఆది నుండి తుదివరకు చదివించగలిగిన శక్తి గలది.

ప్రమాదవశాత్తు దొర్లిన చిన్న చిన్న తప్పులు తప్ప, మొత్తం మీద గ్రంథం సమగ్రమని చెప్పవచ్చు. అయినా మంచి చెడులను విచారించవలసినవాళ్ళు సద్విమర్శకులు. మొత్తంమీద ఈ గ్రంథానికి మంచి ఆదరణ లభిస్తుందని ఆశిస్తున్నాను.

మద్రాసు
25-5-90

డా॥ కృష్ణమూర్తి

ఆచార్య డా॥ సాళ్వ కృష్ణమూర్తి,
77, 10 వెస్ట్ స్ట్రీట్, కామరాజ్ నగర్,
మద్రాసు - 41.

# మైకోలు

తెలుగులో శ్రీనాథుడు ఉద్దండుడైన మహాకవి; బ్రాహ్మీదత్త వరప్రసాదుడు; సకలవిద్యాసనాథుడు; పెదకోమటి వేమారెడ్డి ఆస్థానమున దాదాపు ఇరువదేండ్లు విద్యాధికారి; విజయనగర దేవరాయాస్థాన పరికల్పిత స్వర్ణాభిషేకుడు; కవిసార్వభౌముడు; యుగకర్త. అతని కావ్యాల మీద ఎన్నో గ్రంథాలు, వ్యాసాలు వచ్చినవి. అన్నింటిలోను ఏదో ఒక విశేషము ప్రస్తుతి కెక్కుతూనే వస్తున్నది.

శ్రీనాథుని కృతుల్లో 'హరవిలాసము' సరళమైన రచన; పండితులు కానివారికి కూడా రసప్లావితంగా ఉండే రచన. దీనిలో చిఱుతొండ నంబికథ, గౌరీకల్యాణము, పరమేశ్వరుని దారుకావన విహారము, సముద్ర మథన కాలమున పరమేశ్వరుడు హాలహాల భక్షణము సేయుట, కిరాతార్జునీయ కథ — హరుని విలాస కృత్యాలుగా అభివర్ణింపబడినవి. శివపరమైన ఈ కథల్లో శ్రీనాథుని శివభక్తి కవితాపరమైన విచ్ఛిత్తి విశేషంగా ప్రకాశించింది

శ్రీమతి జయభారతిగారి ఈ హరవిలాస కావ్యవిమర్శలో క్రొత్త సిద్ధాంత మేదీ ప్రతిపాదింపబడకపోయినా ఈ కావ్యాధ్యయనానికి కావలసిన విషయసేకరణ - వైశద్యానికి దోహదం చేసేది - ఎంతో కొంత ఉన్నదనక తీరదు. తమిళ పెరియపురాణం, తెనుగు కన్నడ బసవపురాణాలు, సంస్కృత శివభక్త విలాసం మొదలైన వాని వెలుగులో చిఱుతొండ నంబి కథ పరిశీలింపబడింది. కాళిదాస కుమారసంభవంతోపాటు కన్నడంలోని హరిహరుని గిరిజా కల్యాణం, తెనుగున నన్నెచోడుని కుమారసంభవాల వెలుగులో

గౌరీకల్యాణ కథ దర్శింపబడింది. పరమేశ్వరుని దారుకా వనవిహార కథ పౌరాణికమూలములతోనే కాక ఉత్ప్రేక్షావల్లభుని 'భిక్షాటన కావ్యం' వెలుగులోను చూడబడింది. వార్ధిమథన వృత్తాంత కథ పౌరాణిక దృష్టితోనే చూడబడినది. కిరాతార్జునీయకథ భారత మూలాన్ని భారవి కావ్యాన్ని గ్రహించి దర్శింపబడింది. దీనిలో పాశుపతశైవాన్ని గూర్చి స్పృశించడం జరిగింది.

శ్రీనాథుడు మహాపండితుడు. అతన్ని ఒక మార్గానికి కట్టి వేయడం సులభం కాదు. కిరాతార్జునీయ కథలో పరమేశ్వరుడు కిరాతవేషం ధరించడాన్ని వర్ణించిన 'వికట పాటల జటామకుటికా భారంబు కఱకైన జుంజురు నెఱులుగాఁగ' అనే పద్యం (హర. వి. 7-41) కాశ్మీర దేశంలో ప్రసిద్ధి కెక్కిన ప్రత్యభిజ్ఞా శాస్త్రమన బడే శైవానికి అంగీకార్యమైన 'వివర్తవాదానికి అనుగుణంగా వ్రాయబడిందనేది చాలమందికి తెలియదు. త్రికశాస్త్రం, ప్రత్యభిజ్ఞా శాస్త్రం అనబడే ఈ ఈశ్వర ప్రత్యభిజ్ఞాశైవమే భారతంలో 'ప్రతిస్మృతి విద్య' అనబడింది. మహాకవుల రచనలు నీరుకొలది తామరగా ఉంటాయి.

జయభారతి చేసిన ఈ హరవిలాస కావ్యవిమర్శ ప్రయత్నం సాహిత్య జిజ్ఞాసువులకు ఉపకరిస్తుందని నా ఆశంసనము — ఇతి శివమ్.

మద్రాసు<br>20-5-90

ఆచార్య డాక్టర్ సాళ్వ కృష్ణమూర్తి

# ప్రవేశిక

మహాకవి, కవిసార్వభౌముడైన శ్రీనాథు నెరుగని ఆంధ్రు డుండడు. ఆతని కృతులమాట యటుంచిన ఆతని చాటు పద్యముల గూర్చి తెలియనివారుండరు. దక్షిణ భారతదేశమంతట పర్యటించి సాహితీ సౌరభముల వెదజల్లిన శ్రీనాథుని కవితా పటుత్వము తరువాతి ఆంధ్రకవుల కెందరికినో ఆదర్శప్రాయమైనది.

పుంభావ సరస్వతిగా కీర్తింపబడిన శ్రీనాథుని సంస్కృతాంధ్ర బహుళమగు కవితాశైలి అనన్య సదృశము.

కందుకూరి వీరేశలింగం పంతులు, కొమర్రాజు లక్ష్మణరావు, చిలుకూరి నారాయణరావు, నేలటూరి వేంకటరమణయ్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, బండారు తమ్మయ, చాగంటి శేషయ్య వంటి పండితులు హరవిలాసమును భిన్న దృక్పథములతో పఠించిరి.

డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తి 'శ్రీనాథుడు' అను తమ గ్రంథములో కవికాల, కృతుల క్రమము, జన్మస్థలాదుల గూర్చిన వివాదములను, విమర్శలను గూర్చి సమగ్రముగ చర్చించి హరవిలాస రచనా కాలమును క్రీ. శ. 1400 అని నిరూపించిరి.

శ్రీచిలుకూరు పాపయ్యశాస్త్రి, శ్రీఅక్కిరాజు ఉమాకాన్తం, గాండీవివంటి మరికొందరు పండితులు శ్రీనాథుని కవిత్వముగూర్చియు, మతము వివిధములగు పరిశోధనా వ్యాసముల రచించి ప్రకటించిరి.

శ్రీనేతి అనంతరామశాస్త్రిగారు శ్రీనాథుని కృతులను భాషా పరముగ పరిశీలించిరి. శ్రీజయకృష్ణ బాపూజీ "శ్రీనాథుని సాహిత్య ప్రస్థానము" శ్రీనాథ కృతులనన్నిటినిగూర్చిన పరిశోధనా గ్రంథము.

పై చెప్పిన పూర్వ పరిశోధకుల పరిశోధన నా పరిశోధనా పాటవమునకు ఒక పట్టునిచ్చినది. అందులకు వారికి నా కృతజ్ఞతలు.

నాకు తెలిసినంతవరకు సమగ్రము, తులనాత్మకమగు పరిశోధన హరవిలాసమును గూర్చి జరిగియుండలేదు. అందులకే శివభక్తి విలసితమగు హరవిలాసము నగల శ్రీనాథుని ప్రతిభా పాండిత్యములు, వర్ణనా చాతుర్యము, పాత్రపోషణ కవితా విలక్షణములు రూపింప దలచితిని.

మహాశివరాత్రి పర్వదినమున నీ సిద్ధాంత వ్యాసము సమర్పింపబడుట (29-3-84) ఒక విశేషము. హరవిలాసము మూల కథాదికములలోను, తదితర కావ్య సత్యములను వెలికి తెచ్చినది.

---

# ఉపోద్ఘాతము

0.0 ప్రబంధ యుగావిర్భావమునకు బీజావాప మొనర్చి, తన్మార్గమును తన రచనా వైశిష్ట్యముచే సముజ్జ్వల శోభా మహనీయమొనర్చిన మహా కవీంద్రుడు శ్రీనాథుడు. ఆంధ్రసాహిత్యమున అత్యధిక గ్రంథ నిర్మాణ మొనర్చి యుగకర్తయై నూతన సాహిత్య ప్రక్రియల కొజ్జబంతియై వెలసినట్టివాడు. సంస్కృతేతిహాస పురాణ కావ్యానువాదములే గాక సాంఘికేతి వృత్త రచనములతో సామాన్య జన జీవిత ప్రతిబింబమగు ప్రజా కవితా రచనము లొనర్చి, పెక్కు రాజాస్థానముల జొచ్చి భూనేతల కడ ఉపాయన సత్కారాదుల నందిన మహితాత్ముడు.

బ్రాహ్మీదత్త వరప్రసాదుడై, పుంభావ సరస్వతియై, సకలాగమశాస్త్ర పురాణ నిష్ణాతుడై సకలవిద్యా సనాథుడై సంస్కృతాంధ్ర కావ్యకళాదక్షుడై కవిసార్వభౌమ బిరుదాంకితుడైన కవిశేఖరుడు. అట్టి కవీంద్రుని ప్రతిభావ్యుత్పత్తుల గూర్చియు, భక్తితత్పరతను గూర్చియు, బహుముఖ పాండిత్యమును గూర్చి సింగనామాత్యుడు

బ్రాహ్మీదత్త వరప్రసాదుడ, పురుప్రజ్ఞా విశేషోదయా
జిహ్మస్వాంతుడ, వీశ్వరార్చన కళాశీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత
బ్రహ్మజ్ఞాన కళాధురీణుడవు నీ భాగ్యంబు సామాన్యమే.

అని ప్రస్తుతించెను. (శృం. నై)

వీరభద్రారెడ్డి రాజమహేంద్రవరమునకు శ్రీనాథుని పిలిపించి

ఈక్షోణిన్ నినుబోలు సత్కవులు లేరీ నాటి కాలంబునన్
దక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరో భామిన్

వక్షోజద్వయ గంధసార ఘుసృణ ద్వైరాజ్యభారంబున
దక్షించున్ గని సార్వభౌమ! భవదీయ ప్రౌఢ సాహిత్యముల్.
అని ప్రశంసించి, 'కాశీఖండ' ప్రబంధము నంకితము చేయమనికోరెను.

సింగనామాత్యుడు వీరభద్రారెడ్డి పేర్కొనిన దానిని బట్టి శ్రీనాథుని పాండిత్య ప్రకర్ష యెట్టిదో వ్యక్తమగును.

శ్రీనాథుడే తన కవిత్వ తత్త్వవిచారము చేసెను.

"పంపా విరూపాక్ష బహు జటాజూటికా
రగ్వధ ప్రసవ సౌరభ్యములకు
తుంగభద్రా సముత్తుంగ వీచీ ఘటా
గంభీర ఘుమ ఘుమారంభములకు
గళసాపుర ప్రాంత కదళీ వనాంతర
ద్రాక్షలతా ఫల స్తబకములకు
గర్ణాట కామినీ కర్ణహాటక రత్న
తాటంకయుగధాళ ధళ్యములకు
నిర్నిబంధ నిబంధమై నెనయు కవిత
తెలుగునను సంస్కృతంబునఁ బలుక నేర్తు—

ప్రసవ సౌరభ్యములకు సముత్తుంగ వీచీఘటా గంభీర ఘుమ ఘుమారంభములకు, కదళీ వనాంతర ద్రాక్షలతా ఫల స్తబకములకు, కర్ణాట కామినీ కర్ణహాటక రత్న తాటంక యుగధాళ ధళ్యములకు నిర్నిబంధమైన సంస్కృతాంధ్రమయ శబ్దబ్రహ్మము నుండి విర జిమ్మెడి కవిత్వము నల్లగల దిట్ట.

శ్రీనాథుని శైలీ నిర్వచన మొనర్చుట కష్టసాధ్యము. ఆయన శైలి సందర్భోచితము. రసిక రసాయనము. తద్విన్యాస వైదగ్ధ్యము స్వతంత్ర మయినను పూర్వకవితాభిమాన మెనయ తద్రచన మొనర్చిన తావులు కలవు.

శ్రీనాథుడే

వచియింతు వేములవాడ భీమన భంగి
నుద్దండ లీల నొక్కొక్క మాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు తిక్కయజ్వ ప్రకారము రసా
భ్యుచిత బంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని త్రోవ
సూక్తి వైచిత్రి నొక్కొక్క మాటు

అని చెప్పికొనెను.

ఇట్టి కవితా సార్వభౌముని కవిత్వ పటుత్వమద్వితీయము. శ్రీనాథుని పాండిత్య ప్రకర్షను, బహుభాషా పరిజ్ఞానమును, వివిధ శాస్త్రకళా కౌశలాతిశయము గల పాండిత్యమును గూర్చి శ్రీనాథుని 'కూరిమి సేయు మఱిది' దగ్గుపల్లి దుగ్గన నాసికేతోపాఖ్యానమున నిట్లు వివరించెను:

"సంస్కృత ప్రాకృత శౌరసేనీ ముఖ్య
భాషాపరిజ్ఞాన పాటవంబు
పన్నగపతి సార్వభౌము, భాషిత మహా
భాష్య విద్యా సమభ్యాసబలము
నక్షపాద కణాద పక్షిలోదీరత
న్యాయ కళా కౌశలాతిశయము
శ్రుతి పురాణాగమ స్మృతి సాంఖ్య సిద్ధాంత
కబళన వ్యుత్పత్తి గౌరవంబు

తే॥ పూర్వకవి ముఖ్య విరచితా పూర్వ కావ్య
భావ రస సుధా చర్వణ ప్రౌఢతయును
గండళింపగ గాశికా ఖండ నైష
ధ ప్రముఖ వివిధ ప్రబంధము లొనర్చి." (నాసి-పీఠిక)

శ్రీనాథుడు పాకనాటి నియోగి బ్రాహ్మణుడు. భారద్వాజ గోత్రుడు ఆపస్తంబ సత్సూత్రుడు. 'విద్యారాజీవభవుడైన మారయకు, పుణ్యాచారభీమాంబకు'' ప్రియపుత్రుడు. ఆంధ్ర పద్మపురాణ కృతికర్త యగు కమలనాభామాత్యుని పౌత్రుడు. వారిధీ తటీకాల్పట్టణము తాతగారిది. అది పాకనాటియందు కలదు. ఈ విషయములు కావ్య నిర్దిష్టములు. కాని శ్రీనాథుని జన్మస్థల కాలాదులను నిర్ణయించుటకు సరియైన ఆధారములు లేవు. అందులకే వాదోపవాదములు.

కాల్పట్టణము నెల్లూరు మండలము నందలిదని కొందరు, కృష్ణా మండలము నందలి కాల్పట్టణమేనని మరి కొందరు. కాల్పట్టణము ఆంధ్ర దేశములోనిది కాదనియు కర్ణాటక దేశమందు సముద్ర ప్రాంతమున నొక యూరై యుండవచ్చుననియు, శ్రీనాథుడు కర్ణాటుడేగాని, యాంధ్రుడు కాడనియు సిద్ధాంత రాద్ధాంతములు బయలు దేరినవి. వారలకు శ్రీనాథుని కావ్యములలోని—

''కర్ణాట కటక పద్మ వనహేళి శ్రీనాథభట్టసుకవి''
''తల్లీ కన్నడ రాజలక్ష్మి దయలేదా నేను శ్రీనాథుడన్''
''నా కవిత్వంబు నిజము కర్ణాట భాష''

— ఇత్యాదులు బలమిచ్చినవి. ఈ వాదమును పరాకాష్ట మొనర్చి హేతుపూర్వకముగ విచారించి శ్రీనాథు డాంధ్రుడేననియు, ఆంధ్ర దేశమునందలి కృష్ణా మండలము నందలి లేక నెల్లూరు మండలము నందలి కాల్పట్టణ మాతని జన్మస్థలమని సిద్ధాంతీకరించిరి.

## 0.1 శ్రీనాథుని జన్మకాలము – రచనలు:

శ్రీనాథుని జననకాలము, కావ్యరచనా కాలములు వాని పూర్వాపౌరములు తెలుపుట కాధారములు పెక్కులున్నప్పటికి ఆ విషయములు వివాద గ్రస్తములు. ఆధారములలో ఈ క్రింది పద్య మాణిముత్యము.

"చిన్నారి పొన్నారి చిఱుత కూకటినాడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూగు మీసాల నూత్న యౌవనమున
శాలివాహన సప్తశతి నొడివితి
సంతరించితి నిండు జవ్వనంబున యందు
హర్ష నైషధ కావ్యమాంధ్ర భాష
ప్రౌఢ నిర్భర వయః పరిపాకమున గొని
యాడితి భీమనాయకుని మహిమ

ప్రాయమింతకు మిగుల గైప్రాలకుండ
గా శిఖాఖండమను మహాగ్రంథమేను
దెనుగు చేసెద గర్ణాట దేశ కటక
పద్మ వనహేళి శ్రీనాథ భట్ట సుకవి." (కా. ఖం. 1-7)

— పై చెప్పిన పద్యమందలి యా యా ప్రాయములకు తగిన వత్సర పరిమితిని విమర్శకులు తమకు తోచినట్లు అయిదారేండ్ల వ్యత్యాసముతో నిర్ణయించిరి. వారి వాదోపవాదములను పరిశీలించి సమష్టిపై శ్రీనాథుడు క్రీ. శ. 1360 – 1380 సంవత్సరముల మధ్య కాలమున జన్మించెనని నిర్ధారితము చేయవచ్చును. బాల్యము నుండియే కవిత చెప్పనేర్చినవాడు శ్రీనాథుడు. ప్రథమ కృతి మరుత్తరాట్చరిత్ర (క్రీ. శ. 1372) ద్వితీయ కృతి శాలివాహన సప్తశతి (క్రీ. శ. 1376) తదుపరి వరుసగా పండితారాధ్య చరిత్రము (క్రీ. శ. 1382) శృంగార నైషధము (క్రీ. శ. 1390), హర విలాసము (క్రీ. శ. 1400), ధనంజయ విజయము (కీ. శ. 1410–1412) నందనందన చరిత్రము (క్రీ. శ. 1424–29), భీమఖండము (క్రీ. శ. 1430–34) కాశీ ఖండము (క్రీ. శ. 1430–1434) శివరాత్రీ మాహాత్మ్యము (క్రీ. శ. 1445) పలనాటి వీరచరిత్ర (క్రీ. శ. 1446)

మున్నుగాగల గ్రంథములను సంపదించినట్లు శ్రీ కోర్లపాటివారు నిర్ధారణ గావించిరి. ఇందు కొన్ని అనుపలబ్ధములు. అవి 1. మరుత్తరాట్చరిత్రము 2. శాలివాహన సప్తశతి, 3. పండితారాధ్య చరిత్రము, 4. ధనంజయ విజయము 5. నందనందన చరిత్రము. క్రీడాభిరామ కర్తృత్వము వివాదగ్రస్తము. పల్నాటి వీరచరిత్ర యందలి కొన్ని భాగములు మాత్రమే శ్రీనాథ కృతమని నిరూపితము.

శ్రీనాథుని గ్రంథములలో హరవిలాసమునకు గల స్థానము:

శ్రీనాథు డీశ్వరార్చన కళాశీలుడు. శివభక్తి ప్రపూరితమగు నాతని కృతులే ఆతని శివభక్తి నిరతికి సాక్ష్యములు. భీమేశ్వర పురాణము, కాశీఖండము శ్రీనాథుని యీశ్వర భక్తిని చాటున వయ్యు, నవి స్థలపురాణములు. పండితారాధ్య చరిత్ర, నిగమార్థ సార సంగ్రహమని శివభక్తి మయమనియు చెప్పవచ్చును. శివరాత్రి మాహాత్మ్యము, ఆ పర్వదిన శ్రేష్ఠత్వము నుద్ఘాటించు మాహాత్మ్య కావ్యమై శ్రీనాథు డవసాన దశలో రచించెనని తెలియుచున్నది. ''నైషధం విద్వ దౌషధమ్'', 'కాశీ ఖండ మయః పిండమ్' అను ఆభాణకములు, శ్రీనాథుని ప్రతిభా వ్యుత్పత్తుల తెల్పుచున్నవి. ఇట్లు శ్రీనాథుని గ్రంథములు కావ్యానువాదములుగను స్థలపురాణ మాహాత్మ్య రచనములుగ సాంఘిక జీవన ప్రతిబింబములుగ నున్నను హరవిలాస మాతని రచనలలో ప్రత్యేక స్థాయిని సంతరించికొనెను. కథాకథనము చేతను, దేశీయ సంప్రదాయ కవితా వర్ణనల చేతను, శివభక్త్యాతిశయ నిరూపణము చేతను స్వాతంత్రమగు రసవత్తర ప్రబంధముగ హరవిలాసము రాజిల్లుచున్నది.

## 0.2 హరవిలాస రచనా కాలము:

కృత్యవతరణికనుబట్టి హరవిలాస రచనా కాలము నిర్ణయించుటకు సాధన సంపత్తి యుండియు, ఈ గ్రంథ రచనా కాలము వివాదగ్రస్తమైనది.

కొమర్రాజు లక్ష్మణరావు, కందుకూరి వీరేశలింగం పంతులు, చిలుకూరు వీరభద్రరావు, వేటూరి ప్రభాకరశాస్త్రి, బండారు తమ్మయ, నేలటూరి వేంకటరమణయ్య, చాగంటి శేషయ్య మొదలగు వారు శ్రీనాథ విరచిత హరవిలాస కాల నిర్ణయము చేయ సమకట్టినవారలలో ముఖ్యులు. అందు హరవిలాస రచనాకాలము, కుమారగిరిరెడ్డి జీవితకాలము ఒకటేనని లక్ష్మణరావు, బండారు తమ్మయ, నేలటూరివారు కొర్లపాటివారు నిర్ణయించిరి.

కృతిపతియగు అవచి తిప్పయసెట్టి, తమ్ముడైన తిరుమల సెట్టిని శ్రీనాథుడు కృత్యవతారికలో వర్ణించుచు

> హరిహరరాయ ఫెరోజి సహా, సురధాణగజాధిపాది భూ
> వరులు నిజప్రభావ మభివర్ణనసేయు, గుమారగిర్య భీ
> శ్వరుని వసంత వైభవము సర్వము నొక్కడ నిర్వహించు మా
> తిరుమలనాథ సెట్టికిని ధీగుణ భట్టికి నెవ్వరీదగున్ —

అను పద్యమున విజయనగరాధీశుడైన హరిహరరాయలు, బహమనీరాజైన 'ఫెరోజీసహా' కొండవీటి రెడ్డిరాజైన కుమారగిరి యను ముగ్వురు సమకాలీనులైన రాజులు స్వస్వరాజ్యములు పరిపాలించు కాలమనుటచే అనగా క్రీ.శ. 1398-1400 సం॥ ప్రాంతమున కుమారగిరి ప్రభుత్వపు చివర కాలమున హరవిలాసము రచింప బడినదని తేలినది.

0.3 హరవిలాస కృతి భర్త:

కుమారగిరి రాజ్యాస్థాన సుగంధ భాండాగారాధ్యక్షు డగు అవచి తిప్పయసెట్టికి శ్రీనాథుడు 'బాలసఖ' సంబంధముచే 'శైవ ప్రబంధ మగు' హరవిలాసము నంకిత మొనర్చెను. అవచి తిప్పయసెట్టి తాతలు నెల్లూరు మండలమున జీవించి

యున్నట్లు, వారు కాంచీపుర మందలి వరదరాజస్వామికి బాలార్క మను పద్మరాగమును దానమిచ్చి తిరువల్లూరు నందు చెరువు త్రవ్వించి, కావేరికి గట్టు కట్టించి, ఏకామ్రనాథునకు వేయి కర్పూర దీపములు వెలిగించుట కేర్పాటు చేసిన వారలు. ఉభయ గోత్రములవారు వాణిజ్యశ్రేష్ఠులై శైవ వైష్ణవ సమయదీక్షా విశేషులై యుండిరి. తిప్పయసెట్టి పరమ వైష్ణవుడగు కంచి నంబి వంశజుడు (తిరుకచ్చి నంబి) ఈ తిప్పయసెట్టి మాచాంబా అవచిదేవయల పుత్రుడు. తిరుమలసెట్టి, చామిసెట్టి ఈతని సోదరులు. ఈ అన్నదమ్ములు ద్వీపాంతరావాస వ్యాపార మొనర్చి సుగంధ భాండాగారము నింపి కుమారగిరి నెరపు వసంతోత్సవముల జయప్రదముగ నడపుచుండిరి. అన్నమదేవి తిప్పయసెట్టి భార్య. మాచన, విశ్వనాథ చెనమల్లలను వారలు కుమారులు.

0.4 హరవిలాస కథానుక్రమణిక:

హరవిలాస కావ్యమున చిఱుతొండ నంబి కథ మొట్టమొదటిది. కవి శివలీలోత్కర్ష మగు కథాకథనము, "భక్తాస్తు తనవో మమ" యను పరమ సత్యము నుద్బోధించుటకే. శ్రీనాథుడు శివభక్తి విలసితమును దాక్షిణాత్య గాథయు నగు చిఱుతొండ నంబి కథను కావ్యాదిగ గైకొనెను. ద్రవిడ దేశస్థుల కత్యంత పరిచయము గల్గిన శివభక్తుని గాథ చిఱుతొండ నంబిగాథ. ద్రవిడ కర్ణాటాంధ్ర దేశములలో జనరంజకమై దేశ వ్యాప్తమై సీ భక్తుని గాథ నెరుగని శివభక్తులుండ నంతటి బహుప్రచారకత్వము నొందినది. పురాతన శివభక్త గాథను, శ్రీనాథుడు కృతిభర్త యగు అవచి తిప్పయ ప్రీత్యర్థము తన ఈశ్వరార్చన కళాశీలత్వ ముట్టిపడ చిఱుతొండ నంబి కథతో కావ్యారంభ మొనర్చెను. తిరుకచ్చినంబి వంశీయుడనుచు చిఱుతొండ నంబికిని అవచి

తిప్పయకును కవి సాధర్మ్య మూహించుచు, కృతిభర్త నత్యంత శ్రేష్ఠమైన తుంబురు వంశజుడని కొనియాడుట విశేషము. కావ్యాంకితము బాలసఖున కిచ్చిన అపురూపగౌరవమును తలపించుచున్నది.

దేశవ్యాప్తమై ద్రవిడదేశస్థుల మన్ననకు పాత్రమైన ఇతివృత్తముతో కావ్యారంభ మొనర్చిన ఎల్లర అభీష్టముల నెరవేర్చినవాడ నగుదునని శ్రీనాథుడు భావించెను. అపురూపమగు కోరికను, అందునను నరమాంసమును భగవంతుడు కోరుటయు ఆ భగవంతుని పరీక్షలో విచిత్రమగు కోరిక యని సైతము ఇంచుకైనను భావింపక, తన ఏకైక పుత్రమాంస మర్పించి తన తిరుబాస వ్రతమును చెల్లించిన వీరమాహేశ్వరుని చరిత్రము భక్తినేగాక త్యాగవీరముల చాటుచున్నది. భక్తి యనగా నిస్వార్థమైనదనియు, ఆత్మ సాక్షాత్కారమునకు తోడ్పడునదనియు, రజో తమో గుణముల నణచి వికారపు మొలకలను సమూలముగ పెకలించివేయునని నంబి బాగుగ నెరుగును. శివునకు శివయోగికి భేదము లేదని శరణుల అర్థప్రాణంబులు శివాధీనములని, భయ భ్రాంతుల తొలగించి, పాప సిరాస మొనర్చు శివకర్తృత్వమును భోక్తృత్వమును, త్రికరణశుద్ధిగ అంగీకరించిన భక్తుని గాథయే నంబి గాథ. ఆ భక్త కుటుంబ సభ్యులును యజమాని యభీష్టమును, తిరుబాసను వీసమంతైన వ్యర్థము గానివ్వరు. అనుకూలవతియై భర్త్రాభీష్టమును నెరవేర్చుచు, ఆతని ఆజ్ఞను మాడైన దాటని అంగనారత్నమగు తిరువెంగనాంచి, తలిదండ్రుల భక్తిపరాయణతను పుట్టుకతోనే పుణికి పుచ్చుకొని పరోపకారప్రియ శీలత్వమును ప్రకటించు బాల సిరియాలుడు, అన్ని విషయములందు చేదోడు వాదోడుగ నున్న చందననంగ వీరశైవవ్రత మహాయజ్ఞ పరిసమాప్తికై అనుక్షణము పాటుబడిన త్యాగశీలురు.

మమతాహంకారముల త్యజించి, నిష్కామమగు బుద్ధితో, భగవదర్పితమగు మానసముతో "త్యాగేనైకేన అమృతత్వ మానసుః" అన్న సత్యము నెరిగినట్లు ప్రవర్తించినవాడే నంబి.

మానవజీవిత సంసారములలో భక్తుడు భగవంతుని ప్రీతికై యెంతటి ఘనకార్య మొనర్చినను, పుత్ర మాంసము నర్పించిన వృత్తాంత మసహజమై ఆశ్చర్యమును గొల్పును. భక్తి పరాకాష్ట దశ నొందిన ఘట్టమును తలపించుచు, నిజపుత్ర నిసర్గమోహ శృంఖలముల తెగటార్చి వీరశైవ వ్రతమును నిర్విఘ్నముగ నెరవేర్చుటలో అకుంఠితమగు కార్యదీక్ష, ఆత్మవిశ్వాసము, భగవంతునిపట్ల గల విశ్వాసము వ్యక్తమగును.

వైశ్యుడుగా అదివరకె సిరియాలుడు (నంబి) పిలువబడుటచే శ్రీనాథుడు చమత్కారముగ, వైశ్యులలో అఖండమగు త్యాగ వీరములను ప్రదర్శించిన నంబి కథావృత్తమును స్వీకరించి ప్రప్రథమ హారవిలాసముగ చిత్రించెను.

వేదవేదాంగ పారీణుడు, శివభక్తి నిరతుడు నగు శ్రీనాథుడు ఉపాసకుని ప్రాణములు, జీవశక్తి భరితములై నల్దిసల వ్యాపించి యుండి ఆ ప్రాణములు విలక్షణముగ భగవంతునిలో చేరుటకు యత్నించునను వేద రహస్యము నీ చిఱుతొండ నంబి కథలో నిక్షేపించెను.

బాల సిరియాలుని ప్రాణములట్లు నల్దిసల వ్యాపితమై భగవదాజ్ఞచే భర్తురాలి ప్రార్థనచే తిరిగి ఆత్మశరీరక స్వరూపము నొందెననియు, వేదరహస్యము నెరిగిన మహాకవి శ్రీనాథుడు, బాలుడు "తత్త్వద్వ్యంజన పాక గంధ్యవయవస్థాన ప్రతానంబుతో" తిరిగి వచ్చెనని వర్ణించి అద్భుత రస ప్రతిపాదనము గావించి కవితా విలాసమును ప్రదర్శించెను.

నంబి, సంగ, బాలసిరియాళుడు, చందనిక కారణజన్ములని అచంచలభక్తి విశ్వాసముల ప్రకటించిన వారలు సశరీరులై కైలాస మేగినని ఆశ్చర్యాద్భుతములతో కథా శ్రవణోత్సుకత నినుమడించు రీతిని కవి, కథాగమన మొనర్చి పాఠకుల కమందానందమును భక్తి ప్రియత్వమును కలుగునట్లు రచించి కృతకృత్యుడయ్యెను. కావ్య ప్రయోజనము రసానందమగుటచే భక్తిరసామృత పానముచే ధర్మ దీక్షా ధన్యమానసులగుట తథ్యము. కథాప్రణాళికలో నీ కథ భక్తి కరుణా, త్యాగ వీరరసములు నుప్పతిల జేసిన తపస్వియే శ్రీనాథుడు.

కావ్యమున హరలీలనే తెల్పునది గౌరీ కల్యాణము. నంబి అఖండ ప్రేమానురాగములచే మమతాహంకారములు వీడి పుత్ర త్యాగ మొనర్చె ననుటతో ఆర్ద్రీభూత మనస్కులగు పాఠకుల నిట శ్రీనాథుడు శృంగార రస తరంగితుల చేయును. జగన్మాతా పితరులగు శాంభవి శంకరుల ప్రణయ సస్యము వివిధ పరీక్షల కెదురు నిల్చి ఫలించి వివాహ లీలగ పర్యవసించినది. దాక్షాయణీ విరహ భారమున హిమాలయములందు తపోమగ్నుడైన మహాశివుని యుగ్ర తపమును భంగ మొనర్చి మన్మథుడా పార్వతీ శంకరులలో ప్రణయము పండించెను. మాయావటు వేషమున మనసునందలి దృఢసంకల్పము నెరిగిన మహాశివుడు సప్తర్షుల ద్వారా పార్వతీ వివాహ రాయ బారము జరిపి వేదోక్త విధాన సంప్రదాయములచే పార్వతిని వివాహమాడెను. కుమారోదయము ప్రధాన ప్రయోజనముగా గల గౌరీ కల్యాణము, తారకాసుర విజృంభణమును కారణముచే కాగి వడదేరి కార్యానుకూలము నొనర్చినది. కనుక తారక విజృంభణము, మన్మథ ప్రోత్సాహములు తొలుత గౌరీ కల్యాణ కార్య ప్రయోజ నోద్దిష్టములై పిదప కుమారస్వామి జననమునకు దారితీసినవి.

కాళిదాస కుమార సంభవాంధ్రీకరణమును స్వతంత్ర ధోరణి యించుక యుట్టిపడినట్లుగ సందర్భోచిత వర్ణనముల నటనట చేయుచు

మూలవిధేయముగ నుండి, శృంగార రసోచ్ఛృంఖలత్వమునకు లోటు రాని విధమున శ్రీనాథుడు రచించి పూర్వాశ్వాసములందలి నంబి కథచే బరువెక్కిన గుండెలను తేలిక చేయుచు రసవద్ఘట్టముల పోషించె ననవలెను.

కాళిదాసుని కావ్యనామము ననుసరింపక, గౌరీ కల్యాణము వరకు మాత్రము హరలీలగ తీర్చిదిద్దుటలో శ్రీనాథునకు కన్నడ కవియగు హరిహరుని గిరిజా కల్యాణము తోడ్పడిన దనవచ్చును. ప్రబంధోచితమగు వర్ణనలచే నా కావ్యము ప్రత్యేకత గల్గియుండ శ్రీనాథుడాతనివలె దాక్షిణాత్య వివాహ సంప్రదాయములందును, ఇతివృత్తమును కల్యాణము వరకే పరిమితి నొనర్చుటలో నా కవి ననుసరించెననవలెను. శివుని కారుణ్యము భక్తురాలి పరీక్షయందు పర్యవసించియు నాటకీయ ధోరణి గల్గిన నీ ఘట్టము రసవంతమై పాఠకుల నమందానంద కందళిత హృదయారవిందుల నొనర్చును.

గౌరీ శంకరుల వివాహానంతరము జగన్మాతా పితరుల లోక విషయమే విస్మరించిన విధముగ ఆనంద సముద్రములో మునిగి తేలు చుండ శివుని ప్రమథ గణములు అవిధేయులై దుర్మార్గమున ప్రవర్తించి హిమవంతుని కండ్లు బడిరి. మామగారైన హిమవంతుడు అల్లుడు భూతగణముల దుర్వర్తనమును మాన్పింపని నిర్లక్ష్య ధోరణికి కోపగించికొనెను.

మహాశివుడు 'త్రిరాత్రౌ శ్వశుర గృహం' అను విషయము మరచి సంభృత నవ్యకుటుంబ భారుడై మంచు గుబ్బలి తేని యింట మను గుడుపులు గుడిచినందులకు విచారపడి, అవమానమునకు చింతించి కోపముతో హుటాహుటిగ భార్యకు చెప్పక సపరివార సమేతుడై దారుకావనము చేరెను. ఈర్ష్యాసూయా మత్సరములచే నహంక రించిన మునిగణముల సన్మార్గులుగ తీర్చి దిద్దుటకై మాయా మిండ

జంగముడై శృంగార మోహములను మునిపత్నుల యెదుట ప్రదర్శించి ఆ సతీమతల్లుల కవ్వించి మునులను ధిక్కరింపగా వారీతనిని శపించిరి. ఆ శాప ఫలితముగ లింగోద్భవము కాగా, దారు వనమున శివుని విచ్చల విడిగ ప్రవర్తించిన ధోరణియందును, అచటి అప్సరాంగనలు శివునకు భిక్షావితరణ మొనర్చినపుడును శ్రీనాథుడు ఉత్ప్రేక్షా వల్లభుని భిక్షాటన వర్ణనల లొనర్చి శృంగారరసము ముంచెత్తును. గౌరి కల్యాణమున శృంగార రసమీ ఘట్టమున శిఖరాగ్రము వంటిది. పాఠకుల మనస్తత్వమును గమనించి శ్రీనాథుడట్లు వర్ణించెను.

కావ్యగానమున పురాణకథయగు సముద్ర మథనమును స్వీకరించి, హరిలీలను హరలీలగ రూపొందించి జీవిత యాత్రలో తొలుత కాలకూట పానమువలె కష్టముల రుచిజూచిన పిమ్మట అమృతపాన దివ్యవస్తుతతియగు సుఖముల నానందింప దగునను దివ్యసత్యమును, సందేశమును కవి మన కందించును.

బహువ్యయప్రయాసల కోర్చి పట్టువీడని కార్యదీక్షచే సముద్ర మథన మొనర్చిన దేవదానవులు తుదకు కార్యసాఫల్యమునకై ఎట్టి నిగ్రహమును ప్రదర్శించినదీ ఎట్టి దుర్మార్గమున కొడిగట్టినదీ పరీక్షించి చూడ, జీవిత సమరమున మానవు డెదుర్కొన వలసిన సమస్యల తీవ్రత ఇబ్బడిగను, ముబ్బడిగ నుండినను చివరకు ధైర్య స్థైర్యములతో ముందుకు సాగిన ధర్మయుత శాంతి జీవనము గమ్యస్థాన మగునని ప్రబోధించు చున్నది.

శివపారమ్యము నుద్ఘాటించు ఈ క్షీరాబ్ధి వృత్తాంతము మానవ మనస్తత్వమున గల హెచ్చు తగ్గులను వంచన కాపట్యములను వెల్లడించుచు సంసార సాగర మథన మొనర్చుచు, ఏటికి ఎదు

రీచునట్టి మనోబలమును ధార్మిక జీవన స్థైర్యము నిచ్చునదై శాంతి సందేశము నొసగుచున్నది.

భక్తుడు భగవంతుడు ఎదురెదురుగ నిలిచి హోరాహోరిగ పోరాడి జయమెవ్వరికి లభించుననన్న ఉత్సుకతను గల్గజేసి విజయము వీర భోజ్యమన్పించిన వృత్తాంతమే కిరాతార్జునీయము. శివార్జునులు కిరాతార్జునులై సవిలాసముగ కటికై పోరాడి వేడుక గల్గించుచు వీర రసావిష్టుల జేయును. పరాక్రమము, పట్టుదలచే అనూనము అసదృశ మగు పాశుపతాస్త్రమను దివ్యాస్త్రమును బడసిన అర్జునుని శీలసంపద శివభక్తి ప్రపూతమై నైగనిగ్యమును సంతరించుకొన్నది.

అర్జున మాయాభిల్లుల సంవాదము, ఇంద్రార్జున సంవాదములు హాస్య వీరరస సముపేతములై సహజత్వ ముట్టిపడునట్లు రచించిన శ్రీనాథుని కవితా ఝురులు భాగీరథీ పయోధారా నిర్ఝరముల బోలినవి.

బ్రహ్మకు గూడ సాధ్యముగాని నివాత కవచ పౌలోమ కాల కేయ వధలొనర్చిన అర్జునుని పరాక్రమ సంపద అతని నొక మరపు రాని వీరునిగ తీర్చిదిద్దినది. శ్రీనాథుడు మహాభారతేతిహాస కథా వృత్తమును చేబట్టినను నగిషీతన ముట్టిపడ ప్రకాశించు రత్నాభరణము వలె ఈశ్వరార్చన కళా శీలత్వముచే ధగద్ధగాయమాన మగు ఇంద్రార్జున భ్రాత్ర పోషణములతో వీరరససమున్మేషమై శాంత రస పర్యవసాయియై ప్రతిభాసించుచున్నది.

హరవిలాస కావ్యముత్తమ సంస్కార జీవనోప బలకమై, రసానంద ప్రయోజనా కాంక్షియై, శాంతియుత సమరస జీవన సాఫల్యకారియైన ఉత్తమ ప్రబంధమనదగియున్నది.

# విషయసూచిక



# 1. చిఱుతొండనంబి కథ

**1.0.** అవతారిక :- తాత్త్విక దృక్పథులైన భారతీయులు ఐహికాముష్మిక ఫలాపేక్షులు. ఏతత్ఫలాపేక్షయే భారతీయ సంస్కృతీ విశిష్టత. ధర్మార్థ కామ మోక్షములను చతుర్విధ ఫల పురుషార్థములను సాధించి అమృతుడగుటయే మానవుని పరమావధి యనియు అట్టి లక్ష్య సాధనమే కావ్యప్రయోజన మనియు భామహుడు-

> ధర్మార్థ కామ మోక్షేషు వైచక్షణ్యం కళాసుచ,
> కరోతి కీర్తిం ప్రీతిం చ సాధు కావ్య నిషేవణమ్.

సత్కావ్య పఠనముచే మానవుడానందమును ధర్మనిరతిని, ఆధ్యాత్మిక వికాసమును పొందును.

అతీంద్రియ తర్కాతీత ప్రకాశ సాక్షాత్కారాన్వేషణమే మతము. భక్తి, జ్ఞాన, కర్మ మార్గములు మోక్షగామికుపాదేయములని మతోపదేశము. అందునను భక్తిమార్గము సులభ తరము. తద్రహిత జ్ఞాన కర్మ మార్గాన్వేషణము నిష్ఫలము. భక్తి అనుభవైక వేద్యము.

"సాత్వస్మిన్ ప్రేమ రూపా" అని, "అనిర్వచనీయం ప్రేమ స్వరూపమ్" అని నారద వచనము. లౌకిక జీవనముచే కలుషితమైన మనస్సు కావ్య పఠనము ద్వారా సత్త్వప్రధానమైన రసానందము ననుభవించి తదనంతరము ఉత్తమ సంస్కారము నుజ్జీవింప జేసికొనుటకు భక్తి యావశ్యకము.

ప్రకృత పరిశీలన కావ్యము శృంగార వీర భక్తిరసాది పరిపుష్టము. భక్తిరస ప్రధానము. హారలీలోత్కర్షము. తదంతర్భాగమే చిఱుతొండనంబి కథ.

1.1. కథాప్రాశస్త్య ప్రాచుర్యాదులు :- చిఱుతొండనంబి కథయుందలి యితివృత్తము చారిత్రకము; భక్తిరసాత్మకము; జనరంజకము; తమిళ వేదమని ప్రశంసింపబడు "తిరుత్తొండ పురాణము" (పెరియ పురాణము)ను 'సేక్కిళార్' అను తమిళ కవి క్రీ.శ. 12వ శతాబ్ది పూర్వార్ధములో (1133-1150) పద్య కావ్యముగ సంతరించెను. ఇది అరువత్తుమూవర్ నాయన్మారుల చరిత్ర. దక్షిణ భారతమున తుంగభద్ర మొదలు కన్యాకుమారి వరకు క్రీ.శ. 300-865 మధ్యకాలమున నీ అరువది ముగ్గురు నాయన్మారులు జీవించి యుండిరని శిలాతామ్ర శాసనాదుల మూలముగ, నానెముల మూలమున తెలియుచున్నది.[1] ఈ నాయన్మారులు శివభక్తులై తమిళ వాఙ్మయమున కెనలేని సేవ చేసిరి. పాల్కురికి సోమన ఈ అరువది ముగ్గురు నాయన్మారులను పండితారాధ్య చరిత్రలో 'సహస్రగణమాలిక'లో మహిమ ప్రకరణములో ప్రమథ రుద్ర యోగాచార్య ధర్మాచార్య గణములలో పేర్కొనెను. ఈ అరువత్తుమూవురు అను సంఖ్య జైనమత సమయాచార్యుడగు హేమచంద్ర సూరి రచిత త్రిషష్టి శలాకాపురుషుల చరిత్రలోని సంఖ్యను పోలియున్నది.[2]

చిఱుతొండనంబి పెరియపురాణమున '36'వ నాయన్మారు; క్రీ.శ. 600-680 ప్రాంతమున ప్రసిద్ధి చెందిన అప్పర్, సంబంధర్ అను శైవ కవుల కాలమునకు సంబంధించినవాడు. ఈతనికి సంబంధించిన శాసనములు తమిళ వాఙ్మయమున కనబడుచున్నవి. ఇతడు క్రీ.శ. 630 ప్రాంతమున నున్నవాడు. పెరియ పురాణము నందలి ఈ నంబి కథ చిర కాలమునుండి పాటలుగ ప్రచారమున కలదు. నూరు సంవత్సరములకు పూర్వమే ఒక కవి దీనిని నాటకముగ తమిళమున రచించినట్లు ప్రసిద్ధి. కన్నడమున కూడ ఈ కథ యక్షగాన, షట్పది, రగడల రూపమున కలదు.

---

1. రాజమాణిక్యం, పెరియపురాణం - ఆరాయిచ్చి, 1948.
2. సుబ్రహ్మణ్యము, జి. వి; సారస్వత సౌరభము, 1961.

నేటికిని చిఱుతొండని పేర అతని జన్మస్థలమగు తిరుచ్చెంగాట్టం గుడిలో 'చిఱుతొండ విళా' నడుచుచున్నది. ఈ నంబి చోళనాడున జీవించి పల్లవ రాజైన మొదటి నరసింహవర్మకు సేనానాయకుడుగ నుండినవాడు. పైగా రాజుకై వాతాపిపై క్రీ. శ. 644లో దండెత్తుటయేగాక తదితర చేర, చోళ, పాండ్య దేశములలో యుద్ధమొనర్చి వీరమును ప్రకటించి నట్లు పరమేశ్వరవర్మ కురంప్లేట్లు (S. I. I. - I. I. P. P. 144) తెల్పు చున్నవి. బహుజన రంజకమై బహుళవ్యాప్తమైన ఈ కథను గూర్చి జె. ఎం. నల్లసామి పిళ్ళై తమ పెరియపురాణ ఆంగ్లానువాదమున నిట్లనిరి[3] - "It is the most popular story of the whole purana; that of Nandanar and Kannappa only coming next. It is the first favourite with all the story tellers, dramatists, Bhagavathars and popular not only in this province, but in the sister province of Bombay. We have seen Poona dramatic companies perform this story with great spirit and the late Tanjore Govindaswami Rao acting of it was moving and sublime. The Poona Brahmins call this saint Siriyala Maharaja and observe an annual feast in his honour."

పై వాక్యముల బట్టి ఈ సిరియాలుని కథ మహారాష్ట్రవరకు వ్యాపించి నాటకములుగ, నటింపబడిన ప్రశస్తమగు భక్తగాథయని తెలియుచున్నది. పైగా చిఱుతొండని జీవిత విశేషాదికముల తెల్పు శిల్పములు కంచిలోని ఏకామ్రనాథ దేవాలయ ప్రాకార కుడ్యములపై చెక్కియుండుటచే ఈ కథకుగల ప్రాచుర్యము చారిత్రకమని తెలియు చున్నది.

'As regards oral versions Gene Roghain found the story of the little devotee still told as part of oral recitation of the palanati veera charitra in Andhra. The Tamil Ciruthondar

3. Nallasamy Pillai, J. M., Periyapuranam Translation Eng; 1903.

Pattam Katai (Madras–R. G. Pali. Company n. d.) is either a modern oral version of the story or is based upon such a version.[4]

పై వాక్యములను బట్టి నేటికిని చిఱుతొండని కథ వాగ్రూపమున పల్నాటి సీమలో కలదని వ్యక్తమగుచున్నది.

శైవమతాభిమానులగు ఆంధ్రకవులీ ప్రాచీన భక్తగాథను స్వీకరించి వివిధ సాహిత్య ప్రక్రియలలో ఆంధ్ర సారస్వతమునకు పరిచయ మొనర్చిరి. మొత్తము మీద సంస్కృతాంధ్ర తమిళ కర్ణాట భాషలలోనే చిఱుతొండనంబి కథ పలువుర కవుల దృష్టి నాకర్షించి "మృత్పిండ మేకం బహు భాండ రూపం" అనినటుల వివిధ ప్రక్రియా వైవిధ్యములచే రమ్యమగు రసవత్తర ఖండకావ్యములుగ రూపొందినది.

1.2. నంబి జన్మాదికములు :-

తిరుచ్చెంగాటం గుడి వాసియైన పరంజ్యోతి మట్టాభ్రస్త్ర గజాశ్వా రోహణ విద్యానిపుణుడు. శివభక్తి తత్పరుడు. ఆగమ జ్ఞాని. వైద్య విద్యా పారంగతుడు.

"ఆయుర్వేద కలైయుం అలగిల్ వడనూల్ కలైయుం
తూయపడై కలత్తొళిలుం తురై నిరంబ పయున్త వట్రార్"
(పె. పు. 36-8)

ఋగ్వేదమునకు ¹యుర్వేదము; యజుర్వేదమునకు ధనుర్వేదము, అథర్వవేదమునకు అర్థశాస్త్రము ఉపవేదములుగా చెప్పబడుటచేత పరంజ్యోతి వేదవేదాంగ పారంగతుడని వ్యక్తమగును.

---

4. George L. Hart III, Sanskrit and Indian Studies, 1979; P. 235.

నంబి మామాత్తిర (మామాత్తియ పాఠాంతరము) మరపినర్ కులస్థుడు. కాంచీపురమునేలిన ప్రథమ నరసింహావర్మ (పల్లవరాజు)కు సెద్బలి. అజేయ విక్రముడైన సైన్యాధిపతి. రాజు ఆతని వీరవిక్రమమునకు శివభక్తియే కారణమని గుర్తించి ఆతనిని భక్తుల నారాధింప స్వస్థలమైన తిరుచ్చెంగాటమున నియమింప, తదారాధన యందు పునీతుడైన ఆతనిని పశుపతి భక్తులు చిఱుతొండడని పిలువసాగిరి. తిరువెణ్గాట్టు నంగ ఈతని భార్య. శీరాలదేవుడను శివునికి, వీరభద్రునికి సేవచేసి చిఱుతొండనంబి తన యేకైక పుత్రునకు సీరాలదేవర్ అని పేరుపెట్టెను.

కీ.శే. పొంగూరు సూర్యనారాయణశర్మ తమ శివభక్త చరిత్రములో పరంజ్యోతి మహామాత్య బ్రాహ్మణ కులజుడని తెల్పిరి. పెరియ పురాణమునకు తమిళమునకు వ్యాఖ్యానము వ్రాసిన శ్రీ సి. కె. సుబ్రహ్మణ్యం మొదలియార్ పరంజ్యోతి కులమును గూర్చి యిట్లనిరి - 'మామాత్తిర కులమనునది పరంపరగ మందులిచ్చే వైద్యకులము.' "అమాత్య" అను కులముతో దీనిని కలుపగూడదు. అది బ్రాహ్మణులలోని ఒక తెగ. మామాత్తిర కులము వైదికులకును రాజులకును మధ్యనున్న ఒక కులము. వీరు యజ్ఞోపవీతధారులు - "మున్నూల్ సేర్ పొన్ మార్బిల్ సిరుత్తొండర్" (పె.పు.-23 పు. 702).

పెరియపురాణమును సిద్ధాంత విషయముగ స్వీకరించి, పరిశోధించిన శ్రీ రాజమాణిక్యం, నంబి శ్రేష్ఠ వంశజుడై, వేదవేదాంగ పారీణుడై, యుద్ధకుశలుడై, మనుధర్మశాస్త్ర లక్షణ సమన్వితుడని సేక్కిళార్ పేర్కొనినట్లు తెల్పిరి. 'మామాత్ర్యుడు' - అనగా మంత్రాంగము నడపువాడని యుద్ధవిషయములలో సంప్రదించువాడని అర్థము.

'మాామా_త్తిరర్' - మహామాత్రులు అనువారు మౌర్యప్రభుత్వో ద్యోగులు; సాధారణముగ నగరపాలకులుగా నియమింపబడుచుండిరి.[5]

మహామాత్రా: (ప్రధానానిచ[6] మహానతిమాత్రః పరిచ్ఛదః యేషాంతే మహామాత్రాః)

"మహామాత్రః ప్రధానస్స్యాత్" అని పుంస్కాండమందు ఉత్కృష్టులు, హీనులు గాక మధ్యమాధికారములయందు వ్యవస్థితులైన దళవాయి మొ॥ పేర్లు. కనుక "మహామాత్య" "మహామాత్ర" శబ్దార్థములను బట్టి మంత్రియని, దళవాయియని తెలియును.

పైన పేర్కొనిన పొంగూరి సూర్యనారాయణశర్మ డా॥ రాజ మాణిక్యం వాదనలకు మూలము కులమును వ్యక్తము చేయు పదమును "మాామా_త్తియర్" అని భావించుటయే. చిఱుతొండనంబి మంత్రి కాడు; దళవాయి లేక సేనాధిపతి. కావున పై వాదము పొసగదు. మహామాత్ర శబ్ద భవమే 'మాామా_త్తిరర్' అని భావించినచో నామ లింగానుశాసనార్థము పొసగును.

తమిళ పెరియపురాణ వ్యాఖ్యాత శ్రీ సి. కె. సుబ్రహ్మణ్యం ముదలియార్ మాా మా_త్తిర కులము వైదికులకును రాజులకును మధ్య నున్న కులమనుటచే నంబి బ్రాహ్మణ క్షత్రియ కులములు గాక వేరొక కులమునకు చెందియుండవలెను. అది వైశ్యకులముకాని, శూద్రకులము కాని కావచ్చును. తమిళ వ్యాకరణమగు తొల్కాప్పియమును బట్టి అరివార్ (బ్రాహ్మణులు), రైతులు (వెల్లాలర్లు), అరసర్ (రాజులు), వణిగర్ (వ్యాపారులు) అను నాల్గు సాంఘిక విభజనలున్నట్లు తెలియు

5. రెడ్డి, జి. ఎన్., తెలుగు నిఘంటువు – పుట 617.

6. అమరకోశం, నామలింగానుశాసనము – పు. 470.

నని, ఈ నాల్గు విభజనలు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను వర్ణాశ్రమములకు భిన్నమనియు, రాజులు వెల్లాలర్లు ఇచ్చి పుచ్చుకొను చుండుటచేతను, వెల్లాలర్లు రాజ్యము నేలుచుండుట చేతను, ఉత్తర భారతపు శూద్రులకోవకు వెల్లాలర్లు చేరరని - నంబి అరోరన్ అభిప్రాయము.[7]

కనుక నంబి శూద్రుడుగాక, వెల్లాలర్ (ఇతై వేళాలర్, మరుత్తువర్ - పె.పు. 6 సంపుట-583) కులస్థుడుగనో, వైశ్య కులస్థుడుగనో అయి యుండవలెను. వైశ్యుడనుటకు ఆధారములు లేవు. కాని నంబి వైద్య విద్యా పారంగతుడగుటచే

అమ్బష్ఠో వైశ్య ద్విజన్మనో[8] : (అంబ సమీపే తిష్ఠతి చికిత్సార్థ మితి అమ్బష్ఠ : స్థాగతి నివృత్తౌ) చికిత్సార్థము సమీపమునందుండువాడు అని అమరము తెల్పుచున్నది. అనగా వైశ్య స్త్రీకిని బ్రాహ్మణునికిని పుట్టినవాడు.

ఇట్లు అన్వేషింపగా 'నంబి' సంకీర్ణ జాతివాడని తెలియును. యజ్ఞోపవీతము ధరించువాడై వేద వేదాంగ పారంగతుడై గజాశ్వారోహణ విద్యావిపుణుడై అధికమగు సేవాబలము గల్గిన సేనాధిపతియై, రాజునకు సమీపమున నుండి వైద్యము చేయువాడని తెలుచున్నది.

పై విధముగ తిరుత్తొండర్ పురాణమున, మామాత్తిర, మామాత్తియ అను పాఠాంతరములుండుట మూలమున, పరంజ్యోతి బ్రాహ్మణుడా? కాదా? యను వాదోపవాదములు తమిళ వాఙ్మయమున నేర్పడినవి. కాగా తదర్వాచీన కన్నడ ఆంధ్ర సాహిత్యములందు చిఱు

7. Nambi Aroran, culture of the Tamils as revealed by the Periapuranam – Ph.D.–History 1968.

8. అమరకోశము – నాగలింగాను శాసనము – పు. 570.

తోండని వైశ్యునిగా భావించిరి. శ్రీనాథుడు హరవిలాసమున కృతి భర్తయగు అవచి తిప్పయ ప్రీత్యర్థము, వైశ్యునిగ చిత్రించెనా? యను సందేహము కొందరు పండితులకు కల్గినది. జనపరంపరాగత కన్నడ రగడలయందు, కన్నడ సాహిత్యమునందు నంబి సెట్టిగా చిత్రీకరింప బడెను.[9]

పైన పేర్కొనిన వాదోపవాదములను పరికించినచో పరంజ్యోతి అమాత్య బ్రాహ్మణుడనుటకంటె మిశ్రమజాతివాడని పేర్కొనుటయే సమంజసముగ కన్పించుచున్నది. కాగా పరంజ్యోతి తరువాతి కాలమున 'సెట్టి' యగుటకు కల కారణముల నూహింపవలెను.

ఆంధ్ర కన్నడ బసవ పురాణములందు శివశరణ సంపుటియం దును, శ్రీనాథ హరవిలాసమునందును అర్వాచీన ఆంధ్రగ్రంథములం దును నంబి వైశ్యుడుగ పేర్కొనబడుటచే, శ్రీనాథుడు నంబిని సెట్టిగ మార్చలేదని అట్టి అపప్రథకు శ్రీనాథుడు తావిచ్చియుండలేదని తోచును.

పాల్కురికి సోమన నాటికే వీరశైవమత లక్షణములు ప్రబలినవి. జంగమ శిష్యులుగ భావించు లింగ బలిజలు, లింగాయతులు, దేవాం గులు మొదలగువా రుండిరి. లింగబలిజలు శివయోగులను బిరుద నామ మును, దేవాంగులు బ్రాహ్మణ బిరుద నామమును ప్రకటించుకొనుచు యజ్ఞోపవీత ధారణ మొనర్చుచుండిరి. లింగాయతులు దేవాంగులలో కొందరు తమ పేర్లకు పిదప శ్రేష్ఠియను బిరుదనామమును ధరించిరని వారి పురాణ మత గాథలందును, సుప్రభేదాగమము అను పాశుపతాగ మమునను కలదు.[10]

---

9. చెన్నారెడ్డి, జీ., సాహిత్య ప్రబోధము 1972.

10. ప్రసాద భూపాలుడు, ఆంధ్ర విజ్ఞానము – 6 సంపుటము – పుట 8056.

పైగా 'సెట్టి' శ్రేష్ఠి శబ్ద భవము. సంస్కృత సాహిత్యమున ఈ శబ్దమునకు పలు అర్థములు కలవు - అధికారి, ఉత్తముడు, సైన్యాధికారి, కళాకారుడు, వ్యాపారులలో అగ్రగణ్యుడు, అధ్యక్షుడు- బహుశః కన్నడ సాహిత్యమున సిరియాళునకు శ్రేష్ఠత్వము నాపాదించి, ఆతని శ్రేష్ఠియని పేర్కొని యుండవచ్చును. తద్భవమైన 'సెట్టి' శబ్దమునకు తదర్వాచీన కాలమున అర్థ విపరిణామ మేర్పడి కులవాచిగా మారి యుండును. ఏతత్కాలమున సిరియాళుని సెట్టిగా భ్రమపడి, ఆతనిని వైశ్యకులస్థుని గావించిరి. కన్నడ వాఙ్మయ పరిచయము గలిగిన సోమన శ్రీనాథాదులు తదనుసారులై తమ గ్రంథములలో సిరియాళుని సెట్టిగనే చిత్రీకరించిరనుటలో విప్రతిపత్తిలేదు. అవచి తిప్పయ్య వైశ్యడగుట కూడ శ్రీనాథుడు చిఱుతొండని సెట్టిగనే చిత్రీకరించుటకు ప్రోద్బలము నొసంగియుండవచ్చును. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు ద్విజులు గావునను వేదమార్గానుయాయులు గావునను భేదము పాటింపలేదని తలపవలెను.

1.30. చిఱుతొండనంబి: చిఱు అనగా చిన్నయని, తొండు అనగా సేవయని అర్థము. నంబియనగా పురుషోత్తముడని అర్థము. పశుపతి భక్తులకు సేవచేయుచు భక్త జన పాదరేణువుగ తన్ను భావించి, అతడు కాలము గడుపుటచే భక్తులాతనిని చిఱుతొండడని పిలువ జొచ్చిరి. "సీరార్ తవత్తు చ్చిఱుత్తొండర్" (సిరప్పానిరందు తవవలిమై సిరుత్తొండర్) అనగా శ్రేష్ఠమైన తపమొనర్చిన వాడే చిఱుతొండడు.[11] ఇచట తపమనగా భక్తులకు భోజనమిడక భుజింపని నియతాచారమని అర్థము.

11. సుబ్రహ్మణ్యం మొదలియార్, సి.సె. పెరియ పురాణ వ్యాఖ్య - పుట. 586.

1.31. తిరుత్తొండర్ — చిఱు + తొండు + అర్.

చిఱుకును, తిరుకును సంబంధములేదు. తిరు సంస్కృతశ్రీ శబ్ద భవము (పవిత్రము, శ్రేష్ఠము). తిరుత్తొండర్ అనగా శ్రేష్ఠమైన లేక పవిత్రమైన భక్తుడని అర్థము.

1.32. సీరాళన్ :- సీర్ + అళన్ - సీర్ అనగా దైవ మాహాత్మ్యము - అళన్ అనగా వ్యక్తి. సీరాళన్ - అనగా దైవ మాహాత్మ్యము కల్గిన వ్యక్తి అని అర్థము. తద్రూపాంతరములే సిరియాల, సిరాల శబ్దములు. కన్నడ వాఙ్మయమునందలి చీలాళ శబ్దము కూడ దీని రూపాంతరమే.

1.4. చిఱుతొండనంబి - శిలారూపాది ప్రాశస్త్యము :

చిఱుతొండనంబి కథను తెల్పు మూడు శిల్పములు చోళుల నాటివి కలవు. మొదటిదానిలో తల్లి, సిరియాలుని పట్టుకొనియుండగా, తండ్రి తల తెగగోయుట, రెండవ శిల్పములో తల్లి విచారముగ నుండగ దాసి యగు చందననంగ మాంసమును వండుటకుసిద్ధపరచుట దృశ్యములు మూడవ శిల్పములో శివుడు ప్రత్యక్షమై సీరాలుని బ్రతికించుట, నంబి, నంగ, దాసి శివుని కొనియాడు దృశ్యములును కలవు.[12]

నంబి స్వస్థలమగు తిరుచ్చెంగాట్టంగుడి తంజావూరు జిల్లాలోని రైలుస్టేషనుదగ్గర తిరుప్పుగులూరుకు దక్షిణముగా రెండుమైళ్ల దూరములో నున్నది. కజైముగన్ అను అసురుని వినాయకుడు సంహరించుటచే రక్తము చింది అడవియందెల్లెడల వ్యాపించినందున చెంగాట్టంగుడి అనియు, గణపతి పూజింపబడు స్థలము కనుక, ఈ కోవెలకు గణపతీశ్వరాలయము, అనియు పేర్లు వచ్చినవి. ఈ కోవెలలో ఉత్సవ

12. Rajamanikkanar, The development of Saivism in South India under Pallavas of Kanchi and the imperial cholas - A D 300-1300; 1950 (unpublished Thesis)

సన్నిధి యెదురుగ తిరువాత్తిచెట్టు చిఱుతొండనాయనార్ మొదలగు వారి శిలలు ఉన్నది. ఊరికి దక్షిణమున పై భాగమున చిఱుతొండ మఠము ఉన్నది. ఈ యూరి కోవెల రాజరాజన్ I, రాజాధిరాజన్ I, కులోత్తుంగ III చోళరాజుల కాలము నాటిదని కోవెల గోడలలో రాతి శాసనములు కలవు. ఉత్తరాపదీశర్ అను కోవెలలో చిన్న కోవెలగా గణపతీశ్వరాలయమున్నది. ఉత్తరాపదీశర్ కోవెలలో విజయనగర రాజుల శాసనములు కలవు. అప్పర్, సంబంధర్, గణపతీశ్వ రాలయపు శీరాల దేవుని, (దేవుడు) దేవియగు తిరుక్కుళల్ నాయకిని గూర్చి పాడిరట[13]

పరంజ్యోతికి గణపతీశ్వరుని దయచే సీరాల దేవుడను కొడుకు జన్మింపగా శిశువుకు జాతకర్మాదులొనర్చి అన్నదానమొనర్చి వంశా చారమననుసరించి బిడ్డకు కాపులు వేసెను.

"మంగల నల్లియుం ముళకృం మట్రై ముళకృం వాన్ అళవ
అంగణర్ తన్ శీరడియార్ కళవిరంద నిధి యళిత్తు
తంగళ్ (ళ్) మరబినిల్ ఉరిమై శడంగు దశదినత్తిలుమ్
పొంగు పెరుమగిళ్ళియుడన్ పురిందు కాపని పునైందర్.
(పె.పు. 6 సం.-63వ.)

జ్ఞానసంబంధులు నంబి యింటికి విచ్చేసి ఆతిథ్యము స్వీకరించెను. భక్తి పారవశ్యముచే నంబి సర్వత్యాగము చేయ సంసిద్ధుడైన సమయమున మహేశ్వరుడాతని భక్తిని, త్యాగమును పరీక్షింపదలచి, జంగమ వేష ధారియై, నంబి అన్నదాన వ్రతమున కాటంకము లేర్పరచి, పుత్ర మాంసము తోడి భిక్షావందనమునకు, నంబిని సమ్మతింప జేసెను. వీర మహేశ్వరుడగు నంబి, నమ్మకము త్యాగమునే వాంఛించునని ఎరిగిన

---

13. కలై కళంగియమ్, 5 వ సంపుటము 1959.

పాడగుటచే భగవంతుని పట్ల భక్తిని ప్రదర్శించి, భగవంతుని కోరిక తీర్చి అతని సాక్షాత్కారమును పొందును.

1.5. హరవిలాసము - కథామూలములు - భేదసాదృశ్యములు.

1.50. పెరియ పురాణము - హరవిలాసము - భేదసాదృశ్యములు :

స్థూలముగ కథ రెండింటను సమానమే. ఈ రెండు గ్రంథములందును కథానుసరణము ఇంచుమించుగ నొకటిగ నున్నదనవలెను. భైరవ వేషధారియైన శివుడు జన్మతః శివభక్తుడగు నంబి, ఏకైక పుత్రుని మాంసమును కోరి, అతని వీరమహేశ్వర వ్రతమున కాటంకమేర్పరచెను. అయినను నంబి నిస్స్వార్థముతో, మమకారమును ప్రదర్శింపక, అహంకారమును వీడి, ధృఢసంకల్పముతో భక్తి త్యాగములు ప్రకటించుట ఈ కథలో తెలియనగు ముఖ్యాంశములు.

నంబి పూర్వాశ్రమ ధర్మనిర్వహణమునందును, కథాకథనమునందును, పాత్రపోషణావైదగ్ధ్యము నందును, రసపోషణ నిర్వహణమునందును సామ్య వైషమ్యములగపడును. శ్రీనాథుడు సేక్కిళార్-పెరియ పురాణమును చూచియుండునని అతని కథానుసరణమును బట్టియే తెలియును.

"The story of Ciruthondar was also written by the great Telugu Poet, Srinatha, in the fifteenth century in an account that is close to Cekkilar's than Palkuriki Somanatha's even though Srinatha evidently did not know Tamil. Even today, the story of the Little Devotee is popular in the oral literature of Tamil Nadu and Andhra Pradesh.[14]

పై మాటలను బట్టి శ్రీనాథుడు ముఖ్యముగా పెరియ పురాణానుసారి యని తెలియుచున్నది.

---

14. G. L. Hart III - Sanskrit and Indian Studies. pp. 236.

పెరియపురాణమున భక్తుడు జంగమాన్వేషియై వెళ్లలేదు. జంగమవేషమున శివుడే అతని యింటిని వెదకికొని వచ్చినట్లు, పిదప గణపతీశ్వరాలయమునకు వెళ్లియుండగా, భక్తుడు పిలిచికొని వచ్చినట్లు వర్ణితము. తమిళ గ్రంథమున వర్ష వర్ణన ప్రసక్తి లేదు. సీరాలునికి వీరమాహేశ్వర వ్రతమును గూర్చి తెలియదు. పశూపహారము- పంచ షడ్వయస్కుడుగ, ఏకైకపుత్రుడుగ, తల్లిదండ్రులే స్వయముగ సంతోషముగ నరికి, వండి వడ్డించవలెనని స్పష్టముగ గలదు. హార విలాసమున నించుక భిన్నముగా గలదు. పశూపహారము బ్రాహ్మణ క్షత్రియ వైశ్య సంతతులలో నొకడుగ, పిన్న వయసువాడుగ, రోగ శంకావిహీనుడుగ, రూపసిగ, తలిదండ్రులు వండి వడ్డింపవలెననియు తొలుతనే "కుడుతు నా పంక్తి నిలురేడు - కొడుకు గుడువ" అను నియమముంచినట్లు రచితము.

పెరియ పురాణమున, నంగ ఒకే కులమున నేకపుత్రుడు, పంచ షడ్వయస్కుడు దోష రహితుడు, ఎచట లభించునని ప్రశ్నించునటు లను, నంబి ద్రవ్యమిచ్చిన పుత్రునొసగు వారుందురని, బాలుని పట్టి నరకు మాతాపితలుందరని, యించుక స్వాతిశయముతో తమ బాలుడుండ కాలహరణమొనర్ప తగదని ఆయత్త మొనర్చినట్లు వర్ణితము. ఇట తామిరువురు చేయబోవు కార్యతీవ్రతను ఆధిక్యమును నంబియు, నంగయు ఎరిగియుండుట వారిపాత్రపోషణకించుక లోపము కల్గించునట్లైనది.

హారవిలాసమున, జంగముడు, తొలుతనే నంబితో భార్యకడకు వెళ్లి కార్యము చేయ సిద్ధురాలగునో కాదో తెలిసిన మీదట భిక్షకు వచ్చెదనని, పుత్రస్నేహము సామాన్యము కాదని ఎట్టివారు సిద్ధపడినను తల్లి సిద్ధపడదని తొలుతనే నంగ అంగీకారమును గూర్చి నంబిని

ప్రశ్నించినట్లు వర్ణితము. పైగా బిడ్డడు తల్లిదండ్రుల అంగీకారమును గూర్చి,

> నీకు జంపగ వచ్చుబో నియమనిష్ఠ
> దల్లి కోర్వంగ వచ్చుబో ధైర్యగరిమ,
> మాకు భుజియింపవచ్చు బో మనసుతివుట
> జిఱుతవానికి జావంగ నజీదిగాని. — (హార. ద్వి. 63)

వర్ణించి నియమనిష్ఠ గల్గి ధైర్యగరిమ యున్నను, బిడ్డడు మరణించుటకు సమ్మతించుట చాల అరుదని, కార్యతీవ్రతను ఆధిక్యమును తెల్పు యిట్టి యిడుముల కోర్వగలవా? యని సవాలు చేసినట్లు రచితము. అంతేగాక మానవ మనస్తత్త్వము నెఱుగుట దుస్తరమని, దోసకాయ కట్టి చూచి నట్లు ఎదిరి కోర్కె యెఱుంగుట కష్టమని సహజముగ శ్రీనాథుడు రచించెను. (2-64)

వీరమాహేశ్వరుని చూచి పరీక్షించుటకు శాంభవీ శంకరులు బయలుదేరుట, శివుడు "ఆశీతి వర్ష దేశీయుడుగను, జరాజర్జరిత దేహుండును పలితపాండు జటామండలుండును రుద్రాక్షమాలాలికాభసిత త్రిపుండ్రాలంకృతుడు (హార. ద్వి. 47) నై యుండగా భవాని శివుని" కనురూపయగు గ్రుడ్డి యవ్వయై పాదంబులొత్తు" (హార. ద్వి. 47) చుండెను. ఇట వృద్ధుని నరసిన బొమలు తలవణకుట, వెలుగు సహింపని నేత్రముల దృష్టి, చెవులు వినబడకపోవుట - వార్ధక్య సూచనలు ఆ పాత్రకు జీవమును పోసినవి. ఈ వృద్ధులను అనగా క్షయ వ్యాధి బాధితాంగుడగు వృద్ధ శివయోగిని వీపుమీద మోసికొని గుడ్డవ్వ కోలూదిరాగా, ఇంటికి పిలుచుకొనివచ్చి, అభ్యంగస్నానమున కేర్పాటు చేసెను. ఇట్టి మెఱుగులు దిద్దుకొన్న పాత్ర పోషణమునకు కల్పనములకు పెరియపురాణమున తావులేదు.

హరవిలాసమున నంబి పూర్వజన్మమున తుంబురుడు. తమిళమున నంబి జన్మవృత్తాంతము లేదు. అయితే నంబి గొప్ప వాచాలుడుగను, శివభక్తి తత్పరుడుగను, ఋజురీతిని కావ్యములొనర్చెడి వాడని, భక్త జనసేవలో భక్తాంఘ్రిరేణువుగా భావించినవాడని అట వర్ణితము. హర విలాసమున తుంబురుడు భార్యాసమేతుడై ఆకసమున చనుచు బదరి కాశ్రమమున హరిణవత్సములకు అనుకంపతో ధోరణిని పాయసాన్నము నిచ్చు దుర్వాసుని చూచి వేడుకతో చిటుకవేసెను. ఆ చిటుక శబ్ద మును విని చెదరిన హరిణవత్సముల చూచిన దుర్వాసుడు అంబరమున తుంబుర దంపతులను చూచి మృగాహారమున కాటంకమేర్పరచిన కారణ మున తుంబురుని మర్త్యుడై జన్మింపుమని శపించెను. అల్పాపరాధ మునకే శప్తుడైన తుంబురుడు, దుర్వాసుని శాపావసానము ననుగ్ర హింప వేడెను. కాంచీ నగరమున శివభక్తాగ్రేసరుడుగ మర్త్యుడై జన్మించునటుల ముని అనుగ్రహించెను. 'వణిజుడుగ' జన్మించెనని శ్రీనాథుడు కల్పించెను. దుర్వాసుని శాపవృత్తాంత సృష్టి పెరియ పురాణమున లేదు. తన కృతిపతి యగు అవచి తిప్పయ సెట్టి తిరుకచ్చినంబి వంశజుడని అందునను ఆభిజాత్య వైభవము గల తుంబుర వంశమున జన్మించెనని తుంబురు వృత్తాంతము ద్వారా కావ్య గౌరవము నినుమడింపజేసెను.

ఇక్షు రసాభిషేక వృత్తాంతము, పార్వతీ పరమేశ్వరులు వేర్వే రుగ మారు వేషములతో తిరువెణ్ణాట్టునంగను, బాల సిరియాలుని పరీక్షించు వృత్తాంతము హరవిలాసమున గల నూతనాంశములు.

The Durvasa, Tumburu incident – Not given by previous writers entirely belongs to Tamil Land and South–Indian and dravidian tradition. It is Srinatha that first gave this story an Aryan colouring.[15]

15. Audilakshmi, M. Contribution of Telugu Saivite Literature to South Indian Literature – (unpublished Thesis) P. 261.

పై మాటలను బట్టి శ్రీనాథుడు తుంబురు వృత్తాంతము మూలా మున ఈ కథకు ఆర్యసంస్కృతిని ఆపాదింపచేసినట్లు వ్యక్తమగును.

ఝంఝా ప్రభంజనాయుత మహోత్పాతమగు అకాలవృష్టి యందు పంట చెరకులు లేవని తన తిరుబానవ్రతము వీడక వస్త్రములు తైలమున ముంచి వహ్నిచేసి చతుర్విధాన్నములను భక్తితో భక్త కోటికి పెట్టిన అన్నదాన వ్రత శీలి. పాత్ర చిత్రణమునకు శ్రీనాథుడు వర్షవర్ణనము నూతిగా గైకొనెను. నంబి వ్రత నిష్ఠకు కుంభ వృష్టి అడ్డము కాకపోగా పుత్ర మాంస భిక్షకు సిద్ధముచేసి శివునిచే అతిథి పూజ కొరకురని కూడ లేకుండ చేయుటకు దారితీసినది. చందన నంగ పాత్రకును ముఖ్యత్వము నిచ్చుట, బిడ్డడు తత్తద్వ్యంజన పాక గంధ్య వయవములతో తిరిగివచ్చుట - మున్నగు దృశ్యములు సొగసుగ మనః ఫలకమున హత్తుకొనునవిగ కథాకథనమునందలి నిపుణత్వమును వెలార్చునవిగ నున్నది. వర్ణనలు, ప్రత్యేక వృత్తాంతములు హారవిలాస మున నంబి శివపూజా ధురంధరత్వమును ద్యోతక మొనర్చుటకుబలక ములై కథాకథనమున కనుసంధానములై వెలయుచున్నవి.

సన్నివేశ చిత్రణమునను, రసపోషణమందును శ్రీనాథుడు వినూత్న ధోరణి నవలంబించెను. విభూతి మాహాత్మ్యము, పంచాక్షరీ మంత్ర ప్రాముఖ్యము బాల సిరియాల మనఃపరీక్ష యొనర్చు ఘట్టములు శ్రీనాథుని అద్భుత కల్పనములు.

పెరియ పురాణమున దంపతులు అవ్యాజ కరుణా విశేషులై భక్తివశంవదులై భగవదర్పణ బుద్ధితో వ్యవహరించినట్లు తెలియును. కవుల కథాకథనము 'పాత్రపోషణ' రస నిర్వహణలందు భిన్నత్వము

కానవగును. బాల వధావసర ఘట్టమువ కరుణ రసోద్దీపకముగ సేక్కి-
ళార్ వర్ణించిన తీరు అమోఘము. అది యిట్టిది—

ఇనియ మగనై కింకిణి కాలిరణ్డుం మడియిన్ పుడై ఇడుక్కి-
క్క-నివాయ్ మై దన్ కై ఇరణ్డుం కయ్యాల్ పిడక్క- కాదలనుం
"వని నిడుఃగై ఉరిగిన్డ్రార్ ఎన్డ్రుమగిళిందు వగై సెయ్య
తని మామగనై తాదయార్ కరువికొణ్డు తళై యరివార్-"

(పె.పు. 6 సం. 50).

కాలిగజ్జెల మ్రోతతో, నగలతో ముద్దులొలుకు బాలుని ఊరి వారు దర్శించిరని సేక్కిళార్ వర్ణించి యీ పద్యములో బాలుని గజ్జెల కాళ్లు పిడిలో తల్లి మెట్లు పట్టుకొనినది తల్లిదండ్రుల మనఃస్థితి, కత్తి వాదరకెరగావించు స్థితి దయనీయము.

శ్రీనాథుడు దీని ననుకరించుచు

సీ. చన్నిచ్చు బాగున జననియత్రి తొడలపై
బసిబిడ్డ బవ్వళింపగ బెట్టి
జందనిక తన హస్త ప్రణాళంబుల
గ్రిందనంటుక నంతరించుకొనిమె
జిన్ని బుగ్గల లేత చిఱుతనవ్వు సెలర్ప
సిరియాలుడు మొగిడ్చె జేయిదోయి
చిఱుతొండనంబి శ్రోమ్మాఱుగారగ గురుకత్తి
వాడిగా నూడుచు వంక దీర్చె
నేకమై యట్లు పల్వురి హృదయములను
గుందకానంద వారిధియందు దేలె

గురులు ముగ్వురును గుమారవరునితోడ
నేకవాక్యంబుగా బ్రీతి నిట్టులనిరి. (హర. ద్వి. 116)

ఇందు బాలుడెట్లు - పట్టుకొనబడినది, తలిదండ్రుల స్థితి, కుమార సిరియాలుని మందహాస ప్రకాశము, చందనిక ఏకీభావము—బహు సుందరముగ కరుణరసముప్పతిలునట్లు వర్ణితమై మూలమున కించుక మెఱుగులు దిద్దినన్నది. ఇట్లు అటనట మూలభావముల—దీప్తి తరుగనీక శ్రీనాథుడు పెరియపురాణము ననువరించినను స్వకపోల కల్పనా శక్తిచే మూల భిన్నాంశములను సృష్టించి తీర్చిదిద్దెను.

పెరియపురాణమున నంబి దంపతులు వీరశైవవ్రత సమాప్తి నొనర్చునపుడు

"పొరువిల్ పెరుమై పుత్తిరన్ మెయిత్తన్మై అళిత్తాన్ ఎన పోఱ్ఱిందు
మరువు మగిళ్ళ్ ఎయిద అవర్ మనవియారుం కణవనార్
అరుమై ఉయిర్ ఎనక్కళిత్తాన్ ఎన్ఱుమిగ ఉం అగం మలర
ఇరువర్ మనముం పేర్ ఉవగై ఎయిది అరియవినై సెలుత్తార్."
(పె. పు. 6 నం. 64 ప)

ప్రియపుత్రుం నర్పించు భాగ్యము ఆనందము గల్గించి భర్త తన్ను ప్రాణవంతురాలిగ నొనర్చెనని నంగ తృప్తిపొంద, ఇరువురు ఎవ్వరు చేయలేనట్టి కార్యము చేసిరని తమిళమున కలదు. ఈ భావమునే శ్రీనాథుడు

"వన్నిదంబాడి గెలిచిన భావముప్ప
నప్పు చెక్కంగ దీర్చిన యనువు మెఱయ
పతియు బతియును గారాబుసుతుంవధించి
వరుస నడిపిరి వీరశైవవ్రతంబు" (హ.ది. ద్వి. 120)

"మరీచీ జీర కాద్యైశ్చ కృష్ణ నింబ దళై రపి
పదార్థైఘృతేన బహునా భర్జితం సమసైంధవమ్,
పలాచూర్ణై ర్మిశ్రితంచ హింగు సర్షపవాసితమ్,
అర్ధ శాంగమ శేషం చ పచతి స్మ పతివ్రతా"
-(శి. భ. వి-శ్లో. 31, 32)

అను శ్లోకములను యథాతథముగ ననువదించెను-

"మిరియము నల్లియున్ బసుపు మెంతియు నింగువ జీరకంబు శ
ర్కరయును జింతపండును గరాంబువు గమ్మని నేయి తైలమున్
బెరుగును మేళవించి కడు బెక్కు విధంబుల శాకశుద్ధి వం
డిరి సిరియాలునిం గటికి డెందమునందరళాత్ము లిద్దఱున్."
(హర.ద్వి. 121 ప)

సీ. కమ్మగా గాచిన కట్టు నంజుళ్లను
నీరువెళ్లగ నొత్తి నేత వేచి
చక్కగా దఱిగిన సన్నమాంసంబులు
పరిపాటిమై జొబ్బుబదవ వండి
మూల్గు టెమ్ములతోడ ముదుకగాకుండగ
జాదుబాగున నల్లచారుగాచి
పలయు సంబారాలు పడియాలు బలియించి
దళమైన క్రొవ్వుతో దాలబోసి

షడ్రసోపేతములుగాగ జతుర భంగి
నమృత పాకంబులుగ జేసి రాత్మఁణంబ
సెట్టి సిరియాలు వంశాబ్ధి శీతకరుని
సతులు తిరువెంగనాంచియు జందనికయు. (హర. ద్వి. 122 ప)

ఇట్లు కఠిన గుండెలుగల స్త్రీలు మాంసమును పక్వమొనర్చిన రీతిని సవిస్తరముగా వర్ణించి మూలమునకు మెరుగులు కూర్చిన విధము సహృదయహృదయైక వేద్యముగా నున్నది.

భోజనమునకు సిద్ధమై, పక్వమొనరించిన పదార్థములలో బాలుని యుత్తమాంగము కాన్పింపకుండుటచేత యోగి కోపింప, నంబి భార్య "శిరము కేశ సంకలితముగాన ఆహార యోగ్యముకాదని తలచి దాచితి"నని చెప్పినట్లుగ ఆంధ్రకన్నడ బసవపురాణములందుండగా సేక్కిళార్ తొలుతనే అరుత్త తలై యిన్ యిరచ్చి తిరు అముదు ఆక్కాగాదెన కళిత్తు (పె. పు. 6 వ సం. 65 ప) అని శిరము నైవేద్యమునకు నర్హమని ప్రక్కకు తీసి, చందన నంగ కిచ్చినట్లు వ్రాసెను పైగా, యోగి చెప్పిన ప్రకారము, "పశుమాంసమును వండితిరా" అని ప్రశ్నింపగా, దంపతులు 'తలయిరచ్చి అముదుక్కు ఆగాదుయనకళిత్తోమ్ (పె. పు 6 వ సం. 74 ప) అని బదులు చెప్పినట్లును, భైరవయోగి "అదువుం గూడ నామ్ ఉన్బదు". (పె. పు. 6 వ సం. 74) దానిని గూడ మేము తినెదము అన్నట్లుగ వ్రాయుటంలో నెంతేని ఔచిత్యము కలదు ఇతర గ్రంథములలోని సందేహములకు పెరియపురాణమున తావులేదు. శ్రీనాథుడు సేక్కిళార్ రచించిన తీరుగ.

తలకాయ యెఱచి ముందటంబెట్టి చందనిక "యిది యేను మొదలన బెడంద కాంౘగు యోగి బృందారకుల చందంబెఱిగినదాన నగుటం" జేసి పాకంబు చేసికొనియున్నదాన దవస్వి చిత్తంబే పాకంబు బొందకుండ వడ్డించెదగాక' (హర. ద్వి. 129) అని యనుటలో, శ్రీనాథుడు యథా తదముగ పెరియపురాణముననుసరించెననవలెను. ఈ సందర్భమున శ్రీనాథుడు బసవపురాణములో వలెగాక, నంగ జవాబు ఆ పాత్రౌచిత్యమునకు భంగము వాటిల్లునని యెంచి, చందనికతో తల

మాంసము ముందే వండించినట్లుగ వర్ణించెను. ఇట్లు చందనిక పాత్రకు కూడ ప్రాధాన్యమిచ్చి శ్రీనాథుడు చక్కగా పాత్రపోషణ మొనర్చెను.

పెరియపురాణమున శివభక్తుడెవ్వరైనను తనతో భుజింపవలెనని తొలుత పేచీపెట్టినట్లుండగ, సోమన శ్రీనాథ గ్రంథములలో చిఱుతొండ డిసే తొలుత పంక్తి భోజనమునకు పిలిచినట్లు కలదు. తమిళమున భైర వుడు నిరాహార దీక్షను ఆఱుమాసములు పూనినట్లుండ, శ్రీనాథుడు దానిని ఒక సంవత్సర కాలముగ మార్చుటలో అతిశయము మాత్రమే కాన్పించును.

ఇట్లు పెరియపురాణ, హరవిలాసములను తులనాత్మకముగ పరిశీ లించినతో భేద సాదృశ్యములు కన్పించినను, శ్రీనాథుడు తన గ్రంథ రచనకు పెరియ పురాణమునే ముఖ్యాధారముగ గ్రహించె ననుట సువ్యక్తము.

1.51. కన్నడ వాఙ్మయము - హరవిలాసము. భేద సాదృశ్యములు.

కన్నడమున భీమయు బసవపురాణమును క్రీ. శ. 1369 సం॥లో భామినీషట్పది వృత్తములో రచించెను. హరీశ్వరుని "శివగణ దళ రగళె"లలో "సిరియాల సెట్టియ' యను పేరులో ఈ నంబి కథ కలదు. "శివశరణసంపుటి" [16] అను గ్రంథమునందీ నంబికథ గద్యరూపమున కలదు. ఇందు అల్యాణ శెట్టి కుమారుడే సిరియాల సెట్టి. ఈతని తరువాత నామమే చిఱుతొండనంబి, ఈతనికి ధనపాల శెట్టి కుమార్తె చెంగళెతో వివాహమైనట్లును చీలాళుడను పుత్రుడుండినట్లును వర్ణితము.

పెరియ పురాణములో వలె కంచికి తిరుజ్ఞాన సంబంధర్ రాక, తలిదండ్రులు చీలాళుని కుపదేశ మిప్పించుట తల్లి సర్వకార్యములకు

16. జీవీరప్ప (పల్లి). శివశరణ సంపుటి. 1973.

శివుడే కర్త యని ఎరుగుట తండ్రియే బిడ్డను పాఠశాలనుండి తెచ్చుట శివుడే చెంగళను పరీక్షించుట ఆమె భయపడకుండుటచే శివుడు విఫలుడై చీలాళుని పరీక్షింపబోవుట చందనసంగ వంటకు సహాయ మొనర్చుట మున్నగునవి కమిళకథలపై ఆధారపడిన ఈ రగడలలోను శివశరణసంపుటములోను పేర్కొనదగిన విషయములు. తమిళమునుండి కన్నడ వాఙ్మయములోనికి కథ ప్రవేశించునాటికే నంబిసెట్టి యామె నని భక్త పరీక్షకు కేవలము నంబియేగాక, సంగయు, చీలాళుడు పాత్రులైరని తెలియును. పిదప శ్రీనాథుడును ఈ గ్రంథముల ప్రభావ ముచే భక్త పరీక్షకు దంపతీ సమేతముగ బయలుదేరునట్లును, భవాని సంగను, శివుడు బాలసిరియాలునిద్ర్రవ్య నిశ్చయమును సడల్ప చూచినట్లు వర్ణించెను. పైగా జ్ఞాన సంబంధర్ రాక పేర్కొని యుండుటచే తమిళ కన్నడ దేశముల వ్యాప్తమైన ఈ కథ తొలుత తమిళదేశమున నుండి కన్నడ దేశమునకు వ్యాపించి, తదుపరి సమకాలీన తెలుగు సార స్వతమున ప్రతిబింబించి యుండును.

బసవ పురాణమున కుమార చీలాళుని మనసు మార్చుటకై శివుడు మాయావేషధారియై వెళ్లినట్లు కలదు. ఆ చీలాళుడు ధీర ధరమగు పల్కులతో గురుజన విధేయుడై ఆత్మోన్నత్యముతో తలి దండ్రులను తానే ఓదార్చునట్టి ఘట్టము, నమః శివాయ మంత్ర ప్రాముఖ్యము, పుత్రుడు లేని యింటి దౌర్భాగ్యస్థితి ఈ కన్నడ గ్రంథ మున పేర్కొన దగిన ముఖ్యాంశములు. శ్రీనాథుడు నమః శివాయ మంత్ర ప్రాముఖ్యమును, మారు వేషములో బిడ్డని మనసు మార్ప చూచుటను ఇందుండియే గ్రహించి యుండును.

ఈ కథా వస్తువుతో రెండు తాళపత్ర గ్రంథములు కలవు. దీనికాలమును గూర్చి కర్తలను గూర్చి తెలియరాదు. మొదటిది రగళ లోను, రెండవది వార్ధక షట్పది వృత్తములలోను రచితములు. రెండవ

దానిలో సిద్ధేశ్వరునిచే రచితమైనట్లు కలదు. ఇవి ప్రాచీనములని చెప్ప వచ్చును.

ఆంధ్ర బసవ పురాణములో వలె పాత్రల నామధేయములలో నంబి సిరియాలునిగను, సంగ చెంగళైగను, పుత్రుడు చీలాళునిగను పేర్కొనబడిరి.

దుర్వాస శాప సృష్టి, ఇక్షు రసాభిషేక వృత్తాంతము, శాంభవీ శంకరులు దంపతీ సమేతముగ భక్త పరీక్షకు వెళ్లుటకు ముందుగల శృంగారరస సన్నివేశము, దంపతులు వేర్వేరుగ తల్లీబిడ్డలను పరీక్షించుట, బిడ్డడు శివార్పణమగుదునని యెరిగి పరోపకార ప్రియత్వము చూపుట-మున్నగునవి హారవిలాసమున స్ఫుటముగ కానవగు భిన్నాంశములు. ఇందు కొన్నిటను బసవపురాణమునుండియు తదితరములగు కన్నడ గ్రంథముల నుండియు శ్రీనాథుడు స్వీకరించెను. ఉదాహరణమునకు వర్ష వృత్తాంతము, కన్నడ బసవపురాణమున సూచనగా నుండగ, శ్రీనాథుడు దానిని ప్రపచించెను. కన్నడ తెలుగు బసవ పురాణములలో భీమన సోమనలు సిరియాలుని "శివసహితముగ భూలోకమునకు తెచ్చి" నిమ్మవ్వ కథా వ్యాజమున భక్తునకు స్వార్థము, స్వాతిశయము, గర్వము కూడని గుణములని లోకమునకు చాటిరి. హాలాయుధుని కల్పించి శివభక్తుడు మాంసాహారమును ముట్టరాదను సత్యమును నిరూపించిరి. ఈ కల్పన యంతయు వీరశైవ మత లక్షణమని మాంసాహార విసర్జనమును ప్రతిష్ఠించుటకే యనియు తెలియుచున్నది. హారవిలాసమున హాలాయుధ కథ నిమ్మవ్వ కథలు లేవు. శ్రీనాథుడు నంబి పాత్రకు లోటురానిచ్చునట్లు వర్ణింపమికి ఆ కవి చిఱుతొండనంబికిని అవచితిప్పయ సెట్టికిని సాధర్మ్య మూహించుటయే కారణము కావచ్చును. ఇట్లు కన్నడ వాఙ్మయమునందలి నంబి వృత్తాంతాదులకు హారవిలాసమునందలి చిఱుతొండనంబి

వృత్తాంతాదులకు కొన్ని భేద సాదృశ్యములు కలవు. మొత్తము మీద హార విలాస-చిఱుతొండనంబి కథా రచనమునకు కన్నడ వాఙ్మయము దోహదకారియైనట్లు చెప్పదగును.

1.52. పాల్కురికి బసవపురాణము-హారవిలాసము -భేద సాదృశ్యములు.

చిఱుతొండనబి కథను పాల్కురికి సోమన క్లుప్తముగ పురాణ ధోరణిలో ద్విపదప్రక్రియా రూపమున "సిరియాలుని కథ'గ బసవ పురాణమున చిత్రించెను. సిరియాళ చరిత్ర శైవులకు అభిమానమగుటచే పలువురు శివభక్తులైన కవులు ప్రత్యేక కావ్య నాటకములుగ రచించిరని పాల్కురికి సోమనయే బసవపురాణమున నిట్లు పేర్కొనెను——

"...... ధరణి లోపలను
గరమర్థి నూరూర సిరియాల చరిత
మేటియై చను భక్తి కూటువలందు
పాటలుగా గట్టి పాడెడు వారు
ప్రస్తుతోక్తుల గద్య పద్య కావ్యముల
విస్తారముగ జేసి వినుతించువారు
నటుగాక సాంగ భాషాంగ క్రియాంగ
పటు నాటకంబుల నటియించువారు
మును మాడి వీరు వారననేల కూడి
కనుగాన యోగ్య రోకళ్ళ పాడెదరు"-(బ.పు. 4 ఆ 124)

పాత్రల నామములలో రెండుగ్రంథములకును కొంత భేదము కలదు. బసవపురాణమున నున్న సిరియాలుడే హారవిలాసమున చిఱుతొండనంబి కాని యాతని పుత్రుడు సిరియాలుడు. బసవ పురాణమున సిరియాలుని భార్య తిరువెంగ నంగ (సంగళవ్వ) హారవిలాసమున నంబి సతి తిరువెంగనాంచి, అచటి సంగళవ్వయే ఇట చందనిక.

బసవ పురాణములో సిరాల గర్వభంగము కథకు అంత్యాను-బంధముగ నున్నది. దానికి మారుగా హరవిలాసమునందు చిఱుతొండ నంబి పూర్వజన్మ కథనము కథకిది యుపోద్ఘాతముగ నున్నది. కథా నాయకుడైన చిఱుతొండనంబి పూర్వ జన్మలో తుంబురుడను పేరుగల యొక ప్రమథుడు. అతడొక స్వల్ప కారణమున దుర్వాసుని కోపమునకు పాత్రుడై మానవ జన్మమెత్తి పరమమాహేశ్వరుడై సిరియాలునిగా జీవించెను.

సోమన ఈ కథా ప్రారంభమున నిమ్మవ్వ వృత్తాంతము నంబి దర్ప హరణార్థము హాలాయుధ, కథ వర్ణించెను. రెండు గ్రంథము లందును కథ సమానమే. శ్రీనాథుడు బసవ పురాణ కథను ఛాయా మాత్రముగ స్వీకరించెను. హాలాయుధుని కథలో, ఒకటి రెండు ద్విపద లలో గల

"అడిగినట్టుల వారి కతి భక్తి యుక్తి,
చెఱకు రసంబు నీప్సిత వస్తువులను
నఱలేక యందిచ్చి కఱకంట గొలువ-" (బ. పు. 4 ఆ 266)

వివయమాధారముగ, ఇక్షు రసాభిషేక వృత్తాంతమును

"హరు డిరువది యొక్క దినము
వడిగొని కంచిలో వాన గుర్పింప - (బ. పు. 267)

అను ద్విపద నూతగా గొని శ్రీనాథుడు కథా సంబంధి యగు వర్ష వర్ణనమును చేసెను. వర్ష వర్ణనము కథా విస్తృతికి, నంబి యొక్క నిరుపమాన నిరంతరాన్న దాన దీక్షను స్ఫురించుటకు తోడ్పడినది.

ఇక్షు రసాభిషేక వృత్తాంతమాధారాముగ పార్వతీ పరమేశ్వరుల ప్రణయకలహము సృష్టించి శృంగారాద్భుతరసముల శ్రీనాథుడు పోషించెను. ఈ ద్వివిధ రసపోషణము కథావైచిత్రికి తోడ్పడినది. ఇట్టి

కథాకథనోద్దీపన మొనర్చెడి సన్నివేశములకు బసవ పురాణమున తావులేదు. అదొక పురాణము భక్తులగూర్చి భక్త్యావేశముతో భగవంతుని పట్ల తమ భక్తినిరతిని, స్వయముగా ద్రవిడ దేశమున నున్న కాంచీపురమునకు, చని భక్త పరీక్షకు గడంగుట బాలసిరి యాలుని మనస్సంచలనమునకు శివుడును, తిరువెణ్గాట్టు నంగ చిత్త స్థైర్యము సడలింప పార్వతియును యత్నించుట, బాలకుడు తాను బలిపసువు కానున్నానని ఎఱిగియు జననీ జనకులను మించిన భక్తితో తానా యోగికాహారమగుటకు సంసిద్ధుడైనటుల, జ్ఞానివలె ప్రవర్తించుట శివుని యాజ్ఞమేరకు బాలకునికై మేనత్త యింటి నుండి తినుబండారములే తెంచుట, వృద్ధ జంగమ వేషమున నున్న కుష్ఠువ్యాధి పీడిత పరమేశుని (జంగముని) నంబి స్వయముగా మోసి యింటికి తెచ్చుట, బాలకవృద్ధ దంపతుల అభ్యంగన స్నానము పాఠశాలలో బాలసిరియాలుడు శివుని చే మూర్ఛనొంది విభూతిచే తెలివొందుట-మున్నగు అద్భుత కల్పనములు హరవిలాస కథా విస్తృతికి, పాత్ర ప్రోషణ రస పోషణాదులకు తోడ్పడి ఆ కథ యొక ప్రత్యేక శైవ పబంధ మగునట్లు చేసినవి.

మాంస భోజనము భైరవ జంగముని కర్పించుటలో నంబి రహస్యముగా చేసెనని బసవ పురాణమున నుండ హరవిలాసమున భక్తి ప్రపత్తులతో రాజ వీధిని కుష్ఠు వ్యాధి పీడితుడును, “ఆమ్నాయాంత సిద్ధాంత వాఙ్మహిళా కుంతల మాక్తికాభరణుని మందాకినీ శేఖరుని, కుహనా భైరవుని” మోసుకొని వచ్చి, అభ్యంగన స్నానమొనర్చి పశూపహారమర్పించినట్లు వర్ణితము. సోమన శ్రీనాథుల గ్రంథములలో భైరవుడు శివభక్తుడెవరైనను పంక్తి భోజనమునకు రావచ్చునన్నట్లుగాక తొలుత నే చిఱుతొండడినే పిలిచినట్లు పెరియ పురాణమున కలదు. బసవ పురాణమున “ఏవురు” నిత్య జంగముల

లేనిదే నంబి " భుజిభ్యాడనుట కంటె శ్రీనాథుడు. ఒకడు మొదలుగోని మఱికొందఱు " (హర. ద్వి. 35) అనుటలో యుక్తి యుక్తత గలదు.

బసవపురాణమున తల్లి ప్రియకుమార కుమారుని పిల్చు నట్టి ఘట్టము చివరిదైనను పాఠకులలో కరుణ రస ముప్పతిల చేయును. హరవిలాసమున ఎక్కువ భావావేశము లేనట్లు ఒకే ఒక సీసపద్యమున వర్ణితము.

బసవ పురాణమున నంగ (సంగళవ్వ) ఒక వైపు పుత్రప్రేమ యింకొక చింత స్మరణచే పుత్రశ్లోకము, మరియొక వంక పరమేశ్వర భక్తి, పుత్రుడు నిజముగా వచ్చునేమోయను ఆశ – అను వివిధ భావ, సమ్మేళనముల నొక్కుమ్మడిగ కలబోసినట్లు వర్ణితము. మానవ మాన స్తత్త్వ వివరణము దెల్పు ఆవేశ పూరితమైన భావములను వ్యక్తీ కరించుటలో నుత్తమ కవిత వెలార్చుట, కవకాశముండునని, సోమన వ్యంగ్య ప్రధానముగ, గంభీరముగా రచన గావింప, శ్రీనాథుని కూర్పు రచనా గౌరవముతో నున్నదని తెలియును.

మాయాభైరవుడు నంబి ఓర్పును, భక్తిని రకరకములగు అగ్ని పరీక్షలలో తేల్చి వేయదలిచెను.

" సర్వజ్ఞ మీ మనోజ్ఞంబైన యట్టి వరపుత్రుడున్నాడు

పొరుగింటికిని పిల్వ పోయెదవయ్య !– అని బసవ పురాణమున పల్కిన నంబి తిరిగి

అకలంక మీ రప్పుడన్నారు నేను

విన్నాడ బుత్రుడున్నాడు చదువు

చున్నాడొ.............కొనియెదుగాక. (బం.పు. 4 ఆ. 264)

అనుటలో పంక్తి భోజనమునకు రాని కుమారుని గూర్చి చెప్పుటలో యించుక స్వవచో విఘాతము కలదు. శ్రీనాథుడట్లు గాక "నరమాంస

మొక్కి వెరవుననడుగ" అను సోమన ద్విపద కావ్యమునందు 'వెరవు'ను బహిర్గత మొనర్చినట్లుగ ;

"కుడుతు నా బంతి నిలుతేను గొడుకు కుడువ"

అని ఒప్పందములో, ఇలుతేను, కొడుకును అరువురు భుజింప భుజింతు నను అన్వయము కుదురునట్లుగ, ఇలు తేమన్, కొడుకున్ అను సముచ్చయార్థక విశిష్టమైన ప్రథమాంతములుగ నొక విధముగను, రెండవ విధముగ "కొడుకున్" అనునది ద్వితీయాంత పదముగను కల్పించి రెండర్థములను అద్భుతముగా పొసగించిన కవితా చమత్కృతి శ్రీనాథునికే దక్కినది.

బసవ పురాణమున నీశ్వరుడే కపటయోగి రూపమున వచ్చి "సిరియాలు గరుణాభిక్షం చేయుమను సరమాంస మొక్కొక్క వెరవున నడిగినట్లు" (బ. పు. 4 ఆ. 264) చెప్పబడినది. హరవిలాసమున చిఱుతొండడే జంగమాన్వేషణము చేసి వృద్ధ దంపతుల రూపముననున్న పార్వతీ పరమేశ్వరుల నింటికి గొనిపోయినట్లుండి నంబి శివపూజా తాత్పర్యమును ద్విగుణీకృత మొనర్చునదిగా నున్నది.

బసవ పురాణమున శివయోగికి చెరకు రసమర్పించునట్లు మాత్రమే యుండగ, శ్రీనాథుడు దీనిని బాగుగ విస్తరించెను. తిండి జంగముడు—

చేగానుగాడి చెఱకుం
దీగ రసంబునబు రారి దెబ్బక కుడువ
న్నా గురుపుప దేశించిన
యాగమునిది గాన నిన్ను నభ్యర్థింతున్ - (హర. ప్ర. 18)

అని కోరగా, చిఱుతొండడు పత్నియును బయల్వెడలి "మూదురు దీవల బిగియార మోపు గట్టికొని యెత్తి కొనలేక ప్రుంగ్గ తిలంబడెను. అవు

డాతనికి శ్రీ మహాదేవుడు తోడై చెరకుల మోపు మోసెను. భక్తుని శరీరము చెమర్చగా, భగవంతుని శరీరము కూడ చెమర్చెను. కాని వెండి కొండపైన అప్సరోగంనా నృత్య సంలగ్న మానసుడైన ఈశ్వరుడు సాత్త్విక భావోదయముచే ఘర్మ సలిలములు జాలువారెనని తలంచి, పార్వతి యీర్ష్యాప్రేరితయై "కేళీసరసీరుహాము త్తి సుధూలికా పరాగములు శశాంక శేఖరుని కన్నుల మూటను చిందు"నట్లు మొత్తెను. లీలారవిందముచే హిమశైల నందన వలన ప్రేటువడిన యిందు ధరుడు మందస్మిత స్మేర వదనారవిందుడై మంద్ర గధీరస్వనమున నానతిచ్చుచు "తనయై చెమర్చుటకు కారణము సెప్పెద నాకర్ణింపుము"- అనెను. ఇట్లు శ్రీనాథుడు ప్రథమ ద్వితీయాశ్వాసముల కథానుస్మృతిని (Continuity) పాటించుచు సన్నివేశములను కూర్చుచు అద్భుత భావ పరంపరా విశిష్టురాలగు పార్వతి ద్వారా శృంగార రసము నుప్పతిల చేసెనని చెప్పవలెను.

నంబి పాత్ర పోషణమును పై ఇక్షురసాభిషేక వృత్తాంతము నిరూపించినది. నంబి వీరమాహేశ్వర సిద్ధాంత మార్గాను సారంబున విభూతి స్నాన మొనరించి ధౌత పరిధానము గట్టి త్రిపుండ్ర ధారియై అమృతాశనార్చితుని శీతమయూఖధరుని జలకమార్చును" అభిషేక ప్రియో హరః అను ప్రయాణవచనానుసారము

"అద్వైత స్వమూర్ధ్ని దేశే హిరణ్య కలశేన
సంతత ధారా నభిషించేత్, యథా పయసా దధ్నా నర్పిషా
మధునా శర్కరేణేక్షు రసేన గంధ తోయేన నారికేళతోయేనా
ఉగ్రమరసేన"

అను ఆగమోక్తి ప్రకారము అభిషేకము జరిపి ధూప దీపతాంబూలములు అర్పించి షోడశోపచార పూజలొనర్చు శివపూజాధురంధరుడు నంబి అందులకే జంగముడు కోరిన రీతిగా శ్రీనాథుడు శాస్త్రమెరిగిన వాడు

కాపురను తూమెడిత్తు రసమునకు వలసిన చెఱకు గడలు తెచ్చి అతిథి యొక్క యభీష్టము నెరవేర్చిన వాడే నంబి. ఇట్టి కథా కథ నోద్దీపన మొనర్చెడి సన్నివేశములు పురాణముగా నున్న బసవపురాణమున లేవు. శ్రీనాథుని సన్నివేశ నిర్మాణ ప్రతిభచే పాఠకులలో ఉత్కంఠ పెరిగి బదరికాశ్రమము నుండి కాంచీపురమునకు, కాంచీపురమునుండి కైలాసమునకు, కైలాసమునుండి తిరిగి జంబూద్వీపమందలి ద్రవిడదేశ మునకు తిరిగి వచ్చెదరు పాఠకులకు విసువు కల్గింపని రీతిగ శ్రీనాథుడు సన్నివేశములను కూర్చెనుటకు శాంభవి శంకరులు కాంచీపురమున భక్త పరీక్షకు తొడంగు సందర్భమే ఉదాహరణముగ గైకొనదగును. భక్త పరీక్షలో నంబియేగాక, చాలుడగు, సిరియాలుడును, సంగయును పాత్రులైరి. ఉదాహరణమునకు సంగ, శాంభవి పరీక్ష నెట్లెదుర్కొనెనో ఈ క్రింది పద్యము వలన సంవిదితమగును.

> "మక్కువ రేగి నెయ్యపు గుమారుని జంపుట కంతరాయమై
> యక్కటికంబు పుట్టుటకు నల్లన వచ్చి భదాని యుత్తఱిం
> దక్కటి మాయ జోగిత విధంబున బిడ్డకు బాలువేడనా
> యక్కయుబోసి నెల్ల సమయంబుల బోలె నిలాకులాత్మ్రయై"—
>
> (హర. ద్వి. 96)

పదహారేండ్ల బాలింతగ బిడ్డకు పాలు బోయించమని ప్రార్థించుచు ఆమెలో కనికరము, మమకారము రేకెత్తింప నుంకించుచు ప్రస్తావనా వశమున జోగులు కపటోపాయ సిద్ధులని సుతుని ఓగిరమునకై చంపుట ఉచితమేనా యని అట్టి నిశ్చయ మొనర్చిన మగడు కన్నులు కానడని నీ కొడుకును చంపెడివాడు "మగవాడో కాక మ్రానో" యని, ఆవ గింజంత భూతియైనలదికొనా గుమ్మడికాయంత వెఱ్ఱి పుట్టునని బోధించియు సంగయొక్క మనోనిశ్చయమును సడలింపలేక పోయినది. ఆమె భర్త మాటను మీరెడైన దాటని అంగనారత్నము. శరణార్థుల యర్థ

ప్రాణంబులు శివాధీనములని, శివుడే కర్త, శివుడే భోక్త యని యెఱిగి నట్లుగ పారమార్థిక జ్ఞానసంపత్సారాలుగ చిత్రించిన ఈ సంగ మనః పరీక్ష శ్రీనాథుని అపూర్వప్రతిభా నైపుణ్యమునకు గీటురాయి.

ఇట్టి సన్నివేశములు బసవపురాణమున లేవు.

రసపోషణకు తావలమైన బాలసిరియాల వధఘట్టమున కరుణ రస పోషణ మొనర్చి సిరాల సెట్టి మహాభక్తుని స్వభావోక్తి సిద్ధముగ వర్ణించి విభూతి మాహాత్మ్యమును ప్రబోధించిన వాడే శ్రీనాథుడు. బసవ పురాణమున మూర్ఛగాని శివవిభూతిచే తెలివొందు ఘట్టముగాని లేవు. గురుజనము పిల్లవానికి అంత్యోపదేశము చేయునప్పటి ఘట్టమున శ్రీనా థుని లేఖిని నుండి వెలువడిన అణుపద్యములు భక్తి వాత్సల్య శమ భావములచే ముప్పిరిగొని మున్నిరుగ పొంగినవి.

ఇట్లు సోమన బసవపురాణమునకు హరవిలాసమునకు భేద సాదృశ్యములు కలవు. ఇతః పూర్వమే మల్లికార్జున పండితుడు తన శివతత్త్వసారమున

"తన కొడుకు దునిమివంటక
మొనరగ గావించి నీకు నొప్పని పెడిం
చి (నదాన హెంచ్చి) ముక్తికి
బొనరగ చిఱుతొండ నంబి ప్రోవడె రుద్రా"

అని చిఱుతొండని గూర్చి పేర్కొనుట జరిగినది. కాని అందుండి శ్రీనాథుడు గ్రహించిన విషయము మృగ్యము.

1.5.3. శివభక్త విలాసము – హరవిలాసము – భేద సాదృశ్యములు.

శివభక్త విలాస కాల నిర్ణయము వివాదగ్రస్తము. హరవిలాస మునకు పూర్వ రచన యని పలువురి యభిప్రాయము. ప్రాచీన తా దృష్టితో తులనాత్మకముగా పరిశీలించుట జరిగినది.

“దభ్ర భక్త కథ” యనెడి పేరుతో నీ చిఱుతొండనంబి కథ ఉపమన్యు ప్రోక్త శివభక్త విలాసమున కలదు. సంస్కృతమున అగస్త్య భక్త విలాసము అను గ్రంథమునందును ఈ కథ కలదని ఉప మన్యు భక్త విలాసము తమిళ పెరియపురాణమునకు అత్యంత సన్నిహిత ముగా నున్నదని కీ. శే. పొంగూరు సూర్యనారాయణగారి యభి ప్రాయము.[17]

ఇందు చిఱుతొండనంబి నాయనారు దభ్ర భక్తుడుగను తిరు వెణ్గాట్టు నంగ శ్వేత వన నాయికగను శిాలుడు శ్రీపతిగను నామధేయ ములతో సంస్కృతీకరింపబడిరి.

కథా వృత్తాంతమంతయును పెరియ పురాణమువలె నున్నను అటనట మార్పులు కలవు. పుత్ర మాంస ఖండముల పాక మొనర్చునట్టి ఘట్టము, శ్వేతవన నాయికకు పతివ్రతా లక్షణములు బోధించునట్టి ఘట్టమున పరోపకార పారాయణులని ప్రశస్తిగాంచిన శిబి, అలర్క-కపోతముల పేర్కొను ఘట్టము శ్రీనాథుడు హరవిలాసమున గ్రహించెను. పుత్రుడు శ్రీపతి రంపపుకోత ననుభవించినట్లు కలగనుట, నమఃశివాయ మంత్ర ప్రాముఖ్యము, సాభిప్రాయమైన గురుని యాశీర్వాదము, దభ్ర భక్తుడే బిడ్డను కొంపోవుట మూర్ధమును మూర్కొనకుండుట, బిడ్డని స్నానము, దభ్ర భక్తుని కత్తిదెవదత్తమై కైలాసప్రాప్తి నొందించు నట్లు వెలుగొందుట మున్నగునవి పెరియ పురాణములో లేని కథాంశ ములు.[18] ఈ గ్రంథాదిని అంతమున పార్వతి తనకు ప్రియభక్తులకంటె తక్కువ స్థానమిచ్చెనని శివునిపై నించుక కోపము, అసూయ ప్రకటించి నట్లుండుగా శ్రీనాథుడీ విషయము నొక అద్భుత శృంగార రసవత్తర సన్నివేశముగా రూపొందించె ననవచ్చును.

---

17. సూర్యనారాయణ పొంగూరి; శివభక్త చరిత్రము, 1962.

18. ఉపమన్యువు; సంస్కృత శివభక్త విలాసము, 1931.

సంస్కృతమున శిబి, అలార్క, కపోతములు పరోపకారములను పేర్కొనిందినట్లుండ శ్రీనాథుడు, శిబి, దధీచి మేఘవాహను లమవాలకు అధ్రువంబైన మల భాండ దేహ త్యాగ మొనర్చి శాశ్వత కీర్తి కాయములు పొందినట్లు బాల సిరియాలుని నోట పల్కించెను. దధ్రభక్తుడు, శ్వేతవన నాయికతో పతివ్రతా లక్షణములు దెల్పుచు, పరోపకారమును గూర్చియు తెల్పుట భేదము.

"సుగంధినా తమభ్యజ్య తైలేన తనయం సతీ,
అభిషిచ్య సుఖోష్ణేన వారిణా వారి జేక్షణమ్."
(శి.భ.వి. 20 శ్లో.)

అను శ్లోకమును సిరియాలుని జలకమార్చునప్పటి

"జడల యుల్లిక యూడ్చి సంపంగి నూనియు
చిన్నకూకట్ల జొబ్బిలగనంటి" (హర. ద్వి. 108 ప)

అను పద్యములో యథాతథముగ అనువదించెను. పైగా కొన్ని మెరుగులు దిద్దెను.

పాఠశాలలో సిరియాలుడు :

"మధ్యేస్థితాం శ్రీపతి మర్భకాణాం నిధిం కలానామివ తారకాణామ్" – (శి.భ.వి. 11 శ్లో) అనియుండగా, శ్రీనాథుడు–

"అ భ్యస్త లిపి ప్రపంచుడు గ్రహంబుల లోనుడు రాజుకై వడిన్" – (హర ద్వి. 73) అని యథానువాద మొనర్చెను. అట్లే

"కేజేదత్తైవ దేవేన కైలాస క్రయ పత్రికా"–(శి.భ.వి. 25 శ్లో.)

(కైలాశ మవశ్యము ప్రాప్తింపచేయు కరపత్రము) అను శ్లోక భావము ననుసరించుచు

"నంబి శివార్థమ స్మనసు నమ్మికె.........తీ

ష్ణంబగు కత్తి సెలాప కొండగ్రక్కున ద్రెవ్వి" - (హార ద్వి. 117) అను పద్యము రచించెను.

పుత్రుని మాంసోపహార పక్వ వర్ణనమును - సంస్కృతము నుండి "మరీచీ జీరకాద్యైశ్చ కృష్ణనింబ" అను శ్లోకమును - (శి.భ.వి. 31 శ్లో.) శ్రీనాథుడు - "మిరియము సుల్లియు బసుపు మెంతియు నింగువ (హార. ద్వి. 121) అను పద్యమున యథాతథమున ననువదించెను.

అన్నిటికన్నను శివభక్త విలాసములో వలె "తత్తద్వ్యంజన పాకగంధ్య యవయవస్థాన ప్రతానంబుతో" పిల్లవాని యవయవములు పోపుపెట్టిన వాసనలు వేయుచున్నవని వర్ణించుటచే కవితా గుణమగు కల్పనా చమత్కారము గలదని తెలియును.

వీరశైవము హారవిలాస రచనా కాలమునకు మునుపే ప్రబలి యుండుటచే అంతకు మునుపే రచితమైన శివభక్త విలాసమున సహితము దత్తభక్తుడు జంగమునితో బాటుగ భుజింపవలసి వచ్చినపుడు శిలాకబలమును మాత్రమే తినబోయెను. కాని మాంసమును తినలేదు. జంగముడు శ్రీపతిని పిలువుమని అతడు వచ్చిన పిదపనే భుజింతునని పంతము పట్టెను. పైగా పిల్లలు లేని ఇంటిలో భుజించుట శాస్త్రనిషిద్ధమని యిట్లు తెల్పెను.

"శ్రుణుచైకం వచో భక్త నవేత్సి నియమం మమ,
నాశ్నియామేక ఏవాహం క్వాపి చండాల కర్మవత్
(శి.భ.వి. 50 శ్లో.)

భుక్త పూర్వంచ న మయా సదనే పుత్ర వర్జితే
సర్వ శాస్త్ర నిషిద్ధం తదపుత్ర గృహా భోజనమ్
(శి.భ.వి. 61 శ్లో.)

నరః నరోత్తమేన వినాకృతం యథా
వినా శశాంకేన నభస్థలిం యథా
అదృష్ట సూర్యం దివసం యథా తథా
నికేతనం భాతి న పుత్ర వర్జితం." (శి.భ.వి. 62)

పై శాస్త్ర విషయమును శ్రీనాథుడించుక మార్చి, "అఘము భుజియించుబో" "కేవలాది" యనుచు వేద వాక్యంబు బుధులన వినమె చెపుమ" - (హర. ద్వి. 129) అని రచించెను. ఇందలి 'కేవలాది' శ్లోక శబ్దము కృష్ణ యజుర్వేదీయ తైత్తరీయ బ్రాహ్మణములో నున్నది.

"మోఘమన్నం విందతే అప్ర చేతాః
సత్యం బ్రవీమి వధ ఇత్స తస్య
నార్య మణం పుష్యతినో
సఖాయం కేవలాఽఘోభవతి కేవలాదీ"

(కేవలాదీ కేవలం భుంక్తేన తు దదాతి సోఽయం కేవలాఘో భవతి పాపమేవ సంపాదయతి న తు కించి దపి పుణ్యం సోయం వధ ఏవ నరకే హేతుత్వాత్।) భుజించునపుడు సాక్ష్యమున కొరకుండవలె ననుటే శ్రీనాథునిచే ఏకాకి భోజనము పాపహేతువని చెప్పించినది. పైగా కవియొక్క వేదవేదాంగ పారంగత్వ మిట నిరూపితము.

అట్లే కన్నడ బసవ పురాణమున భీమయ కవి పుత్రులులేని యిల్లు

"ఇనియ నిల్లద కాంతె యాదడె
ఇనియ నిల్లద పురుష నాదడె
తనయ నిల్లద మనెయ నాదడె". (క. బ. పు. 92)

పురుషుడు లేని కాంత, ప్రియురాలు లేని ప్రియుడు, పుత్రుడు లేని యిల్లు నిష్ప్రయోజనములని తెల్పెను. పుత్ర భాగ్య విశిష్టతపై గ్రంథములలో నగ్గడింప బడినది.

పెంపొత్తము మీద శ్రీనాథుని హరవిలాస రచనకు పెరియపురాణము (తమిళగ్రంథము) కన్నడ బసవ పురాణాములు (కన్నడము) ఆంధ్ర బసవపురాణము (ఆంధ్రము) - ఇత్యాదులు ఆకరములని చెప్పవచ్చును.

1.6. కథాగ్రహణ హేతువు :-

దక్షిణ భారతమున శివభక్తుల గాథ లనేకములు కలవు. పురాతన భక్త గాథలలో నీ చిఱుతొండనంబి కథయొకటి. పైగా చరిత్రాత్మక ప్రసిద్ధి నందినది. పలనాటి వీర చరిత్రలోని బాలచంద్ర యుద్ధ భాగము నందీ కథ ప్రసక్తమై తండ్రి కొడుకుల నామములు సోమనాథుని బసవ పురాణము నందు వలె గాక (సిరియాలుడు, సీరాలుడు) శ్రీనాథుని హరవిలాసమునందు వలె

(చిఱుతొండనంబి, సిరియాళుడు)-

> "వలెదు శివకంచి యేకామ్రపతికి
> చిఱుతొండనంబి నా చెలగు భక్తునికి
> శెంకెల శిరువను సీమంతికిని
> సిరియాళుడన బుట్టి చెన్నొంది నాడ."- (92. 94 పుటలు)

అని యుండి యది శ్రీనాథుని కర్తృత్వమును, శివభక్తి నిరతిని చాటుచున్నవి.[19]

తమిళ వాఙ్మయమున బహుళరంజకమై జనవ్యాప్తమగు నీ కథను స్వీకరించినచో కృతిపతిని సంతోషింప చేయవచ్చునని శ్రీనాథుడు తలచి యుండవచ్చును. పైగా సోమన నాటికే ఈ కథ కన్నడమునను, తెలుగునను, భక్తకూటువలలో పాటలుగ పాడెదరని, గద్య పద్య

19. శ్రీరామమూర్తి, కొర్లపాటి, శ్రీనాథుడు. 1971.

కావ్యముల పఠించెడివారని, నాటకములుగ నటించెడివారని, రోకటి పాటలుగ పాడెడివారని తెలియుచున్నది.

హారవిలాస రచనా కాలము నాటికే ప్రసిద్ధినందిన ఈ శివభక్త గాథ శ్రీనాథుని ఆకర్షించియుండును. కృతిభర్త అవచి తిప్పయ ఆతనికి బాల సఖుడు. శ్రీనాథ హారవిలాస కృతిభర్తల సంబంధము హారవిలాసమున నిట్లు నిరూపితము –

"ఆగమ జ్ఞాన నిధివి, తత్త్వార్థ ఖనివి,
బహుపురాణజ్ఞుడవు, శుభ భవ్యమతివి,
బాలసఖుడవు శైవప్రబంధ మొకటి
యవధరింపుము నా పేర నంకితముగ (హార. పీ. 12)

బాలసఖుని కోర్కె ప్రకారముగ శ్రీనాథుడీ హారవిలాసమును "శైవ ప్రబంధముగ" నంతరించి కృతిపతికి నంకిత మిచ్చెను. అందునను కృతిభర్త ప్రీత్యర్థము, 'సిరియాళ చరిత్ర'ను స్వీకరించి కృతిభర్త వంశమునకు మూల పురుషుడైన చిఱుతొండనంబి, కంచి నంబి వంశజుడని, పైగా తుంబురుడు శాపగ్రస్తుడై మానవ జన్మ నెత్తినవాడని తెల్పి శ్రీనాథుడు కృతిభర్తకును, నంబికిని సాధర్మ్యమూహించెను. అందులకే కృతి భర్త వంశావళిని కీర్తించి, ఆయన పూర్వులే గాక నంబి వర్ధిల్లిన కాంచీపురమును వర్ణించి కథా ధోరణిని శ్రీనాథుడు ప్రారంభించెను.

కవి గ్రంథాదిని సిరియాళుని కథనే యెత్తికొనుటకు, కథా పురుషుడగు నంబికిని అవచి తిప్పయ వంశమునకు మూలపురుషుడుగ సంబంధము కలుపుటకు వీలు చిక్కుటయే కారణము అవతారికకును కథారంభమునకు నిట్లు పొత్తు కలుపుట మన సాహిత్యములో అరుదు.[20]

20. లక్ష్మీకాంతం, పింగళి, ఆంధ్ర సాహిత్య చరిత్ర, 1974.

ఎట్టి భక్తుడైనను పుత్రుని నర్పించుట యందు గొప్ప త్యాగము ప్రకటిత మగును. ఈ భక్తి త్యాగములకు తోడుగ ధైర్యసాహసము లవసరములు. కనుక నిష్కామము, నిష్కల్మషము నైన శివభక్తిని ప్రదర్శించిన చిఱుతొండనంబి కథ ఎల్లరికి సుపరిచితమగుటచేత అందునను వైశ్యవంశీయుల గాథయై వైశ్యునకు ప్రీతికల్గించునని శ్రీనాథుడది వరకే వైశ్యుడుగా ప్రసిద్ధి చెందిన నంబి కథను స్వీకరించి, బాలసఖునికి ప్రీతి పాత్రమైన కథనే తొలుత స్వీకరించెను.

అంతే గాని శ్రీనాథుడు కేవలము ధనాశచే నంబిని వైశ్యునిగ మార్చి వైశ్యుని కథను వైశ్య ప్రీతికై రచింపలేదని, కన్నడ వాఙ్మయమునాటికే నాతడు సెట్టి యయ్యెనని మనము తెలిసికొంటిమి.

పైగా వైశ్యులలో త్యాగధనమున్నను, వీరసాహసములరుదని భావించువారలకిది కనువిప్పగనై ఈ కథ వైశ్యుల భక్తి వీరమును సాహసమును ప్రకటించుట కయి ఈ కథనే తొలుత స్వీకరించెను.

సామాన్య జన జీవితమునకు చాల దగ్గరైన యితి వృత్తము గలదగుటచేతను, భక్త వశంవదుడగు మహేశ్వరుని పట్ల భక్తుడు ప్రదర్శించు అప్రతిమాన భక్తి త్యాగములను చిత్రించు కథ యగుట చేతను ద్రవిడ దేశస్థుల కభిమాన ప్రదమగు శివభక్త్యాచార్యుని కథ యగుట చేతను శ్రీనాథుడు తొలుత ఈ కథను స్వీకరించెను.

హరుని లీలలను దెలుపు పురాణ గాథ లనేకము లున్నను, జన వ్యాప్తమై జనాదరణము నొందిన ఈ శివలీల మానవ మానసిక సంఘర్షణల దెల్పు దర్పణమగుటచే కవి చిఱుతొండనంబి కథతో హర విలాసమును ప్రారంభించెను.

ఫలశ్రుతితో అంతమగు హరుని లీలలు హరవిలాసమున కలవు. నంబి కథ యొక్క యుపాఖ్యానము. వైశ్యులకు ధన సమృద్ధి కల్గునట్లు ఈ కథా శ్రవణ ఫలితమై సుప్రయోజనమును సాధించియుండును.

1.7. కథాంత ఫలశ్రుతి :-

"ఈ చరిత్ర వినినను, చదివినను వ్రాసినను పుత్ర పౌత్రాభివృద్ధియు ధనకనక వస్తు వాహాన సమృద్ధి యొనగును" అని కలదు. అమలిన భక్తి, అహంకార వర్జనము, మమకార వర్జనము ప్రధానాంశములుగా గల యీ కథ భక్తి ప్రబోధకమైనది. నిస్స్వార్థమైన ఆత్మార్పణ మొనర్చునట్టి త్యాగమే శ్రేష్ఠము, అమృతము అని వేద ప్రమాణ మిట్లు కలదు.

"త్యాగేనైకేన అమృతత్వ మానసుః" (యజుర్వేదము) ప్రియ మైన యే వస్తువైనను భగవంతుని కర్పించుటలో వెనుదీయరాదని, పుత్ర మాంసము నర్పించిన నంబి కథ తెల్లమొనర్చును. భక్తితో ఫలమో, పుష్పమో, తోయమో అర్పించినను భగవంతుడు ప్రీతుడగు నని భగవద్గీత తెల్పుచున్నది. (అ. 9. 26)

ఈశ్వర ప్రణిధానమునకు క్రియా ఫలన్యాసమే భక్తియని

"సర్వాసాం క్రియాణాం పరమేశ్వరే పరమ గురౌ
సమర్పణం ఈశ్వర ప్రణిధానం క్రియా ఫలసన్న్యాసం
భక్తి విశేషాత్మకమ్" — అని సర్వ దర్శన సంగ్రహములో సాయణులవారు పేర్కొనినట్లు,

పుత్రునర్పించి క్రియాఫలమునకై చింతింపక భగవత్సాక్షాత్కా రమును పొందిన నంబి ధన్యుడు.

నా_స్తి పంచాక్షర రాన్మను ః

నా_స్తి మాహేశ్వరాద్ధర్మో నా_స్తి దేవో మాహేశ్వరాత్ - (స్కాం.పు.) అన్నట్లుగ పంచాక్షరీ మంత్ర మహిమను మాహేశ్వర ధర్మమును ఖ్యాపించు కథాదికము పుణ్యప్రదము.

ఈ కథలో వివిధములగు అగ్ని పరీక్షానంతరము నిగ్రహముతో జంగమారాధన తత్పరతను వెల్లడించి పుత్ర మమకారమును వీడి నంబి కుటుంబ సమేతుడై భగవత్సాక్షాత్కారమును పొందెను. శ్రీనాథుడు మరొక మెట్టు పైకి వెళ్లి

అఖిల జీవ జంతువులును నభ్ర వీథి
భాసుర స్ఫూ_ర్తి నేగె కై_లాసమునకు - (హర ద్వి. 142)

ఇట్లు ఎల్లరిని కై_లాసమునకు గొంపోయెను.

ఈ కథయందు చిత్రాతిచిత్రమైన విషయ మొకటి గలదు. చనిపోయిన బాలుడు సజీవుడై తిరిగి వచ్చుట యెట్లు? తల్లి సమ_స్త దిక్కులను పర్యాయ క్రమమొప్పగ సీరాలుని ఎలుగె_త్తి పిలిచినది. సజీవుడై బాలుడు తిరిగి వచ్చెను. బాలుడు మరణించినను ప్రాణములు సమ_స్త దిక్కులలో ప్రకృతితో లీనమై యున్నవి. దీనిని గూర్చి కీ. శే. విశ్వనాథ వారు, శ్రీనాథుడీ మహా రహస్యము నెరిగినవాడై కథలో ననుసంధించె ననిరి.

బృహదారణ్యకములోని చతుర్థాధ్యాయము నందు ద్వితీయ బ్రాహ్మణమున .

"తస్య ప్రాచీ దిక్ ప్రాంచః ప్రాణాః
దక్షిణాదిక్ దక్షిణ ప్రాణాః
ప్రతీచీదిక్ ప్రత్యంచః ప్రాణాః

మొదలుగా ఏ దిక్కు ప్రాణములా దిక్కునకు పోవును. అపుడు బ్రహ్మ పదార్థము మిగులునట. అందులకే అగస్త్యుడు వాతాపిని జీర్ణము చేసి కొన్నట్లు గాక జంగమునిచే తిని, జీర్ణము కాని సిరియాలుని అంగ మాంసము శరీర రూపముతో నల్దిక్కుల పర్విన ప్రాణములు పిలిచిన తోడనే వచ్చినవనిరి. ఈ మహా విషయము పై చెప్పిన బ్రాహ్మణ ములో కలదవి వారనిరి.

పంచభూతములలో లయమైన ప్రాణములు నల్దిశల వ్యాపించి నను భక్తి పారమ్యతతో బాలుడు పునరుజ్జీవుడయ్యెననవచ్చును. భగ వంతుని సాక్షాత్కారము భక్త్యతిశయము వలననే సాధ్యము. భక్త పరాధీనుడు శంకరుడు.

ఈ వీర శైవాచార్యుని జీవితోదంతము తమిళ కథలలో నొకటై యుండినను దీనికొక ప్రత్యేకత కల్గించినవారు ఆంధ్ర కవివర్యు లన వలెను. అహంకార వర్జితుడై ఏడు తరముల వారిని కంచిలో ఏడు వాడలనే మోక్షము పొంద చేసిన వాడు నంబి.

శివుని వట్ల అనూనమగు భక్త్యతిశయము, మూఢ భక్తి అని నను, వీరభక్తి అనినను, అమలిన భక్తి అనినను, పురాతన భక్తుడు భక్తిని ప్రకటించి భగవంతుని ప్రేమించె ననవలెను.

దక్షిణ భారతమున శైవ మత వ్యాపనమున కెందరో మహాను భావులు యత్నించిరి. వారి యవిరళ కృషి ఫలితముగా శైవ మత సముద్ధరణము జరిగి హిందూ మతమున శైవము జీవగఱ్ఱయై నిలిచినది. అందులకు ఈ చిఱుతొండ నంబి కథయే సాక్ష్యము.

---

# 2. గౌరీ కల్యాణము

**2.0.** గౌరీకల్యాణ ఘట్టము :- శివుని ద్వితీయ విలాసమున రెండు వందల అయిదు పద్య గద్యాత్మకముగ తృతీయ చతుర్థా శ్వాసము లందు గ్రథితము. శివుని లీలలు అరువది నాల్గని హాలాస్య మాహా త్మ్యము తెల్పుచున్నను, వివాహము కూడ ఒక ప్రత్యేక లీల యని నంజుండప్పగారి యభిప్రాయము.[1] పార్వతి యొక్క తపః పరిధవ విధాన పర్యంత పరిశీలనమును శివలీలోత్కర్షముగ నెన్నదగును.

దాక్షాయణి తన తండ్రి గావించిన యవమానమును సహింప లేక యోగ మార్గమున దేహత్యాగ మొనర్చినది. మహాశివుడు దాక్షాయణి శరీర మోక్షము చేసినది మొదలు సర్వసంగ పరిత్యాగము గావించి, యపరిగ్రహుడై హిమవన్నగముపై తప మొనర్చుచుండెను. సతి అపర జన్మంబున మేనకా హిమవంతులకు పార్వతి యనెడి పేరితో జన్మించెను. ఆదిశక్తియగు పార్వతి తిరిగి శంభుని వరునిగా పడయుగోరి ఆతనికి పరిచర్య లొనర్చియు సఫలీకృతురాలు కాలేక, కఠోర దీక్షా సంకల్పముచే శివుని మనమును గెలిచినది. మాయా పటువేషమున శంభుడు పార్వతియొక్క తపోనిష్ఠను మనోవాంఛను పరీక్షించి ఆమె యొక్క దృఢ సంకల్పమునకు మెచ్చి-

> “అరుదగు నీ తపమ్మునకు నమ్ముదు వోయితి నేలుకొమ్ము, నీ
> వరవుడ నంచు...(హార 4-37)

పల్కిన తీరును బట్టి భక్తురాలిపై తనకు గల అంతర్నిహిత వాంఛ సువ్యక్తమగును. పైగా దైవమునకు వార్ధక్యము లేదని దాక్షాయణి అపరజన్మమున పార్వతిగ జన్మించి తన్ను చేరునంతవరకు శివుడు వేచి యుండెనని తెలియుచున్నది. బ్రహ్మాదేవతలతోను, మహర్షులతోను,

---

1. హరిహరుడు – గిరిజా కల్యాణ ప్రబంధము, పీఠిక, 1976.

"తండ్రియగు దక్షుమీద క్రోధంబువలన
యోగ నిర్ముక్త దేహయై యుద్భవించి
పెరుగుచున్నది హిమ భూమి ధర గృహమున
నమ్మహా దేవి శివు గూర్పడనువెరింగి". (హర. 8-18)

అనుటను బట్టి శివ శాంకరులకు సంప్రాప్తమైనది తాత్కాలిక వియోగ మని వారిది జన్మాంతర సంబంధమని తెలియును. అందులకే శివుడు అభవుడని, భూత భవ్యభవోద్భవుడని అస్థాణువని ప్రశంసింపబడెను.

2.1. కథామూలము :-

గౌరీ కల్యాణమునకు కాళిదాస కుమార సంభవమే మూలమని ఇతఃపూర్వపరిశోధకుల భావన.[2] గౌరీ కల్యాణ రచనమునకు సంస్కృత కుమార సంభవమునే గాక, దాక్షిణాత్య భాషోపయుక్త సాహిత్యము లను గూడ శ్రీనాథు డనుసరించినటుల కాన్పించుచున్నది. కాళిదాస కుమారసంభవము పదునేడు సర్గల మహాకావ్యము. అద్యష్టమ సర్గలం కాళిదాస కృతమని, తదుపరి సర్గలు ప్రక్షిప్తములని పండితుల భావన[3] హరవిలాసమున కుమార సంభవాంశము అప్రధానము. శివలీలోత్కర్షో త్క్షిప్తము. శివ పార్వతుల కల్యాణము ప్రధానము. తదానుషంగిక వృత్తాంతములు వివరణాత్మకములు. శ్రీనాథుడు కర్ణాట దేశ పర్యటన మొనర్చి తత్రాజ సన్మానముల నొందినట్లు సువిదితము. కన్నడ సాహిత్య ప్రభావము శ్రీనాథునిపై కలదనుటలో విప్రతిపత్తి లేదు. కన్నడ సాహిత్యమున హరిహరుని గిరిజా కల్యాణమును గూడ దృష్టి యందుంచుకొని గౌరీ కల్యాణ కథా ఘట్టమును రచించె ననుటలో సందేహము లేదు. శ్రీనాథుడు హరిహరుని అనుసరించెననుటకు పెక్కు

2. శ్రీరామమూర్తి, కొర్లపాటి; శ్రీనాథుడు, కళాభారతి, గుంటూరు, 1971.
3. Keith, A. B., History of Sanskrit Literature;...Pages 89-91.

తారాఖ్యానములు కలవు. i) గౌరీ కల్యాణ నామకరణము. ii) ఇతి వృత్త పరిమితి iii) ఫలశ్రుతి iv) వేదోక్త సంప్రదాయ వివాహ విధానము. v) కుమార జన్మ సూచన మొదలగునవి.

కాళిదాస కుమార సంభవానుసరణీయమైన నన్నెచోడ కుమార సంభవము హరవిలాస కావ్యరచనమునకు పూర్వరచనము. హరవిలాస గౌరీ కల్యాణమున నన్నెచోడ కుమార సంభవానుసరణములు కొన్ని తావులందు కాన్పించుచున్నవి. కావున అందలి గౌరీ కల్యాణమును తదానుషంగిక వృత్తాంతములను పరిశీలించుట ఆవశ్యకము ఈ విషయములను పురస్కరించుకొని గౌరీ కల్యాణ రచనమునకు కాళిదాస కుమార సంభవమే గాక హరహరుని గిరిజా కల్యాణ నన్నెచోడ కుమారసంభవాదులు గూడ మూలములని చెప్పవచ్చును.

## ౨.౨. గౌరీ కల్యాణము - విశేషాంశములు :-

కుమార సంభవ కావ్యమున కుమార జననము ప్రాధాన్య వివక్షగలది. హరవిలాసమున కుమార జననము గౌణము. ఉమాశంకర వివాహమునకు వలసిన అనుకూల వాతావరణ విషయాదికములు, అప్రత్యక్ష కారణములైన తారక దర్పము, మన్మథ దాహము, రతీ విలాపములు తృతీయాశ్వాసమున వర్ణితములు. ఆశ్వాస ప్రారంభమున తారకుని దుండగములు వర్ణించి తారక వధకై బ్రహ్మ సలహాననుసరించి ఉమాశంకరుల గూర్పుటకై మన్మథుని ప్రయోగించి, అతడు భస్మీభూతుడు కాగా అతని పునరుజ్జీవనమునకు తారక వధకు, గౌరీ కల్యాణమునకు ఏర్పాట్లు సాగినవి. అనగా పార్వతి తపశ్చర్యచే శివుని మెప్పించుట, గౌరీ కల్యాణములు చతుర్థాశ్వాసమున వర్ణితము. ఇట్లు తృతీయాశ్వాసాంతమున

"అదృశ్య రూపంబైన భూతంబు రతీదేవి మరణ వ్యవసాయబుద్ధి మందీభవింపజేసి," గౌరీ కల్యాణమునకు ప్రతీక్షించినట్లు వర్ణితము. దీని వలన మూడు నాల్గా ఖ్యానముల కథకు అనుస్యూతము పాటించి నట్లైనది.

దుష్ట శిక్షణము శిష్టరక్షణమునకై భగవంతుడు వివిధావతారముల నెత్తి దుష్టుల శిక్షించి భక్తుల బ్రోచును. ఇట బ్రహ్మవర గర్వితుడై బలగర్వమదాంధుడైన తారకుని సంహారమునకు సమర్థుడైన పుత్రుని శివశాంకరులు పొందుటే ప్రముఖ మగు విషయము. తత్కార్యానుకూలతకు భవానీ శంకరుల గౌరీ కల్యాణమే శరణ్యము అది బ్రహ్మ ఆదేశము. శ్రీనాథుడు గౌరీ కల్యాణము హారవిలాసముగ చిత్రించుట విశేషము.

ఈ వృత్తాంత వర్ణనమున కవి తపస్సున కత్యంత ప్రాధాన్యమిచ్చి పార్వతీ శంకరుల నమిత శ్రద్ధాసక్తులతో వర్ణించెను. మహా శివుడు బహు తపోవ్రత నియమైక ఫలవిధాత. అట్టివాడు "మదినొక్క తలపుచేసి" తపమాచరించెను. కామిన్మై సతిని గోరి తపోనియతి నున్నవాడే శంకరుడు. తపముచేసి శుద్ధమైన శరీరము ఇంద్రియ సంఘాతముతో గాని మహాత్కార్యమునకు అనువగు వీర్యసంతతి పుట్టదనియు, అహంకరించిన కాముని దహించకున్న కామువశమను దోషము ఇంద్రియములకు కల్గునని శివుడు కాముని దహించి వేసెను. ఇది మన్మథ భస్మీకరణమునకు కారణము. కామ దహన ఘట్టము నిష్కామ ప్రేమకు సూచన.[4]

రెండవది పార్వతీదేవి తపస్సు - హరుని మెప్పింపజాలని శరీర సౌందర్యము వ్యర్థమని శరీర త్యాగము చేయవలెనని లేక తపోనియతి నుండి హరుని బడయవలెనను అవంధ్య ప్రతిజ్ఞ పూనినట్టిదే పార్వతి. ఫలోదయాంతమైన తపస్సుకై దృఢ ప్రతిజ్ఞను పూని 'పండు రక్తా

4. నరసింహం, అప్పల, సాహిత్య పరిషత్పత్రిక; త్రిక, 1963; సంపుటి 52.

ధృత పూర్వకమైన పాశుపతదీక్ష"ను పూనినది. ఉగ్రతప మొనర్చినది. ఆమె కఠోరనియమములు పాటించి శీతవాతాతపములకు చలింపక తపస్సు చేయుగా మునులామె "భావి ప్రభావ శక్తికి ప్రణతు"లర్పింతురు. కవి "దుష్కరమైన తపము చేసెనని తపోభిమానము పార్వతికి యుండని తపోభారముననే భర్గుని వశీకరింప దలంచినదని నిర్భర తపః కృత కోమల దేహ యష్టియైనదనియు, ఉదగ్ర తపో మహానీయ వేదనాభర మును సహించె" ననియు తెల్పుట తపమున కిచ్చిన ముఖ్యత్వమే కారణము. పవిత్రమగు ప్రణయాగ్నిచే క్రాగినది. తపోగ్నిచే పవిత్రురాలై ప్రణయ పరీక్షలో నెగ్గినది.

లోక యాత్రకు సంసారికి కన్యాలాభము వరము. పదిమంది సుతులను పొందగల కన్యను గౌరవముగ దానమొనర్చుటలో విశేషము కలదు. గృహమేధి హిమవంతుడు అట్లొనర్చి కృతార్థుడయ్యెను. కన్యాదాన విశిష్టత గౌరీ కల్యాణమున చాటబడినది. పురాణాగమాదులలో గౌరీ కల్యాణము వర్ణితమయ్యె లోకవ్యవహారములకు నిదర్శనము. గౌరీ కల్యాణమునకు దుష్ట సంహార శక్తిమంతమగు కుమారోదయమే ప్రయోజనము. మహాశివుని అష్టమూర్తులు "భువన రక్షా ప్రయోజన మునకె కాదె" అని మహాశివుడు చెప్పుటలో లోకరక్షణము ప్రధానమని అంతరార్థము.

పార్వతి తలిదండ్రులకడ తపమాచరించుటకు అనుమతి వేడుటలో ఆమెకు వారిపట్ల గల వినయ విధేయతలు వ్యక్తమగును. గౌరి తన కఠోర తపముచే శివుని మెప్పింప దీక్ష బూని సిద్ధినందినది.

"యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చదుస్తరం,
తత్సర్వం తపసా ప్రాప్యం తపో హి దురతిక్రమమ్"[5]

అని పెద్దలన్నట్లుగ పార్వతి తన తపముచే కృతకృత్యురాలయ్యెను.

---

5. భర్తృహరి – నీతిచంద్రిక – శ్లో. 101.

2.3. ఆంధ్రీకరణ విధానము :-

ఆంధ్రీకరణ విధాన నూతన పద్ధతికి మార్గ దర్శకుడై తద్విధాన మును సూచించి, సంస్కృత పురాణేతిహాసాదులను కావ్యరూపమున నాంధ్రీకరించి, ఆంధ్ర సరస్వతికి జీవితము నర్పించి కవితా సామ్రాజ్య సార్వభౌమాధికార మధిష్ఠించిన కవి సార్వభౌముడు శ్రీనాథుడు. ఈ విషయమునే పాపయ్య శాస్త్రిగారిట్లు పేర్కొనిరి.[6]

"శ్రీనాథుని ప్రబంధముల కాంధ్రభాషలో ప్రత్యేకస్థానము నార్జించి పెట్టిన దాతని సంస్కృత కావ్యానువాద సరణియే. అది సంస్కృత పదములను తెలుగు పదములను సముచిత రీతిని అతడు మేళ వింపజేసి శ్రుతి మధుర మైన శైలిలో భావము నావిష్కరించి ఆయా రచనలు తెలుగున స్వతంత్రముగ బయలుదేరునట్లు పాఠకుల భావింప చేయుట అతని రచనలకు గల ప్రత్యేకత".

శ్రీ కొర్లపాటి వారు కుమార సంభవాంధ్రీకరణము గూర్చి విపులముగ చర్చించుచు అది నైషధాంధ్రీకరణ ప్రణాళికాబద్ధమైనదనిరి.[7] హరవిలాసము నైషధానువాదమునకు తరువాతి దని "ఆంధ్ర భాషా నైషధాబ్జ భవుని" - (హర. ప్ర. ఆ. 8) అను హరవిలాసమునందలి పద్యపాదమును బట్టి తెలియుచున్నది. శృంగార నైషధమున "అశేష మనీష హృదయంగమంబుగా, శబ్దంబనుసరించియు, నభిప్రాయంబు గుర్తించియు, భావంబుపలక్షించియు రసంబు పోషించియు నలంకారంబు భూషించియు, ఔచిత్యంబాదరించి అనౌచిత్యంబు పరిహరించియు,"

అను వచనమున ఆంధ్రీకరణ విధానమును గూర్చి నిర్వచించి, శ్రీనాథుడు తరువాతిదగు హరవిలాసమున కూడ తద్విధానమునే అనుస రించెననుట తథ్యము.

---

6. పాపయ్య శాస్త్రి, చిలుకూరి; సాహితీ వాఙ్మయము, 1968.

7. శ్రీరామమూర్తి, కొర్లపాటి; శ్రీనాథుడు, కళాభారతి; గుంటూరు; 1971.

శ్రీనాథుని కవితకు జాజ్వల్యమానమై కండ్లకు మిరుమిట్లు గొల్పు ప్రధాన తత్త్వము దుర్విలంఘ్యమైన శబ్దశక్తియని అది వాఙ్నివృత్తి మూలక బ్రహ్మానంద సాక్షాత్కార మొనర్చునని అది త్రిధాభూతార్థములతో[8] నభివ్యజ్యమానమగునని సముదగ్ర శక్తి సంపన్నమై నిరుపమాన ప్రయోగ వైఖరీ విశిష్టమని శ్రీ శర్మగారు భావించిరి.[8]

2.3.0. కాళిదాస కుమార సంభవ కథానుసరణములు :-

సంస్కృత కుమార సంభవ కథ శివస్కాంద బ్రహ్మాండ కాలికా పురాణాంతర్గతోపలబ్ధము. శ్రీమద్రామాయణము నందును కుమార జనన ప్రస్తావన కలదు. కాళిదాసు వర్ణించిన సుదీర్ఘ శివపార్వతుల కల్యాణవృత్తాంతము శివపురాణము నందే కలదు. శివపురాణము నందలి కథ కుమార సంభవ కావ్య కథ, భాష, అలంకార, విషయాది కములు నొకే రీతిలో నున్నవి. పురాణ రచనాకాలము వివాదగ్రస్తమైనప్పటికిని కాళిదాస కుమార సంభవమునకు ప్రాచీన శివపురాణము మూలమని విమర్శకులు భావించిరి.[9] అయితే పురాణమునకు కావ్యములకు కొన్ని భేదములు కలవు. పంచమ షష్ఠ సర్గలలో నట్టి భేదములు కానవగును. పురాణమున నారదుడు నిస్పృహచెందిన పార్వతిని తప మొనర్చుమని హితవు చెప్పినట్లును శివునకు కూడ ఆ తపః ఫలముల నొసంగుమని నారదుడే చెప్పినట్లును కలదు.[10] కాని కాళిదాసు శివ పార్వతుల పాత్రపోషణమున శ్రద్ధ వహించి పార్వతి తనంతట తానే దృఢ సంకల్పురాలగుటయు, శివుడామెకు తపోఫలము నిచ్చునట్లుగ

8. శేషేంద్రశర్మ, గుంటూరు; సాహితీ వాఙ్మయము, నరేంద్ర సాహిత్య మండలి, తణుకు, 1968.

9. Keith, A.B. History of Sanskrit Literature, pp. 89-91.

10. Kale, M. R. 'The Kumara Sambhava of Kalidas,' Motilal Banarasdas, Delhi, 1967.

మార్చెను. ప్రఖ్యాతేతి వృత్తము, దివ్యుడగు నాయకుడు, శృంగార రసము, అలంకార శైలీ వైదగ్ధ్యములు అష్టాదశవర్ణనలు గల్గి చతుర్విధ ఫల పురుషార్థసిద్ధికై రచితమైన కుమార సంభవము సంస్కృతమున పంచ మహాకావ్యములలో నొకటైనది. అట్టి కావ్య స్వీకార మొనర్చిన శ్రీనాథుడితి వృత్తమును కల్యాణము వరకు పరిమిత మొనర్చి కుమార జననము సూచించి ప్రబంధ లక్షణోపేతముగ సంతరించెను. యథా మాతృకము కాదు. అది కవి సార్వభౌముని కవితా సౌందర్య రహస్యము.

కవికుల తిలకుడైన కాళిదాసుని రసమయమైన కుమార సంభవ మునకు శ్రీనాథుని హరవిలాసాంతర్గత మగు గౌరీ కల్యాణము స్వతంత్ర మైన సంగ్రహమైన ఆంధ్రీకరణమని శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి మరియు పలువురు పండితులు భావించిరి.[11] ఈ భావము సర్వథా పర్తింప దని కన్నడ గిరిజా కళ్యాణాదులే తార్కాణములు.

### ౨.౪.1. ఇతి వృత్త స్వీకరణము - ఆనుపూర్వికత:-

కాళిదాస కుమార సంభవేతి వృత్తము హరవిలాసేతి వృత్తము ఒక్కటియే యైనను కథాకథనమునందు ఈ షడ్భేదములు పొడకట్టుచున్నవి. కాళిదాసు కుమార సంభవ ప్రథమ సర్గయందలి కొన్ని శ్లోకములను గౌరీ కల్యాణమునందు గ్రహింపక తదితర శివలీలలు వర్ణించు సందర్భమున అనువదించెను. కృత్యాదిన గల హిమవంతుని వర్ణనము, ఆ పర్వత ప్రాంత గుహలు ఆటవికజనుల వర్ణనలు గౌరీ కల్యాణమున అనువదింపక దారుకా వన విహారమున సందర్భోచితముగ వర్ణింపబడినవి.

---

11. శ్రీరామమూర్తి, కొర్లపాటి, శ్రీనాథుడు; 1971; పాపయ్య శాస్త్రి, చిలుకూరు; సాహితీ వాల్లభ్యము, 1968; ప్రభాకర శాస్త్రి, వేటూరు, మద్రాసు, 1938.

కాళిదాస కుమార సంభవములోని ద్వితీయ సర్గములోని తారకాసురుని దర్పము, విజృంభణము, హారవిలాసములో గౌరీ కల్యాణ కథారంభమున కలదు. ఏ తన్మూలమున కారణ కార్యానుక్రమము పాటించి నట్లైనది. తారకాసురునిచే వోడిపోయిన దేవతలింద్రునితో సత్యలోకమునకు పోయి బ్రహ్మను ప్రార్థించి స్తుతింపగా వారల దీనస్థితికి కారణమరయ గోరగా బృహస్పతి తారకునిచే తాము పడిన పాట్లను వివరించునప్పుడు తారకుని దర్పము వివరింపబడినది.

తారకుని వలన బృందారకులు పడిన యవస్థలు దేవతలు బ్రహ్మ దేవునితో మొరపెట్టుకొను సందర్భమునందలి పద్యములు, కపటవటువు పార్వతి యాశ్రమమునకు వచ్చి పార్వతిని యాశీర్వదించు పద్యము (కుర. 4-16) పార్వతీ పరమేశ్వరుల పరిణయ ఘట్టములందలి పద్య గద్యములు శ్రీనాథుడు స్వతంత్రముగ రచించినవి.

బ్రహ్మస్తుతి ద్వితీయ సర్గలో '13' శ్లోకములలో నుండగ (కు. సం. 1-3-15) శ్రీనాథుడు వాని భావమును గ్రహించి సంగ్రహించి, భక్తి నుదోభదించు రీతిగ కావ్యౌచిత్యము పాటించి ఒక దండక రూప మున రచించెను.

2.3.2. అగ్రాహ్యములు :-

హిమవత్పర్వత వర్ణనమునందలి '17' శ్లోకములను కుదించియు, ఒకటి రెండు పద్యములలో ఆశ్వాసాదిని గాక పంచమాశ్వాసమున, లిఖించియు, మేనకా హిమవంతుల కల్యాణ విషయము వదలియు, దేవతల ఒక్కొక్కరి యవస్థయు అట విపులముగ వర్ణితము కాగా, నిట భిన్నముగను, సంగ్రహముగను వర్ణించియు శ్రీనాథుడు ఆంధ్రీకరణమున స్వతంత్రతను కనబరచెను.

ద్వితీయ సర్గమున బ్రహ్మ తారక వధోపాయమును సూచించుచు

"ఉమారూపేణ తే యూయం సంయమస్తిమితం మనః
శంభోర్యతధ్వమాక్రష్టుమయస్కాన్తేన లోహవత్-"
(కు.సం. 2-60)

అను శ్లోకమును, దీని తరువాతి శ్లోకమును -

"తస్యాత్మా శితి కణ్ఠస్య సైనాపత్యముపేత్య వః
మోక్షతే సురబన్దీనాం వేణీర్వీర్య విభూతిభిః-"
(కు. సం. 2-61)

ఆంధ్రీకరింపలేదు. బ్రహ్మకు ముఖ్యత్వము, శివునికి ప్రాముఖ్యమును శ్రీనాథుడిచ్చుటయే కారణము.

"అభ్యర్థనాభంగ భయేన సాధుర్మాధ్యస్థ మిష్టేఽప్యవలం
బతేఽర్థే"
(కు. సం. 1-52)

కవి హిమవంతుడు శివునకు కన్నె నిచ్చెదనని అర్థింపమికి కాళిదాసు చెప్పిన సమర్థనము నుపేక్షించెను. ఇంద్ర-మదన సంవాదములోని శ్లోకముల యుత్తరార్థములు పరిత్యజించియు మూడు నాల్గు శ్లోకముల నొక సీసమున సంగ్రహించియు కథను వేగముగ నడిపెను. పార్వతి రూపవర్ణన సందర్భమునందును తదితర స్థలములందును కొన్ని మనోహర శ్లోకములు అనువదింపబడలేదు. సంగ్రహ పద్ధతి నవలంబించుటయే గాక, శివునికి కాబోవు భార్యను గూర్చిన శృంగార వర్ణనము చేయుటకు నిచ్చగింపక పోవుటయే అందుకు కారణమై యుండవచ్చును. కాని కవితా సామర్థ్యము శ్రీనాథునకు కొరవడి గాదు.

"అనన్య భాజం పతి మాప్నుహీతి" (కు. సం. 3-63)

అని శివుడు పార్వతిని దీవించినట్లుండ,

"సరిలేని మగని బడయుము తరుణీ" (హర. 3-76)

అని దీవించినట్లు శ్రీనాథుడు మార్చెను.

గంగాదేవి శివపత్ని యగుట లోకప్రసిద్ధమగుటచే శ్రీనాథుని మార్పు సముచిత మగుచున్నది.

"ఈ కాంత తోడ మందాకినిన్ వాహిని
సవతి కాగల దేమి చందమునవో" (హర. 3-25)

అని నారదుడన్నట్లు శ్రీనాథుడు చెప్పుట ఈ దృష్టితోనే యని యూహింప వచ్చును. అట్లే బ్రహ్మ కుమార్తె సరస్వతి యనుట లోక ప్రసిద్ధము కాదు. సరస్వతి బ్రహ్మ భార్య యనియే యాథిలో కలదు. మూలమున బ్రహ్మ మారుని శాపావసానము ధర్ముడను ప్రజాపతికి తెల్పినట్లు అనగా మారనాశముచే సృష్టి ప్రసంగము నిలిచిపోవునని ఉమా వివాహానంతరమతడు జీవించునని జవాబు చెప్పినట్లు కలదు. అట్టి జవాబు హరవిలాసమున లేదు.

2.3.3. అమూలక పద్య గద్య రచన :-

ముక్కోటి దేవతలను, మహర్షులను బాధించిన తారకుని గర్వము హద్దులు మీరినది. దిక్పాలకులే అతని ధాటి కోర్వలేక పోవుటను గూర్చి బృహస్పతి తెల్పుచు వాయుదేవుని స్థితి నిట్లు తెల్పెను.

"వ్యావృత్తగతి రుద్యానే కుసుమ స్తేయసాధ్వసాత్
న వాతి వాయుస్తత్పార్శ్వే తాళ వృన్తా నిలాధికమ్"
(కు. సం. 2-35)

పుష్పములను హరించుట వాయువు కార్యము. అది సహజమైనను తారకుని భయముతో సేవించుట అతని దీనస్థితిని తెల్పును. శ్రీనాథుడీ శ్లోకముతో తృప్తి చెందక మాఘుని శిశుపాలవధలోని,

నిశాన్త నారీ పరిధాన ధూనన
స్ఫురాగ సాప్యూరుషులోల చక్షుషు
ప్రియేణ తస్యానపరరాధ బాధితాః
అకమ్పనే నామ చకమ్పిరే సురాః. (శిశు. 1-61)

అను శ్లోకమును గ్రహించి

నిరపరాధ బాధితులకు నిర్జరులకు
బంధ మోక్షంబు గావించు గంధ వహుడు
సతుల పయ్యెద వెడలించి చన్నులలమి
తప్పునేసియు దైత్యు చిత్తంబు వడసి. (హర. 3-4)

అని రచించి 'ఊరు విలోల చక్షు' విశేషమును మాత్రము వదలెను.

పార్వతి పాశుపత దీక్ష అమూలకము.

2.3.4. వర్ణనములు – భేదసాదృశ్యములు :

పార్వతినిరతిశయసౌందర్య వర్ణనమును క్లుప్తముగను, మాతృకకు చేరికగ నించుగ స్వాతంత్ర్యము వహించి వర్ణించిన, కవి ప్రతిభ అపూర్వము.

ఆదిశక్తి పురాది యర్థాంగలక్ష్మియగు పార్వతి మేనకా హిమవంతుల పుత్రికగ జన్మించినపుడు స్థావర జంగమ భువన శుభావహమై దశ దిశాంతరము కుసుమ వర్షము కురిసెను. ఆమె విద్యుల్లతానిభ చ్ఛాయగల్గి, కారుకాలమున మణిశిలాంకు వలె ప్రతిదిన ప్రవర్ధమానయై షోడశ కళా పూర్ణమైన చంద్రరేఖ వోలె ఎదిగి బంధు జన ప్రీతికరముగ పెరిగి గంగానదీ తీరముల బంతియాట యాడుచు, ఉపదేశ కాలమున కళావిద్యల నేర్చుచు బాల్యావస్థ సతిక్రమించెను. యౌవనోదయము ప్రాప్తించినది. ఈ సందర్భమున కాళిదాసు,

"ఉన్మీలితం తూలిక యేవ చిత్రం సూర్యాంశు భిర్భిన్న
మివారవిన్దమ్,
బభూవ తస్యాశ్చ తురస్ర శోభి వపుర్విభక్తం నవయౌవనేన."
(కు. సం. 1-32)

అని వర్ణింపగా శ్రీనాథుడు ఉన్మీలనభావము నేత్రముల కాపాదించి "నేత్రోన్మీలనంబు సేసిన చిత్రంబునుంబోలె నవయౌవన విభక్తంబై" అని వర్ణించెను. మైమరపు కండ్లుగల చిత్రము వలె అసూటలో అధిగత సౌందర్యము కలదు. ఎర్రని చివుళ్లను బోలిన ఆమె కాలిన్రేళ్లు ఎరుపు దనమును చిమ్ముచున్నవట! తొండములను బోలిన యూరువులు మాణిక్య కిరణరేఖలబోలు రోమరాజి, మన్మథుడొనర్చిన మణిసోపానంబుం బోలిన వళీవిభాగము, మారేడువండ్ల సొబగును ధిక్కరించు వక్షోజములు, శిరీష పేశలమైన బాహువులు, ధర్మబంధురమగు కంధరము పూర్ణచంద్రుని బోలు వదనబింబము, సుధారసపు క్రోవియగు మోవి, నూబూవువంటి నాసిక, నున్నవి అద్దముల బోలిన చెక్కిళ్లు, పూవింటిని బోలిన కనుబొమలు, విదియ చంద్రుని బోలిన లలాటము, తుమ్మెదల నీలిమను తిరస్కరింపజేయు నీలాలకములు గల్గిన పార్వతి "సర్వోపమాద్రవ్య సముచ్చయంబగు సౌందర్యంబు నేకత్రావస్థాన దిదృక్ష విరించి సూక్ష్మీకరించి యథాప్రదేశ నివేశితంబుగ" నున్నదట.

ఇందు నఖ శిఖ పర్యంతము సామ్రాజ్ఞిని వర్ణించిన తీరు శ్రీనాథుని సాముద్రికా శాస్త్ర పరిచయమును తెల్పును. వివరణాత్మకముగ శృంగార రసప్లుతితో వర్ణించిన కాళిదాసు శ్లోకములను ఏక దేశముగ గ్రహించి కుదించి కొన్ని మధుర శ్లోకములను వదలినను శ్రీనాథుని వచనమున పార్వతి సౌందర్య వర్ణవమున కృత కృత్యుడయ్యెను.

పార్వతీ వటు సంవాదము హాస్యయుతముగను, యథానువాదముగను చేయబడినది. పార్వతీ పాత్ర పోషణమత్యంత మనోజ్ఞము. పార్వతీదేవి పాశుపత దీక్షను

"చంచరీకాంగనా గరుచ్ఛాయ నేలు
కుటిల కోమలతర దీర్ఘ కుంతలములు,
మడ మలంటంగ నిడుపాటి జడలు గట్టి
పాశుపత దివ్యదీక్ష జేపట్టె గౌరి. (హార. 4-10)

అదియు,

పాశుపత దివ్య దీక్షా విభాసమాన
దివ్య తేజో విశేష సందీప్త మూర్తి
కాలకాంగికి శతవృద్ధులైన మునులు
ప్రణతులగుదురు భావి ప్రభావ శక్తి. (హార. 4-13)

అని వర్ణించుటలో పార్వతి కుటిల కోమల కుంతలములు మడమలంటు నంతట దీర్ఘములని వర్ణించి అట్టి కుంతలములు జడలు గట్టుగ దీక్షపూనెనని, కన్నులకు గట్టినట్లు వర్ణించి, ఆమె పాశుపతదీక్ష పూనినదనుటలో అమూలకమగు ఈశ్వరార్చన కళాశీలత్వము ప్రకటితమైనది.

పార్వతి దృఢ మనస్కురాలేగాక, సుకుమారి యని ఈ క్రింది పద్యమువలన తెలియును.

ఇక్కడ లేరె వేల్పులు సమీప్సిత దాతలు ముద్దుగూన! నీ
వెక్కడ ఘోరవీర తపమెక్కడ? యీ పటు సాహసిక్యముల్
తక్కు శిరీష పుష్పమవధాన పరత్వమునన్ మధువ్రతం
బెక్కిన నోర్చునో విహగ మెక్కిన నోర్చునో? నిశ్చయింపుమా.
(హార. 4-6)

పై మేనక హితమిత్రోక్తులతో దృష్టాంత సహితముగ పార్వతి పుష్పకోమల సౌకుమార్యము ఘోరమగు తపమునకు అనువుగాదని నయముగా నచ్చజెప్ప ప్రయత్నము తోచును. అంతేగాక 'పటు సాహసిక్యముల్' అనుటలో మిగుల సాహసమునకు పూనుకొందువా; యని ప్రశ్నించుచున్నది. కఠినము, ధీరము సాహసములతో కూడిన తపఃకార్యమును గుర్తు చేసియు పార్వతి మనసును మేనక మార్చలేక పోవుటకు శాంభవి దృఢ సంకల్పమే కారణము.

“వేసవిం గనగన మండు నగ్ని గుండంబు నడుమన నిలిచియు, మధ్యాహ్న కాలంబున బత్స్మ పాళీ క్షణస్థితంబులును, దాడితాధరంబులును, బయోధరోత్సేధ నిపాత చూర్ణితంబులును, త్రివళీ క్షణస్ఖలితంబులును, నాభిగహ్వర ప్రవిష్టంబులు నగు జలధర జలబిందుధారలం దోగియు, శిశిరకాలంబునం దివకాళించు కొలంకులలోనం బుక్కిటిబంటి నీట నిశానమయంబుల నిలిచియు, నంబు చులుకంబులను, నుడుపతి కరంబులును, నురుకరువలి డుల్లిన జీర్ణతరు పర్ణంబులును నాహారంబుగా” దుష్కర తపంబొనర్చినది గనుక ఆ మహా శివుని మెప్పింప జాలినది. తేనిచో సాధారణ మానవులకు ఆ భువనాధ్యక్షుండైన మహాశివుడు గోచరమగుట సాధ్యమా? కానే కాదు! ఇట పార్వతి దుష్కర తపము చక్కగ వర్ణితము. ఇందు సకల లోకాధీశ్వరి శంకరుని చేరుటకు దుష్కర తప మొనర్చుట చిట్ట చివరి సాధనమని యెంచిన దనియే పిండితార్థము. చివరకు శంకరుడు తపోబలముచే తన్ను మెప్పించిన పార్వతిని మరల కపట వటు వేషమున పరీక్షించి దృఢ చిత్తురాలగుట నెరిగి “అరుదగు నీ తపమ్మునకు నమ్ముడు పోయితి నేలుకొమ్ము నీ వర వుడ” (హర. 4-37) ననెను. కపట వటు వేషము, స్వభావ సిద్ధమై, సంస్కృత భాషావద గుంఫనముతో గూడి సాభిప్రాయపద సంయుతమైనది. ఆ వటునిరూప వర్ణన మిట్టిది.

అజినాషాఢ ధరుండు ప్రౌఢ తరభాషాళి ప్రగల్భుండు నీ
రజ బంధు ప్రతిమాన తేజుడు, జటారాజిచ్ఛటా తామ్ర మూ
ర్ధజుడేకాకి వటుండు, బ్రాహ్మణుండు విశ్రామార్థియుంబోలె నా
శ్రిత జగన్మోహన మూర్తి సన్నిధికి చేతెంచెన్ వనాంతంబునన్.

(హర. 4-15)

వాచాలియగు ఆ కపట వటుడు మునివేషధారియై వచ్చి గౌరి నాశీర్వదించుటలో నాశీర్వాద ఔచిత్యము గలదు.[12]

పార్వతీ కపట వటు సంవాదము సన్నివేశమునకు తగినదై నాటకీయతను సంతరించుకొన్నది. శివుడే కపట వటురూపమున పార్వతీ మనఃపరీక్షాసమయమున పరమశివుని ఈ క్రింది విధముగ పరిహసించుట సరసమై చమత్కారవంతమై యొప్పియున్నది.

రాయంచ యంచు జీరకు చోకయగు గాక
వచ్చి యేనిక తోలు పచ్చడంబు
హరిచందనా స్పందంబగు చనుంగవ మీద
బట్టు శేగానుగాక భసిత ధూళి
కమనీయ చరణ లాక్షా రాగ రేఖచే
ముద్రితంబగుగాక రుద్ర భూమి
కలిత ముక్తాఫల గ్రైవేయకంబుతో
ముడివడుగాక పెంజిలువ పేరు

మనసు తెన్నయి యుండెనో మానవతికి
నివ్విధం బన్న లోకంబు తెల్ల నగరె?
యహహా! ముదిగొడ్డు నెక్కి భిక్షాటనంబు
సేయబోవుట యదియు సింగారము బవ్వ!

12. బాపూజీ, జయకృష్ణ; శ్రీనాథుని సాహిత్య ప్రస్థానము, జల్ కమల ప్రెస్, గుంటూరు, 1977.

పై విధముగ శివుని బాహ్యరూప వర్ణనము చేసి గౌరి యాతని చేపట్టు టలో గల సాధక బాధకములను వివరించి అతని వివాహమాడ వలదని పలుకు విధము పాఠకుల కమందానందము నిచ్చుననుటలో సందేహము లేదు.

మరియు "అభ్రవీధీపరిచ్యుతంబైన యమర తటినీ జలప్రవా హమ్ము గంగ ధరణీ ధరరాజు నీ చరిత్రంబు కతన వరము పావను డయ్యె, పద్మవదన" అని శివుడు నగజ జన్మసార్థక్యమును ఔన్నత్య మును పరోక్షముగ కొనియాడుచు మరియు నిట్లు పల్కెను :

ప్రథమ ప్రజానాథ పావన కులమున
 ప్రభవించి తఖిల ప్రపంచసార
సౌందర్య సంపద నడి సన్నిధాన, న
 నశ్వరం బైశ్వర్య నైపుణ్యంబు
సౌఖ్యంబు నిరవధి సర్వ సామగ్రి నీ
 యందె చేరి భోగ్య మత్యాయతంబు
భాగ్యంబు నీ కేమి ప్రాప్తి యైనది? మనో
 రథ మేమి చెప్పుమా రాజవదన!

దుష్కరంబైన తపమిట్లు తొడరి చేసి
మేను దయ్యించు కొనగ నేమిటికి వచ్చె?
చిత్తము విచార మార్గంబు చేర దెచ్చి
తత్త్వము దెలియ జెప్పు చూతము మృగాక్షి. (హార. 4-23)

ఇందు శాంభవి పావన కులము, నిరతిశయ సౌందర్యము, అనల్పమైన ఐశ్వర్యము, సౌఖ్యము, భాగ్యము తెల్పక తెల్పబడినవి. దివ్యవరాలగు ఆమె మహేంద్రాది ప్రభృతులగు దిగీశుల మజ్జగించి పినాక పాణిం బతిగా గోరినది. అవర్ష్య రత్నమైన ఆమె నన్వేషించుచు రాదగినవాడే కాని

ఆమె పోదగినది కాదనియు పేర్కొనుటలో ఆమె సర్వ విధముల శ్రేష్ఠురాలని తెలియును. పార్వతీ యొక్క గుణచిత్రణమిది. "ఆమె ప్రేమ బాహ్య సౌందర్యము నాశింపక నిష్కపటమై నివాత దీపము పోలె నిశ్చలమై యనశ్వరమై యుండును. కాళిదాస కుమార సంభవమున ప్రదర్శింపబడిన ప్రేమ నిష్కపటము, నిష్కామము, నిశ్చలము, అన్యోన్యాశ్రయమై పరమ పవిత్రమై యార్ష సమ్మతమైనది. పార్వతీ పరమేశ్వరులకును రతీమన్మథులకును నడుమగల ప్రేమను దాంపత్య ప్రేమ" అందురు.[13]

సకలైశ్వర్యములతో తులతూగుచు, సార్వభౌముని కూతురగు నగరాజ పుత్రికకు ఒక్కుమ్మడి సత్త్వ గుణము అలవడ జాలదు. అంతఃకరణము నందలి మాలిన్యము క్షాళితమై చిత్తశుద్ధి గల్గిన పిమ్మటనే శివుని సపర్యకును తపోధ్యానమునకును అధికారము గాని అర్హతగాని చేకూరదు. అందులకామె తొలుత అరణ్యమునందుండి చేతనా చేతనములకు సేవచేసి పరిణతి నొందినది. మనోనైర్మల్య మేర్పడిన పిదప మునిపూజ, కఠోరతపముచే మేను కృశింపజేసి అహంకారాది గుణముల నంతరింపజేసి సత్త్వగుణియై అమలినమగు ఆదర్శప్రేమను ప్రకటించినది. శివుని ప్రేమ పరీక్షలో గెలిచినది. పై విధముగ పార్వతి ధర్మదీక్షతో నిష్కామ ప్రేమను సాధించినదని వక్కాణింపవగును.[14]

మన్మథ నిర్మథనముచే పార్వతి యౌవనాహంకార మంతరించి సౌందర్యముచే గాక, తపోదీక్ష బూని వాత్సల్యము వహించి, శీతోష్ణాది ద్వంద్వములందు సమభావము సాధించి ప్రకృతితో అభేదమొంది పురుషునకై పర్యుపాసించి ఆత్మార్పణ మొనర్చి, శివుని వశీకృతు

13. నరసింహామూర్తి, అయ్యగారి; సాహిత్య పరిషత్పత్రిక; శోభకృతు 1963.

14. పురుషోత్తం, బొడ్డుపల్లి, సాహిత్య పరిషత్పత్రిక, దుర్ముఖి; సంపుటి 45.

నొనర్చు కొనుటయే గాక అతని మెప్పించి శరీరార్ధము నాతనిచే గొన్న కృత కృత్యురాలని పురుషోత్తంగారు పేర్కొనిరి.[15]

గౌరీ కల్యాణము సంప్రదాయసిద్ధమై శుభప్రదమై సాంఘికాచార దర్పణ ప్రాయమైనది. ఆ కల్యాణమున కన్యాశుల్కము గాని వరశుల్కముగాని లేవు. సప్తర్షులు శివుని వివాహమునకు రాయబారులుగ వ్యవహరించుట కల్యాణ విశేషము.

మరియొక యుదాహరణమున వర్ణనావైభవము గనుడు.

కసుగాపులట్లు విబుధులు వెట్టిచాకిరి చేసి విసిగి వేసారి ఇంద్రాదులతో కూడ పద్మజునితో మొరపెట్టుకొనన బోయిరి. పద్మజుని గుణ గణముల వేనోళ్ల గొనియాడిరి. దేవతలు తారకునిచే పడిన బన్నములను ఆతనితో నివేదించు తీరు అత్యంత సహజ ధోరణి నిట్లు వర్ణితమైనది.

పడితిమి యుక్కడుంబడని పాటులు, దుర్భరమైన వృత్తి వె
న్పడితిమి గర్భ యాచకుల భంగి దరిద్రత చుట్టుకొన్నలోఁ
బడితిమి పాలలో బడిన బల్లుల కైవడి నెల్ల వెంటలం
జెడితిమి యేమి సెప్ప సరసీరుహ సంభవ దుష్ట దైత్యుచేన్.

(హర. 3-15)

ఇట తేట తెనుగుతో సహజముగు ఉపమానములతో మునులు పడ్డ పాట్లను స్వాభావికముగ కరుణ రసోద్దీపితముగ శ్రీనాథుడు వర్ణించి వారల దుస్థితి కుతిలపాటు మనకు కన్నులకు గట్టినట్లు చూపెను.

2.3.5. రస పోషణము :-

"రసోవై సః రసం హ్యేవాయం లబ్ద్వా నందీ భవతి"

(తై. ఉ. అను. 7)

---

15. పురుషోత్తం, బొడ్డుపల్లి, సాహిత్య పరిషత్పత్రిక, దుర్ముఖి; సంపుటం 48.

అను నిర్వచనము రస ప్రాముఖ్యమును రసానందమును గూర్చి పేర్కొను చున్నది. రసజ్ఞుడగు కవి సాహిత్యమున రసమునకు అత్యంత ప్రాధాన్యము నిచ్చును. రసపేశలమైన కావ్యము సహృదయ హృదయానందము; సర్వవిధ ప్రబంధములకు జీవభూతమైనది రసము. కథానుక్రమణికలో రసపోషణము పుష్పహారములోని దారము వలె అంతర్నిహితమై తదుప క్రమణోప సంహారములకు జీవభూతమై యుండును. రస రహిత కథా కథనము నీరసమై నిర్జీవమై యుండును.

గౌరీ కల్యాణమున ఇతివృత్తమునందలి అనుపూర్వికతచే కారణ క్రమము పాటింపబడి రస విషయకముగను మూలమున కంటె కొంత మార్పు గోచరించును. తారకాసురుని త్రిలోకాధిపత్యము, అతని దుండగముల వర్ణనలలో రౌద్ర వీరములు పోషితములు.

స్థాణ్వాశ్రమ వసంతోదయ, పార్వతీ సౌందర్య వర్ణన, మన్మథ వీరాలాప జైత్ర యాత్రలందును పుష్పాభరణ భూషితయగు పార్వతీ శివానురాగ వర్ణనమందును తద్వివాహ లీలలందును శృంగార రసము పోషితము. మరియు రతీ విలాప ఘట్టమున కరుణరసము ప్రధానముగ నుండి విప్రలంభ శృంగార వర్ణనా ఛాయలు గలవు.

పార్వతీ శంకరుల తపోఘట్టములందును గౌరీ కల్యాణ వృత్తాంత ఫలాంత కుమారోదయ తారక వధ సూచనాదికములలో శాంతరసము పరిఢవిల్లినది.

పార్వతీ కపట వటు సంవాదమున హాస్య రసము మితహిత ధోరణిని పోషితము.

మొత్తము మీద శ్రీనాథుని రసపోషణ మూల విధేయమయ్యు, సందర్భోచితములగు వర్ణనలను కొంత భిన్నమై కవి స్వతంత్ర రస

పోషణా వైదగ్ధ్యమును వెలార్చుచున్నది. ఈ కవి భాషానుగుణముగ రసముసుప్పతిల్ల చేసెరనవచ్చును. కథానుక్రమణమున రసము పూర్వాశ్వాస భక్తి త్యాగ వీర రస భిన్నమగుటచే రసఝరీ గౌరీ కల్యాణ ఘట్టమును సముచితోత్సాహముతో పఠించి రసానంద తన్మయులయ్యెదరు. రస నమ్మేళన వర్ణనా విధానము మహాకవి యనజ్ఞకు నిదర్శనము. కథా కథనమునందీ రసపోషణము ప్రధానమై కావ్య శిల్ప కళాంగమై ప్రతిభాసించుటచే కవి అవశ్యముగ రస పుష్కలముగు వర్ణనలొనర్చెను.

2.3.6. శబ్దానుసరణము :-

హరవిలాసము చంపూ కావ్యము. శ్రీనాథుడు సంస్కృత శ్లోకముల నాంధ్రీకరించు తరి శ్లోకవిషయమును దృష్టియందుంచుకొని పద్య గద్యాత్మకముగ అనువదించెను. ఇందు శబ్దార్థములు రెండును ప్రాధాన్య వివక్ష కలవి. తదనుగుణముగ శ్రీనాథుడు తన అనువాదమును పద్య గద్యములుగా విభజించికొనెను. శ్రీనాథుని శబ్దానుసరణము పద్య గద్య పారిభాషిక ప్రయోగములందు కానవగును.

2.3.6.0. పద్యరూప శబ్దానుసరణము :-

మూల శ్లోకములను పద్యరూపమున అనువదించునపుడు శబ్దములను యథాతథముగ అనుసరించుట దుస్సాధ్యము. కాని శ్రీనాథుడు తద్విషయ సాధనకు ప్రయత్న మొనర్చి సఫలత్వమును సాధించిన అద్వితీయుడు. అట్టి పద్య రూప శబ్దానుసరణములను కొన్నింటిని మాత్ర మిచ్చోట నుదాహరించుట జరిగినది.

"విన్యస్త శుక్లా గురు చక్రు రంగం
గోరోచనా పత్ర విభక్త మస్యాః,
సాచక్ర వాకాంకిత సైకతాయా
స్త్రిస్రోతసః కాంతి మతీత్య తస్థౌ." (కు. సం. 7-15)

అను శ్లోకమును శ్రీనాథుడు పార్వతిని వధువుగా చేసినప్పుడిట్లు యథా తథముగ ననువదించెను.

> కలిత గోరోచనా పత్రముల తోడ
> గరము విలసిల్లె నీ హారగిరితనూజ
> చక్రవాక పదాంకిత సైకతముల
> గరము విలసిల్లు నా కాశగంగ వోలె. (హర. 4-84)

ఇందు "విన్యస్త శుక్ల గురు చక్రరంగం" అను సమాసమును తప్ప మిగిలిన శ్లోకమునంతను అనువదించెను. పార్వతి ముఖము గోరోచనా పత్రములతో చక్రవాక పక్షుల పదముల జాడలతో విలసిల్లు ఇసుక ఒడ్డులతో గూడిన గంగానది వలె యొప్పియుండెను. ఇట్లు భావ విహితముగ శబ్దమును పాటించి అనువదించెను. క్రింది శ్లోకము నందలి శబ్దములను పూర్తిగా అనుసరింపనప్పటికి శ్లోకార్థమును మాత్రము పూర్తిగా అనువదించెను. భావమునకు శబ్దమునకు అవినాభావ సంబంధము కలదు. తత్సంబంధము తద్భాషా సంబంధి. సంస్కృత భాషకుపయుక్తముగు శబ్దార్థ సంబంధము ఆంధ్ర భాషకు వర్తింపక పోవచ్చును. అందులకే అసంపూర్ణ శబ్దానుసరణము.

> శైలః సంపూర్ణ కామోఽపి మేనాముఖ ముదైక్షత,
> ప్రాయేణ గృహిణీ నేత్రాః కన్యార్థేషు కుటుమ్బినః -
> (కు. సం. 6-85)

> - భూమి ధర రాజు సంపూర్ణ కాముడయ్యె
> ముదముతో మేనకాదేవి మొగము నూచి
> కన్యకాదాన వేళల గలదు చనవు
> క్షితి గృహస్థుల కంటె సద్గేహినులకు... (హర. 4-68)

మరియొక శ్లోకము కూడ ఈ పద్ధతియందే అనువదించెను.

"ఈప్సితార్థ క్రియోదారం తేఽభినన్ద్య గిరేర్వచః,
ఆశీర్భి రేధయామాసుః పురః పాకాభిరమ్బికామ్"
(కు. సం. 6-90)

- ఈప్సితార్థ క్రియా సముపేతుడైన
శైలపతి మాటకందఱు సంతసిల్లి
ప్రణతి యొనరించి యంజలి పాణియైన
గౌరి నాశీర్వదించిరి గగనమునులు. (హర. 4-71)

ఇట భావము ననుసరించి శబ్దముల నొకపాలు మిక్కుటముగనే గైకొని అనువదించెను. సప్తర్షులు తమకు పాదాభినందన మొనర్చిన గౌరిని ఆశీర్వదించిరని నగాధిపతి మాటల కందరు సంతోషించిరని తెలియును.

కొన్ని తావులందు అత్యల్పముగ శబ్దానుసరణము గావించి భావము నుపలక్షించెను. ఈ క్రింది శ్లోకమునందలి ప్రథమపాదము నందలి 'హృదయ' శబ్దమును మాత్రమే గ్రహించి మిగిలిన శ్లోకము నందలి భావము గ్రహించి ఆంధ్ర భాషానుగుణముగ అనువదించెను.

"హృదయే వససీతి మత్ప్రియం, యదవోచ స్తదవైమి కైతవమ్,
ఉపచార పదం న చేదిదం త్వ మనంగః కథ మక్షతా రతిః.
(కు. సం. 4-9)

- హృదయమున నుండు దీవని హృదయనాథ! ప్రియము
చెప్పుదు వది యొల్ల తేమజంబు
హృదయమున నుంట నిజమేని మదన! యెట్లు భస్మమైతివి?
నే నెట్లు బ్రదుకగంటి? (హర. 8-90)

2.3.6.1. గద్యరూప శబ్దానుసరణము :-

సంస్కృత శ్లోకముల నాంధ్రీకరించునపుడు సంస్కృత శబ్దార్థములను రెండింటిని ఆంధ్ర గద్యమున యథాతథముగ అనుసరించుట కష్టము కాదు. కాని శ్రీనాథుని గద్య మెల్లెడల మూలానుసరణము కాదు. కాగా కొన్ని సంపూర్ణాను సరణములు, కొన్ని అర్థానుసరణములు, కొన్ని నాత్యనుసరణములు. ఇయ్యది సత్కవి అనువాద విధానము. ఎయ్యది యెచ్చట ఉపయోగ యోగ్యమో అయ్యది అచ్చట ప్రయోగ యోగ్యము. ఇదే శ్రీనాథుని విధానము. శ్లోకములను గద్య రూపమున అనువదించిన కొన్ని సందర్భములను మాత్రము పరిశీలింతము.

i) గద్య రూప అర్థ శబ్దానుసరణము :-

అరణ్య బీజాంజలి దాన లాలితా స్తథాచ తస్యాం హరిణా
విశశ్వసుః. (కు. సం. 5-14)

ఇందలి శబ్దార్థముల నిట్లు అనుసరించి అనువదించెను.

- హరిణ కిశోరంబులకు నరణ్య బీజాంజలి దానంబునన్.
(హర. 4-14)

మరియొక ఉదాహరణము :

"శశినా సహయాతి కౌముదీ సహమేఘేన తటిత్ప్రలీయతే"
(కు. సం. 4-33)

- శశి తోడం గూడ గౌముదియు మేఘుంబు తోడం గూడ
మెఱుంగు" ననుట (హర. 3-93)

ii) నాతి విస్తృత శబ్దానుసరణము :-

i) "స గోపతిం నంది భుజావలంబి శార్దూల చర్మాం
పరితోరుపృష్టమ్

తద్భక్తి సంక్షిప్త బృహత్ప్రమాణ మారుహ్య కైలాస
మివప్రతస్థే." (కు. సం. 7-37)

- నంది భుజావలంబియై శార్దూల చర్మ నిహిత పల్యాణ బంధం
బగు వృషభంబును గైలాస శిఖరంబుంబోలె నారోహణంబుసేసి,
(హర. 4-92)

ii) ప్రదక్షిణ ప్రక్రమణాత్కృశానో రుదర్చి షస్తన్మిథునం చకాసే,
మేరోరుపాంతేష్వివ వర్తమాన మన్యోన్య సంసక్త మహాస్త్రి
యామమ్. (కు. సం. 7-79)

- ప్రదక్షిణ ప్రణామంబున నా మిథునంబు విభావసు నారాధించు
నపుడు మేరువునకు బ్రదక్షిణంబు సేయు నహస్త్రియామంబు
ననుకరించె. (హర. 4-98)

iii) తౌ దంపతీ త్రిః పరిణీయ వహ్ని మన్యోన్య సంస్పర్శ
నిమిలీతాక్షౌ,
స కారయామాస వధూః పురోధా_స్తస్మిన్సమిద్ధార్చిషిలాజ
మోక్షమ్. (కు. సం. 7-180)

- సమిద్ధ జ్వాలంబైన యనలంబునందు దాక్షాయణి లాజ
మోక్షంబొనర్చె.

iv) ఇత్థం విధిజ్ఞేన పురోహితేన ప్రత్యుక్త పాణి గ్రహణోపచారౌ,
ప్రణేమతుస్తౌ పితరౌ ప్రజానాం పద్మాసనస్థాయ పితామహాయ.
(కు. సం. 7-86)

- అంత నిర్వర్తిత పాణిగ్రహణ మహోత్సవులై భవానీ భవులు
భక్తి భావనా వశంవదులై బ్రహ్మాసనాసీనుండగు పితామహు
నకుం బ్రణమిల్లిరి. (హర. 4-98)

v) తస్మాత్ ప్రదేశాచ్చ వితానవంతం యుక్తం మణి స్తంభ చతుష్టయేన
పతివ్రతాభిః పరిగృహ్య విన్యే క్లరో ప్తాసనం కౌతుక వేది మధ్యమ్.
(కు. సం. 7-12)

- తత్ ప్రదేశంబున నుండి మణి స్తంభ చతుష్ట యాభిరామంబును వితానవంతంబును నగు కౌతుక వేది మధ్యంబునకుం దెచ్చి నెచ్చెలు లలంకరింప దొడగిరి. (హర. 4-82)

2.3.6.2. శాస్త్రసంబంధ పద యథానుసరణము :-

జ్యోతిష ఖగోళ యోగ శాస్త్రాదులకు సంబంధించిన పదములను యథాతథముగ గ్రహించెను. శాస్త్రములు సంస్కృత భాషా సంబంధులు. తచ్ఛాస్త్ర సంబంధ పదజాల యథాతథ గ్రహణము అనివార్యము. కావున శ్రీనాథుడు కూడ అట్టి పదములను యథా మూలము గనే ప్రయోగించెను.

1) జ్యోతిశ్శాస్త్ర సంబంధ పదములు :-

అథౌషధీనా మధి పస్య వృద్ధౌ తిథౌ చ జామిత్ర గుణాన్వితాయామ్
సమేత బంధు హిమవాన్ సుతాయా వివాహ దీక్షా విధి మన్వ తిష్ఠత్. (కు. సం. 7-1)

- ఓషధీనాథు డభివృద్ధి నొందుచుండ
దిథికి జామిత్ర గుణము సంధిల్లుచుండ,
బర్వతేంద్రుండు సముపేత బాంధవుండు
పుత్రికోద్వాహ కల్యాణమునకు దొడగె. (హర. 4-78)

మైత్రే ముహూర్తే శశలాంఛనేన యోగం గతా సూత్తర ఫల్గునీషు,

తస్యాః శరీరే ప్రతికర్మ చక్రుర్బంధుస్త్రియో యాః పతి
పుత్రవత్యః (కు. సం. 7-6)

- మైత్ర ముహూర్తంబున నుత్తర ఫల్గునీ నక్షత్రంబునకుం జంద్ర యోగంబు గలుగు చుండ బతి పుత్రవంతులగు సముత్తైదువ లప్పుత్త్రశాలినికి శృంగారంబు సేసిరపుడు. (హర. 4-78)

జామిత్ర గుణము మైత్రీ ముహూర్తము అను జ్యోతిశ్శాస్త్ర సంబంధ పదములు రెండును పార్వతీ పరమేశ్వర వివాహ ముహూర్త మునకు సంబంధించినవి.

2) ఖగోళ శాస్త్ర సంబంధ పదములు :

దృష్టి ప్రమిదం పరిహృత్య తస్య
కామః పురశ్శుక్ర మివప్రయాణే
ప్రాన్తేషు సంసక్త నమేరు శాఖం
ధ్యానా స్పదం భూత పతే ర్వివేశ. (కు. సం. 3-43)

- కామః ప్రయాణే యాత్రాయాం పురోగతః శుక్రోయస్మిన్దేశే తం పురః శుక్రం దేశ మివ - అని పురశ్శుక్ర పదమునకు మల్లి నాథ వ్యాఖ్య ఈ అంతరార్థమును గ్రహించిన శ్రీనాథుడిట్లు అనువదించెను.

- మనోభవుండు ముక్కంటి యెదుట జక్కటిగాని యొక పక్కయుగా బురశ్శుక్రంబు నడచు వాడునుంబోలె. (హ. 3-64)

మన్మథుడు శివాశ్రమము చేరి యెదుట శుక్రుడున్న దిక్కువైపు ప్రయాణమును పరిహరించినట్లు శివదృష్టిని పరిహరించి ప్రాంత ప్రదేశ మున నిలిచెను. విరుద్ధమైన దానికి 'ఎదురు శుక్రము' అనునానుడి ప్రసిద్ధి. ముహూర్త వేత్తలు దీనిని గొప్ప దోషముగ పరిగణించి,

ప్రతి శుక్రం ప్రతి బుధం ప్రత్యంగారక మేవచ।
అపిశక్ర సమో రాజా హంతి సైన్యో నివర్తతే॥

అని నిషేధించిరి.

3) యోగ శాస్త్ర సంబంధ పదములు :-

పర్యంక బంధ స్థిర పూర్వకాయ మృజ్వాయతం సన్నమితో
భయాంసమ్,
ఉత్తాన పాణి ద్వయ సన్నివేశాత్ ప్రఫుల్ల రాజీవ మివాంక మధ్యే
(కు. సం. 3-45)

- పర్యంక బంధ బంధురిత పూర్వకాయుండును నుత్తాన పాణియు
ప్రాణాయామ పరుండును నగు,

"పర్యంక బంధేన వీరాసనేన"

పర్యంక బంధము యోగశాస్త్ర సంబంధి. ప్రాణాయామము గూడ నట్టిదే. ఇట్లు పెక్కింటిని ఉదాహరణగా పేర్కొనవచ్చును.

2.3.7. సమాస స్వీకరణము :-

మూలము నందలి సమాసములర్థ యుక్తములు, శబ్దరంజితములు. అయినప్పుడట్టి సమాసములను అనువాదము నందు యథాతథముగ గ్రహించుట పరిపాటి. శ్రీనాథుడును అట్లే గావించెను. సుందరములు, భావయుక్తములు అగు పెక్కు సమాసముల నట్లే గ్రహించెను. మచ్చునకు కొన్నింటిని మాత్రమే ఉదాహరించుట జరిగినది.

i) అహాం బలాసి స్పృహణీయ వీర్యః......... (కు. సం. 3-20)

- సంస్పృహణీయ విక్రముడ వీవు......... (హర. 3-52)

ii) ప్రయత్న సంస్తమ్భిత విక్రియాణాం,.......... (కు. సం. 3-34)

– సంస్తంభిత విక్రియారంభులు......... (హర. 3-60)

iii) ఆరోపిత పుష్ప చాపే,.......... (కు. సం. 3-35)

– సమారోపిత పుష్ప చాపుండు......... (హర. 3-60)

iv) పుష్పాసవా ఘూర్ణిత.......... (కు. సం. 3-38)

– పుష్పాసవా ఘూర్ణితేక్షణము......... (హర. 3-62)

v) నిష్కమ్ప వృక్షం నిభృత ద్విరేపం
మూకాణ్డజం శాన్త మృగ ప్రచారం
తచ్ఛాసనాత్ కాననమేవ సర్వం
చిత్రార్పితారమ్భ మివావతస్థే. } (కు. సం. 3-42)

– నిష్కంప వృక్షము, నిభృత ద్విరేఫము, మూకాండ జంబును, ప్రశాంత మృగ ప్రచారంబును, చిత్రార్పిత రూపావస్థానము.........
(హర. 3-64)

vi) దక్షిణాపాఙ్గ నివిష్ట ముష్టిం, ఆకుంచిత సవ్యపాదమ్.........
(కు. సం. 3-70)

– దక్షిణాపాంగ నివిష్ట ముష్టియు ఆకుంచిత సవ్యపాదుండు......
(హర. 3-82)

vii) భ్రూభంగ దుష్ప్రేక్ష్య.......... (కు. సం. 3-71)

భ్రూభంగ దుష్ప్రేక్ష్యంబగు......... (హర. 3-82)

viii) గౌరసిద్ధార్థ నివేశవద్భి ర్దూర్వా ప్రవాళైః...... (కు. సం. 77)

గౌరసిద్ధార్థ వినివేశ కల్పితమగుచు దరుణ దూర్వా ప్రవాళ సంభరిత మగుచు......... (హర. 4-79)

2.3.8. సమాస స్వతంత్రీకరణము :-

సంస్కృత సమాసములను యథాతథముగ తెలుగున గ్రహించుట కవకాశము లేనపుడు సరియగు అర్థస్ఫూర్తి నొసంగనప్పుడు శబ్ద గాంభీర్యమును కల్గి వేరొక సమాసము గాన్పించనపుడు సమాసములను, స్వతంత్రీకరించి ప్రయోగించెను. కొన్ని ప్రయోగములు మాత్రమిందు ప్రదర్శితములు.

i) కాతుక సంవిధానైర్గృహే గృహే వ్యంగ్య పురస్ధ్రి వర్గమ్......
(కు. సం. 7-2)

- కౌతుక వ్యగ్ర కాంతా నికాయ మగుచు...... (హర. 4-72)

ii) విన్యస్త వైడూర్య శిలాతలే......... (కు. సం. 7-10)

- పృథుల మాణిక్య శశికాంత వీథియందు...... (హర. 4-81)

2.39. భావాను సరణము :-

ఇతో గమిష్యా మ్యథవేతి వాదినీ
చచాల బాలా స్తన భిన్న వల్కలా,
స్వరూప మాస్థాయ చ తాం కృతస్మితః
స మాల లమ్బే వృష రాజకే తనః... (కు. సం. 5-84)

- పార్వతీదేవి అనవరత తపోధ్యాన నిష్ఠితయై శంభుని మెప్పింప గోరి నప్పుడు కృతక బ్రహ్మచారి యొకడు పార్వతి తపో విషయాది కముల గూర్చి ముచ్చటించుచు శంభుని గూర్చి కేవలముగ మాటలాడ మొదలిడెను. పార్వతి చెలికత్తెలతో శంభుని తూలనాడు నతనిని మాటలాడ నీయకుమని పల్కు సందర్భములోనిదీ శ్లోకము. మూలము న "మెడబట్టి నూకెడ"ని పార్వతితో ననినట్లు లేదు. తెలుగున కోపావేశితురాలై, పార్వతి జయా విజయులను చెలికత్తెలతో వంకర

కొంకర మాటలాడు బ్రహ్మచారిని పొడబట్టి నూతుడని నాలుగైదడు గులు వేసి తిరిగి చూచినది.

“జిలుగగు వల్కలాంచలము చెన్నయి చన్నుల మీద జాఱగా
నలుక దుషార శైలసుత యవ్వలి మోమయి నాలుగేన్ పదం
బులు చని భ్రూకుటీ కుటిల ముగ్ధ లలాట ముఖేందు బింబయై
మలఁగి కనుంగొనన్ భుజగ మండనుడైన శతద్విజోత్తమున్.
(హర. 4-35)

- శ్రీనాథుని భావాను సరణమిది - జిలుగగు వల్కలాంచలము, సొగసుగా స్తనముల మీదనుండి జాఱగా అలుకతో కనుబొమలు ముడి పడినను ముగ్ధత్వముతో నిందుబింబ ముఖము నించుక ఓరగానిడి భుజగ మండనుడుగ మారిన ఆ శతద్విజోత్తముని పార్వతి చూచినదట.

ఇట జిలుగు లొలుకు వల్కలాంచలముల జాఱుపాటులోని మిస మిసలు, అలుకతోడి మోమున కనుబొమలు ముడిపడుటేగాక, కోప ముతో విసవిస నడవబోయి తటాలున నిటు తిరిగి భుజగమండనుడైన శివుని చూచెనసుట, హఠాత్తుగ చీకటిలో తారాడు వారికి వెలుగు గోచరమైనట్లయినది. ఇంతలి పార్వతి ముగ్ధ మోహన రూపము భావగత సౌందర్యోద్దీపితమై చలన చిత్ర గత సౌందర్య భాసితమై మిరు మిట్లు గొల్పునదైనది. భావ గ్రహణమేగాక మూలమునకు మెరుగులు దిద్దిన ఘట్టమిది.

2) ముక్తా యజ్ఞోపవీతాని బిభ్రతో హేమ వల్కలాః
రత్నాక్ష సూత్రాః ప్రవ్రజ్యాం కల్ప వృక్షా ఇవాశ్రితాః
(కు. సం. 6-6)

- పదియార్వన్నె పసిండి వల్కలమునన్ భాసిల్లు ముత్యాల జ
న్నిదముల్ రత్న మయాక్షతంబులును మాణిక్యంపు
బాత్రంబునన్

జడురొప్పన్ ధరియించి కల్ప ధరణీ జాతంబులున్ బోలె గ
న్పడురన్ నిల్చిన దివ్య సంయమూల సంవీక్షించి సంభావనన్.
(హర. 4-41)

ముత్తెముల జందెములు దాల్చి బంగారపు నారచీరలు గట్టి రత్నంపు జపమాలలను గల్గి వాన ప్రస్థాశ్రమము నవలంబించిన కల్పవృక్షములు వలె నొప్పు చున్నమునులు ప్రత్యక్షమైనట్లు మూలమున వర్ణితము. హారవిలాసపు పద్యభావ సౌందర్యము అనూనమైనది. కల్పవృక్ష సామ్యముచే మనోహరమగు చున్నది. "హేమ వల్కలాః ముక్తా యజ్ఞోపవీతాని" అనునది పదియార్వన్న పసిండి వల్కలములుగాను, ముత్యాలు గుచ్చిన జన్నిదములుగ నున్నను "రత్నాక్ష సూత్రాః" మాత్రము రత్నాల అక్షతలుగ దివ్యమునీంద్రుల కరములలో భాసిల్లి నది. ఇది శ్రీనాథ కవీంద్రుని కలమున నుద్భవించి పార్వతీ పరమేశ్వర కల్యాణమునకై పెండ్లి పెద్దలనబడు సప్తర్షుల చేతులలోని మాణిక్యంపు పాత్రలలోబడుట లోక కల్యాణమునకే గదా! ఇక ప్రవ్రజ్యాం పదము ప్రస్తుత పద్యములో వదలినను శ్రీనాథుడు 51 వ పద్యమున:(4 ఆ) వాన ప్రస్థాశ్రమ స్వీకృతులగు వారలకు సహజమగు లజ్జా ధర్మము పరిత్య జించినట్లు వర్ణించెను. ఆదిమ మునీశ్వరుడగు శివునకు వివాహేచ్ఛ గల్గు టతో ప్రజాపతి పుత్రులగు సప్తర్షులకు ఏల లజ్జ కలుగ వలెను? కనుక నే త్యజించిరని భావము.

౩) తస్మిన్ మఘోనస్త్రి దశాన్ విహాయ
సహస్ర మక్ష్ణాం యుగ పత్పపాత
ప్రయోజనా పేక్షితయా ప్రభూణాం
ప్రాయశ్చలం గౌరవమాశ్రితేషు. (కు. సం. ౩-1)

- పక్షమున పెంపునం గుసుమ బాణుని మీఁదన వ్రాలె దేవతా
ధ్యక్షుని వేయికన్నులును దక్కిన వేల్పుల నుజ్జగించి సూ

క్ష్మేక్షిక జూడ గార్యగతి యిట్టి దయా ప్రభువుల్ ప్రయోజనా
పేక్ష నొకప్పు డాశ్రితుల కీర వహించిన గౌరవోన్నతుల్?

(హర. 8-39)

ఇందలి భావ మత్యంత సుందరము; దేవేంద్రుడు బ్రహ్మదేశమున దేవహితార్థము పార్వతీ శంకరులకు సమాగమము సమకూర్ప సంకల్పించి యెదుటనున్న సంకల్ప సంభవునిపై సహస్రాక్షులను బరపెనని భావము తక్కిన దేవతా గణమును మినహాయించి వేయికండ్లతో శాంకరీ శంభు సమాగమ ప్రయోజనోద్దిష్టమగు చూపులతో మన్మథుని సాదరముగ వీక్షించెను. భావానుసరణమునకు సముదంచిత కార్యాణము. కాని 'పక్షము పెంపు సూక్ష్మేక్షిక' అను అదనపు పద ప్రయోగములు ఇంద్రుని దేవ హితార్థ ప్రయోజనోపలక్షములై అతని అంతర్గత భావప్రకటితములై అలరారుచున్నది. కార్యసాఫల్యమునకై ఆశ్రితులకు ఒకప్పుడు అమిత గౌరవ మర్యాదలు ప్రభువు లిచ్చెదరను పరమ సత్యమును స్ఫుటముగ తెలియజేయునవియై యున్నవి. "సూక్ష్మేక్షిక" పద ప్రయోగము శ్రీనాథుని సునిశితమగు ఆలోచనా దృష్టిని లోకజ్ఞతను తెల్పును. పక్షపాత గుణము ఇంద్రుడు వహించెననుట శ్లోకమున స్పష్టముగ లేదు. హరవిలాసమున 'పక్షము పెంపు' వలన, పక్షపాత గుణము ఫలతంత్రము నాశించియేగాని గుణపక్షపాతము గాదని తెలియును. పైగా ఆశ్రితులపట్ల ప్రభువుల ఆదరాభిమానములు చంచలములు, స్వప్రయోజనోద్దిష్టములని అనుభవపూర్వక సత్యములని తెలియును.

4) సుగన్ధి నిశ్వాస వివృద్ధ తృష్ణం బిమ్బాధరా సన్న చరం
ద్విరేఫమ్,
ప్రతిక్షణం సంభ్రమ లోల దృష్టి ర్లీలారవిన్దేన నివారయన్తీ.

(కు. సం. 3-56)

- కమ్మనియూర్పు గాడుపుల గంధము గ్రోలగవచ్చి రోష్ఠ బిం
  బమ్ము సమీపదేశమున బాయక యాడెడు తేటి గేలి ప
  ద్మమ్మున మాటి మాటికి సముంచిత విభ్రమలోల దృష్టియై
  యమ్మదిరాక్షి చోపె దరహాస వికస్వర గండపాళియై.

(హర. 3-71)

ఇందు కమనీయ దృశ్యమొకటి కలదు. సువాసనా భరితమైన నిట్టూర్పు వాయువుల మధురిమ గ్రోలుటకై పార్వతీదేవి ఓష్ఠబింబ సమీపమున తిరుగాడు తేటిని మాటిమాటికి శాంకరి దృష్టి కడ్డుగ వచ్చు తేటిని దరహాస వికస్వర గండపాళియై చేతిలోని లీలారవిందముచే తోలుచున్నదట! ఎంత అద్భుత రూపచిత్రణమిది! కాళిదాసుని శకుంతల వలె పార్వతీ ముఖ సౌందర్యము పద్మ భ్రాంతిచే ఇనుమడించినది. పద్మ భ్రాంతిచే తుమ్మెద పార్వతి ముఖము నుండి వెల్వడు సువాసనా భరితములగు నిట్టూర్పు వాయువుల మధురిమకు చొక్కియు, దొండపండు వంటి అధరము నాస్వాదించుటకు అట తారాడుచున్నట్లును విలాసముగ చేతియందున్న లీలారవిందమున చోపుచున్న దృశ్యము పఠితలముందు సాక్షాత్కరించును. పద్మినీజాతి నిట్టూర్పులు సువాసనా భరితము లందురు. మొత్తముమీద పార్వతి అపురూప సౌందర్యము ఇట రాణించుచున్నదని అభిప్రాయ గర్భితము. సంభ్రమము గలది యగుటచే పార్వతి చంచలాక్షి యనుట ఇట వ్యంజితము. రకరకములైన రంగుల సమ్మేళనముచే గీసిన వర్ణచిత్రమిది.

5) ఏవం వాదిని దేవర్షౌ పార్శ్వే పితు రధోముఖీ
   లీలా కమల పత్రాణి గణయామాస పార్వతీ. (కు.సం.6-84)

- అది దేవర్షి బహుప్రకార మధుర వ్యాహార సంతర్పణం
  బని గొంతుండగ తండ్రి పార్శ్వమున పద్మాతంబు లజ్జాభరం

బుసు మార్ధ్వంబును దోప నమ్ర వదనాంభోజాతయై యల్లన
ల్లన లెక్కించుచు నుండెఁ బాణి నవలీలా పద్మ పత్రంబులన్.
(హార. 4-67)

- నాటకీయతను వెలార్చు మనోజ్ఞ రంగ దృశ్యమిది. ఒకవైపు హిమవంతుడు సప్తర్షులను అర్ఘ్య పాద్యాదులతో నెదుర్కొనుట మరియొకవైపు ప్రాక్తన ప్రజాపతులగు సప్తర్షులు పెండ్లి పెత్తన మున్నవారై అరుంధతీ సహితులై విచ్చేసి హిమవంతుని పూజలందుకొనుట, రంగము పైననే తండ్రి పార్శ్వమున లజ్జా భావముచే మార్ధ్వముచే నమ్ర వదనాంభోజాతయై అల్లనల్లన చేతిలోని నవలీలాపద్మ పత్రములను లెక్కించుచున్న పార్వతి దృశ్యమానమగుచున్నది. కన్యనిమ్మని కోరి వచ్చిన సప్తర్షుల ముందట పార్వతి సంతోషాతిశయముచే పద్మపత్రములు లెక్కించుచు సంచారీ భావగోపనము చేయుచున్న అపూర్వ దృశ్యమిది.

6) ధాతు తామ్రాధరః ప్రాంశు ర్దేవదారు బృహద్భుజః
ప్రకృత్యైవ శిరోరస్కః సువ్యక్తో హిమవానితి. (కు.సం. 6-51)

- ధాతు తామ్రాధరుడు దేవదారు భుజుడు
సాను వక్షస్స్థలుడు వటస్కంధుడైన
మంచు గుబ్బలి రాజు సంభ్రమముతోడ
ఋషి సమూహంబు నతిభక్తి నెదురుకొనియె. (హార. 4-55)

గైరికాది ధాతువులనెడి పెదవి, దేవదారు వృక్షములనెడి భుజముల ఔన్నత్యము గలవాడును, స్వభావముచే గండశిలలే వక్షస్సుగా గల వాడగుటచే నతడు మంచు పర్వతమునకు రాజు అని స్పష్టపడెనని మూలార్థము. తెనుగున సానువులను వక్షస్థ్సలమును గూర్చి చెప్పిన మీదట వటవృక్షములనెడి మూపులు గలవాడనియు, 'హిమవాన్' అనుటకు 'మంచు గుబ్బలి రాజు' అనుటయు మనోహరములు. అప్రాణి

వస్తువులకు మూ_ర్తి నిచ్చుచు జీవమును పోయుట కవికుల గురువు కల్పనా విశేషజ్ఞతను సూచించును శ్రీనాథుడీ రూపకల్పనమును యథావిధిగ స్వీకరించి రూపగత చిత్రణ మొనర్చెను. పాదన్యాసములచే ధరిత్రి పరికంపము చెంద అత్యంత పమోన్మాద భయభ_క్తులతో అర్ఘ్య పూర్ణ హస్తాబ్జములతో న_ప్తర్షుల వేగముగ నెదుర్కొనినట్లు (హర. 4-54) ముందు పద్యమున వర్ణించుటచే హిమవంతుని జంగమ స్థావర రూపములు వర్ణితములు.

7) వ్యావృ_త్త గతి రుద్యానే కుసుమ _స్తేయ సాధ్వసాత్,
న వాతి వాయు _స్తత్ పార్శ్వే తాలవృంతానిలాధికమ్.
(కు. సం. 2-35)

- నిరపరాధ బాధితులగు నిర్జరులకు
బంధ మోక్షంబు గావించు గంధ వహుడు,
సతుల వస్త్యోద వెడలించి చన్నులలసి
తప్పు నేసియు దైత్యు చి_త్తంబు వడసి. (హర. 3-4)

- ఇందు వాయుదేవుడు బంధ మోక్షము గల్గుచు స్వభావము గల్గినను, దుర్మార్గముగ స్త్రీల వస్త్యోదలను తొలగించి శిక్షితుడు గాక దైత్యుని చి_త్తము వడసెనట! అనగా సన్మార్గముగ నుండెడి వాడే తప్పు నేసియు దైత్యుని అనురాగమునకు పాత్రుడయ్యెనట. ఎట్టి అపరాధమైనను చేసి దైత్యుని చిత్తానుగుణముగ వ_ర్తించినచో శిక్షితులు గారని భావము. ఈ భావము కుమారసంభవమున లేదు. గంధవహుడు ఉద్యానవన పుష్పముల దొంగతనము భయమువలన తారకాసురు నెడబాయక ప్రక్కనే యుండి వివనకర్రతో విసిరిన దానికంటె నెక్కువ వినరక సేవించును. (కు. సం. 2-35) భయముతో యజమానిని సేవించుటకంటె తప్పునేసియు నిర్భయముగ నుండి దైత్యుని మనసు చూరగొనినను టలో గంధవహుని ధీమా కన్పడుచున్నది.

ఇట్లు సంస్కృత కుమార సంభవము నందలి పెక్కు శ్లోకముల యందలి భావము నుపలక్షించి శ్రీనాథుడు కుమార సంభవాంధ్రీకరణ మును గావించెను. ఈయది అనితర సాధ్యము. శ్రీనాథుని కవితా సార్వ భౌమాధికార మిందు దృగ్గోచరమగుచున్నది. ఇయ్యది భావమానము.

2.3.10. అభిప్రాయ ఘటనము :-

సంస్కృత కుమార సంభవ కావ్యమైనను తద్రచనా ప్రణాళిక, హరవిలాస రచనా ప్రణాళికలు భిన్నములు. కొన్ని విషయములు సంస్కృతమున విస్తృతములు. తద్విషయములు హరవిలాసమున కనుప యుక్తమైనపుడు శ్రీనాథుడు తద్భావమును గ్రహించి, కుదించి పెక్కు శ్లోకముల యందలి భావము నొకటి రెండు పద్యముల యందు రచించెను. కొన్ని పర్యాయములు శ్లోకములయందలి భావము నొకించుక గ్రహించి హరవిలాస రచన కనువగు భావమును దానికి జోడించి రచించెను. ఇయ్యదియే శ్రీనాథుని అభిప్రాయ ఘటనము.

"బాలేన్దు వక్రాణ్య వికాస భావాద్బభుః పలాశాన్యతి లోహితాని,
సద్యో వసన్తేన సమాగతానాం నఖక్షతానీవ వనస్థలీనాం."
కు. సం. 3-24 శ్లో.

— నవకములగు ములు మోదువుఁ
బువు మొగ్గలు విపిన వీథిఁ బొల్పెసలారెన్
దివుట వసంతుండను ప
ల్లవుఁ డిడిన నఖక్షతంబులకు సరియగుచున్. హర. 3-58

ఇందు బాలచంద్రుని వక్రత్వము లేకపోయినను 'ములు' అను పదము మొగ్గలు మొనదేలి పదనుగా నుండుటను సూచించును. 'నవక ములను' పదము క్రొత్తవైన మొగ్గలనుటను తెల్పును. 'సమాగతానాం' 'లోహితాని' విశేషణములు లేవు. అప్రస్తుత గమ్యమానముగా సమా

సో_క్తి యథాప్రకారము స్వీకరించెను. ఇట 'వనస్థలీనాం' అని స్త్రీలకు బదులుగ విపిన వీధి అని వాడెను. వసంతుడను పల్లవుడిడిన నఖక్షతము వలె మోదుగు పూవు మొగ్గలు ఆకాశమున విచ్చినవట! పల్లవుడన విటుడని అర్థము. స్త్రీ పురుష విషయము స్ఫురితము. అభిప్రాయ ఘటనమున కిది తార్కాణము.

హిమ వ్యపాయా ద్విశదా ధరణా మూ పాండరీ భూత
ముఖచ్ఛలీనామ్,
స్వేదోద్గమః కింపురుషాంగ నానాం చక్రే పదం పత్ర విశేష కేషు.
(కు. సం. 3-33)

- చెమట కింపురుష స్త్రీల చెక్కులందు
గ్రమ్మి మృగనాభి పత్ర భంగంబుఁ గరఁచెఁ
జందన ద్రవ మింపెయ్యిఁ జన్నుఁ గవకు
నలరుఁ బన్నీటితో గుహ్యా కాంగనలకు. (హర. 3-59)

చలికి పగలకుండ మైనమో కుంకుమయో పూయుట కద్దు. అకాల వసంతోదయముచే పగలక పోయినను వారి పెదవుల పాండు వర్ణము ప్రకాశించెనట. కాని శ్రీనాథుని పద్యమున చెమటచే కింపురుష స్త్రీల చెక్కిళ్లపై కస్తూరిచే రచితమైన మకరికా పత్రములు కరగించినట్లే కాక చందన ద్రవము కూడ కరిగి స్తనభాగమును తడపినదట! పూనీటితో స్నానమాడు గుహ్యకాంగనలకు వసంతోదయముచే వసంత చిహ్నము గు వేడిమిచే చెమట యుద్భవించెనను మూలాభిప్రాయమును గ్రహించి మెరుగులు దిద్దిన ఘట్టము ఇది!

## 2.3.11. అలంకార సౌందర్యము :-

శ్రీనాథుని కవిత శబ్దాశ్రితమే కాని శబ్దాలంకారాశ్రితము కాదు. ఇక అర్థాలంకరముల మాట తలచిన, యథా మూలకాలంకారములనే

అనుసరించెననవలెను. కనుక కాళిదాసు వలె నీతడు పరిమితాలంకార ములను వాడెననుట నిశ్చితము. కాళిదాసు కావ్యములను స్మరించి నంతనే మొట్టమొదట మనస్సులో తళుక్కున మెరయుచుండునవి అతని ఉపమానములే. అందుకే అతడు "ఉపమాకాళిదాసస్య" అని ప్రశస్తి గాంచెను. శ్రీనాథుడు కూడ తదనుసారి యగుటవలన 'ఉపమాశ్రీ శ్రీనాథస్య' అనుటలో తప్పులేదు. ఉదా:- 'చంద్రోదయారంభ' ఇవాంబు రాశిః కు. సం. 3-67 శ్లో.

– 'చంద్రోదయారంభ కాలమునం బొంగిన దుగ్ధ సాగరము లీల'

(హర. 3-80)

దేవహితార్థమై ఇంద్ర ప్రేరితుడై, మదనుడు పంచసాయకము లతో శివ తపోభంగ మొనర్ప నట్టి ఘట్ట మిది. తపోవనపు నిశ్శబ్ద గాంభీర్యముచే సడలిన ధైర్యమును, పార్వతీ దర్శనముచే కూడ గట్టు కొని అదనుకై వేచియున్న మన్మథుడు అంబిక శివునకు మందాకినీ పద్మమాలను సమర్పించినపుడు సమ్మోహనాస్త్ర మేసెను. శివుని మదిలో ననురాగ రేఖ ఉదయించును. పండిన దొండపండు వంటి పెదవితో ఆకర్ణాంత విశాలనేత్రములతో స్వచ్ఛమైన మోహముపై పరనమగు ప్రేమంపు చూడ్కులతో శివుడు పార్వతిని చూచెనట! నివృత్త ధైర్యుడగు అతని హృదయానురాగము చంద్రోదయ కాలమున ఉప్పొంగిన దుగ్ధ సాగరము వలె నుండెనట! చక్కని ఉపమాలంకారము. యథాతథముగ స్వీకరింపబడెను. ఇట్టివే అనేకములు.

1) సోఽహం తృష్ణాతురై ర్వృష్టిం విద్యుత్వానివ చాతకైః,
అరిది ప్రకృతైః దేవైః ప్రసూతిం ప్రతియాచితః......

(కు. సం. 6-27)

– తృష్ణాతురులైనవారు,
వారి వాహంబు ఘన వృష్టి గోరినట్లు. (హర. 4-44)

2) गगनादव तीर्णा सायथा वृद्ध पुरस्सरा,
తోయాంతర్భాస్కరా లీవ శేషేముని పరంపరా. (కు.సం.6-49)

- నిర్మలంబైన నీటిలో నీడ దోచు
నిందు బింబంబును బోలె ఋషి గణంబు - (హర. 4-53)

3) అదృష్టి సంరంభ మివాంబు వాహ మపామివాధార మను త్తరంగమ్ (కు. సం. 6-58)

- నిస్తరంగకమైన మున్నీరు వోలె......... (హర. 3-65)

4) తచ్చాధ్యాసనాశ్కాసనమేవ సర్వం
చిత్రార్పితారంభ మివావ తస్థే —— (కు. సం. 4-42)

- చిత్రార్పిత రూపావస్థానంబు బోలె....... (హర. 3-64)

5) ముక్తా యజ్ఞోపవీతాని బిభ్రతో హేమవల్కలాః
రత్నాక్ష సూత్రాః ప్రవజ్యాం కల్ప వృక్షా ఇవాశ్రితాః
(కు. సం. 6-6)

- కల్ప ధరణీ జాతంబులన్ బోలె

6) మనసః శిఖరాణాం చ సదృశీ తే సమున్నతిః (కు. సం. 6-66)

- అఖర్వములగు నీ మహా శిఖరముల భంగిన్. (హర. 4-62)

7) విదూర భూమిర్నవ మేఘ శబ్దా దుద్భిన్నయా రత్న
శలాకయేవ, (కు. సం. 1-24)

- శారుశాలంబు మణి శలాకయును దాను,
నొప్పెడు విదూర భూమికి నుద్దియయ్యె. (హర. 3-22)

8) ఉన్మీలితం తూలిక యేవ చిత్రం, ......(కు. సం. 1-32)

- తూలికోన్మీలితమైన చిత్రంబునుంబోలె...... (హర. 3-23)

9) సా చక్రవాకాంకిత సైకతాయా
   స్త్రీస్రోతసః కాంతి మతీత్య తస్థౌ - (కు. సం. 7-15)
 - చక్రవాక పదాంకిత సైకతముల గరము విలసిల్లు నాకాశ గంగ
   వోలె. (హర. 4-84)

అమూల కోపమ :-

ప్రతిభావంతుడగు శ్రీనాథు డమూల కోపముల ప్రయోగించెను.

1) పలికె లలాట లోచనుడు ప్రస్ఫుట భంగి ముని ప్రజంబుతోఁ
   దొలకరి మేఘ ఘోషములతోఁ బుగణించు నసంచిత ధ్వనిన్.
   (హర. 4-47)

పార్వతీ పాణిగ్రహణోత్సాహియైన మహా శివుడు సప్తర్షుల రావించి వారలతో పెండ్లి రాయబారమునకు పోవవేడ బోవునట్టి సందర్భమిది. చంద్రరేఖతో నొప్పిన జటాజూటముతో కోమలమగు దంత కాంతితో ప్రస్ఫుటముగ తొలకరి ఋతువులో మేఘ ఘోషమును పోలిన చక్కని ధ్వనితో సప్తర్షులతో మాటలాడెనట! చక్కని ఔపమ్య మిది. కంచు కంఠము వలె స్ఫుటమై మేఘ గర్జన స్వరము తొలకరిలో వచ్చునట్టిదట! ఇట్టిదే—

i) నూబూవుం బోలునాసికయు...... (హర. 3-23)

ii) ఒలికి బూడిదయైన నామని యేడ్చెనావలచినట్లు...(హర. 3-83)

iii) సుధారసంబు గ్రోవియగు మోవి...... (హర. 3-23)

ఉత్ప్రేక్ష :-

చివురు గఱి తోడి లేమావి పువ్వు శరములు
చేసి మధు మాస కాలంబు చిత్తజునకు
నళికులంబుల పేర నామాక్షరములు
వరుసతో నిలిపె ననఁ జాల్పె వానియందు. (హర. 3-57)

వసంత కాలమున లేత మావి చివుళ్లు చిత్తజునకు అళికులముల పేరుతో పూలశరములా యన్నట్లు ఒప్పియుండినవట. యథాయథాలంకారముగు ఉత్ప్రేక్ష. ఇట్టివే 3-23, 3-69 పద్యములలో కలవు.

అర్థాంతరన్యాసము :-

> నిర్జితేంద్రియులైనట్టి నియమ పరుల
> నంతరాయంబు లేమి సేయంగ గలవు? (హార. 3-63)

చిత్త స్వాధీనము గలవారి కంతరాయములు ఆత్మానుసంధానమును తొలగించునవి కావు. సామాన్యముగ అంతరాయములచే చిత్తస్థైర్యము చెడుట సహజము. విశిష్టుల కట్టి అంతరాయములు చిత్తస్థైర్యము నిచ్చునవే యనుట - విశేషము, అర్థాంతరన్యాసము. ఇట్టివి - 40, 66, 85 - తృతీయాశ్వాసమునను, 18, 24, 44, 68 - చతుర్థాశ్వాసములందు గలవు. ఇతః పూర్వ పరిశోధన గావించిన కొర్లపాటి వారు వీనిని సూచించినందున వీనిని విపులీకరింపలేదు.

2.3.12. అనౌచిత్యపరిహారము :-

> తాం వీక్ష్య సర్వావయవానవద్యాం రతేరపి హ్రీ పద
> మాదధానామ్,
> జితేంద్రియే శూలిని పుష్ప చాపః స్వకార్యసిద్ధిం పున రాశ
> శంసే. (కు. సం. 3-87)

> అఖిల లక్షణ సంపూర్ణయైనయట్టి
> యా లతాతన్విఁ జూచి పుష్పాయుధుండు
> దాను పూనిన దేవకార్య మఖిలమును
> సఫలతం జెందెనని మది సంతసిల్లె...... (హార. 3-72)

– ఇందు సకల లక్షణ సంయుతురాలైన పార్వతిని శ్రీనాథుడు సుకుమారముగ చిత్రించి మూలములో వలె రతిని కించపరచినట్లు గాక ఉత్తమ స్త్రీ వర్ణనము చేయుట అనౌచిత్య పరిహారమనదగును. ఇట్టివి పెక్కులు.

2.3.13. ఔచిత్య సమాదరము :-

> కుబేర గుప్తాం దిశ ముష్ణరశ్మౌ
> గంతుం ప్రవృత్తే సమయం విలంఘ్య,
> దిగ్ద దక్షిణా గన్ధ వహాం ముఖేన
> వ్యలీక నిశ్వాస మివోత్స సర్జ...... (కు. సం. 3-25)

> – ఉత్తరాభిముఖుండైన యుష్ణ రశ్మి
> చండమీక్షించి దక్షిణాశా పురంధ్రి
> గంధ వాహంబు పేర ధీర్ఘంబుగాగ...... (హర. 3-55)

దక్షిణ దిక్కును బాసి సూర్యుడుత్తర దిక్కునకు వెళ్లగా తన సంభోగ కాల మతిక్రమించి మరియొక కుత్సిత పురుషునిచే నుంచుకొనబడిన స్త్రీని కలియబోగా మొదట దాక్షిణ్యావతియగు నాయిక దుఃఖముచే విడచు నిట్టూర్పులో యనునట్లు మలయ వాయువులు వ్యాపించెను. ఈ ఉత్ప్రేక్షాలంకారము యథా తథముగ శ్రీనాథుడు తన పద్యమున వాడి ఔచిత్య సమాదర మొనర్చెను.

2.3.14. సీసపద్య రచనా విధానము :-

శ్రీనాథుని సారస్వత తపఃప్రభావమున సీసములు కరిగి బంగారమై ఉద్ధత గమనముతో సుజ్జ్వల కాంతులతో పరిమళించి పారాడునది. "అజగరమువంటి దీర్ఘ కాయముతో పడియుండు సీనపద్యమును నన్నయ విడయ విస్తరణకు వాహనము చేసికొనెను. ఆ సీసమునకు పడగ

కొత్తించి ఫణాఖండమున మణులు మెరపించి శ్రీనాథుడు నాగస్వరమూది యిచ్చ వచ్చిన ఆటలాడించెను."[16]

ఏదేని యొక విషయమును వర్ణింప దలపెట్టిన దానిని సర్వాంగ పరిపుష్టము చేసి వర్ణించెడి తీరంతయు కవి సార్వభౌమునకు భట్టబాణుని విషయానుసరణ సంస్కరణమని, మన్మథుని రాక సీస గీతములలో ఈ క్రింద వర్ణించు తీరును బట్టి తెలియును.

కాంతా జనంబుల కటివంక బొమలతోఁ
ప్రతి వచ్చు పుష్ప చాపంబుతోడ
కోకిల వ్రాతంబు గ్రుక్కిళ్లు మ్రింగించు
క్రొమ్మావి చిగురాకు గొడుగు తోడ
రతిదేవి నిడుసోగఁ గ్రాలు కన్నుల డాలుఁ
దలపించు మీన కేతనము తోడ
భుజగ లీలావతీ భుక్త శేషములైన
గంధ వాహ కిశోరములతోడ

ఇందురుచితో వసంత మాసంబు తోడ
రాజ కీర రథం బెక్కి ప్రాభవమున
వచ్చె వలరాజు చిత్తానువర్తనముగ
సంభ్రమముతో మహేంద్రు నాస్థానమునకు. (హర. 3-38)

ఇందు మూలశ్లోకమునందలి "రతివలయ పదాంకే చాపమాసజ్య కంఠే" (కు. సం. 2-64) అను శ్లోకము నందలి 'ఆసజ్య' అనునది మాత్రము లేదు. వలరాజు దేవేంద్రుని సభకు వచ్చునప్పటి వైభవ వర్ణనమిది. సార్వభౌముని యాస్థానమునకు సామంత రాజొకడు వచ్చినప్పటి ఠీవియంతయు

16. హనుమచ్ఛాస్త్రి, ఇంద్రగంటి; విజ్ఞాన సర్వస్వము - 4; ఆంధ్ర భాషా- సమితి, 1961.

వెలయునట్లు చిత్రితమైనది. మూలమున వలరాజు సంభ్రమము సరళ ధోరణిలో కన్పట్టగ చూతాంకురము గొడుగు పువ్వు చాపముతో కోకిల సైన్యముతో గంధవహ కిశోరములతో, చంద్రునితో వసంతునితో రాజకీర రథము నాడంబరము నధికముగ చూపట్టును. తన రచనా శిల్పమును పరిపుష్టము చేయుటకై మూల విషయమును పెంపుచేయు నుత్సాహము శ్రీనాథునికి మెండు. అందులకాతడు సీసములు వాడును.
ఉదా :-

"క్రొమ్ముడి జై పెక్కు కుసుమంబులుమియుచు
నవటు ప్రదేశంబునందు బొరల
జేవుఱించిన లేత చెక్కుటద్దంబుల
దాటంక యుగళంబు తన్నియాడ
నాక్రోశ పరిదేవ నాక్షర వ్రాతంబు
కంఠ గద్గదికచే గ్రగ్గు పడగ
హరినీలముల చాయ నక్షి గోళమ్ముల
సొబగు గాటుక నీటి సోన గురియ

ముత్తియంబులు పేరులు ముఱిసి పడగ
హస్తముల పీగు జనుదోయి యడిచి కొనుచు
సంబరంబిచ్చు రతిదేవి శంబరారి
కప్పుడు వసంతు నెదుట దుఃఖార్త యగుచు." (హర. 3-92)

రతి వసంతునెదుట దుఃఖార్తయైన విధము సవిస్తర ధోరణితో కరుణ రసోద్దీపితముగ వర్ణించుటకు సీసము ఆతనికి తోడ్పడినది.

ఒకే భావమునే పెక్కు పదములు మార్చి మార్చి యనుసంధించి. దానిని హృదయము నిండుగా సరవుకొనునట్లు చేయుట కాతడీ విధముగ సీసము వాడును.

"అనువు తప్పిరి, నొచ్చి రలసి రాపదనొంది
రదవదలైరి చీకాకుపడిరి...... (హర. 3-10)

ఇట్లు శ్రీనాథుడు కాళిదాస కుమార సంభవములోని శ్లోకముల ఏకదేశాంధ్రీకరణమునకు సీసపద్యములను, స్వతంత్రతను ప్రకటించుటకు ఎత్తుగీతములను ప్రయోగించెను. మొత్తము మీద శ్రీనాథుని సీస పద్యము లాతని శయ్యా సౌభాగ్యమును వెలార్చుచున్నవి.

**2.4. శైలీవైదగ్ధ్యము :-**

"శ్రీనాథుని పద్యము చెవిని జొచ్చుచుండగనే మనసును పులకరింప జేసి మొగమును వికసింపజేయునది యాతని శయ్యా సౌభాగ్యము. అనర్గళ, ధారతో నుదాత్త గమనముతో ఱొమ్ము విరుచుకొని నడుచు నా పోకడ యనన్య కింకరము."[17]

శబ్దార్థములను సంస్కృత ప్రౌఢిని తెలుగు నుడికారమును సమ పాకమున సంవదించి శబ్దార్థోభయ ప్రధానమైన నిరర్గళ ధారా మధుర మైన శైలిని శ్రీనాథుడు ఆంధ్ర కావ్యరంగమున వెలయించెను. సంస్కృత శబ్దాడంబరముతో కూడిన ప్రౌఢ సమాస రచనము చేయు గలడు. తెలుగు తీయదనము లొలుకు నుడికారము పలికింపగలడు. ఆతని సీసపద్యముల నడక, మత్తేభ శార్దూలముల రచనా విన్యాసము, ప్రౌఢ సంస్కృత సమాస పదగుంఫనము తెలుగు పలుకుబడుల సొంపుపెంపులు తరువాతి కవులకుపజీవికలైనవి.

"విలక్షణ శబ్ద సంపాదన చేతను, మనోహర శబ్ద సంయోజన చేతను, రమణీయ సంస్కృతాంధ్ర తుల్య స్కంధ సంధానము చేతను,

---

17. వెంకటశేష శాస్త్రి, గడియారము; శ్రీనాథ కవి సార్వభౌముడు; ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1975.

గైర్వాణీ ఛందశ్చర్యా మర్యాద చేతను విశిష్ట క్రియాపద ప్రయోగ చాతురి చేతను, ఒకానొక మనోహర ప్రకార భావాభివ్యక్తి చేతను శ్రీనాథుడు ఆంధ్ర సాహిత్య ప్రపంచంలో ఎట్టివారినైనను పాదాక్రాంత మొనర్చ గల ధీశాలి."[18]

పూల ఘుమ ఘుమలు, అలల గలగలలు, ద్రాక్షపండ్లతీయందనములు, తారకల మిలమిలలు శ్రీనాథుని కవితా స్రవంతి నోలలాడునప్పటి అనుభూతి, లోక సమ్మోహన కరములగు నతని పద ప్రయోగముల విన్నాణంపు మెఱుగులకు సముచిత స్థలముల పరస తరంబులుగ మేళవింపబడు తీరుతీయములు గల జాతీయములు, లోకోక్తులు, వలపు గులుకు పలుకు బడులు అనంతములుగా నుండి ఎనలేని శోభ కూర్చుచుండును.

ఉదా :- సంస్కృత ధాటి :-

జంభారి ప్రభవ ప్రయుక్త నిబిడ జ్యారావ గంభీర సం
రంభ భ్రామిత గాండివ ప్రసర దస్త్ర వ్రాత దీవ్యత్స్వరా
సంభిన్నాంగములై సురారి తనువుల్ సంగ్రామ రంగంబునన్
గుంభ ద్రోణము లట్లు బిట్టు గురిసెన్ ఘోరాస్త్ర వర్షం బోగిన్.
(హర. 7-167)

ఉదా :- తెలుగు నడక తీరు :-

చివురు గజితోడ లేమావి పువ్వు శరములు
చేసి మధుమాస కాలంబు చిత్తజునకు
నళికులంబుల పేర నామూఢరములు
వరుసతో నిల్చెనన బొల్చు వానియందు. (హర. 3-57)

---

18. శేషేంద్రశర్మ, గుంటూరు; సాహితీ వాల్లభ్యము, నరేంద్ర సాహిత్య మండలి, తణుకు, 1968.

'అలుముగడును నొక కుత్తుకైన గాని' వంటి జాతీయములు, రత్నం బొరునిచే నన్వేషింపబడు గాని యొరుల నన్వేషించునే వంటి సూక్తులు, మంచుగొండ యనుంగు బెండ్లికొడుకు, ఇవతాళించు కొలంకులు వంటి జాను తెనుగులు, అంత్య ప్రాసములు, ఎత్తుగడల పదముల కూర్పులు, అక్షరముల గరిడీ సాములు, భావముల తీర్పులు. విశేషణముల దండ అల్లో' విన్నాణములు కోకొల్లలు. ఇది యిట్టిదని చూప కావ్యమంతయు నుదాహరింప దగును.

2.4.0. క్రియాపద ప్రయోగ వైశారద్యము :-

శబ్దశక్తి మూలక వ్యంజన ధోరణి పటుతరమైన మహాత్త్వ కవిత్వ కళాంగము. అట్టి పద వాక్య ప్రమాణజ్ఞుడే శ్రీనాథ కవి సార్వభౌముడు. ప్రయోగించిన పదము ప్రయోగింపక క్రియాపద వైశారద్యమును స్ఫుటింపచేయు అతని ప్రయోగములు అత్యంత నిశితములు, భావ ప్రకటితములు.

తారకుడు బ్రహ్మ వర గర్వితుడై ముప్పదిమూడు కోట్ల దేవతలను మహర్షులను ముప్పు త్రిప్పులు పెట్టి కన్నీరు మున్నీరుగ విలపింప చేసెను. స్వర్గవాసులేమి, పాతాళ వాసులేమి దిక్పాలక చతుష్టయమేమి అందరు తారకుని దర్పము నణపజాలక పోయిరి. తారకుని ధాటికి సరికాని వారు సిద్ధ సాధ్య యక్ష కిన్నర కింపురుష విద్యాధరులలో లేక పోయిరి. ఆ దుర్మార్గుని దుండగముల కవధి లేక పోయెను. చివరకు మహర్షులు శాంతి యుతముగ తపస్సు చేసికొనలేక పోయిరనిన తారకుని దౌర్జన్యాతిశయములను వేరుగ పేర్కొన నవసరము లేదు. ఏకచ్ఛత్రాధిపత్యముగ నేలు తారకునిచే ఎల్లరు అష్ట కష్టముల పాలై అంగలార్చిన విధమును వివిధ క్రియాపద వైశారద్యమున శ్రీనాథుడు సాక్షాత్కరింప చేసెను.

అనువు దప్పిరి నొచ్చి రలసి రాపడ నొంది
రడవడలైరి చీకాకు పడిరి
యంగలార్చిరి విచ్చి రాఅడి బొందిరి
భ్రమసిరి పాఱిరి పల్లటిలిరి
బెగ్గడిల్లిరి పికాపికలైరి సొలసిరి
కలకల గూసిరి కుతిల పడిరి
గ్రగ్గుల కాత్తైరి కలగి రోటాఱిరి,
వెలవెల్లనైరి నివ్వెఱగు పడిరి

యవవునవులైరి గుజగుజలైరి డసి
రొల్ల బోయిరి జగ్గిరి తల్లడిలిరి
సిగ్గు పడి రొచ్చు వడిరి యుస్సుస్సు రైరి
కారనిచేత మునులు బృందారకులును. (హర. 8-10)

ఇట్టి క్రియాపదప్రయోగ వైఖరి నవలంబించిన కవి 'న భూతో న భవిష్యతి'

### 2.4.1. తెలుగు నుడికారము :-

ఆంధ్రీకరణమున స్వతంత్రించి తన ప్రత్యేకతను తెనుగు నుడికారములలోను, వింత వింత తెనుగు పలుకుబళ్ళలోను శ్రీనాథుడు చాటెను. పాకశాసనుడు దివిజ కార్య సంసిద్ధికై మనంబున కందర్పుని తలచెను. అట్టి తరి మన్మథుడు ఇంద్ర సభకేతెంచిన తీరు చూడుడు.

కాంతా జనంబుల కటివంక బొమలతో
ప్రతివచ్చు పుష్ప చాపంబుతోడ
కోకిల వ్రాతంబు గ్రుక్కిళ్లు మ్రింగించు
క్రొమ్మావి చిగురాకు గొడుగుతోడ

రతీ దేవి నిడు సోగగాలు కన్నులడాలు
దలపించు మీనకేతనముతోడ
భుజగ లీలావతీ భుక్త శేషము లైన
గంధ వాహ కిశోరకముల తోడ

జంఝురుని తో వసంత మానంబుతోడ
రాజకీర రథం బెక్కి ప్రాభవమున
వచ్చె వలరాజు చిత్తానువర్తనముగ
సంభ్రమముతో మహేంద్రు నాస్థానమునకు. (హార. 3-38)

ఇందలి గ్రుక్కిళ్లుగ్రమింగు, సోగగ్రాలు కన్నులడాలు - అను పదములందు తెనుగు నుడికారము ప్రదర్శితమై కవిభాషాభిమానము వెల్లివిరియుచున్నది.

పేరోలగమున నున్న దేవేంద్రుడు మన్మథుని సగౌరవముగ నాహ్వానించెను. కుసుమ బాణుని వేయి కన్నులతో చూచుచు తక్కిన వేల్పుల నుజ్జగించి దేవేంద్రుడు 'సూక్ష్మేక్షిక'తో మన్మథుని చూచెనట! ఇది యొక విశిష్టప్రయోగము ప్రయోజనా కాంక్షితుడగు ప్రభువు ఆశ్రితులకు సముచిత గౌరవాధిక్యముల నిచ్చుచు చూచెడి చూపు.

రా యిటు రమ్మని చేతికి
జేయిచ్చి ప్రమోద రేఖ చిగురొత్తమరు
న్నాయకుడు నిల్పె సుమన
స్నాయకు నరిగద్దె మీద సౌహార్దమునన్. (హార. 4-40)

ప్రమోద సౌహార్దములు పొంగులు వార దేవేంద్రుడు మన్మథుని చేయిపట్టి పిలుచుకొని వెళ్లి తన నరిగద్దెపై ఆసీనుచేసిన సందర్భమున రచించిన పై పద్యమున గల "రా యిటు రమ్మని చేతికి యిచ్చి" అను

ప్రయోగము తెలుగు సోయగమును, నాటకీయతను వ్యక్తము చేయు చున్నది.

2.4.2. తెలుగు భాషా పదముల ప్రయోగము :-

శివుని బైసి మెఱుంగరాడె, రాయంచ యంచు జీరకు జోక యగు గాక, ఇపతాళించుకొలంకులు, సురకరు దలి డుల్లిన జీర్ణ తరు పర్ణంబులు, ముత్యాల మొల నూలి మురువు సూపెడు, నిమ్నమున కోడిగిలు నీరు, బుజ్జగించి కూర్మి పొంపిరి వోవగ, సంబెరంబిచ్చె, గద్దదికచే గ్రగ్గు పడగ, సొబగు కొటుక నీటి సోన కురియు, ఒలికి బూడిదయైన ఆమని యేడ్చె ఆవటచినట్లు, కేకరాలోకనంబుల గెల్లుములగి, భావంబు కీలు దెలిసి - మొదలగు ప్రయోగములు అర్థాశ్రితములైన వృత్తి భేద ముగా నాశ్రయించిన రీతి (పదముల కూర్పు) శ్రీనాథుని సొమ్మని అది రసజ్ఞుల పాలిటి భోగమని శ్రీ శర్మగారనిరి.[19]

శ్రీనాథుని వినూత్న శైలి రసిక రసాయనమై అర్వాచీన కవులకు మార్గదర్శకమైనది.

2.5. హరవిలాసము : నన్నెచోడె కుమార సంభవము :-

కవిరాజ శిఖామణి విరచిత కుమార సంభవమున గౌరీ కల్యాణేతి వృత్తము వర్ణింపబడినది. కనుక హరవిలాస గౌరీ కల్యాణ కథను, నన్నెచోడ కుమార సంభవమునగల గౌరీ కల్యాణ కథను పోల్చి చూడ నగును. రెండు గ్రంథములకు కాళిదాస కుమార సంభవమే మాతృక.

2.5.0. భేదములు :-

1) హరవిలాసమున గౌరీ కల్యాణము, తథానుషంగిక వృత్తాంత ములు శివుని లీలలలో నొకటిగ, పార్వతీ శంకరుల వివాహమే

---

19. శేషేంద్రశర్మ, గుంటూరు, సాహితీ వాల్లభ్యము, నరేంద్ర సాహిత్య మండలి, తణుకు, 1968.

ప్రాధాన్య వివక్షగల్గి కుమార జననము గౌణముగ నెంచబడినది. శివోత్కర్షను ప్రతిపాదించు ప్రత్యేక ప్రబంధమై కాళిదాస కుమార సంభవమునందలి (శ్లోకభావముల) నటనట గ్రహించినను స్వతంత్రమగు రచనా వైఖరితో ద్వాదశాశ్వాసయుతమైన బృహద్గ్రంథము నన్నె చోడుని కుమార సంభవము 2) హారవిలాసము కాళిదాస కుమార సంభవమునందలి గౌరీ కల్యాణ తత్సంబంధ విషయాదికములకు అనగా 8 సర్గల వరకు యథానువాదమైనను సంగ్రహముగ రెండాశ్వాసము లలో వర్ణితము. నన్నెచోడుడు ప్రబంధోచితమగు అష్టాదశ వర్ణనా వైఖరితో పార్వతీ జనన, పార్వతీ పరమేశ్వర సంయోగముతే గాక, హరుడు సుఖలీలతో అర్ధనారీశ్వరత్వమును పొందువరకు గల కథా భాగము వర్ణితము. 3) తారకాసుర విజృంభణముతో తృతీయాశ్వాసము ప్రారంభమై మన్మథ దహన రతీవిలాసాది వృత్తాంతములు వర్ణితమై గౌరీ కల్యాణమునకు ఆనుషంగిక విషయములై వెలసినవి. నన్నె చోడుని గ్రంథమున కుమార జననము, తారక విజయము ప్రధాన విష యములై సతీదేవి గణాధిప జన్మములు, దక్షాధ్వర ధ్వంసములు. ఆనుషంగిక వృత్తాంతములుగ వర్ణింపబడినవి. బ్రహ్మస్తుతిని నన్నెచోడు వదలివైచెను. రసవత్తరముగ రతీ మన్మథ సంవాదమును ప్రవేశపెట్టెను. పార్వతీదేవి ఓం నమఃశివాయ మంత్రముతో అక్షరాభ్యాస మొనర్చి నట్లు వర్ణించి శివపారమ్యను ప్రకటించెను. 4) హారవిలాసమున రతీ సంవాదము లేదు. బృందారక బృందము బ్రహ్మను స్తుతించి తాము తారకునిచే పడ్డపాట్లు వివరించినట్లు గాక తారక విజృంభణముతో ప్రారంభమై సంగ్రహముగ బ్రహ్మస్తుతి చేయబడినది. హిమవద్వర్ణనము ప్రత్యేకించి లేదు. ఇట "నీరజాక్షి మేనితో సగపాలు గణుతింపగ మగ పాలుగా నున్నదీ పల్లవాధర శ్రీ పాద పద్మంబు నొరయు నొక్కమా టుడు గణేశుడీ కాంతతోడ మందాకినీ వాహిని సవితిగా గలదేమి చంద

మునసో'' అని నారదుడు పల్కినట్లు కలదు. 5) నన్నెచోడుడు కృ. కు.స. హిమాద్రి వర్ణనమును 16, 17 పద్యములలో కాళిదాసుని వలె విపులముగ చేసెను. నగర వర్ణనము, పార్వతీ శైశవమున బొమ్మల పెండ్లిండ్లు చేసి గుజ్జెనగూళ్లు వండినట్లు వర్ణించి స్వతంత్రతను ప్రకటించెను. ఆమె యౌవనమును 33 పద్యములలో విస్తరించెను. భవానీ శంకరుల శృంగార లీలలు, మధుపానక్రీడ వర్ణితములు. నారదుడు "ఈ దేవి లోక జనని మహాదేవు నగ్రమహిషియై పేర్మి సురేంద్రాదుల కర్చితయగు'' నని పల్కెను. వివాహ వర్ణనము నన్నెచోడుడు సంగ్రహముగా చేసెను. 6) మన్మథా గమనము ఒక పద్యమున "క్రాంతా జనంబుల కతివంక బొమలతో'' శ్రీనాథుడు వర్ణించెను. నన్నెచోడుని మన్మథా గమనము శ్రీనాథుని పద్యమునకే మాత్రము తీసిపోక మరింత సొబగులతో వెలుగు వర్ణచిత్రము.

ఉదా :- పూవులు తేరు జక్కవలు పూన వసంతుడు దాను నెక్కి కీ
రావళి గోకిలావళి మలయానిలముందనుగొల్వ పొల్పరా
గావర మీన కేతనము గ్రాలినలివ్రజ శంఖ కాహళా
రావములుం జెలంగ నమరావతి కిం జనుదెంచె నున్నతిన్.

అనుటయేగాక :-

"తన్నుగని యనిమిషులైరో మున్నయిరో
నాగ ననిమిష దృష్టిని నాకి సమితి
దగిలి కనుగొని వారి చిత్తములు దనకు
నెఱుంగ దమరేశునకును రతీశు నెటిగె.

అను దేవతల అనిమిషత్వమును అద్భుతావహముగ - అనుసంధించెను''
7) సంగ్రహ రచనలో శ్రీనాథుడు రతీ మన్మథ సంవాదమును చేయు లేదు. నన్నెచోడుడు పరమేశ్వర తపోభంగము చేయువలదని కుల

దైవము పైకెత్తి పోవుట తగదని నివారించుచు మన్మథుని ఆతని సిబ్బంది సామర్థ్యమును హేళన మొనర్చుట చూడుడు.

కొనిబాలురైనను దిని పిప్పియుమిసెడు
　　　　చెఱకు విల్లని నమ్మి చేత బట్టి
మొలకల తలవెంద్రుకల బోంది కందెడు
　　　　నలరు పుష్పము లమ్ములని తలంచి
తలిరాకులైన గదల్పనోపని మంద
　　　　పవనుండు నొక పెను ప్రాపుగాగ
నబలలు సోకిన నాకాశమున బోవు
　　　　నళి శుకములు మూల బలము గాగ

నెంత వేసవి మట్టిన నెండ గమరు
నను వసంతుండు దగు సహాయుండు గాగ
గాకి పిల్లల కోడు పికములు బోటు
మగలుగా నుగ్రుపై బోన దగున మదన. —
　　　　　　　　　　　　　　(న. కు. సం. - చ. 75)

8) అష్టాదశ వర్ణనలు, పార్వతీ విరహము, మన్మథు శివుని తపోభంగావసరమున దుశ్శకునములు హారవిలాసమున లేవు.

కుమార సంభవ ప్రబంధమున పార్వతీ విరహము, సఖీశుశ్రూష, ఆమె చిత్త వికారమునకు హిమవంతుని సంభ్రమము వర్ణితము. ఆటవిక జన దివ్య ఋషుల పట్ల ఋతు నగర వర్ణనములు కలవు. పార్వతిని తపస్సు చేయవలదని మేనక రకరకములుగ బుజ్జగించుట తండ్రి వద్దనుట పారతి బేలయై కన్నీరు డించినట్లు వర్ణితము. హారవిలాసమున కాళిదాసుని శ్లోకానుసారము ఈ క్రింది విధముగ వర్ణితమై పార్వతి పాత్ర పోషణము చక్కగా జరిపెనని తెలియును.

ఉదా :-

> ఇక్కడ శేశ వేల్పులు సమీప్సిత దాతలు ముద్దుగూన నీ
> వెక్కడ ఘోరవృత్తి దప మెక్కడ యీ పటు సాహసిక్యముల్
> తక్కు శిరీష పుష్ప మవఘాన పర్వతమునన్ మధు వ్రతం
> బెక్కిన నోర్చునో విహగ మెక్కిన నోర్చునో నిశ్చయింపుమా!
>
> (హార. 4-6)

### 2.6.1. సాదృశ్యములు :

నారదాగమనము శివ పరిచర్యార్థమై పార్వతిని తండ్రి నియమించుట మన్మథాగమన దహన రతీవిలాప ఘట్టములు రెండు గ్రంథములందు గలవు. రతీదేవిని ఆకాశవాణి సమాశ్వసించుట పార్వతీదేవి తపోదీక్ష కవుల ఈశ్వరార్చనాభిరతి వ్యక్తమగు వర్ణనలు రెండును భిన్న ధోరణిగ నున్నను ఏకైక గమ్యముగా నుద్దేశింపబడినవి. పార్వతి తపము, పార్వతీ మాయావటు సంవాదము శివ సాక్షాత్కారము, శివుడు సప్తర్షులను కన్యను తనకై వేడుమని హిమవంతుని కడకు పంపుట, వారు పెండ్లి పెద్దలై వ్యవహరించుట, వివాహము రెండు గ్రంథముల సమానమే. కాని నన్నెచోడుడు సప్తర్షులు పార్వతిని తిరిగి శివుని కడ వర్ణించుట సబబుగా లేదు. ఇది అనౌచిత్యమనిపించును.

వధూవరులను మంగళస్నాన గాత్రులుచేసి అలంకరించుట విధి విహిత వివాహ కార్యము రెండును నమానమే. కాని సాంగోపాంగాదికముగ శ్రీనాథుడు కాళిదానువలె వివాహము వర్ణింపగా, నన్నెచోడుడు కళ్యాణమును గూర్చి" బృహస్పతి దత్త సుముహూర్తంబునం బరమేష్ఠి హోమ పురస్సరంబుగా విధి విహిత విధానంబున గిరీశుండు గిరిజం బరిణయం బయ్యె నని మాత్రము వర్ణించెను. వివాహ నందర్భమున జార విటాదిక వర్ణనలు మితిమీరినవై వర్ణితము. సప్తర్షులు గాక

బృహస్పతి ముహూర్తము నిశ్చయించినట్లు నన్నెచోడుడు రచించుట ఆ కవి ప్రత్యేకత.

**2.6. గౌరీ శంకరుల వివాహము :- వేదోక్త పద్ధతులు :**

మానవులు స్వార్థారాధనమునకై వివాహమును కల్పించిన విధమును వివాహ చరిత్రమును బ్రాహ్మ, దైవార్ష ప్రాజాపత్యా సుర గాంధర్వ రాక్షస పైశాచాది వివాహములు విశదము చేయుచున్నవి. మన్మథ దహనాంతరము కలిగిన ఉమామహేశ్వరుల పరిణయము వివాహ పరిణామమునకు ప్రబల ప్రమాణ మనవచ్చును. పార్వతీ పరమేశ్వరుల వివాహము సీతారాముల వివాహము వలె మానవ కల్యాణములును ప్రేమ త్యాగ సాధ్యములై విలసిల్లినవి.

**2.6.0 వివాహము - స్వరూప స్వభావములు :**

వివాహకర్మయందు కన్యాదానము, శచీపూజ (గౌరీపూజ), వివాహము చతుర్థి యను నాలుగు అంగములు కలవు. వివాహకర్మ కన్యాదానముతో ప్రారంభమై గర్భాదానాది హోమాది కర్మలతో ముగియుచున్నది. వివాహము ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫల ప్రాప్తికి చేయు దివ్యమైన సాధనము.

భార్యా భర్తల సాహచర్యము, సాహవాసము, సహధర్మ చర్యము, సంతానము 'ప్రజాయై గృహమేధినాం' అని కాళిదాసు చెప్పినట్లుగ పరమార్థ ప్రాప్తికి స్త్రీ పుంసంయోగమే శరణ్యము. హరవిలాసమున శ్రీనాథుడు శివుని ద్వారా

"దార పరిగ్రహమే కద
సారపు ధర్మముల కెల్ల సాధన మరయన్. (హర. 4-44)

అని వివాహ ప్రాశస్త్యము గూర్చి పేర్కొనెను.

"సుహృదస్సమవేతా న్మంత్ర వతోవరాన్ప్రహిణుయాత్ మదర్థం
కన్యాం వృణీధ్వమితి వరాన్ప్రేషయతి తావాదితో ద్వాభ్యా
మభి మంత్ర యేత్ - (4-27)

అని యాజుష వివాహ ప్రయోగమున, పరమేశ్వరుడు తన బంధువులైనట్టియు, వేదాధ్యయన సంపన్నులైనట్టి బ్రాహ్మణులను 'మీరు ఈ కులములో నుంచి నా కొరకు కన్యకను వరింపుడు' అని ప్రయాణము చేయించవలెనని చెప్పుచున్నది.

చింతితోపస్థితులైన సప్తర్షులతో మహా శివుడు భువన రక్షా ప్రయోజనమునకై దేవసేనాని పుత్రునిగా బడయగోరి పార్వతిని పరిణయమాడ తలచితి నని తెల్పుచు "యుష్మత్సంఘటితంబులైన సంబంధముల కెన్నండును వికారంబు పుట్ట నేరదు. కన్యార్థంబయి యిట్లు ప్రవర్తింపు డీ భంగి నాడుఁడని మీకు మతి ప్రదానంబు సేయుంబనిలేదు భవత్ప్రణీ హితంబులైన పురాణాగమాదులు గదా లోక వ్యవహారంబులకు నిదర్శనంబులై యుండు" ననుట గౌరీ కల్యాణ సంప్రదాయ ప్రారంభమై తరువాతి వారల కాదర్శ ప్రాయమైనది. అనగా కన్యాదానమొనర్పుమని వరుని వైపు వారు కొందరు కన్యయింటికి వెళ్లుట సంప్రదాయమైనది. అట్లే పార్వతియు

"అరుదగు నీ తపమ్మునకు నమ్ముడు వోయితి నేలుకొమ్ము
నీ వరవుడ"

నని శివుడు పల్కగానే తాను చెప్పక జయావిజయులను ప్రాణ సఖులతో" మా తండ్రి హిమవత్పర్వతేంద్రుడు దేవరకు బ్రమాణీకరింపం బాత్రం జేసె కన్యకం బిత్రు పరాధీన నగుట దేవర చిత్తంబు నవధరింప వలయు" నని విన్నపంబు - ఇదియు పెద్దలు నడుపు వివాహమునకు ప్రాతి పదిక

---

21. యాజుష వివాహ ప్రయోగము.

అరుంధతీ సహితులై సప్తర్షులు శుభ ముహూర్తమున హిమవంతుని కడకేగి శంభునికి పార్వతి నిమ్మని వేడిరి. వివాహ శోభన కార్యము లందు పురంధ్రీజనములకు జనవు చెల్లునని మాననీయమగు పుణ్య కర్మం బునకు స్త్రీలనిగాని, పురుషులనిగాని భేదము వహింపక పూనవలెను. సమస్త సంయమి జనాద్యుడైన మహా శివుడు శైల సుతాపరిగ్ర హోత్సాహుడై యుండగా ప్రాక్తన ప్రజాపతులు సప్తర్షులు పరిగ్రహ వ్యతికర సంభవంబైన అచ్చపు లజ్జ పరిత్యజించుచు హిమవంతుని కడకు పెండ్లి రాయబారమేగి వివాహ సంధాతలై హిమవంతుడు కన్యాదాత కాగా గౌరీ శంభులు వధూవరులు కాగా సంప్రదాయాను సారము వినిశ్చితకార్యులై వివాహ తిథి నేటికి నాలవనాడని ముహూర్త నిశ్చ యము చేసిరి. ఓషధీ ప్రస్థ పురమున పెండ్లి సందడి చెలరేగి రాజ వీథులు, తోరణములతో కేతనములతో, పూల మాలలతో గరుడ గంధర్వ కిన్నర విద్యాధరాది సకల లోక హర్షదాయకమైనది.

2.6.1. పార్వతిని పెండ్లి కూతురుగ చేయుట.

మైత్రీ ముహూర్తమున ఉత్తర ఫల్గునీ నక్షత్రమునకు చంద్ర యోగము కలుగుచుండ పతి పుత్ర వంతులగు ముత్తైదువులు పార్వతిని శృంగారము చేసిరి. దూర్వా ప్రవాళములు, గౌరాంగ రాగములు ఆమెకు శుభము కల్గించుటకై అలంకరించిరి. బంగారు కంక పత్రము చేతియుండుండగా ఆ గిరినందన సూర్యకిరణములతో వెలిగెడి విదియనాటి చంద్ర కళవలె నుండెను. కమ్మని లోధ్ర పుష్పపు అకరువుతో చేసిన నూనెతో ఆమెకు నలుగురు పెట్టిరి. నల్లని కాలాగురుద్రవమున ఆమెకు అంగరాగము పూసిరి. గిరిజకు కస్తూరి, పునుగు, గంధ సారము సంపంగి నూనెలు సమకూర్చి అభిషేక యోగ్యమగు మడుగు వస్త్రములు కట్టి చలువరాతితో ముత్యాల చవికెలో చంద్రకాంత పీఠికపై కూర్చుండ బెట్టి బంగారు కడవలతో నీళ్లు ముంచిపోసి ఆమెకు మంగళస్నానము

చేయించిరి. స్నానానంతరమామెను స్త్రీలు కౌతుక వేదికి దెచ్చి అగరు ధూపౌఘములతో కురులు తడియార్చి ఇవ్వ పూదండల నామె కొప్పులో తురిమిరి. ఆమె చెక్కిళ్లపై గోరోచనముతో మకరికా పత్రములు గీయగా ఆమె చక్రవాక పదాంకితములతో విలసిల్లు గంగానది వలె నొప్పెను. గిరిజ ఫాల భాగమున ముంగురులతో జలదరేఖాయుతంబైన చంద్రుని పగిది నొప్పెను. ఒకతె లోధ్ర కషాయములతో గోరోచన ముతో, నొప్పు పుష్పములు గిరిజ కపోలముల తాకునట్లు శిరమందలంక రించెను. మరియొకతె పార్వతి ఆ భరణముల ఎరుపు రంగు దిద్దెను. ఒక లలామ అంబిక చరణాంబుజములకు లత్తుక పూసెను. ఒక కాతో దరి విశాలాక్షియైన పార్వతి కన్నులకు మంగళకరముగ కాటుక దిద్దెను. గౌరి సకలాభరణభూషితయై సర్వలోక నయనోత్సవ యయ్యెను.

హరితాళముల మనశ్శిలల గరంచి చిగురుతో ముంచి మేనక పార్వతి యొక్క గండమండలిని పత్ర భంగములను రచించెను. చందన ముతో ఆ తల్లి కుమార్తెకు కల్యాణ రేఖ దిద్దెను. మేనక దీక్షా తిలకంబు దిద్ది, ఊర్ణా కౌతుక హస్త సూత్రమును బంధించెను. పట్టు వస్త్ర ములు ధరించిన గౌరి కులదేవతల పూజించి ముత్తైదువ ప్రార్థన చేసి కల్యాణ మండపమునకు వచ్చెను.

2.6.2. శివుని వరునిగా చేయుట :-

బ్రాహ్మి భసితాంగముతోను, మాహేశి రుద్రాక్షమాలతోను, కౌమారి భిక్షా కరోటికతోను, వైష్ణవి తోలు దువ్వలువతోను, వారాహి కెంగేలి యిర్రితోను ఇంద్రాణి మణిమయములగు హారముల తోను, చాముండి దివ్య భూషా హారములతోను, దేవదేవునకు దివ్య శృంగార మొనర్చిరి. దివ్య శృంగారము, క్రమముగ కస్తూరి భరితాంగ రాగముతోను పట్టు పచ్చడముతోను, తారహారములతోను, హరితాళ

తిలకముతోను, చంద్రరేఖా చూడామణిత్వముతో నొప్పి యున్నది. వీరుడగు పురుషునికి ఖడ్గము నీడలో రూపు చూపించుట సంప్రదాయము. అట్లే శివునకు ఆతని అలంకారమును ఖడ్గమున చూపించిరి. ఆతడు వృషభారూఢుడై సప్త మాతృకలు, భద్రకాళి, ప్రమథ పరివారుడై ముప్పది మూడుకోట్ల దేవతా సమూహము కొలువ సమస్త వైభవోపేతముగ ఓషధీ ప్రస్థ పురమును చేరెను. హిమవంతుడు సమస్త బంధు జనాళితో వనగంధ ద్విపరాజినెక్కి రాగా ఈశ్వరుని నెదుర్కొనెను.

2.6.సి. కల్యాణ ఘట్టము :-

తుషార గిరీశ్వరుండు మేనక పసిండి పాత్రిలతో జలము వోయ, పురసురాంతకుని పాదములు కడిగి కన్యాదాన మొనర్చెను. 'కమ్' ధాతువు నిష్పన్నము కన్యా శబ్దము - వరులను కోరునది అని అర్థము; దానమనగా

"స్వస్వత్వ నివృత్తి పూర్వక పరస్వత్వాపాదనమ్."–

(ధర్మసింధువు)

ఒక వస్తువుపై తనకున్న హక్కును వదలుకొని యితరునికా హక్కు నిచ్చుట అని అర్థము. కన్యాదానము అనునది ఒక వివాహ ధర్మము.

"వైవాహికో విధిః స్త్రీణాం సంస్కారో వైదికః స్మృతః,
పతిసేవా గురౌ వాసో గృహార్థోఽగ్ని పరిక్రియామ్."

(మనుస్మృతి-67)

స్త్రీలకు వివాహమే ఉపనయనము.

"కన్యాం కనక సంపన్నాం కనకా భరణైర్యుతాం।
దాస్యామి విష్ణవే తుభ్యం బ్రహ్మలోకే జిగీషయా"॥

అనుచు కన్యాదాత కన్యచేతిని వరుని చేతిలోనుంచి ఉదకముతో గూడ దానమిచ్చును. దీనినే ఉదక దానమందురు. కన్యాదాన కాలమున

వరునకు కన్యాదాత శక్త్యాను సారముగ దక్షిణ తాంబూలాదు లివ్వ వలెను. వరుడు కన్యాదాతలు ఖరార్లు చేసికొందురు.

కన్యాదాత :

"ధర్మార్థ కామేష్వత్వయేషా నాతిచరితవ్యేతి వదేత్" అని వరుడు- 'నాతి చరామి' అని ప్రతిన చేయును. అటు పిమ్మట వధూ వరులచే తలమీద జీలకర్ర బెల్లము రెండింటిని కల్పిన ముద్దను పెట్టింతురు. కన్యాదానము సుముహూర్తము నందు జరిగినదనుటకీ కార్యము చేయింతురు. హారవిలాసమున ఈ ఘట్టమున ఒక తాటియాకు పట్టు గ్రంథ పాతముండుటచే నీ విషయమునకు తెలియు లేదు.

ఇంతవరకు జరిగిన క్రియకు ఉద్వాహమని పేరు. ఇది కన్యా సంస్కారము. ఇప్పటినుండి కన్య వధువగును. కన్యాదానముగు వరకు కన్యను వరుడు చూడడు. దానానంతరము మంత్రములతో కన్యను చూచును. ఈ మంత్రములన్నియు కన్యాదోషములు పోవుటకుగాను పఠింతురు. కన్యాదోష నివారణమునకై దర్భను కనుబొమల మధ్య నుండి తుడిచి వెనుక వేయుట, యుగచ్ఛిద్రాభిషేకము (కాడిమాను రంధ్రములో బంగారముంచి అభిషేకించుట) చేయుదురు. వధువునకు దర్భ త్రాటితో వరుడు కంకణ బంధ మొనర్చును. తరువాత మాంగల్య ధారణము. ఇందుకు మంత్రము లేదు.

"మాంగల్య తంతునానేన మమ జీవన హేతునా
కంఠే బధ్నామి సుభగే త్వం జీవ శరదాం శతమ్"[22]

అని శ్లోకము చెప్పి మాంగల్యము కట్టించుచున్నారు. ఇది మంత్రము కాదు స్మృతి వాక్యము.

---

22. యాజుష వివాహ ప్రయోగము.

పిమ్మట తడిపిన అక్షతలు (ఆర్ద్రాక్షతారోపణము) వధూవరుల తలలపై ఒకరికొకరు పోసికొందురు. తలంబ్రాలు పోసికొన్నట్లు హర విలాసమున

> పట్టు తెరచీర చాటున బ్రహ్మ మంత్ర
> వాద పూర్వముగా దలంబ్రాలు హస్త
> కమలములు దోయిలించి శ్రీ కంఠరుండు
> గౌరి శిరస్సున బూన్చెను గౌతుకమున. (హర. 4-95)

పార్వతీదేవియు బంధు జనోపదేశంబునం గాలకంధరు శిరమున ముత్యాల ప్రాలు నించె."— (4-96)

తెరచాటున ఆర్ద్రాక్షతారోపణము జరిగినట్లు వర్ణితము. ఇచట మంత్రములు చెప్పుచున్నారు. కాని అవి వేదములలో లేవని పెద్ద లందరు. కొందరు అక్షతారోపణకు పిమ్మట మాంగల్య ధారణము చేయించెదరు. ప్రధానహోమము, లాజహోమము వరుసగా జరిపింప వలెను. హరవిలాసమున అంబికా చక్రధరులు ప్రదక్షిణ ప్రక్రమములు చేసినట్లు వర్ణించిన పిదప లాజహోమము, ధ్రువ దర్శనము, లౌకికంబైన ఆర్ద్రాక్షతారోపణము అనుభవించినట్లు గలదు. సదస్య నాకబలి (నాగ వల్లి) ఇంద్రాణీ పూజ వసంతపూజ, లౌకిక భాషలు, అరుంధతీ దర్శనము. దేవతా దర్శనము అనుక్రమమున వివాహ సంప్రదాయ కలాపములు జరుగును. శ్రీనాథుడు ఏ కారణము చేతనో వివాహ కార్యకలాపములు కూడ కుదించి వ్రాసినట్లు తెలియుచున్నది.

**2.6.4.** కుమార సంభవము - వివాహ సంప్రదాయములు :

ఈ కావ్యమున గౌరీ శంకరుల కల్యాణ వైభవమును పరిశీలించిన ఆనాటి వివాహ సంప్రదాయములు తెలియవచ్చును. సప్తమ సర్గమున '70' వ శ్లోకమునుండి వివాహ వర్ణన ప్రారంభము.

సుందరియగు పార్వతి తపోబలముచే శివుని మనము గెలిచిన పిదప ఆతని అర్ధశరీరము నాక్రమించి ధన్యురాలైనది.

మహాశివుడు విష్ణువు చేయిపట్టి దింప వృషభవాహనము దిగి బ్రహ్మ యదివరకె ప్రవేశించిన విడిది గృహమును ప్రవేశించెను. దేవేంద్రాది దేవతలు, సప్తర్షులు శివుని ప్రమథ గణములు శివుని వెను వెంటనే అనుసరించిరి. శంకరుడు చిత్రాసనాసీనుడై యుండగా హిమ వంతుడు మధుపర్కమును దుకూలములను, మంత్రోక్తముగా నిచ్చెను. (72 శ్లో.) పట్టువస్త్రధారియైన శివుడు వధువు కడకు గొంపోబడగా వధూవరులన్యోన్య సందర్శనముచే సంతోషము నొందిరి.

హిమవంతుడు కుమార్తె యగు పార్వతి కరమును అష్టమూర్తి యగు శివుని కరమునందుంచెను. మహాశివుడు ఆమె పాణిగ్రహించు టతో పార్వతి రోమాంచిత మయ్యెను. శివుని కరములందు స్వేదోదయ మయ్యెను. దంపతులిరువురు అహస్త్రియామములు మేరువును చుట్టినట్లు అగ్నికి ప్రదక్షిణ మొనర్చిరి. పురోహితుడు వధువుచే అగ్నియందు లాజహోమ మొనర్ప జేసెను. లాజధూమము నాఘ్రాణింపజేసెను. ఆ ధూమ స్పర్శకు పార్వతి బుగ్గలు ఎఱుపై తడియై కర్ణాభరణము జారినది. బ్రహ్మ "ఈ యగ్నియే మీ వివాహ సమాప్తికి కర్మ సాక్షి శివునితో ధర్మబుద్ధురాలవై ఆతని సేవింపుము" అని పార్వతితో అనగా పార్వతి శ్రద్ధాతువై ఆ కర్ణాయత నేత్రయై బీడుభూము లెదురుచూచిన తొలి కారు వర్షమువలె వినినది. దంపతులు ధ్రువ దర్శనమునకు వెళ్లగా సిగ్గుతో తలయెత్తలేని పార్వతి 'దర్శనమయ్యె'నని బదులిచ్చినది.

వివాహ మహోత్సవము కులపురోహితుడు జరపగా దంపతులు బ్రహ్మకు నమస్కరింప "వీరపుత్ర ప్రాప్తిరస్తు" అని పార్వతిని ఆశీర్వ దించెను. ఆసీనులగు ఆ దంపతులు లౌకికార్ద్రతా కౌతుకముల ననుభవించిరి. సరస్వతి వారిని ప్రస్తుతించెను.

మధు పర్క పాణిగ్రహణ అగ్ని ప్రదక్షిణ లాజహోమము, ధ్రువ దర్శన అర్ధ్రి తక్షతారోపణములను ముఖ్య వైదిక సంప్రదాయములను కాళిదాసు కల్యాణ వర్ణనలో ననుసరించెను.[23]

## 2.7. కాళిదాస కుమారసంభవము - హరిహరుని గిరిజాకల్యాణము - హరవిలాసము - తులనాత్మక పరిశీలనము.

ప్రతిభా శక్తిచే శృంగార రస సముద్విక్తమగు కావ్యముగ తీర్చి దిద్దుటచే కుమార సంభవము పంచ మహా కావ్యములలో నొకటై కాళిదాసునకు సంస్కృత వాఙ్మయమున అమరామర కీర్తిని ఆర్జించినది.

కుమార సంభవమున తారక వధ నొనర్పగల కుమారోదయమే ప్రాధాన్య విషయగలది. కుమారోదయమునకు వలసిన యత్నములలో సతీతియోగాగ్ని చేతప మొనర్చు శివునకు అపరజన్మమున పార్వతిగా జన్మించిన శాంకరికి సంయోగము కల్గించుట మొదటిది. దేవేంద్ర ప్రార్ధనచే మన్మథుడు వారి కలయికకై యత్నించి భస్మీ భూతుడయ్యెను తుదకు పార్వతి తపోధిక్యతచే సంతసించిన శివుడు గౌరికి ప్రత్యక్షమై కళ్యాణమునకు సమ్మతించెను. రతిపతియు వారి కల్యాణముచే పునరుజ్జీవితుడగును. కుమారోదయమప్పుడే కల్గినది. ఇట్లు కుమారసంభవమునకు పంపిన అవాంతర విషయములను లేదా అనుషంగిక వృత్తాంతములను కాళిదాసు తొలుత సువివరముగ వర్ణించి తారక నిర్మథనాదక్షుడగు కుమారుని యుద్ధ ప్రయత్నములను తారక వధను కావ్యాంతము వరకు సుదీర్ఘముగ వివరించెను. అయ్యు తారకాసురుని విజృంభణముచే దేవేంద్రాది దిక్పాలకులు, మునులు పడరానిపాట్లు పడి తుదకు బ్రహ్మకడచేరి శరణోపాయము వేడుట, అతడు ఈశ్వరాంశ, సంభూతుడగు కుమారుడే తారక నిర్మథన మొనర్చునని కుమారోదయముచే కావ్య

23. కాళిదాసు, కుమార సంభవము. (72-90 శ్లో - 7స)

ఫలమైన తారక వధకు వలసిన బీజావాపనము ద్వితీయ సర్గలోనే జరిగి నట్లు కవి వర్ణించుట చూడ కావ్యప్రయోజనము నతడు మరుపలేదని యెరుగ వలెను.

గౌరీ కల్యాణము వరకు గల యితి వృత్తమును కల్యాణాను షంగిక వృత్తాంతములను మాత్రమే మూడు గ్రంథములందు పరిశీలించి భేదసాదృశముల నెన్నదగును. కాళిదాసుని కుమార సంభవమునందలి గౌరీ కల్యాణమును కన్నడమున హరిహరుడు, తెనుగున నన్నెచోడుడు శ్రీనాథుడు అనుసరించుటతో పోలికలు భేదము లేర్పడినను, ఏ కవి యెంతవరకు మాతృకానుసారము అనువదించిరో లేక భావగ్రహణ మొనర్చిరో గ్రహించవలెను.

అయ్యా గ్రంథేతి వృత్తమును సమగ్రముగ ననుసరించుటచే నన్నె చోడుని కుమారసంభవము ప్రత్యేకముగ పరిశీలింపదగినది.

2.7.0. సాదృశ్యములు :-

ప్రథమ సర్గమున హిమాలయ వర్ణనము తత్ప్రాంత గుహాలు, మేనాదేవీ హిమవంతుల కల్యాణము మైనాక జననము, మైనాకుడు నాగకన్యను వివాహమాడి సముద్రములో దాగుకొనుట, పార్వతీ జన నము, నారదాగమనము, శివుని యుగ్రతపము, పార్వతీదేవి పరిచర్య- అను అంశములను కాళిదాసు వర్ణించెను.

కన్నడమున హరిహరుడు పై ప్రథమ సర్గాంశములను స్వీక రించియు విస్తరించి, నాల్గాశ్వాసములలో ప్రపంచించెను. అయ్యా కాళిదాసుని హిమాలయ వర్ణనము నిట్లు అనువదించెను.

i) నగవర్ణన -

"అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా" (కు. సం-1-1)

అను శ్లోకమును హరిహరుడు ప్రథమాశ్వాసములో

i) ఆ విస్తార గభీర వారినిధి యిందం పశ్చిమాంబోధిగం
తీవి గ్గొప్ప వుదాత్త గహ్వార సహ సంతాన పర్యంత గో
త్రావా సోజ్జ్వల గండశైల శిఖర ప్రోద్భూత భూజాత ప
త్రా వేశోన్నత భీమ రూపధర దేవాగమ్య హేమాచలం.
(గి. క. 1-48)

ii) భీమ తే పూర్వ పశ్చిమకె పర్విద పర్వత రాజ నొప్పు సం. (గి.క.1-50)

వర్ణించుచు పూర్వ పశ్చిమాంబోధుల వరకు విస్తరించి దీవితో గొప్ప గుహాలతో పర్వతములతో, వృక్షములతో భీమరూపుడైన హిమవంతు డుండెనని హిమవంతుని స్థిరమైన భీమరూపమును చిత్రించి కాళిదాసు ననుసరించెననుట స్పష్టము.

కనుక హరిహరుడు కాళిదాసుని ప్రథమ సర్గలోని విషయములను ప్రబంధ రచనా ధోరణిలో కావ్యలక్షణముల పాటించుచు రచించినను కాళిదాసు ననుసరించెనని తెలియును.

శ్రీనాథుడు హరవిలాసమున కాళిదాసుని హిమాలయ పర్వత వర్ణనమును తత్ప్రాంతపు గుహాలను కింపురుష దంపతుల విహారానుగుణ మగు దరీ గృహములను తృతీయ చతుర్థాశ్వాసములందలి గౌరీ కల్యాణ ద్వితీయ విలాసమున ననువదింప పంచమాశ్వాసమున దేవదారు వన విహార వృత్తాంత సందర్భమున, దారువనము హిమాలయములకు దక్షిణ భాగమున నున్నదని సమయోచిత వర్ణనా ప్రజ్ఞచే ననువదించెను.

ఉదా : ప్రథమసర్గ ప్రథమ శ్లోకమును, '17' వ శ్లోకమును,

"వృద్ధ కచ్ఛప రాజుపీ పంక్తి పీఠంబు
సురతరంగిణి దెల్లి శిరసుపాగ. (హర-5-30)

అను పద్యమునందును '8', '14' శ్లోకములందలి భావమును

అందు విహరించుగాంచన
కందర మందిరములందు గౌతుక మొప్పన్
బృందారక మిథునంబులు
కందర్ప విహారముల బగల్లును రేలున్. (హర-5-21)

అను అనువదించెను. అట్లే ప్రథమ సర్గలోని పెక్కు శ్లోక భావములనే శ్రీనాథుడు 22, 23 పద్యములలోను, 27 వ వచన భాగములోను పంచమాశ్వాసమున అనువదించెననుట సుస్పష్టము.

మేనా హిమవంతుల వివాహము, మైనాక జనన వివాహాదుల ప్రసక్తి యిందు లేదు, అట ద్వితీయ సర్గలోని తారకాసురుని దర్పము, విజృంభణము, హరవిలాసములో తృతీయాశ్వాస ప్రారంభమున కలదు. అట తారకాసురునిచే వోడిపోయిన దేవతలింద్రునితో సత్యలోకమునకు పోయి బ్రహ్మను ప్రార్థించి స్తుతింపగా వారల దీన స్థితికి కారణ మరయగోరగా బృహస్పతి తారకునిచే తాము పడినపాట్లను వివరించు నప్పుడు తారకుని దర్పము వివరింప బడినది. తారకుని వలన బృందారకులు పడిన యవస్థలు (హర. 3-10) దేవతలు బ్రహ్మతో మొర పెట్టుకొను సందర్భమునందలి పద్యములు శ్రీనాథుడు స్వతంత్రముగ రచించెను.

బ్రహ్మస్తుతి అట 15 శ్లోకములలో నుండగా హరవిలాసమున భక్తి ప్రపత్తుల తెల్పుట కనువుగ కంఠస్థము చేయ వీలగునట్టి ఒక దండకమును శ్రీనాథుడు రచించెను. ఇందు 4, 5 శ్లోకములకు మాత్రము యథానువాద మొనర్చెను. అనగా 15 శ్లోకముల భావము సంగ్రహింప బడినది.

దేవతల పాట్లు అట ఒక్కొక్కరి గూర్చి ఒక్కొక్క శ్లోకమున నుండగా నిట మాఘుని శిశుపాలవధలోని 'విశాన్త నారీ పరిభాన'

శ్లోకానువాద మొనర్చియు తదితర పద్యములను స్వతంత్ర పద్ధతిలో బృందారకుల అవస్థలను వివరించెను.

మొత్తము మీద ప్రథమ ద్వితీయ సర్గల శ్లోకములను పంచమాశ్వాస తృతీయాశ్వాసములందు యథానువాద మొనర్చియు, ఇతి వృత్తాను పూర్వకత పాటించియు, స్వతంత్రతను ఆంధ్రీకరణమునందు ప్రకటించిన వాడు శ్రీనాథుడు.

ii) పార్వతీ తపోవిధాన ఘట్టము :

పంచమసర్గలోని

యదాఫలం పూర్వ తస్సమాధినా
న తావతా లభ్య మమంస్త కాంక్షితమ్
తదాఽనపేక్ష్య స్వ శరీర మార్దవం
తపో మహత్ సా చరితుం ప్రచక్రమే. (కు. సం-5-18)

అని సాధారణతపము మాని పార్వతి కఠిన తపమును శరీర మార్దవమును లెక్కింపక,

శుచౌ చతుర్ణాం జ్వలతాం హవిర్భుజాం
శుచిస్మితా మధ్యగతా సుమధ్యమా,
విజిత్య నేత్రప్రతి ఘాతినీం ప్రభా
మనన్య దృష్టి స్సవితార మైక్షత (కు. సం-5-20)

శుచిస్మితయై సుమధ్యయైన పార్వతి వేసవి కాలమున నాలుగగ్నులందే గాక యైదవ మగ్నియగు సూర్య తేజాగ్నికి - అనగా పంచాగ్ని మధ్యమందు తీవ్ర తప మొనర్చినట్లుండ, హరిహరుడు-

i) "పంచాగ్ని నడువగె జెవిపుళ తపదోళ్" (గి. క. 9-9) అనియు

ii) "మిగె సుత్తీర్ణ దవాగ్ని కాయ్వరవికాంతోచ్చాగ్ని యత్యుష్ణమం
నగపుత్త్రి యుదరాగ్ని మేగె కవితర్పాదిత్య తీవ్రాగ్ని బం
దొగెదా బేసగె యగ్ని యెం దినిసి తోరుత్తిర్ప పంచాగ్ని మ
ధ్య గతాంఘ్రి ప్రనిందళుగ్ర తపదొల్ శర్వాణి యుద్యగ్ర దిం.
(గి. ౪-9-10)

అను పద్యములందు యథానువాద మొనర్చెను. మూల శ్లోకములోని నాల్గగ్నులను ఐదవది యగు సూర్య తేజస్సును కలుపుకొని పంచాగ్నులను గూర్చి ప్రపంచించెను. అనగా పార్వతి చుట్టు పంచాగ్నులు, దావాగ్నులు, సూర్యకాంత శిలల ఉష్ణము అత్యుష్ణమైన జఠరాగ్ని, నడినెత్తి మీది సూర్యుని ఎంత తీవ్రత అందునను వేసవి ఎంత ఆమెను బాధింపలేవని శర్వాణి యట్టి యుగ్ర తప మొనర్చెనని వర్ణితము-హారవిలాసమున-

"పాశుపత దివ్య దీక్ష జేపట్టె గౌరి" యనియు,
"పాశుపత దివ్య దీక్షా విభాసమాన
దివ్య తేజో విశేష సందీప్త మూర్తి" (హార.4-10, 13)

అను పద్యములలో శ్రీనాథు డీశ్వరార్చన కళాశీలత్వమును ప్రకటించుచు గౌరికి పాశుపత దీక్ష నిప్పించినను ఆమె కఠోర తపమును వర్ణించునపుడు కాళిదాసు ననుసరించిన విధానము-

"ఇవ్విధంబున నబ్బింబాధర శిఖరంబుల యందలి హరిణ కిశోరంబులకు నరణ్య బీజాంజలి దానంబునుం దరులతా కుంజంబులకు నిర్ఝర సలిల ధారా సేకంబును నొనర్చుచు, గృష్ణా జినోత్తరా సంగవతియు, సర్వాంగ భసితాభ్యంగన మంగళ స్నానయునై కొంతకాలంబు గడపి కాంక్షితంబు కడగానక తెంపుసేసి మండు వేసవిం గనగన మండు నగ్ని కుండంబు నడుమన నిలిచియు, మధ్యాహ్నకాలంబున నర్క మండలం బాలోకించియు......దుష్కరంబైన తపం బొనర్చెనని (హార-4-14) వర్ణితము.

iii) పార్వతీ వటు సంవాద ఘట్టము :

కిమిత్య పాస్యా భరణాని యౌవనే
ధృతం త్వయా వార్ధకశోభి వల్కలమ్,
వద ప్రదోషే స్ఫుట చన్ద్ర తారకా
విభావరీ యద్యరుణాయ కల్పతే. (కు. సం-5-44)

అను శ్లోకమును పోలిన కన్నడ పద్యము కాళిదాసాను సరణమునకు తార్కాణము.

ఎళిదళిరింగళ సోంకిం
గళవడళ్కువ శిరీష సుకుమారాంగం
బళవత్కర్క శతర దిం
బళిసి ర్దీ నారసీరె గాంతుదు చిత్రం. (గి. క. 9-103)

పై శ్లోకమందలి 'వల్కల' శబ్దానువాదమును, "లేతవెన్నెలను గూడ ఓర్చుకోలేని పువ్వు సుకుమారమైన నీ దేహాంగములు అతి కఠినమైన నారచీరలు గట్టుటకు ఎట్లు సమ్మతించినదో చిత్రముగా నున్న" దనుటలో నితరత్ర శ్లోక భావములను గ్రహించెను.

హార విలాసమున పై శ్లోకానుసరణమును వచన భాగమున శ్రీనాథుడిట్లానర్చెను.- "నిండు జవ్వనంబునకుం దగిన విభూషణంబులు తొలగం బెట్టి వార్ధకోచితంబులగు వల్కలంబు లెట్టుల ధరించితివి?

కాళిదాసుని

దివం యది ప్రార్థయసే వృథా శ్రమః
పితుః ప్రదేశా స్తవ దేవ భూమయః
అథోప యన్తారమలం సమాధినా
న రత్న మన్విష్యతి మృగ్యతేహి తత్ (కు. సం-5-45)

అను శ్లోకము యథానువాద మొనర్చిన విధము-

"దేవలోక నివాసంబున కానపడెడేది నది వృథాశ్రమంబు; నీ పుట్టినిల్లు దేవ భూమియకదా ? తగిన వరునిం గామించి సమాధి వహించితివేని నదియు నీకుం దగదు. రత్నంబొరునిచే నన్వేషింపబడు గాని యొరున న్వేషించునే." (హర. 4-24)

iv) తపోవన ఘట్టము :

నందీశ్వరుని ఆజ్ఞచే స్తంభించిన తపోవనమును కాళిదాసు-

నిష్కంప్ప వృక్షం నిభృత ద్విరేఫం
మూకాండజం శాన్త మృగార ప్రచారమ్,
తచ్ఛాసనాత్ కానన మేవ సర్వం
చిత్రార్పితారంభ మివా వతస్థే. (కు. సం. 3-42)

అని వర్ణింపగా హరిహరుడు అట్టి నిశ్శబ్ద తపోవనమును, మన్మథ ప్రవేశమును ఇట్లు వర్ణించి మూలము ననుసరించెను.

వ :- నందీశ్వరం మోహాన బలద సుధారసమయ సునాదమం భోంకనె కేళ్దం తుతె కంపిసి కరణం కలంకి కించిత్ సంచలన మననాగి చెల్గిద చిత్తమం మెల్లమెల్లనె సంతమిసికొండు శివజ్ఞానదిం దెళ్పత్తు కద్దారదు మన్దిర్ద బలమం కండు

అలమల్లళి గొండవు కో
కిల నికరం బ్యాకులాంగ మాదువు చంద్రం
కళె గుంది కంది దం కో
మళె యన్ విహ్వాళ విధాన మాన సరాధర్.

కీర తరంగ మోడిదివు చూతగ జావళి గీళి దుత్తె కాం
తారబొళ్దియ బిళ్దవు సమీర నడంగి దనా వసంత కం

ఘోర వసంగళోళ్ పుగుతెమొయరదం కలహంస మాలె శా
సార దొళంజు పొక్కువు రథాంగ రథం నడగెట్టు వద్భుతం.
(గి. క. 8-8, 10, 11)

హారవిలాసమున నదే ఘట్టము -

ఆ శిలాదనందను దివ్యశాసనంబున గాననం బెల్ల నిష్కంప వృక్షంబును, నిభృత ద్విరేఫంబును మూకాండజంబును, ప్రశాంత మృగ ప్రచారంబునై "చిత్రార్పితావస్థానంబునుం బోలె" అను వచన మున (3-64) యథానువాద మొనర్పబడియు,

వయ్యముగాగ భూమి బడవైచె నిలింపులు చూచి బెగ్గిలన్.
(3-66)

అనియు,

"మనోభవుండు ముక్కంటి యెదుటి జక్కటిగాని యొక
పక్కియగా, బురశ్శ్మక్రంబు నడచు వాడునుంబోలె మనుబునం
జంకుచు..." అమ్మాల శౌర్యసంపదల్,
బాణముల వడవేసినట్లు యథాతథముగ ననువదించెను.

v) మన్మథ విజృంభణము :-

మోహనాస్త్రమేసి సుంకించిన మన్మథుని వర్ణన కుమారసంభ వమున నిట్లున్నది :

"స దక్షిణాపాఙ్గ నివిష్టముష్టిం నతాంస మా కుంచిత సవ్యపాదమ్,
దదర్శ చక్రీకృత చారుచాపం ప్రహర్తు మభ్యుద్యత మాత్మ
యోనిమ్." (3-70)

శివుని మార దర్శనము నిట్లు హరిహరుడు వర్ణించెను -

పసిరిసి పర్చిన సీడడి
కుసిదంగం సీళ్ద దండనె గదె భుజాగ్రం
కుసుమ శరాంకుచిత కర
మెస దిర్దువు దృష్టి ముష్టి శరసంధానం. (గి. క. 8-24)

ఇంకు కుంచించిన శరీరముతో ఎక్కు పెట్టిన వింటితో కూడిన భుజ ముతో నున్న మారుని శివుడు చూచినట్లు మూలవిధేయానుసారిగనే వర్ణితము.

హరవిలాసమున -

"కట్టెదుర దక్షిణాపాంగ నివిష్ట ముష్టియు నాతతాంగుడును నాకుంచిత సవ్యపాదుండును జక్రీకృత శార్ఙ్గకుండును బ్రహారోద్యుక్తుండునున్నైన" అని శ్రీనాథుడు మాతృకానుసారముగ ఆంధ్రీకరించెను.

vi) రతివిలాస ఘట్టము :-

కుమారసంభవములోని చతుర్థ సర్గలోని 14, 15 శ్లోకముల భావమును హరిహరుడు

"ఎల్లిత్తొ శశియు చెల్లాడె
ఎల్లిత్తో పూతనూత్న చూత గజంతా
నెల్లిత్తొ పంచ బాణము,
దెల్లిత్తో కుసుమ చాప విభ్రమ మాగళ్." (గి.క.8-63)

అని మాతృకానుసారముగ ననువదించెను.

హరవిలాసమున -

కోయిల నోరూరు క్రొత్త మామిడి మోక
నద పల్లవంబు బాణత్వముడిగె
శుక శారికలు గూడ శోక స్వరంబుల
బలదింప వొడగె చాపంబు గదిరి... (3-89)

అనియు

"మధురాలాప నిసర్గ పండితంబులకు గండుం గోయిలం నేలోకో
భువనంబులకు రాయబారంబు పంపవు?"... (3-91)

అను వచనమందు మూలానుసరణములు కన్పట్టుచున్నవి.

vii) ఇతర ఘట్టములు :

హరవిలాసమున ఇంద్ర మదన సంవాదమునందు మూడు నాల్గు శ్లోకముల నుత్తరార్థముల పరిత్యజించియు మూడు నాల్గు శ్లోకముల నొక సీసమున సంగ్రహించియు కథను వేగముగ శ్రీనాథుడు నడిపెను. ఉదా:

"కేనాభ్యసూయా పదకాంక్షిణా తే నితాన్త దీర్ఘైర్జనితా
తపోభిః" (కు. సం. 3-4)

అను శ్లోకపాదమును స్వీకరించి,

"ఎవ్వండు దీ పదం బెలమి నుద్దేశించి
యతి ఘోరమగు తపం బాచరించె" (హర. 3-44)

అని అనువదించెను. మదనుని వీరాలాపములు యథాతథముగ ననువదింపబడినది.

మన్మథ భస్మీకరణ, రతీవిలాప ఘట్టములు మూలానుసారులు.

viii) వేదోక్త వివాహ సంప్రదాయ వర్ణనము :

కాళిదాస కుమార సంభవమున గౌరీ శంకర కల్యాణమున వేదోక్త వివాహ సంప్రదాయములభి వర్ణితములు. మధు పర్కం, పాణి గ్రహణ అగ్ని ప్రదక్షిణ లాజహోమ, ధ్రువ దర్శన ఆర్ద్రాక్షతారోపణములను ముఖ్యవైదిక సంప్రదాయములను మాత్రమే కాళిదాసు కల్యాణ వర్ణనా ఘట్టమున ననుసరించెను. (కు. సం. 72-90) నప్తర్షులు

పెండ్లి పెద్దలై కన్యనడుగబోవుట, శివుని సప్త మాతృకల అలంకరించుట నిందు గలదు. హరిహరుడు భవానీ శంకరుల వివాహ మహోత్సవము నకు సప్తర్షులు పెండ్లి పెద్దలుగ వ్యవహరించుటాదిగ వేదోక్త వివాహ సంప్రదాయ వర్ణనములందును కాళిదాసు ననుసరించెను.

హరవిలాసమున వివాహ వర్ణనా ఘట్టము కాళిదాస కుమార సంభవానుసారియై యుండి సాదృశ్యముగ గల్గియున్నది.

పై విధముగ గౌరీ కల్యాణేతివృత్త గ్రంథములను పరిశీలింప సామ్యము లగపడుచున్నవి.

2.7.1. భేదములు :-

కుమార సంభవమునకు మారోదయ కావ్యప్రయోజనముగా గలది. పదునేడు సర్గల విస్తృత కావ్యమై తారక విజృంభణ, మన్మథ నిర్మథన, గౌరీ కళ్యాణ వృత్తాంతము లిందు ఆనుషంగిక వృత్తాంతము లైనను విపుల ధోరణిలో వర్ణితములు కుమార జననానంతరము భవానీ శంకరుల శృంగార లీలలు, తారక వధోపాయము, తారక వధ, ఆదిగా గల వృత్తాంతము లిందు గలవు. రసోత్కర్షచే ప్రతిభాసితమై ఉత్తమ కవితా శైలితో నొప్పుచు కావ్యరాజమై సంస్కృత వాఙ్మయమున పంచ మహాకావ్యములలో నొకటై విరాజిల్లుచున్నది.

కన్నడ గిరిజా కళ్యాణము దశమా శ్వాస పరిమితి గల్గి ప్రబంధో చిత అష్టాదశ వర్ణనలతో గిరిజా కళ్యాణమే ప్రాధాన్య విషయముగా గల్గి కుమారోదయ సూచనముతో శివభక్తి ప్రపూతమైన హరిహరుని ఉత్తమ కావ్యము.

హరవిలాసమున శ్రీనాథుడు కాళిదాస కుమార సంభవేతి వృత్త ముగు గౌరీ కల్యాణము వరకు స్వీకరించి మాతృకానుసారాను వాద మొనర్చి శివ ఈశ్వరార్చన కళాభిరతి నటనట వ్యక్త మొనర్చెను. తృతీయ చతుర్థాశ్వాసములందు గౌరీ కల్యాణము శివ ద్వితీయ విలాస ముగ కుమారోదయమప్రాధాన్యముగ నభి వర్ణితమైన కావ్యము.

కుమార సంభవమున తారకాసురుని విజృంభణమును గూర్చి బృహస్పతి బ్రహ్మ దగ్గరకు వచ్చినట్లు చెప్పగా బ్రహ్మ ఈశ్వరాంశ సంభూతుడే తారకుని వధింపగలడని ఉపాయము చెప్పినట్లుండగ గిరిజా కళ్యాణమున నా విషయము వదలి వేయబడినది.

విష్ణువు మదనుని శివతపోభంగ మొనర్ప మన్నట్లును, మూల మున లేని ఇంద్ర తారకాసుర యుద్ధ వర్ణనము చేసియు, ఇంద్ర బ్రహ్మ బృహస్పతులు తారకుని కడకు రాయబారము పంపినట్లును హరిహరుడు ప్రబంధోచిత వర్ణనల కనువుగ మార్పులు గావించెను.

రామాయణ మహాభారత శివసార మన్స్య బ్రహ్మ సౌందర పురాణాంతర్గతమగు గిరిజా కల్యాణ కథను స్వీకరించి కల్యాణము వరకె యితి వృత్తమును పరిమితి యొనర్చి వివాహలీలకే ప్రాముఖ్యమును కుమారోదయమున ప్రాధాన్యముగను ఎంచి హరిహరుడు రచించెను. శాంకరీ శంభుల వివాహానంతర కామకేళీ విలాస వర్ణనముల పరిత్య జించుట, కుమారజనన, తారకవధల సూచించుట, ఈ కావ్యమున గల ప్రత్యేకతలు.

పార్వతి హంపిలో తప మొనర్చుట, శివుడు కన్నడనాడులోని హేమకూటమున తప మొనర్చుట, పార్వతిని సఖులతో హిమవంతుడు విమానమున పిలిచికొని పోవుట - హరిహరుని ప్రబంధోచిత స్వస్థలాభి

మూన కల్పనములు. వాత్సల్యమూర్తి యగు హిమవంతునిచే పార్వతి యౌవన వర్ణన మొనర్చుట అతడు నారదునితో పాటుగ చంద్రికా విహార మొనర్చుట ఈ కావ్యమున అనౌచిత్యము లనవచ్చును.

మన్మథుడు నిరస్త ధైర్యుడై అగజను శరణు వేడుట, విష్ణువే మదనుని శివ తపోభంగ మొనర్ప పంపుట, కలహప్రియుడైన నారదుడు శివ తపోభంగ ఘట్టమున నుండుట, పార్వతీదేవి రతీదేవి నోదార్చుట - హరిహరుని కల్పనములు.

వివాహవర్ణన యందు కుమారసంభవములో సామ్యముగపడు చున్నను సంప్రదాయ కలాపముల వర్ణించు ఘట్టమున దాక్షిణాత్య పద్ధతితో ప్రాంతీయాభిమానము ప్రకటించుచు మెట్టికి, తెర, నాంది, తలంబ్రాలు, కన్యాదానము, పూర్ణాహుతి సప్తపది, బువ్వపు బంతి, తాంబూల చర్వణము చతుర్థ దినపు వేడుకలను హరిహరుడు వర్ణించెను. వేదోక్తముగ ఎదుర్కోలు, అప్పగింతలు, వసంతోత్సవములను కార్యకలాపములను సైతమీతడు వర్ణించెను.

ఈతని వివాహ వర్ణనము విపులమై స్వతంత్రమై నాటి సాంఘిక ఆచార వ్యవహారములకు దర్పణమై మూలభిన్నమగు వివాహ కార్య కలాపములతో నొప్పి యున్నదనవచ్చును.

శ్రీనాథుడు ఇతి వృత్తమును కల్యాణము వరకు పరిమిత మొనర్చి గౌరీ కల్యాణ నామకరణముచేసి దాక్షిణాత్య వివాహ విధాన సంప్ర దాయముల ననుసరించి ఫలశ్రుతి, కుమారోదయ సూచనా వర్ణనము లొనర్చి భవానీ శంకరుల కామకేళీ విలాస వర్ణన పరిహార మొనర్చు టలో హరిహరుని అనుసరించెననవలెను.

శ్రీనాథుడు మాతృకానుసారముగ ఉమాశంకరుల వివాహ వర్ణనము లొనర్చియు, దాక్షిణాత్య వివాహ సంప్రదాయానుసారియై హరిహారునివలె ఎదుర్కోలులు, తెర, కన్యాదాన వధూవరుల అలంకరణములను ముత్తైదువ ప్రార్థన, కులదేవ ప్రార్థన, ఊర్ణా కౌతుక హస్త సూత్రబంధనాదికములను వర్ణించెను. ఇట్లు కుమార సంభవ, గిరిజా కల్యాణ, హరవిలాసముల తులనాత్మకముగ పరిశీలించుటతో ఇతివృత్తానుసరణమున్నను ఇతివృత్త పరిమితిలోను, అనుపూర్వికతలోను, సందర్భోచిత కావ్యవర్ణనలలోను, తదితర స్వల్ప విషయాదికములలోను సామ్య వైషమ్యములగపడుచున్నవని తేలినది.

---

# 3. దేవదారు వనవిహార వృత్తాంతము

**3.0. కథామూలము :-**

శైవకవులు 'దారుకావన విహారము'ను, శృంగార రసభావ భరితముగ పరమేశ్వరాలంబనముగ చిత్రించుట పరిపాటి. ఈశ్వర భక్తుడైన శ్రీనాథుడు హరవిలాసములో శివలీలగ పంచమాశ్వాసమున పురాణ ప్రథిత విషయమును కావ్యరీతిలో రచించి, ఔచిత్యమునకు, రసావిష్కృతికి లోపము రానీయక వర్ణించిన వృత్తాంత మిది. స్కాంద బ్రహ్మాండ వామన శివలింగ కూర్మ పురాణములందు మహాశివుని దారుకావన విహార వృత్తాంతము కలదు.[1] హరవిలాసము నందలి యీ కథకు పై పురాణములన్నియు మూలములే. కథాబీజమీ పురాణములన్నింటి యందును కలదు. శ్రీనాథునకు సమకాలీనుడని పేర్కొనబడుచున్న నిశ్శంక కొమ్మనామాత్యుడు శివలీలావిలాసములో పదునాల్గవ శివలీలగ 'దారుకావన విహారము'ను వర్ణించెను. దొడ్డారెడ్డికి అంకితమియ్యబడిన శివలీలావిలాసమున, శృంగార రసభావావిష్కరణము సుచ్ఛృంఖలమై కొనసాగినదని శ్రీ చిలుకూరు పాపయ్య శాస్త్రిగారు తెల్పిరి.[2] అప్సరల భిక్షావితరణ మొనర్చు సందర్భమున శ్రీనాథుడు సంస్కృతమున గల ఉత్ప్రేక్షావల్లభుని[3] భిక్షాటన కావ్యము ననుసరించెను.

---

1. స్కాంధ పురాణము, ఉత్తరార్ధం (శివ భా.) 38 అధ్యాయం, క్లైవ్‌రో, కలకత్తా - 1962.

   బ్రహ్మాండ పురాణము - పురాణ గాథాలహరి, పు-458.

   Vamana Purana - A Study, Prthvi Prakasam, Varanasi - 1974.

   శివ పురాణము - 12 అధ్యాయము, క్లైవ్‌రో, కలకత్తా - 2020.

   లింగ పురాణము, 29-38 అధ్యాయములు, క్లైవ్‌రో, కలకత్తా - 1960.

2. పాపయ్యశాస్త్రి, చిలుకూరి; భారతి, ఆగష్టు, 1958.

3. ఉత్ప్రేక్షావల్లభుడు - భిక్షాటన కావ్యము.

**3.1. భిక్షాటన కారణము :-**

బ్రహ్మ యొక్క పంచమ ముఖము ఒకానొక సమయమున శివుని నిందించెనట! అటుపిమ్మట శివుడు కాలభైరవుని పుట్టించి ఆ పంచమ శిరమును ఖండించెనట! బ్రహ్మ భయపడి తన పంచమ శిరమును శివుని దగ్గర పడునట్లును, ఆ కపాలముతో శివుని భిక్షాటన మొనర్చుమని కోరి నట్లును స్కాంద శివపురాణములు తెల్పుచున్నవి.[4] శివుడు బ్రహ్మ హత్యాదోషము తొలగించుకొనుటకై కపాల భిక్షకు దొరకొనెనని తెలియుచున్నది. మరియు స్కాందపురాణముననే పార్వతి శివుని దారు వనమునగల స్త్రీల పాతివ్రత్యమును ధ్వంస మొనర్చుమని కోరగా, అట్లు కూడదని శివుడు వాదించియు పిమ్మట పార్వతి కోరిక ననుసరించి శివుడు దారువనమునకు కపాలధారియై వెళ్ళినట్లు వర్ణితము.[5]

స్కాంద పురాణ మహేశ్వర ఖండమున ఋషి పత్నులం కైలాస వాసియగు శంకరుడు ఏకాకియై భిక్షుకై తిరుగుచుండగా ఋషిపత్నులు నీవెవరని ప్రశ్నింపగా తాను దాక్షాయణీ విరహముచే విరక్తితో మన శ్శాంతి లేక సంకల్పరహితముగా దిగంబరునిగా తిరుగుచున్న శివుడనని బదులు చెప్పినట్లు కలదు.[6]

లింగపురాణమున మహా శివుడు మునులను పరీక్షించుటకు దేవ దారువనమునకు వెళ్ళినట్లు కలదు. అచట వారి ప్రవృత్తి మార్గ నిష్ఠను పరీక్షించి నివృత్తి మార్గములో ఆశీర్వదించుటకు వెళ్ళినట్లు వర్ణితము.[7] (నివృత్తి లక్షణ జ్ఞాన ప్రతిష్ఠార్థమ్).

---

4. శ్రీనివాస శర్మ, వేమూరి, పూర్వగాథాలహరి; పు. 458, 1976
5. స్కాంద మహా పురాణము; ఉత్తరార్థము 5వ భాగం. 1962 – "తాసాం త్వం మదనో భూత్వా చారిత్రం క్షోభయ ప్రభో."
6. విశ్వనాథ శర్మ, పరిపెల్ల; స్కాంద పురాణము – 1975.
7. లింగ పురాణము; 29 అ – 88 అ.

శివపురాణమున లింగోత్పత్తి కారణ సందర్భమున శివుడు దారుకావనమున మునులను పరీక్షించుటకు వెళ్ళినట్లు కలదు.[8] భిక్షాటన కావ్యమందు శివుడు తన ప్రభుత్వ నిర్మాణలోపముచే గ్రామములలో భిక్షాటన మొనర్పవలసి వచ్చెనని, స్త్రీలు అతని భిక్షాటనచే నీతి వచనములచే భక్తిపరవశులైనను, శివుడట్లు 'దేహి' యని వచ్చుట తన్ను తాను హింసించుకొన్నట్లుగ భావించునట్లున్నది.[9] హరవిలాసమున

> "అఖిల లోకేశ్వరుడు మామ యాత్మలోని
> విసువుఁ జారజనంబుల వేసటయును
> ప్రమథ గణములు సేయు ధౌర్త్యంబు నెఱిగి
> దారుకావని కరుగంగ దలచె నపుడు." (హర. 5-18)

మామగారిపై కోపముతో దారుకావనమునకు వెళ్ళినట్లు వర్ణితము. ప్రమథ గణముల ధౌర్త్యము, శివుడత్తగారింటిలో మనుగుడుపులం దున్నప్పుడు జరుగునట్లును, హిమవంతుడు -

> ఎ.గీ. తమ్మిపూ చూలి పునుక కంచమ్ము సాచి
> దిట్టతనమున బిచ్చము దేహియనుచు
> వాడ వాడల భిక్షించు కూడుగొని
> యిట్టి దివ్యాన్నములు మెచ్చునే శివుండు (హర. 5-16)

అని విసుగుకొనుటలో శ్రీనాథుడు పురాణ ప్రథిక ధోరణిని గాక, కావ్య ధోరణిలో వర్ణించి, నూతనత్వమును, అనూనమగు కల్పనాశక్తిని ప్రదర్శించెను. స్కాంద పురాణములో వలె "సంయమి వధూపాతివ్రత్య భంగంబు తనకుం బరమ ప్రయోజనంబుగా" - (హర. 5-53) నున్నట్లు శివభిక్షాటనకు ప్రయోజనము తెల్పబడినది.

---

8. శివ పురాణము; చతుర్థ భాగము; అ; పుట. 662 - 663.
9. త్రైశిక్షావల్లభుడు - భిక్షాటనము, దశమి పద్ధతి.

ఇట్లు పురాణములందును, కావ్యములందును శివభిక్షాటనకు గల కారణములు భిన్నములు. శ్రీనాథుడు గ్రహించిన కారణము సహజముగా నున్నది.

3.2. అనుసరణములు :

3.2.0. కాళిదాస కుమార సంభవము - హరవిలాసము.

శ్రీనాథుడు దారుకావనమును వర్ణించుటకు మునుపు అది హిమవత్పర్వతపు దక్షిణ సీమలో సంసిద్ధమై మునిజన సంసేవ్యమానమని వర్ణించుచు హిమాలయమును తత్సమీపమునగల గుహాలను, అరణ్యములను వర్ణించునపుడు కాళిదాస కుమార సంభవము ననుసరించెను.

పంచమాశ్వాసమున 20 వ సీస పద్యపు రెండవ పాదమున

"పృథివ్యా ఇవ మానదణ్డః" — (కు. సం. 1-1)

పాదమును బట్టి భూమికి కొలకఱ్ఱయో యున్నట్లుండె నన్న ఉత్ప్రేక్షను స్వీకరించి,

"మహీ మండలమునకు మానదండము మేను" —

(హర. 5-20)

అనియు, తదితర పూర్వార్థ పాదమగు -

"పూర్వాపరౌ వారి నిధీ విగాహ్యస్థితః" —(కు. సం. 1-1)

"పూర్వాపరాబ్ధులు పొరుగుటిండ్లు" — (హర. 5-20)

అని యథానువాద మొనర్చెను. సప్తర్షులు హిమవంతుని యౌన్నత్యమును, ఉదారగుణమును పొగడు సందర్భమునందలి -

"యథైవ శ్లాఘ్యతే గంగా పాదేన పరమేష్ఠినః,
ప్రభవేణ ద్వితీయేన తథైవోచ్ఛ్రిరసా త్వయా" —

(కు. సం. 6-70 శ్లో.)

శ్లోక భాగమును,

'మూర్ధ్ని గంగా ప్రపాతేన,' — (కు. సం. 6-57 శ్లో.)

అను శ్లోకభాగమును గ్రహించి శ్రీనాథుడు -

"సుర తరంగిణి వెల్లి శిరసు సోఁగ" — (హర. 5-20)

అని అనువదించెను. అంతేగాక,

"యజ్ఞాంగ యోనిత్వమ వేక్ష్య యస్య సారం ధరిత్రీ ధరణక్షమం చ,
ప్రజాపతిః కల్పిత యజ్ఞభాగం శైలాధి పత్యం స్వయమన్వ
తిష్ఠత్" — (కు. సం. 1-17 శ్లో.)

అను శ్లోకభాగమును,

"యజ్ఞభాగ భుజాం మధ్యే పద మాతస్థుషా త్వయా" —
(కు. సం. 6-72 శ్లో.)

అను శ్లోకభాగమును గ్రహించి శ్రీనాథుడు -

"పాలనీయ మశేషశైల సామ్రాజ్యంబు
యాగ హవిర్భాగ మోగిరంబు." (హర. 5-20)

అని అనువదించి హిమవంతుని యఖండ శైల సామ్రాజ్యమును, యాగ హవిర్భోక్తృత్వమును పేర్కొనెను.

పైగా, స్థానేత్వాం స్థావరాత్మానం' అను (కు. సం. 6-67 శ్లో.) కాళిదాసు వాక్యముల నాధారముగ గొని హిమవంతునకు స్థావర జంగమ రూపముల కల్పించుచు,

"మాల్యవన్మేరు కైలాస మలయ సహ్య
గంధమాదన మందర క్రౌంచ వింధ్య
భూ ధరంబులు చుట్టాలు పొగడదరము
సకల గుణధాముఁ బర్వత సార్వభౌము." (హర. 5-20)

అని శ్రీనాథుడు పర్వతరాజున కొక రూపకల్పనము నద్భుతముగ చేసెను.

అశ్లో

"యత్రాంశుకాక్షేప విలజ్జితానామ్" - (కు. సం. 1-14 శ్లో.)

అను శ్లోకభావమును శ్రీనాథుడు -

అందు విహరించు గాంచన
కందర మందిరము లందు గౌతుక మొప్పన్
బృందారక మిథునంబులు
కందర్ప విహారముల బగళ్లును రేలున్. (హర. 5-21)

ఎంచి నుతింప శక్యమె మహీశ్వరు సంతతి వానికైన
రత్నాంచిత రోచి రుద్గమ నిరస్త రవీందు మరీచిజాలమున్
గాంచన కందరాయ వనికాయిత వారి ధరాంతరాళ ని
ర్వంచిత దేవతా మిథున వాంఛిత మూలము శీతశైలమున్.
(హర. 5-22)

అను పద్యములలో అనువదించుచు శృంగార రసభావభరితముగ వర్ణించెను.

కాళిదాసుని -

యం సర్వశైలాః పరికల్ప్య వత్సం మేరౌ స్థితేదోగ్ధరి దోహదక్షే,
భాస్వంతి రత్నాని మహౌషధీశ్చ పృథూపదిష్టాం దుదుహుర్ధ
రిత్రిమ్ - (హర. 5-23)

అను శ్లోకమును శ్రీనాథుడీ క్రింది విధముగ యథానువాద మొనర్చెను.
దీనిచేత హిమవంతుని శైలరాజత్వము రత్నసంపద స్థిరపడినది.

హేమశైలంబు దోగ్ధగా భూమి సురభి
నఖిల రత్నౌషధులను గల్పాది యందు
బృథు మహారాజు పంపున బతికె నెలమి
మంచుకొండను నెయ్యగావించి గిరులు. (హర. 5-23)

"పదం తుషార స్రుతి ధౌత రక్తం యస్మిన్నదృష్ట్వాఽపి హత
ద్విపానామ్." (కు. సం. 1-6)

అను శ్లోక భాగమునే శ్రీనాథుడు

ఆమోదంబునఁ వేటలాడుదురు నీహారాద్రి కాంతార రే
ఖా మధ్యంబున చాపటలంకృతులతో గంధ ద్విపశ్రేణులన్
క్షామక్షామ మనోజ్ఞ మధ్యములు గుంజా భూషణాలంకృతల్
వ్యామ గ్రాహ్య పయోధరల్ శబర సేనాధీశ సీమంతినుల్.
(హర. 5-24)

అను పద్యముగ రచించి, కిరాతులు ఏనుగులను వేటాడుటను మాత్రమే గాక వారి యందమైన స్త్రీల గుంజాభూషణములను అందమైన సన్నని నడుములను వర్ణించెను. అంతటితో తృప్తిపడక 26 (5 ఆ) పద్యములో ఆటవిక స్త్రీలు సైతము ధనువు చేపట్టి వింటిని ప్రయోగింతురని ఆ ప్రయోగాలు తుహిన పర్వతములందు మారుమ్రోగుననియు వర్ణించెను.

పైవిధముగ శ్రీనాథుడు కాళిదాస కుమార సంభవములోని ప్రథమ షష్ఠ సర్గములలోని పెక్కు శ్లోకములను గ్రహించి, హరవిలాస పంచమాశ్వాసమున 20 మొదలు 26 పద్యముల వరకు హిమవత్పర్వ తౌన్నత్యమును, అందలి కందరములను ఆటవిక జనులను గూర్చి వర్ణిం చుచు యథానువాదము చేసి భావస్వీకారమును కూడ గావించెను.

మరియు 27 వ సంఖ్యగల వచనమునందును హిమవత్పర్వత గుహలు గంగానదీ నిర్ఝరములచే ప్రతిధ్వనించునని వనమహిషమ్ముల వలన జారిన కొండరాళ్లతోను, శబరస్త్రీల యలంకరణల కుపయోగ పడు రంగురంగుల గైరికా శిలాచూర్ణములతోను, కిన్నర మిథునము లుండు పొదరిండ్లతోను, గంధర్వస్త్రీలు వాయించు వీణవాద్య సంగీత

మునకు మురిసిన కురంగములతోను, దట్టమగు తమాల వృక్షములతో నొప్పియుండునని[10] హిమవత్పర్వత శోభను చక్కని శైలితో వర్ణించుట యందును శ్రీనాథుడు కాళిదాసు ననుసరించెను.

### 3.2.1. ఉత్ప్రేక్షావల్లభుని భిక్షాటన కావ్యము - హరవిలాసము

భిక్షాటన కావ్యకర్త పేరు గోకులుడని ఆతడే శృంగార రస ప్రధానమగు సుందరీ శతక కర్తయని ఉత్ప్రేక్షావల్లభుడనునది బిరుద నామమని తెలియుచున్నది.[11]

"శ్రీ గోకులస్య సుకవేః ఉత్ప్రేక్షా వల్లభే త్యభిధా"

ఈ గోకుల కవి యొక్క కాల దేశములు తెలియుటలేదు. కాని శ్రీనాథుని హరవిలాసములోని దేవదారు వనవిహార వృత్తాంతమును పరికించినచో పెక్కు తావులందు ఉత్ప్రేక్షా వల్లభుని పోకడలు కాన్పించుచున్నందు వలన సంస్కృత కావ్యము శ్రీనాథునకు ప్రాచీనమనియే పలువురు భావించిరి.

కవి గావించిన భగవత్ప్రార్థనమును బట్టియే యా కావ్యోన్నత్యము తెలియనగును.

"కల్యాణ మావహతు వః శివయో స్తదేకం
గాత్రం యదీయ మసితచ్ఛవి కంఠమూలం
వామే తరేఽపి కురుతే సిత భాసి భాగే
ప్రారబ్ధ శైల తనయా పరిణామ శంకామ్.

కార్శ్యం తృణోతు భవతాం పరమేశ్వరస్య
భిక్షాటనం తదను సంహిత దేహి శబ్దం

10. కాళిదాసు, కుమార సంభవము, 1976, పు. 1-49.

11. సూర్యనారాయణ శాస్త్రి, మల్లాది, సంస్కృత వాఙ్మయ చరిత్ర; 1961.

యన్నాస్మి నాఽపి విధేర్విపరీత భావే
యాంచోక్తి దైన్య సహామేవ మనశ్చకార." (భిక్షా-1)

ఈ శ్లోకమునందలి కవిత్వ పటుత్వము అమోఘము. సుకవిస్తుతిని, కుకవినిందను కూడ ఈతడొనర్చెను.

శివుడు భిక్షాటనకై వచ్చిన సందర్భమున వివిధాంగనలు వివిధ భంగిమలలో భిక్షా ప్రదర్శనము చేయుట, శివునకు దూరమైనపుడు విరహావేదనతో తలపోయుట, మున్నగు అంశములను పురస్కరించుకొని ఈ కావ్యకర్త ఆ చేష్టలను నలుబది పద్ధతులుగా ఈ కావ్యమున చిత్రీకరించెను.

అవి కావ్యముఖము, మండన, మండన ప్రతిషేధ, నిర్గమన దర్శన అంగవర్ణన విలాస ఉత్తర ప్రత్యుత్తర భిక్షాప్రదాన, దీనోక్తి, పారవశ్య పారవశ్యోక్తి, విశ్లేషారంభ, ప్రశ్నోక్తి, అనుగమన, భిక్షాటన, రథ్యా చరిత, చరితోపలాలన, బంధువచన, అనురాగ, గురువచన విరహిణ్యవస్థ అతిదీనోక్తి ప్రయుక్తి ఉద్యాన చరిత ఉద్యానోక్తి శిశిరోపచార సఖ్యుపా లంభన, ప్రదోష, చంద్రోదయ, దూతీప్రేషణ దూతీవచన రజనీ యాపనోక్తి, స్వప్న, స్వప్నోక్తి గౌరీ ప్రశంసా పద్ధతులు.

కవి వర్ణించిన శివభిక్షాటనము, అందలి శృంగారము స్వర్గలోక మునకు సంబంధించినది.

"భిక్షాటనేన పురుహూత పురాంగనానా
మాకస్మికోత్సవ విధాయిని భూతనాథే,
తాసామనంగ శరజర్జర మానసానాం
నానావిధాని చరితాని వయం వదామః"

ద్వితీయ విధానమున చెప్పిన దానిని బట్టి ఆ కావ్యము దేవవేశ్యలకు నిలయమై పుష్కల శృంగారమునకు తావలమైనదని తెలియును. కవియే

"వృత్తం వసన్త తిలకం విషయః శివస్య
భిక్షాటనం కవి రసౌ శివభక్త దాసః
శృంగార ఏవహి రస స్తదిహ ప్రబంధే
శ్రద్ధానకస్య యది సూక్తి వినోదశీలః."(భిక్షా-అవతారిక)

అను శ్లోకమును శివభిక్షాటనము వసంత తిలక వృత్తములో శృంగార రసమే ప్రధానముగా గల ప్రబంధమని పేర్కొనెను.

హిమవంతుడు తన పైనను ధూర్త వర్తనము లొనర్చిన ప్రమథ గణముల పైనను విసుగు, కోపము ప్రదర్శింప మహాశివుడు దారుకా వనమందలి దేశవాటమునకు భిక్షకై పోవ రంభ తిలోత్తమ ప్రమ్లోచ, హరిణి, మంజుఘోషాది అప్సరలు వివిధములగు దివ్యాన్నములను, పాయస మధూకర భిక్షాన్నములను' అపాంగ రంగస్థల లాస్య లంప టంబులగు కటాక్ష వీక్షణములతోడ" సమర్పించిరి. దేహ సౌందర్యము ప్రస్ఫుట మగునట్లు ఒయ్యారముగ శృంగార రస తరంగిత దృష్టులతో అప్సరలు, మునిపత్నులు శివునకు భిక్ష నొసంగునప్పటి సందర్భమున శ్రీనాథుడు ఉత్ప్రేక్షా వల్లభుని భిక్షాటనకావ్యము ననుసరించెను.

హరవిలాస భిక్షాటన కావ్యములలో భిక్షాటన కార్యము సమమైనను కవులిద్దరును భిన్న ప్రయోజనోద్దిష్టులు అమరావతి అట రంగము కాగా, శృంగార పూరితమైన '40' పద్యములందు అమరావతీ స్త్రీలు మాయా శివుని సందర్శించుట, విమోహితలగుట అలంకార పద్ధతులు, ప్రేమ సల్లాపములు మున్నగు ప్రత్యేక భాగములు గల్గినది భిక్షాటన కావ్యము ఇట హరవిలాసమున దేవదారు వనమున మునిపత్నుల కావాసముగా గలిగి భవ్య శివ శృంగారమునకు నిలయమైనది. శ్రీనాథుని-దారుకా వనవిహారమందు లౌకిక శృంగారచ్ఛాయలు తొంగి చూచు చున్నది.

శబ్ద భావానుసరణము :

"కాచిత్కల క్వణితకంకణ మంజునాదైః
కశం స్వవీక్షణ పరం విదధే విదగ్ధా,
పుంసాం మనోభిలషి తేషు విలాసినీ నాం
ప్రాయేణ భూషణ రవః ప్రథమాభిలాషః

(భిక్షా. 19. విలాస పద్ధతి)

అను శ్లోకములోని 'కంకణ మంజునాదము'- మంజు ఘోష మదన వైరికి భిక్ష సమర్పించునపుడు" నూపుర భూషణ ప్రాధాన్యముగ "చిత్రరేఖ నూపుర మేఖలా కల కలంబును", రత్న కంకణ రవముగను, విలసిల్లిన వనుటకు ఈ క్రింది పద్యములుదాహరణములు.

1. కనక నూపుర ఝణత్కార నిక్వాణంబు
రవళి మట్టియలతో రాయిడింప. (హర. 5-45)

2. కనక నూపుర మేఖలా కలకలంబు
రత్న కంకణ రవముతో రాయిడింప. (హర. 5-51)

భావానుసరణము : అష్టమ దశమ పద్ధతులకు సంబంధించిన ఈ క్రింది శ్లోకముల ననుసరించి శ్రీనాథుడు మూడు పద్యములను రచించెను.

"స్రస్తోత్తరీయ మధునా కుచమండలం తే
పాణిద్వయేన పిదధాసి యదంబుజాక్షి!
తత్స్యాధు సంప్రతి పునర్విలయోజ్ఝితోఽస్య
తస్యామి సఖికేన... తిరస్క్రియాస్తు. (భిక్షా. 8-13)

సర్వాంగ వీక్షణ మనోభవ భాగ్య హీనా
మానం త్వమస్య గిరిశస్య కిమద్య కుర్మః

పక్షః స్థితే ప్రథమమనన్యదృశం మగ్న
ముద్ధర్తు మేవ నిపుణాసి యతస్త్వతో౽పి" (భిక్షా. 13-10)

1) క్రొంబట్టుఁ బసిండి సిబ్బెముల బయ్యెద కొంగొక కొంత జాతి చ
నట్టు లలాట లోచనుని కన్నులు మాటికి విందు సేయఁగన్.
(హార. 5-48)

2) సార దోర్యుగ్మలక మూలంకషంబులైన
వీగుఁబాలిండ్లు పయ్యెద వీడు కొలుప. (హార. 5-49)

3) చక్షూరాగ మెలర్పఁగా హారిణి నిశ్వాసంబుతో ముంగిటిన్.
(హార. 5-46)

భావదీప్తి నొకించుకేని తరుగ నీక శ్రీనాథుడీ పద్యముల రచించెను.

భిక్షాటన కావ్యమునందలి భిక్షా ప్రధాన ఘట్టమున

"ప్రత్యాలయం కృపణవజ్జగతామధీశ
దేహీతి దీనపద వాదిని భిక్షమాణే
వామభ్రువాం మనసి జావాస (శ) మానసానాం
భిక్షా ప్రదాన చరితాన్యపలాలయామః" (భిక్షా. 10-1)

అను శ్లోకములోని "మనసిజావా సమాన సానాం" అను శ్లోకభాగము హారవిలాసమునందలి

...నఖాంకుర ద్యుతులతో గీల్కొంచు మాణిక్యము
దాల్పింకార మయూఖ కందళ దళ వ్యాపారమేపారగన్.
(హార. 5-43)

అను పద్యమునందలి 'కందళ దళ వ్యాపారమేపారగన్' అను సమాన మునకు మూలముగ కనబడుచున్నది. రెండవ శ్లోకముగు-

"కాచిత్పురః పురంపోరతి సంభ్రమేణ
భిక్షామపాత్ర పతితా మవబుద్ధ్య సద్యః
అంతర్భయేన విదధే హృదయే కరాగ్రం
భిక్షాహమస్మి భవతో భగవాన్నితీవ" (భిక్షా. 10-2)

ఇందు సంభ్రమముతో భిక్షను పాత్రలో వేయుబోయి క్రింద వేసి భయ విహ్వాలయై ఆమె 'ఆ భిక్ష పోయిన పోనిమ్ము. నేను భిక్షగా ఉందును'. అన్నది. ఇట్లు ఆ స్త్రీ శృంగార భావముతో శివునకు తన్ను తాను భిక్షగా అర్పించుకొను సుకుమార భావమును గ్రహించి, రంభ 'నఖ రేఖలు బయలుపడగ' (హర. 5-44) రంభాామ్రఫలముల నిచ్చినదని శ్రీనాథుడు రచించెను.

భిక్షాటన కావ్యమున భిక్షాటన సందర్భమున వర్ణించిన వివిధ శృంగార చేష్టల నాధారముగా గొని భిక్షా ప్రదాన ఘట్టమున శ్రీనాథుడు నఖరేఖలు బయలుపడెనని, నఖాంకురద్యుతులు కెంగేలతో గీల్కొనె నని, కనక నూపుర ఝణత్కార నిక్వాణంబు రవళి మట్టియలతో రాయిడించెనని వాలారు గోళ్లపై రత్నాల దీప్తులు జాలువారెనని ఉరమున ముత్యాలహారములు మురుపు సేసెనని కమ్మల నిగనిగలు సీడలు చూపెనని, చక్షూరాగ మొలసెనని, కొంగొత్తకాంతి జారెనని, గాజులు గలగలలాడెనని, అపాంగ రంగస్థల లాస్యలంపటంబులగు కటాక్ష వీక్షణంబులతో పాటు, అప్సరలు వివిధములగు అమృత దివ్యాన్నములను మాధుకర భిక్షాన్నముల నొసగినట్లు వర్ణించెను.

భిక్షాటన కావ్యమందు వివిధ పద్ధతులు లౌకిక శృంగారమునకు మచ్చు తునకలు కాగా శ్రీనాథుని దారుకావన విహార వర్ణనమందు లౌకికచ్ఛాయలు తొంగి చూచుచున్నను మొత్తముమీద దివ్య శృంగార విలసితముగానే భాసించుచున్నదని యిట శ్రీమద్భాగవతము నందలి

కృష్ణ గోపికావాల్లభ్యము వంటి దానిని, పశుపశుపతి అభేద సాధనలో తత్త్వ విధిజ్ఞులు తిలకింతురని పండితాభిప్రాయము.

3.2.2 లింగ పురాణము - హార విలాసము.

మహాశివుడు మునుల పరీక్షార్థము దేవదారు వనమున మునుల ప్రవృత్తి మార్గమును నివృత్తి మార్గము వైపు మరలించుట కుద్యుక్తుడై నప్పుడు అతని రూపమును గాంచి మునిపత్నుల విచలితల నొనర్చినప్పటి వర్ణనము.

"వికృతిం రూప మాస్థాయ దిగ్వాన విమ మేక్షణః
ముగ్ధో ద్వి హస్తః కృష్ణాంగో దివ్యం దారువనం యయౌ,
మందస్మితం చ భగవాన్ స్త్రీణాం మనసిజోద్భవం
భ్రూ విలాసం చ గానం చ చకారాఽతీవ సుందరః"
సంప్రేక్ష్య నారీ వృందం వై ముహుర్ముహుర నంగ హా।
అనంగ వృద్ధి మకరోదతీవ మధు రాకృతిః (లిం. 29-10&11)

ఇట గల వికృత రూపమును శ్రీనాథుడు స్వీకరింపక నెల మిండ జంగమ స్వరూపమును వర్ణించినను, స్త్రీల నాతడు మందస్మితములతోను, భ్రూ విలాసములతోను, సుందర రూపముతోను, స్త్రీలకు అనంగ వృద్ధియగు నట్లొనర్చెనని వర్ణించుటలో లింగ పురాణమునే అనుసరించెను. అట మద ఘూర్ణిత నేత్రలై భ్రూ విలాస ప్రదర్శన మొనర్చుచు, ఆడి, పాడి పరవశ్యలైన స్త్రీల గూర్చి శ్రీనాథుడు యథా తథముగ ననుసరించినను శివపరముగ దానిని మార్చి రచించెను.

దరహాసంబుల భ్రూలతానటన ముద్రా విభ్రమ ప్రౌఢిమన్
బరిహాసోక్తుల భావ గర్భ రససంపత్తి స్ఫుటాలోకన

స్ఫురణాభంగుల మానికాంతిల మనంబుల్ చూర లాడెన్ మహే
శ్వరుడుద్దామ విలాస దారువనికా వాట ప్రదేశంబులన్
(హార. 5-53)

3.2.3. స్కాంద పురాణము - హారవిలాసము.

దారువనమునందలి పతివ్రతల చారిత్ర్యమును ధ్వంస మొనర్పు మని కోరిన పార్వతి యొక్క విచిత్రమైన కోర్కె ప్రకారము మహా శివుడు దారువనమునకు వెళ్లినప్పటి రూపము

"కృత్వా కాపాలికం రూపం యయౌ దారువనం ప్రతి
మహాహిత జటాజూటం నియమ్య శశి భూషణమ్।
కంఠత్రాణం పరం కృత్వా ధారయన్కర్ణ కుణ్డలే।
వ్యాఘ్ర చర్మ పరీధానో మేఖలా హార భూషితః।
నూపుర ధ్వని నిర్ఘోషైః కంపయన్నైవ వసుంధరామ్
మహా నూర్ధ్వ జటా మాలీ కృత్తి భస్మానులేపనః
కృత్వా హస్తే కపాలం తు బ్రహ్మణశ్చ మహాత్మనః
మహాడమరు ఘోషేణ కంప యన్నైవ వసుంధరామ్
ప్రభాత సమయే ప్రాప్తౌ మహాదారువనం ప్రతి"
(స్కా. అ. 33-27)

ఈ వర్ణనను యథాతథముగ శ్రీనాథుడు స్వీకరించి-

"మువ్వన్నె పులితోలు మొల దిండుగా గట్టి- (హార. 5-56)
అను పద్యమున శివభిక్షాటనా స్వరూపమును వర్ణించెను.

అంతేగాక మునిపత్నులు శివుని మహైశ్వర్య రూపమును చూచి కామ కలుషితలై వివిధ వికారములతో పరిధానములు జారుట,

కేశములు వీడుట, భైక్ష్యమీూదలచియు ఈలేని వికారస్థితిలో నుండినట్లు వర్ణితము.

"కాచిత్ దష్ట్వా మహాదేవం రూపయౌవనగర్వితా
ఉత్సంగే సంస్థితం బాలం విస్మృతా పాయితుం స్తనమ్"
(స్కాం. అ. 38-88)

కామబాణ హతాచాఽన్యా బాహుభ్యాం ప్రీడ్యస్తనౌ,
విశ్వస స్త్రీతదా చోష్ణం నకిం చిత్ప్రితి జల్పతి. (స్కాం. అ.38-89)

హరవిలాసమున శివుడు దిగంబర స్వరూపుడుగాక స్కాందపురాణములో వలె కాపాలిక రూపములో నున్నను నెఱమిండ జంగముడై

1) మానినికాంతల మనంబులుల్బాటలాడెన్, (హర. 5-58)

2) సతుల ముత్తైదువుల నిర్విశంక వృత్తి
రజని కర ఖండ మౌళి విరాళి గొలిపె, (హర. 5-54)

3) శపథ శతకృతోష్ణంబాను...అనుభవింపచేసి (హర.5-55)

4) ......ముని కళత్రంబుల పాతివ్రత్యంబులు పొలిపుచ్చుచు
విచ్చల విడి జరియింప..... (హర. 5-57)

అని శృంగారోత్కర్షతో వర్ణితము. ఇట మూల భావములను పెంచి ననుట సుస్పష్టము.

3.2.4 శివపురాణము - హరవిలాసము.

శివభక్తులైన ఋషులభక్తిని పరీక్షించుటకై మహాశివుడు వికృతవేషముతో దుష్టచేష్టలొనర్చియు వారలకు మంచిచేయుటకు వెళ్ళినట్లు వర్ణితము. ఆతని వికృత రూపమును దర్శించిన స్త్రీలు భయవిహ్వాలలై విస్మితులైరి. మిక్కిలి కలతపాటుతో పారవశ్యమునందినట్లు వర్ణితము.

వారి వికారములు దర్శించిన ఋషులు. కారణమన్వేషించి శివునే కారణమడిగి బదులు పొందని వారై ధర్మబాహ్యాకార్య మొనర్చిన శివుని లింగము పతనమగునట్లు శపించిరి.

ఇట సంగ్రహాముగా నున్న పురాణ కథా బీజమును శ్రీనాథుడు స్వీకరించియు స్వకపోల కల్పనా శక్తిచే నవ్యమును, లోకజ్ఞతను సూచించు విధముగ భిక్షాటన కథారంభ మొనర్చి కావ్యధోరణిని ఘటించెను.

౪.౩. భిక్షార్థి స్వరూపము - హారవిలాస - ఔచితీ పరిపోషణము

భిక్షార్థులలో కుటిచక బహూదక హంస పరమహంసలను నాల్గు రకములలో మహా శివుడు పరమహంసకోవకు చెందిన ఆదిభిక్షువైనను, హారవిలాసమున మాత్రము నెఱిమిండ జంగముడు.

పసిడి కప్పెర లాతంబు పచ్చకోల
జోగపట్టియు కకపాల జోలె సంచి
కలికి కాటుక గీర్బొట్టు పలుగు పేరు
జాతిగా దాల్చి నెఱిమిండ జంగమగుచు. (హార. 5-41)

ఇందు భిక్షాపాత్ర, పచ్చకోల, లాతాము, జోగపట్టియు, కకపాల యును నవి భిక్షుక స్వరూప సహజములైనవే. కాని శివుడు నెఱిమిండ జంగమగుట వీరశైవమత ప్రభావము ననుసరించియే యనవలెను. దిగంబరుడని చెప్పుటకు మారుగ శ్రీనాథుడిట్లు నెఱిమిండ జంగము డనుటకు ప్రత్యేక కారణ మున్నదనవలెను.

జంగమ స్వరూపమును గూర్చి చంద్రజ్ఞాన ఆగమనములో చెప్ప బడినది. ఈ విషయమే శ్రీనాథుని గ్రంథమందలి జంగమునకు కూడ వర్తించును.

"యద మీ మానుషాకారః ప్రత్యక్ష పరమేశ్వరః" -
(చం. ఆ. 3)

మానవాకారమున చరించు ప్రత్యక్ష పరమేశ్వరుడని

"జకారాజ్జననం దూరం గకారాద్గతి నాశనమ్,
మకారాన్మరణం నష్టం జంగమస్త్ర్యక్షరాత్మకః" -
(చం. ఆ. 3)

అని భావింపబడి, ఆ జంగము, ప్రీతికై, ధనమాన ప్రాణదార పుత్రుల నైతమార్పించి సంపూర్ణమగు భక్తి విశ్వాసములు ప్రకటించినట్లు శివ భక్తుల కథలు తెల్పుచున్నవి. ప్రత్యేకించి జంగమ ప్రీతికై భార్యనర్పించుట, భార్య చీరయొలిచి యిచ్చుటకు కూడ వెనుదీయని శివభక్తి తత్పరత వీరశైవ సాహిత్యమున నున్నట్టిదే.[12] అట్లే యిట మహాశివుడు నెఱమిండ జంగముడై మునిపత్నుల పాతివ్రత్యమును పోలివుచ్చునట్లు వర్ణింపబడుట అపచారముగా కాక పరమార్థ పరముగ గ్రహింపవలెను.

హిమవంతుడు కుమార్తెయగు పార్వతితో ప్రమథ గణముల ధూర్త వర్తనమును దండింపని శివుని గూర్చి విసుగుతో ప్రస్తావించు నపుడు శివుని అమంగళాకారమును వర్ణించు సందర్భమున శివుని భిక్షాటన స్వరూపమును తొలుత శ్రీనాథుడు వర్ణించెను. పిమ్మట వేళ వాటమునకు ఆ పిదప ముని జనాశ్రమమునను త్రివిధములుగా భిక్షుక స్వరూపములను శ్రీనాథు డొనర్చెను.

3.4. వర్ణనలు.

3.4.0. భిక్షుక వర్ణనము :

పార్వతీ పరమేశ్వర వివాహానంతరము మహాశివుడు భార్యపై వలపు పట్టరానిదగుటచే అత్తవారింట ఇల్లటముండెను. శివుని ప్రమథ

12. సేక్కిలార్ - పెరియ పురాణము.

గణముల ధార్ష్ట్యము హిమవంతునికి కోపమును దెప్పించుటచే హిమవంతుడు, ప్రమథ గణముల దండింపలేదని శివునిపై కోపముతో విసుగుకొను సందర్భమున శ్రీనాథుడు చమత్కారముగా ఇట్లు వర్ణనమును గావించెను —

తలమీది చదలేటి దరిమీాల దినజేరు
కొంగలు చెలగి కొంగొంగురనగ,
మెడ దన్ను ఫణుకుల నిడుపేరు లొండొంటి
బోరి బోరి దాకి బొణ్బొణుగు రనగ,
గట్టిన పులితోలు కడకొంగు సోకి, ఠమా
బోతు త త్తడి చిట్టు బుట్టుమనగ,
గడియుంపు బామలు కకపాలలో నున్న
భూతిపై జిలికిన బుస్సురనగ,

దమ్మి పూ చూలి పునుక కంచమ్ము సాచి
దిట్టతనమున బిచ్చము దేహియనుచు
వాడవాడల భిక్షించు కూడుగాని
యిట్టి దివ్యాన్నములు మెచ్చునే శివుండు. (హార. 5-12)

శివుని భిక్షాటన కార్యము ఈ వర్ణనముననే బీజప్రాయమై కన్పించుచున్నది. శివుని కపటాకారము గూడ ముందుగనే కనుల ముందు కన్పట్టుచున్నది. అందుకే శివుడు నంది వాహనారూఢుడై కతిపయ ప్రమథ పరివార పరివృతుండునై మామగారి వీడ్కోలుకొనక, వారికి చెప్పక నభో మార్గంబున హిమవత్పర్వతమున ఏకదేశస్థితంబగు దారు వనమును ప్రవేశించెను.

3.4.1. ప్రకృతి వర్ణనములు :-

కావ్యవస్తు సమున్మీలనమునకు వలసిన దేవదారు వన సౌందర్య చిత్రీకరణమునకు శ్రీనాథుడు పూనుకొనెను. ఆ వనమును తపోధనుల

కును, దేవతా మిథునములకును విహార యోగ్యమైనదైను. దేవదారు వనము హిమవత్పర్వతమునకు దక్షిణసీమలో గౌరీ తపోవనోపాంత దేశ సంస్థితమై మునిజన సంసేవ్యమై యొప్పినది.

శిరమున ఆకాశగంగ వెల్లి పాగా కాగా వృద్ధకచ్ఛపరాజు పీఠు అంఘ్రిపీఠమై, మహీమండలము కొలుచునంతటి మేనుతో, పూర్వాపరాబ్ధులు పొరుగుటిండ్లు కాగా, పార్వతీదేవి కన్యగా, ముక్కంటి జామాతగా గల్గి, లెక్కకు మిక్కుటములైన పర్వతములు తన్ను గొలువ యాగ హవిర్భాగమే ఆహారముగా గల్గి, మాల్యవన్మేరు కైలాసాది పర్వతములు చుట్టాలు కాగా, సకల గుణధాముడైన హిమవత్పర్వత సార్వభౌము డొప్పియుండెను. హిమవంతుని గొరకు చక్కని రూపకల్పనను శ్రీనాథు డొనర్చెను. ఆ హిమవత్పర్వత బంగారు గుహాలలో బృందారక మిథునములు కుతూహలముతో రాత్రింబవళ్లు కందర్ప విహారము లొనర్చెదరు. ఆ శీతశైలమునందు సూర్యకిరణములచే రత్నములు ప్రతిబింబించుచుండ, కాంచన కందరములకు మేఘములే యవనికలు కాగా, దేవతా మిథునములు యథేచ్ఛగా విహరింతురు. కిరాతులు చెంచెతలతో ఆ యడవులలో డప్పులు మ్రోయ ఏనుగుల వేటాడుదురు. ఆ పర్వతమునకు ఆ పర్వతమే సాటిగాని అన్యముగాదు. ఆటవిక జనుల భుజములందలి ధనుర్జ్యాటంకార ధ్వనిచే, ఆ తుహిన పర్వత తటములు మారుమ్రోగును.

పైగా, గంగానది యొక్క సెలయేటి నీటితో మారుమ్రోగు గుహాలు, రంగు రంగుల లేపన ద్రవ్యములు, గైరికా శిలా చూర్ణములు, గంధర్వుల వీణా గుణ నిక్వాణము లాలకించు కురంగములు, తమాల వృక్షములతో పర్వత మొప్పియుండెను. ఈ పర్వత వర్ణనము అల్లసాని పెద్దన హిమాలయ వర్ణనకు తదితర కవుల వర్ణనకు ఒజ్జబంతియైనది.

ఈ విధముగ పర్వత సార్వభౌముని సార్వభౌమత్వమును కొని యాడి శ్రీనాథుడు దేవదారు వన వర్ణనకు పూనుకొనెను. కావ్యధోరణిలో పురాణ భిన్నమైన వన ప్రాశస్త్యము నుగ్గడించుట శ్రీనాథుని యద్భుత కల్పనా శక్తిని, అపూర్వ ప్రతిభా సంపత్తిని తెల్పును. ఆ ఘట్టము పేర్కొనదగినది :

కర్ణికా మాణిక్య కనక పద్మినులతో
కల్పవల్లీ కుడుంగములతోడ,
విమల చింతారత్న వేదికాస్థలులతో
సిద్ధ రసాపగా శ్రేణితోడ,
దివ్యలోకాప్సరః స్త్రీ కదంబముతోడ
గామదుగ్ధేను సంఘములతోడ,
దివ్యౌషధీలతా దీప మాలికలతో
సకలర్తు సన్నివేశంబుతోడ

మదనవైరికి గారాపు మామయైన
మంచు గుబ్బలకేని సీమాంచలమున
దేవతా ముని సేవ్యమై తేజరిల్లు
ధర్మసంజీవనము దేవదారు వనము. (హర. పం. ఆ. 28)

దేవతా ముని సేవ్యమైన దేవదారు వనమున కల్పవృక్షములు, కామధేనువులు, రత్నవేదికలు, దివ్యౌషధీలతలు, సకలుర్తు సన్నివేశము లుండుటేగాక దివ్యలోకాప్సరః స్త్రీ కదంబములను, సిద్ధరసాపగా శ్రేణియును కలవని వర్ణించుటకు కారణమా వనము మౌని తపశ్చర్యా యోగ్యమే కాక రసిక జన విహార యోగ్యమని తెల్పుటకే.

ఈ పద్యమునందభివర్ణితమైన విషయము కాళిదాస విరచిత అభిజ్ఞాన శాకుంతలము నందలి కశ్యపాశ్రమ వర్ణనమును దలపించుచున్నది.

శ్లో॥ ప్రాణాయామ నివేన వృత్తి రుచితా సత్కల్పవృక్షే వనే
తపస్తప్యమీ...... (అ. శా. స. అం.)

ప్రాణాయామ యోగయోగ్యములగు కల్పవృక్షములు కాంచన పద్మ పరాగ కపిశమై యభిషేక యోగ్యమగు తోయము, ధ్యాన యోగ్యమైన రత్న శిలాస్థలములు సంయమిస్థైర్యమునకు, విబుధ స్త్రీ సాన్నిధ్యమునకు స్థానమైన ఈ ఆశ్రమము తపశ్చర్యచే గాని లభ్యముగాదన్నట్లుగ అటనుండగా శ్రీనాథుడు అట్టి సామగ్రినంతయు దేవదారు వనమున సమకూర్చియు, కామదుగ్ధేను సంఘమును దివ్యౌషధీ లతా దీపమాలికలను సకలర్తు సన్నివేశమును జతగూర్చి దేవదారు వనమును దేవతా ముని సేవ్యమును, ధర్మ సంజీవమును గావించెను.[13]

ధర్మ సంజీవన మొనర్చు అచటి మునులు, ముని పత్నులు రతీ మన్మథులవలె సౌందర్య విరాజితులు. పరమేశ్వరుడు జంగమ వేషధారియై తన్మునిపత్నుల పాతివ్రత్యమును భంగింపజేయ బోవును కనుక ఆతని తోడి భోగయోగ్యత వారియందున్నదనుటకు, వారి విలాసములను, వారి సౌందర్యమును సహజముగ శ్రీనాథుడు సమకూర్చెను.

3.4.2. ఆశ్రమ వర్ణనము :-

పాతకమడగించు యాగ హవిర్ధూమములు, సామము లేడింటిని పాడు గండుకోయిలలు ప్రణవాక్షరము లాలపించు తుమ్మెదలు, ఆగమ భాషితము లొనర్చు శుక శారికలు, శాస్త్రములు చర్చించు నెమళ్లు - దివ్యాశ్రమ స్థాయిని సూచించు మైలురాళ్లు. ఆముష్మ్య పరాయణులై అరిషడ్వర్గమును దరిచేరనీక నీవార ముష్టింపచులైన మునులు, ప్రశాంత

---

18. పాపయ్యశాస్త్రి, చిలుకూరు, భారతి; ఆగష్టు 1958.

జీవన మొనర్చుచుండిరి. ఈ ఆశ్రమ వర్ణనము భారతమున గల కణ్వాశ్రమ వర్ణనమును తలపించును.

దేవదారు వనమునందలి గోష్ఠ ప్రదేశమునందలి లేగదూడలు హోమానుష్ఠాన యోగ్య పయస్సంపాదన ముగిసిన పిదప దమ మాతలగు కామధేనువుల పయస్సుధాలహరుల గ్రోలి యానందంబున తోకలు కదలించుచు గంతులు వేయుచుట! చూడ ముచ్చటైన వర్ణనమిది. అచటి ధేనువులు కామధేనువులై పాలు అమృతమై లేగలకు జంఘా లాఘవ మొడగూర్చిన వన్న అతిశయోక్తి కాదు.

3.4.3. మునిపత్నుల మునికన్యకల వర్ణనము :-

మునిపత్నుల విహారములలో కొన్ని విహారములను శ్రీనాథుడు వర్ణించెను. ఈ క్రింది పద్యమున సరళ ధోరణిని శ్రీనాథుడు మౌని భార్యలు కాయక్లేశముల నుజ్జగించిన తీరు నభివర్ణించిన విధమిట్టిది:

'ఆయావేళలమౌనిభార్యలు గృహవ్యాపార లీలాభవ
త్కాయ క్లేశములుజ్జగింత్రు విసత్కర్పూర రంభా తరు
చ్ఛాయా శీతల చంద్ర కాంతమణీ పాషాణ ప్రదేశంబులన్
వాయుప్రేరణ బచ్చ కప్పురము పై వర్షింప నకాననలోన్',
హార. 5-35)

మౌని భార్యలాయా వేళల గృహ వ్యాపారములందు శ్రమ గల్గినపుడు, కర్పూరపుటనటి చెట్లనీడలో చంద్రకాంత శిలా వేదికలపై గూర్చుండి చల్లగాలి పచ్చకర్పూరము రాల్చుచుండ నా యాసము నుజ్జగింతురు.

గృహ వ్యాపారంబులవలన అలసిన మేనుల సేద తీర్చుటకై ముని పత్నులు సెలయేరులలో జలక్రీడలాడుదురు. ఈ వర్ణనము అతిసహజమై ఆ నాటి మునిపత్నుల నిత్యకృత్యములలో తెలియచేయునదియై యొప్పారుచున్నది.

నిలయు వ్యాపారంబుల
యులపుల మేనులు చెమర్చి యపరాహ్ణమునన్
సెలయేటులలో జల్లులు
జలుకురు నాడుదురు మునుల చిపురుంబోణుల్. (హార. 5-37)

ఇక అకుటుంబ సభ్యులైన మునికన్యకల సొగసును శ్రీనాథుడిట్లు వర్ణించెను :

జిలుగైన కనకంపు జీనాంబరము కొంగు
పాలిండ్ల బింకంబుబయులు పరప,
భ్రమరకంబుల జుట్టు ప్రస్వేద కణములు
నొసలి కస్తురి బొట్టు నూలుకొలుప,
దర విశ్లథంబైన ధమ్మిల్ల భారంబు
చిమ్మ జీకబులకు జిట్టమిడుప,
దరళ హాటక రత్న తాటంక దీప్తులు
కుక్కుటద్దములపై బీరువాఱ,

బసడి కుండల నిర్ఝరాంభస్సు దెచ్చి
పోయు కంకణ నిక్వాణములు సెలంగ
గన్యలతలకు ముని కన్యకా కదంబ
మఖి మతంబైన యప్పావనాశ్రమమున. (హార. 5-80)

ఇందు మునికన్నెలు సుందరాంగులే గాక, యౌవన దశావిర్భావముచే సర్వావయవ సౌభాగ్య లావణ్యవతులై నల్లని యెత్తైన శిరోజసంపదతో, రత్న తాటంకముల దీప్తులు చెక్కుటద్దములందు ప్రతిఫలింప నొసట కస్తూరీ తిలకపు సురభిళముచే భ్రమరకములు చుట్టుముట్టు, జిలుగు వస్త్రాంబరములలో గాజులు గలగలలాడ పసిడికుండల సెలయేటి నీటిది చేతబట్టి లతలకు నీరుపోయు దృశ్యము సాక్షాత్కార రమణీయము.

ముని బాలకల దైనందిన కార్యక్రమ వర్ణనము సహజ సుందరమై యీశ్వర భక్తి సూచకమై యాశ్రమ మునికన్యకలకుచితమై, సందర్భానుసారియై యున్నది.

నిర్ఝరాంభః కేళి నీలకంఠాంగనా
తాండవాడంబర దర్శనంబు,
పుష్పాపచాయంబు పూర్ణిమా తిథి నిశా
చంద్రోదయారంభ సంభ్రమంబు,
ప్రసవకందుకలీల బాల ప్రవాళేచ్ఛ
గిరినదీ సైకత క్రీడనంబు,

పాంచాలి కాకర కాంచన కుంభాంబు
లతిథి పూజార్థ సజ్జీవ కృతార్ఘ్య పాద్య
సలిల మధు పర్క లాజ కుశ ప్రవాళ
గంధ పుష్పాక్షతాది ప్రకల్పనములు
ప్రత్యహః కృత్యములు మౌని బాలికలకు. (హార. 5-39)

జలక్రీడలు, దేవాలయ గమనము, పుష్పాపచయము, పున్నమనాటి వేడుకలు, బంతులాట, చెట్లకు నీరుపోయుటాదిగా గల కృత్యములు స్త్రీ శైశవ దశా విశేషములే. కాని మునికన్యలు అతిథి పూజకై సలిల మధు పర్క లాజ కుశప్రవాళములు సేకరించునట్లు వర్ణించుట శ్రీనాథుని వర్ణనోపజ్ఞకు చక్కని యుదాహరణమై సముచితమై యలరారుచున్నది.

ఇక పర్ణశాలలో ముని కన్యకలు చెంచెతలై తండ్రులెచటికైనను వెళ్లినపుడు తల్లుల యెదుట చెంచు చిగురాకుబోణుల వేషములు దాల్చి వారి చేష్టల నభినయించుట మరియొక మనోహర దృశ్యము.

సెలయేటి తెలినీట జలుబంతి పసుపాడి,
నేసక్రుమ్ముళ్ల బిచ్చియలు తొడిగి,

గురువింద సేరులు గుబ్బ చన్నుల దాల్చి,
నెమిలి పించెంపు బుట్టములు గట్టి,
పయ్యెద మాఱుగా బౌఱుటాకులమర్చి,
చాదున దిలకంబు సంతరించి,
కంకేళి చిగురాకు గర్ణపూరము చేసి,
కుసుమ పూవుల ధమ్మిల్లి సరుల దాల్చి,

ఈంచు చిగురాకు బోణుల చేతలెల్ల
నభినయింతురు పర్ణశాలాంతరముల
దంద్రు లెందేని జనునప్డు తల్లులెదుర
గారవము సేయ ముని కన్యకా జనంబు. (హర. 5-38)

ప్రకృతి ప్రసాదించిన పుష్ప పల్లవములను, సులభ లభ్యములగు గురు వింద‌లు, పండుటాకులు, నెమలి పింఛములు అడవిలో నున్న స్త్రీలకు సౌందర్య పోషక సాధనములై శ్రీనాథుని వినూత్న స్త్రీ సౌందర్య వర్ణనమునకుపబలకములైనవి. సుందరముగ పొంకముగ తెనుగుదనముట్టి పడ స్త్రీల యలంకరణమును సవిస్తరముగ వర్ణించిన కవులరుదు. శ్రీనాథుని వర్ణనము రమ్యము.

3.4.4. వేశవాట వర్ణనము :-

పారమార్థిక చింతనముతో నున్న ముని పుంగవుల మనము చెదరక, కామము పొడసూపనీక నిష్ఠతో నున్నను, వారి వ్రత భంగ మొనర్చుటకా యన్నట్లు ఆ దేవదారు వనమున పదునాల్గు జాతుల యప్సరలు జాతి కొక్కొక్క వాడ యేర్పడ నానా సంకేత సన్నివేశంబై స్థిరావాసులై ఆత్మోత్పత్తి స్థానంబులైన వతాకముల నెగురవైచు కొనుచు ప్రతిభవన భిత్తిభాగంబులందును చిత్తరువులు సంతరించుకొని యుండిరి. ఆ చిత్రములును, అచ్చరలను శ్రీనాథుడు సవిస్తరముగ "కోర

కిత నేత్ర త్రిభాగుండై......" అను వచన భాగమున (హార. 5-40) వర్ణించెను.

పురాణ ప్రసిద్ధములును, మన్మథ వికారోద్బోధకములగు విషయములు పై వచన భాగమున వర్ణితము. అట్లే అప్సరలు త్రిభువన వశీకరణ యోగ్య విభ్రమ వ్యాపారాలాపాది భూషితలుగా చిత్రించుట, శ్రీనాథుని శృంగార వర్ణనా వైదగ్ధ్యమును, భిక్షా ప్రదాన సన్నివేశౌచిత్యమును తెల్పును. త్రిభువన సుందరాంగుల ప్రోల నిలబడి భిక్ష కోరిన పరమేశ్వరుని సౌందర్యము మరింత మోహావహమై వారలనే గాక మునిపత్నుల మనములను కలచిన వనుటకు ఈశ్వరుని రూప సౌందర్యమ సదృశమని గర్భితము.

వేశవాట వర్ణనము వీతరాగుల చిత్తవృత్తిని కలచుటకే యని భిక్షాటన కావ్యము ననుసరించుటకు వలసిన సందర్భమును సిద్ధమొనర్చుటకేయని తెలియగలము. శృంగార శాంత రస సంఘర్షణమీ వృత్తాంతము. విబుధ మత్తకాశినుల కలికి చూపులు, మొలక నవ్వులు, భిక్షాటన కావ్య ప్రభావములే!

### 3.5. లింగోత్పత్తి వృత్తాంతము :-

హారవిలాసమున ఈశ్వరుడు కావించిన దేవదారు వనవిహారమునకు నిదానము. శివపురాణాంతర్గత కథావస్తువు దీనికి మూలమని భావించిరి కాని, స్కాంద లింగ వామన బ్రహ్మాండాది పురాణములలో సహితము ఈ కథావస్తువు కలదు.

వేటూరి వారిచే పరిష్కృతమైన హారవిలాసమున (1938) పంచమాశ్వాసాంత భాగము అను శీర్షికలో కొన్ని గద్య పద్యములు కలవు. అందు శివుడు లింగాకారమున విజృంభించి దేవదారు మునీంద్రుల ధర్షించుట, బ్రహ్మదేవుడు శివలింగమును దండకమున స్తుతించుట అభిషే

కించుట తుదిని ఫలశ్రుతి కలవు. వావిళ్లవారు ఈ వృత్తాంతమును పీఠికానుబంధముగను, ఎమెస్కోవారు దీనిని పంచమాశ్వాసాంతముననుముద్రించిరి. ఈ లింగావిర్భావ కథనము ప్రక్షిప్తము కావచ్చునన్న అభిప్రాయము కలదు. దేవదారు వనవిహారము దివ్య శృంగార విలసితముగ భావింపవలెననుచు, ఈ లింగావిర్భావము మాత్రము అతిశయ శృంగారమని భావించిరి. అశ్లీలమని వదలివేయబడినది.

మహాశివుడు జంగముడై దేవదారు వనమున భిక్షార్థియై తొలుత వేశవాటమునను, పిదప మున్యాశ్రమమునను బ్రహ్మకపాలమును చేతబూని నూపుర ధ్వని వ్యాపింప భసితాంగుడై శార్దూల చర్మధారియై కర్కోటకాహితో శిరోజములకట్టి చంద్రు దాల్చి, మువ్వంక చేతబట్టి, ఖట్వాంగపాణియై వెళ్లెను. తిలోత్తమ ఘృతాచీ రంభాద్యప్సరలు వివిధాన్నములను మహాశివునకు భిక్షగానిచ్చిరి. మూలమున ఫలతాంబూలాదులు అనియుండ, శ్రీనాథుడు పాక కళావర్ణనా నైపుణ్యము ప్రదర్శించుచు, వివిధాన్నములను భిక్షగా నిచ్చినట్లు వర్ణించెను. అర్థకపాలము మాత్రమే నిండగా, శివుడు తృప్తి చెందనివాడై మున్యాశ్రమమున సంయమి పాతివ్రత్య భంగమే పరమ ప్రయోజనముగ "హారి వాహగర్జాస్వరంబున" 'భవతి భిక్షాందేహి' యని యాచించెను. సుబల మార్కండేయాది మునుల యిండ్లలోని సతుల నా మహాశివుడు నిర్విశంక వృత్తితో విరాళి గొలిపి మదనోన్మాదంబున ప్రవర్తించెను. నిలింప వ్రాత మాతని కనుంగొని, ఆతని యధర్మ ప్రవర్తనమునకు చింతించి శపించిరి. తత్కారణముగ లింగోద్భవము కాగా, బ్రహ్మాది దేవతలు, మునులు లింగమును పూజించిరి. మునులీర్ష్యాద్యోషములుజ్జగించి, భక్తి ప్రపత్తులతో లింగస్వరూపుని గొల్చిరి; బ్రహ్మదండకమున స్తుతించెను. తుదిలో కథాశ్రవణ ఫలశ్రుతి కలదు.

— ••• —

# 4. వార్ధి మథన వృత్తాంతము

4.0. వార్ధి మథన వృత్తాంతము :-

షష్ఠాశ్వాసమున శ్రీనాథుడు '136' గద్యపద్యములలో సముద్ర మథన వృత్తాంతమును శివలీలగ వర్ణించెను. కైలాసమున పార్వతీ పరమేశ్వరులు తదితర దేవతాగ్రామణులు సభ తీరినపుడు పార్వతీదేవి శివుని యింగితంబెరిగి కంఠమూలమందలి కప్పును గూర్చి పృచ్ఛించెను. అపుడు ఈ కథను శంభుడు శాంభవికి చెప్పినట్లు కలదు.

జంభాసురుని వజ్రాయుధముచే సంహరించి దేవేంద్రుడు తిరిగి వచ్చునపుడు దేవగంధర్వాది నిచయమాతని విక్రమమును నుతించుచుండగా అమరావతిని సమీపింపబోయెను. దారిలో దుర్వాసుడు ప్రమ్లోచ యను దేవతాస్త్రీ పారిజాత పుష్పమాల్యమును తనకీగా, ఇంద్రుని చూచి ఆశీర్వదించి ఆ పుష్పమాల్యము నిచ్చెను. దాని నింద్రుడు విజయ గర్వాటోపముచే కన్నుగానక ఐరావణ కుంభస్థలిపై అలవోకగ వేసెను. అమ్మదగంధ సింధురము వసుంధరాభరణ శౌండంబగు తుండంబెత్తి సున్నని యప్పువుదండను గ్రమ్మన గ్రుమ్మరించి విసిరి కేసరంబులు పిసరవోవ, మకరందంబు చింద, రేకులు విఱుగ, పుప్పొడి సడలగా కపోలభాగముల రాచికొనెను. ఇట్లు ఆ పుష్పమాల్యము ధ్వంసమగుటను కండ్లార చూచిన దుర్వాస మహర్షి ప్రళయ కాల రుద్రుని వలె కనుబొమలు ముడివడ, అంగాంగములందు స్వేదోదయము కాగా దుర్నిరీక్షుడై యింద్రుని చూచి,

> ఓరి మదాంధ! యహల్యా
> జార! త్రిలోకాధి రాజ్య జాతమగు నహం
> కారంబా? యిది మమ్మం
> జీరికి గైకొనక యిట్లు సేయుట యెల్లన్. [హర. 6–18]

'అనుచు', తాను దీవించి చేయెత్తి యిచ్చినట్టి పుష్పమాలిక నాదల బూన్పక హస్తి చేతికిచ్చినందులకు కోపించి" ఇంత నుండియు నీ నాకంబఖిలంబును నిశ్శ్రీకంబగుగాక" యని శపించెను. యతి పతిశాపా క్షరములు వమ్ముగా వయ్యె. విగత లక్ష్మీక విలాసుడైన దేవేంద్రుడు బ్రహ్మ విష్ణు శివ సందర్శ మొనర్చి, తన దుఃస్థితి నెరింగించి వారి హితవు తోను, సహాయముతోను, వార్థిని మథించుటయును, తత్సంభవమైన సురుచిర వస్తూత్పత్తి నాయా వ్యక్తులకు పంచిపెట్టుటయు, తత్సంభవ కాలకూట జ్వాలలనుండి రక్షింపబడుటయు, మోహినీ అవతారుడైన హరి సమయస్ఫూర్తిగ ప్రవర్తించుటయు నిందలి విషయములు.

4.1. సముద్ర మథనావశ్యకము : బృందారకులు ఇందిరావ్యపాయం బున నపార దారిద్ర్యాంధకార మగ్నులై నగ్నాటులుంబోలి భయంపడి తేట మొగంబు వడి, హాటక గర్భవాలికిం బురందరుండు ముందఱగా జని, మునిశాపయుక్తి, మూడులోకంబుల రాచసిరి యబ్ధిలో మునింగిన భంగి తేటతెల్లంబుగ దెలియం బఱచుటం బట్టి దుర్వాస శాపముచే నాకము నిశ్శ్రీకమై పునః పూర్వవైభవోపేత మగుటకు మహాశివుడు అబ్ధిని మథింపవలెననుటయే కారణము.

విరూపాక్ష దివ్యాంశ భవుడగు దుర్వాసుడు అల్పాపరాధము నైనను సహింపనట్టివాడు; మరియు ప్రథమాశ్వాసమున కవి మాట లలో "క్రోధ సంవర్ధమాన తపోధనుడు". పైగా,

'క్రోధం బితరులకుఁ దపో<br>
బాధక మగుఁ గాని నా తపంబున కడియ<br>
ద్బోధకము సలిల మగ్నికి<br>
బాధకమై వైద్యుతాగ్నిఁ బ్రభవించు గతిన్.' (హర. 6-26)

అను దుర్వాసుని మాటలలో కోపమున కావంత అవకాశమున్నను, కోపించియు తపోధనమును వృద్ధిచేసినట్టివాడు దుర్వాసుడు; తన్ను

ధిక్కార మొనర్చి, భయభక్తులు లేక, వేయికన్నులుండి కానరాకుండు మదగర్వ వికారుని, పూజ్య పూజావ్యతిక్రమముచే సర్వకార్య హారణ మొనర్చినట్టి జంభాసురభేదిని శపించెను; ఆ శాపఫలితముగ సురుచిర వస్తుతతితో నిందిర యింద్రుని విజృంభమణగ దుగ్ధాంబుధిలోన గూలి పోయెను.

దూర్వాస శాపకారణముచే విగతలక్ష్మీవిలాసుడైన దేవేంద్రుడు, బ్రహ్మ విష్ణు బృందారక సమేతుడై మహాశివుని కడకేగి శరణో పాయము వేడ, వార్ధి మథనకార్యావసరము ఏర్పడినది. క్షీరసాగర మథన కార్య మొనర్పబడినది. కారణ కార్యక్రమబద్ధము ననుసరించి శ్రీనాథుడు జంభారి విజృంభణము, దూర్వాసశాప వృత్తాంతము పాల సముద్రము చిలుకబడుట యను క్రమమును పాటించెను.

4.1.2. కథా ప్రారంభము - నవ్యత :-

కావ్య ప్రారంభమున నవ్యత్వము అనగా కారణ కార్యముల క్రమ మును పాటించుట, తృతీయాశ్వాసమున తారక విజృంభణము, అసుర వధోపాయమగు గౌరీ కల్యాణ కుమారోదయముల వర్ణించుటలోనే జరిగినది. శివలీలల దెల్పు ఈ గ్రంథమున పార్వతీదేవి అఖిలలోక విలో చనాహ్లాదకలన కందమై యందమైన శృంగార రేఖవలె నున్న శివుని కంఠ మూలమున గల కప్పును గూర్చి పృచ్ఛించుటయే సముద్ర మథన కార్య స్ఫురణకు, శివుని యింగిత మెఱుగుటకు తావిచ్చెను. శంభుడు శాంభవి కిచ్చు సమాధానమే పూస గ్రుచ్చినట్లుగ నుండి జంభాసురభేది విజృం భణము, దుర్వాసముని పారిజాత పుష్పప్రదానము, దేవేంద్ర తిరస్కా రము, మునిశాపము, అనుక్రమముననుసరించినది. పాఠక సుబోధమగు పద్ధతిచే కథను ప్రారంభించుట శ్రీనాథుని పద్ధతి.

4.2. విశేషాంశములు :-

ఇందలి యితివృత్తము పురాణ ప్రథితము. బ్రహ్మవైవర్తకూర్మ

విష్ణు పురాణములలో నీ కథ వర్ణితము.[1] శివలీలల దెలుపు పురాణము లలో నెచ్చటైనను ఈ కథను చూడగలము. పురానవం - పురాణమని నిర్వచనము. సర్గప్రతిసర్గ, వంశ మన్వంతర వంశాను చరితమను పంచ లక్షణోపేతమైనది. కథా ప్రాధాన్యమై భగవర్లీలల దెలుపునవి పురాణ ములు. సంస్కృతాంధ్ర భాగవతములలో నీ కథ హరిలీలగ చిత్రితమై యుండ నిట శివలీలగ చిత్రితమైనది. హరిహరులు క్షీరసాగర మథన కార్య సంరంభమున సమానపాత్ర వహించినను కవి మతాభి రుచిని బట్టి శివలీలగనో విష్ణులీలగనో పర్యవసించుట సహజము.

ఇట పాలకడలి త్రచ్చుటకు మూలకారణము నాకము నిశ్శ్రీక మగు నన్న దుర్వాస శాపమే. దుర్వాస ముని యింద్రునికి పుష్ప మాల నిచ్చుట ఆతడు నిర్లక్ష్యముగ పూమాలను ఏనుగుపై నుంచుట, ఆ పూమాలను ఏనుగు నాశమొనర్చుట, దుర్వాసముని శాపము విష్ణు పురాణమున కలదు.[2] సురుచిర వస్త్వాదయమునకు మునుపు భీతావహ ముగ హాలాహలోత్పత్తి దేవదానవుల పట్టుదల నించుక సడలచేసినది. పట్టుదల తాత్కాలికముగ సడలి అమూల్య వస్తు లాభమునకు ప్రేరే పించు స్థిరసంకల్పత్వమును వారిలో కల్గ చేసినది. ఇటి పట్టుదల యను గుణము ప్రయత్న విఫలత్వమునకు లొంగనిదని స్పష్టమైనది. అందుకే నీతి శతక కారుడు-

> ఉద్యమేనైవ సిధ్యన్తి కార్యాణి న మనోరథైః
>
> న హిసుప్తస్య సింహస్య ప్రవిశన్తి ముఖేమృగాః. (భర్తృహరి)

అని ప్రయత్న సాధనముననే కార్యము లొనగూడునని వక్కాణించెను.

---

1. వేంకటేశ్వర్లు-ఓలేటి; అష్టాదశ పురాణములు.
2. శ్రీనివాసశర్మ, వేమూరి; పురాణ గాథాలహరి; కమలా అనార్కలి; సాహితీ మంజూష.

గ్రంథాదిని దుర్వాస కోపశాపములకు సుపరిచితులమైన మనము ఇట మరియొక పరి ఇంద్రుని శపించు దుర్వాసుని కానగలము. అచట అల్పకారణముచే కుపితుడైన దుర్వాసు డిట ఇంద్రుని మదాంధతకు క్రుద్ధుడై, ఇంద్ర తిరస్కారము సీసడించి 'నాకము నిశ్శ్రీకమగుగాక!' యను శాపము నొసంగుటకు దారితీసినది. విశేషమేమనగా క్రోధము తపోబాధకము కావలసినది కాని అది దుర్వాసుని విషయమున తపః సంవర్ధక మొనర్చినది. అందుకే కవి "పూజ్యపూజా వ్యతిక్రమము సర్వ కార్యహారమగు గాదే!" అను సూక్తి దుర్వాసుని కోపమునకు కారణమని తెల్పెను. హరుని విలాసము గనుక నిందు దేవేంద్రాదులు బ్రహ్మను వెన్నని తోడ్కొని శివునికడకే వచ్చుట, అతడు కర్తవ్యము, తరణోపాయము సూచించుటయు జరిగినది. వారందరు పంచ కంద పద్యములలో శివపారమ్యము నుగ్గడించుట గమనార్హము.

కార్య మన్ననో క్షీరసాగర మథనము వలసిన సాధనసమగ్రి ఆ మహాశివుడే సూచించెను. కార్యప్రయోగ రక్షకులు త్రిమూర్తులే ఇక ఆ మహాకార్యమునకు, విఘ్నమాపాదింపని విధముగ వినాయక ప్రార్థనయు జరుగుట కార్యాధిక్యతను తెల్పుటయేగాక, దివ్యులలో గల కార్యదీక్ష ఉత్కంఠ, ప్రయత్నము తెల్పుచున్నవి. తక్కిన కథా కథనము వేరు. విష్ణుమూర్తి మంధర పర్వతమును దేహము మీాది ఆ భరణాంబరాదులు చెక్కుచెదరని రీతిని సునాయసముగ లేవనెత్తుట వేరు. ఇది శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతమును లేవనెత్తిన విధమును తలపించుచున్నది. పైగా వరాహమూర్తి భూదేవిని ఒంటి గోరమీాద మోసెను గదా !

ఇక కవి వినాయక ప్రార్థనావసరమున షోడశోపచార పద్ధతిని తెల్పుటలో నాతని నియమ నిష్ఠాదులెరుకపరచెను. అంతేగాదు; స్వామి నైవేద్య వర్ణనలో నాతనికి గల వివిధ భక్ష్యభోజ్య చోష్యాదు

లతో గూడిన పరిచయము, భోజనప్రియత్వము వెల్లడియగును.[3] అంబోధి మథనముచే బ్రహ్మాండ కర్పరమే గగ్గోలు వడినది. దిక్కులు పిక్కటిల్లు ధ్వానముతో డిండీర పిండములు వ్యాపింప భూనభోమండలము లేకమై సమస్త ప్రాణులకు భీతావహమై పాషాణ ఘట్టనంబున నెగయు మిణు గురుంబోలె అంతర్మణి శలకాశకలంబులు మీాదికెగయ హాలాహలమే ఉద్భవించినది. ఆలసించిన సమస్త లోకాళికిని విపత్సంభవమని ఎరిగిన ఆ శివశంకరుడు మహాశివుడు లోక కల్యాణార్థమై గరళమును మ్రింగి గళమున నుంచికొని నీలగళుడయ్యెను. ఇంతటితో పార్వతి ఆశ్వాసాదిని ప్రశ్నించిన ప్రశ్నకు సమాధానము లభించినది. కవి వినాయక స్తుతికై ఒక దండకమే రచించి గ్రంథాదిని విఘ్నరాజ ప్రార్థన లేదన్న లోటును తీర్చివైచెను.

మహాశివుడు కాలకూట విషమును రసఘటిక వోలె మ్రింగిన సందర్భముగ కవివాడిన "కటుక మగు విషము విషధర" యను కంద పద్యము (హార. 6-70) "శ్రీనాథుని భీమఖండములో గూడ నుండుటకు కారణము శ్రీనాథుడు "గ్రసతేస్మ" అను సంస్కృత భీమఖండ శ్లోకమే యని ఆ శ్లోకానువాదము తొలుత హారవిలాసమున చేసి తదుపరి భీమ ఖండమున గూడ చేసెనని అందువలన హార విలాస రచనా కాలము భీమఖండ రచనకు తరువాతిది కాబోదది శ్రీ బండారు తమ్మయగారనిరి.[4]

హారవిలాసము పూర్వకాలీకమని భీమఖండము, తదనంతర కాల మున రచితమని తెల్పుచు, రెండు గ్రంథములలో 'కటుకమగు' పద్య ముండుట యథార్థమని, అయితే హారవిలాస కథకు సంస్కృత భీమ ఖండము మూలమనుట కుదురదని శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగా రనుచు హారవిలాస కథ ఒకటి రెండు అంశములందు కూర్మపురాణము

3. సాంబశివరావు, పులిచెర్ల, భారతి; అక్టోబరు 1971.

4. తమ్మయ, బండారు, రెడ్డి సంచిక.

సందలి కథతో పోలినదని, హాలాహాల భక్షణ కథ శ్రీనాథుని స్వతంత్ర మగు కల్పన అని తెల్పిరి.[5]

వినాయక ప్రార్థనము భీమఖండమునందలి క్షీర సాగర మథన సందర్భములోనే కలదు.[6] భాగవతమున నిట్టిది లేదు. సంస్కృత భీమ ఖండమున మొదట హాలాహలము సముద్ర గర్భమునుండి ఉద్భవించి నపుడు ఎల్లరు భీతిల్లి శివుని శరణువేడగా ఆ దేవదేవుడు దానిని తన గళమున నిలిపికొని లోక సంరక్షణ మొనర్చిన పిమ్మట ముందట్టియిష్ట వస్తువులుద్భవింప కుండుటకై రూతని యుద్బోధనవై గణాధిపతిని పూజించినట్లున్నది. హరవిలాసమునందలి వినాయక పూజ భాగవతాది పురాణములలోనిదిగాదు. పైగా హాలాహాల భక్షణము, సముద్ర మథ నము హరవిలాసమునందు వడిగలకథా గతిలో నున్నది.

4.3. కావ్య ప్రణాళికలలో నీ కథకు గల స్థానము :-

హరుని లీలలను క్రమముగ చిత్రించు నీ కావ్యమున క్షీరసాగర మథనము మహాశివుని పారమ్యము నుద్ఘోషించును. పూర్వప్రకరణమున కవి దారుకా వన విహార సందర్భమున లింగోత్పత్తి క్రమమును వర్ణించి ఆ మహాలింగమును సుర గరుడ ఖచర విద్యాధర కిన్నర సిద్ధ సాధ్య ముఖ్యులే గాక బ్రహ్మదేవుడును స్తుతించుట మనమెరుగుదుము. అనాటి నుండి అనుపమ దివ్యలింగార్చనము మహామునులకే గాదు, అందరికి అర్హ మైనది. అట్లు శివుని పరమోత్కృష్టత నుగ్గడించు కథాదికములలో హాలాహల భక్షణ వృత్తాంతమొకటి. సర్వలోక భయంకరమగు హాలా హలోత్పత్తి యందరిని భయభ్రాంతులు చేసి కింకర్తవ్యతా విమూఢుల నొనర్చినపుడు, మహాశివుడు లోకోపద్రవ కారణమగు హాలాహలమును

---

5. శ్రీరామమూర్తి, కొర్లపాటి, శ్రీనాథుడు, 1971.

6. శ్రీనాథుడు – భీమఖండము.

అవలీలగ రసఘుటిగ చేసి మ్రింగెను. కనుక శివమాహాత్మ్య ప్రతిబోధక మగు నీ వృత్తాంతమును శ్రీనాథ మహాకవి స్వీకరించెను. ఈ కావ్యమున తొలుత మహాశివుడు చిఱుతొండనంబికి మోక్షమిచ్చి భక్తుని పట్ల కరుణను ప్రకటించుటయు చివర అర్జునుడను భక్తునకు పాశుపతాస్త్ర మను దివ్యాస్త్రమును నిచ్చి కాచుటయు జరిగినది. శంకరుడు భక్తవ శంకరుడని కావ్యాద్యంతేతివృత్తములు సుస్పష్టమొనర్చినవి.

అట్లే తనదైన అనన్యభక్త్యాతిశయము చేతన, అఖండవ్రత చర్య చేతను పార్వతీదేవి మహాశివుని మెప్పించి ఆతని అనురాగమునకు పాత్ర మైనట్టి వృత్తాంతమే గౌరీకల్యాణ వృత్తాంతము. ఇక దారుకా వనవిహార సందర్భమున ఈర్ష్యాదోషముచే కన్నుగానని రీతిని ప్రవర్తించిన మహా మునులకు మహాశివుడు గుణపాఠము నేర్పి చివరకు వారలను తన భక్త కోటిలో చేర్చుకొనుటకు వక్కాణింపబడిన. మొత్తము మీద ఈ కావ్యమున హరునిలీలలు తొలుత భక్తవశంవదుడని చాటి పిదప శివశ్రేష్ఠత్వము, కారుణ్యమునుగ్గడించు వృత్తాంతములు క్రమమున స్వీక రింపబడినది. మహాశివుని నీలగళనామాచిత్యము నుగ్గడించు వృత్తాం తము హాలాహల కథనము. విడివిడిగ నున్న పూలు ఒక సుమమాలగ రూపొందినట్లు శివలీలల దెల్పు నీ కథ లోక కావ్యముగ నేర్పడి హర విలాసమైన దనవలెను. క్షీరసాగర మథనమున నిటు మహాశివుడే కార్య భారకర్తయైనట్లు వర్ణింపబడుటకు శ్రీనాథుని ఈశ్వరార్చన కళా శీల త్వమే కారణము. అనుబంధముగ కూర్మ విష్ణు పురాణాంతర్గత దుర్వాస శాప వృత్తాంతము స్వీకరించుట వలన కథ పెరిగి ప్రత్యేక వృత్తాంతము గనై కథా కథనమునకు చేయూతనిచ్చినది. క్షేమూా సంపన్నుడైన శ్రీనాథ మహాకవి స్వతంత్రత, ప్రజ్ఞా విశేషము కథాకథనమునను రసవత్తర వర్ణనాధోరణిలోను చూడవలెను పడుటతో నీ కథ హర విలాసమున సముచిత సత్కార మొందినది.

**4.4. ఇతర గ్రంథములలో క్షీరాబ్ధి మథన వృత్తాంతము :-**

సంస్కృతాంధ్ర భీమఖండము లందీ వృత్తాంతము గలదు. సంస్కృతాంధ్ర భాగవతములందీ కథ గలదు. ఉపమన్యువు బాల్యమున పాలకొరకు తపస్సు చేయగ వాని నిమిత్తముగ ఈశ్వరుడు క్షీరసాగరమును సృజించినని శివపురాణము తెల్పుచున్నది.[7]

**4.4.0. సంస్కృతాంధ్ర భీమఖండముల కథ :-**

మంకణ మౌని నారదునితో దక్షవాటి నాథీశ్వరుండు కాల కూటంబు నెబ్బంగి నుపహరించినని, ఆ కథాక్రమంబు నెఱింగింపుమని వేడెనట! దేవదానవుల ప్రతిఘటన చూచి యింద్రుడు హరికడకు పోయి మంతన మాడి సిద్ధ సంకల్పుడయ్యెను. తదుపరి హరి సురదైత్యులకు కలహము మానుడని సురాపానము చేసి సుఖింపుడని క్షీరసాగర మథన మొనర్చిన అమృతము లభించునని సూచించెను. ఆదికచ్ఛపము మూలాధార కుండంబుగా వాసుకి తరిత్రాడుగా క్షీరసాగర మథనము ఆరంభించి కాలకూటోత్పత్తితో తాత్కాలికముగ ఆగెను. హరి విరించి పురందరాది బృందారకులు ప్రార్థనచే మహాశివుడు హాలాహలము మ్రింగెను. పార్వతీదేవి గరళమును గళమున నిల్పుమని, లేనిచో, లోకములు నాశమగునని తెల్పగా శివుడట్లే యొనర్చెను. శ్రీనాథుని భీమఖండములో సకల దేవతానిచయము మహాశివుని '15' పద్యగద్యములలో సుదీర్ఘముగ స్తుతించినట్లు కలదు.

భేద సాదృశ్యములు :- వినాయక పూజ, కాలకూటోత్పత్తికి పిమ్మట శివుడు గరళమును కంఠమున నిల్పిన పిమ్మట ముందట్టి అరిష్ట వస్తువులుద్భవింపకుండుటకై శివుని యుద్బోధచే గావింపబడినట్లు సంస్కృత భీమ ఖండమున కలదు. హరవిలాస ఆంధ్ర భీమ ఖండము

7. శ్రీనివాసశర్మ, వేమూరి, పూర్వగాథాలహరి.

లందు సముద్ర మథనావసరమున నిర్విఘ్న కార్యపరిసమాప్తికై గణాధిపతి పూజ కావించినట్లు కలదు. సంస్కృతాంధ్ర భాగవతములందు ఈ వినాయక పూజ లేదు. కాగా అందు కొంతకాలము మథింపగ మందర పర్వతము కూలి సాగరములో దిగబడగ దేవతలు భగవంతుని ప్రార్థించినట్లును, విష్ణుమూర్తి కూర్మమై ఆ పర్వతముక్రింద చేరి పైకి లేవనెత్తినట్లు కలదు.[8] హారవిలాసమున "పాతాళగోళంబు క్రింద మట్టుగానాది కమఠంబుబెట్టి" నట్లు కలదు.

సముద్ర మథన ఘట్టము కూర్మ పురాణ సంస్కృత భాగవతములందుండి హారవిలాస కథకు మూలములగు చున్నవి.

సురచిర వస్త్వాత్పత్తి :- కల్పతరువు, అప్సరసలు, కౌస్తుభము, ఉచ్చైఃశ్రవము, ఐరావతము, లక్ష్మి, ధన్వంతరి ఒకదాని తరువాత నొకటి యుద్భవించినట్లు భీమఖండమున కలదు. హారవిలాసమున ఆది లక్ష్మి, చంద్రుడు, కల్పవృక్షాదులు, ధన్వంతరి, ఉచ్చైశ్శ్రివాదులు, రంభాద్యప్సరలు చింతామణి, నాగవల్లి, తులసి వనము, హారితి దూర్వాంకురములు ఉద్భవించినట్లు వర్ణితము.

4.4.1. సంస్కృత భాగవతము - హారవిలాసము :-

వ్యాసప్రణీత సంస్కృత భాగవతమును బమ్మెరపోతనామాత్యుడు ఆంధ్రీకరించుచు, భక్తి పారవశ్యముచే వర్ణనము లొనర్చుచు మూల శ్లోకముల కంటె అధిక పద్యరచన మొనర్చెను.

ఈ క్షీరసాగర వృత్తాంతమును పరీక్షిన్నరేంద్రునకు శుకమహర్షి తెల్పినట్లున్నది. ఆంధ్ర భాగవతమునసీ కథ అష్టమ స్కంధమున 185 గద్య పద్యములలో కలదు. రెండు గ్రంథములందును ఈ క్షీరాబ్ధి

8. శ్రీనివాసశర్మ, వేమూరి, పురాణగాథాలహరి.

వృత్తాంతము హరిలీలగ వర్ణితమయ్యె ఆంధ్ర భాగవతమున ప్రశ్నోత్త రావళి రూపముతో నారంభమగును. సంస్కృత భాగవతమున దుర్వాస శాప వృత్తాంతము లేదు. ఆంధ్రమున దుర్వాస శాపవిషయము పేరుకు మాత్రము పేర్కొనబడినది. కాగా బ్రహ్మ దేవతలతో బాటు దేవేంద్రుడు విష్ణువును పురుష సూక్తముతో స్తుతించి ఆతని ప్రత్యక్షీకరించి కొనినట్లున్నది. ఇది పోతనగారి బహుముఖ పాండిత్యమును హరిభక్తిని ప్రదర్శించును. హరియే ఓషధీలతలు సముద్రమున పడవైచి మందర శైలముతో త్రచ్చవలెనని తరణో పాయము సూచించుట, రెండింటను కలదు. గోత్రకలహము మానుటకై పాలసముద్రమును మథింపుడని హరియుద్బోధించి, సహాయ మొనర్చెద నని తెల్పి "మనమే అనుభవింపవలెనని కోరకుడు అట్లు కోరిన క్లేశముల పాలగుదు"రని వ్యాసుడు, విష్ణుమూర్తి దేవతలకు తెల్పినట్లు రచించెను. ఆ శ్లోకమిది.

> "న భేతవ్యం కాలకూటాత్ విషాత్ జలధి సంభవాత్ ।
> లోభః కార్యోరి నదో జాతుదోషః కామస్తు వస్తుషు."[9]

పాలసాగరమును దేవదానవులు హరిహరుల సహాయముచే సన్నాహ ముతో తాత్కాలిక ఐకమత్యముతో త్రచ్చిరి. లక్ష యోజన విస్తార మైన తాబేటి రూపమున హరి మునుగుచున్న పర్వతమును పైకెత్తెను. కాలకూట ముద్భవింపగా లోక సంక్షోభము కానీక పార్వతీదేవి, శివుని కాలకూటము నుండి కాపాడమని వేడినది. ఇట్లు ఆ దేవి కోరుట రెండు గ్రంథములందున్నను ఆంధ్ర మహాభాగవతమున నీ క్రింది పద్యములు లోకాతిశాయియైన సౌందర్యమును పోషించుకొన్నవి.[10] పరీక్షి న్నరేంద్రుడు –

---

9. వ్యాసుడు – సంస్కృత భాగవతము–25 శ్లో.
10. లక్ష్మీరంజనం, ఖండవల్లి, హారవిలాస పీఠిక; 1928.

అమరన్ లోకహితార్థమంచు నభవుండాగాక యుండాడెబో
యమరుల్ భీతిని మ్రింగవేయ నిరివో యంభోజ గర్భాదులుం
దముగావన్ హర! లెమ్ము లెమ్మనిరివో తాజూచి కన్గంట న
య్యుమ ప్రాణేశ్వరు నెట్లు మ్రింగుమనె నయ్యుగ్రానల జ్వాలలన్.
(ఆం. భా. 8-240)

అనిన శుకుం డిట్లనియె.

క. మ్రింగెడు వాడు విభుండని
మ్రింగెడిదియు గరళమనియు మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వమంగళ
మంగళ సూత్రంబు నెంత మది నమ్మెనొ! (ఆం. భా. 8-241)

భాగవతమున హాలాహాల భక్షణఘట్టము మిక్కిలి ఉదాత్త కరుణముగ నున్నదని, శ్రీనాథుని హరవిలాస క్షీరాబ్ధి కథనము యాదృచ్ఛికముగ నుండి అంత రసవంతముగా లేదని శ్రీ లక్ష్మీరంజనం గారనిరి[11].

ఆంధ్ర మహాభాగవతమున బ్రహ్మాది దేవతలు శివుని అష్టమూర్తిత్వమును '7' వ పద్యములో స్తుతించినట్లుండుట విశేషము. కామధేనువు హాలాహాలము తరువాత పుట్టినట్లు కలదు. లక్ష్మీదేవి చివరవ జన్మించినట్లుండగా లక్ష్మి మంగళస్నానమును 12 పద్యములలో పోతన వర్ణించెను. సంస్కృతమున లక్ష్మీదేవి మంగళస్నానమునకై దిక్పాలకులు విశ్వకర్మ మొదలగు వారు దివ్యాభరణములు తెచ్చియిచ్చినట్లు కలదు. లక్ష్మీనారాయణుల వివాహమును దర్శించి అందరును ఆనందించిరి. అమృతమును పంచిపెట్టుటకై విష్ణువు మోహినీ అవతారముతో వచ్చి సత్యామృతమును దేవతలకు. అనృతామృతమును దానవులకు పంచిపెట్టుట రాహుకేతువుల శిరః ఖండనము రెండింటను సమానమే.

11. లక్ష్మీరంజనం, ఖండవల్లి, హరవిలాస పీఠిక; 1968.

శివుడు హాలాహలమును గ్రహించునపుడు కొంత నేల చిందుటచే పాములు, తేళ్లు గ్రహించిన వని పేర్కొనబడినది. హాలాహల భక్షణ గాథ చదివిన వారలకు పాము, తేలు అగ్ని బాధలు జనుల కుండదను ఫలశ్రుతి ఆంధ్ర గ్రంథమున నుండుట భక్తితత్త్వమును బోధించుటకే అనవలెను.

హరవిలాసమున ఆదిలక్ష్మి పుట్టిన రెండు ఘడియలకు చంద్రు డుదయించినట్లు కలదు. కాని చంద్రుడు లక్ష్మికగ్రజుడనుట సుప్రసిద్ధ మగుటచే భాగవతమున అష్టమ స్కంధమున (265-266) అట్లే చెప్ప బడినది. విజయవిలాస మనుచరిత్రలు భాగవతమునే యనుసరించు చున్నవి. హరిహరులకు సమాన ప్రాధాన్యము నిచ్చుచు, హరవిలాస మున శ్రీనాథుడు హరి సతి ఆదిలక్ష్మికి ప్రాముఖ్యము నిచ్చి, ఆదిలక్ష్మి జన్మించిన పిదప చంద్రుడుదయించినట్లు వర్ణించియుండును.

దేవదానవులు "ఇప్పుదార్థంబు మాకుంబంచి పెట్టుము" అని మోహినిని కోరగా నామె నా నేర్చిన విధంబున సుధారసంబు వడ్డిం చెద" అనుట చమత్కారముగ నున్నది. 'నానేర్పుకొలది మీకును మానుగ విభజించి యిత్తు' (కన్కం. 311) నని భాగవతమునందును ఇట్లే కలదు. మోహిని వడ్డనలో "పంక్తి మధ్యంబున నిల్చి కంకణ ఝుణ ఝుణత్కారంబు తోరంబుగా" ఇత్యాది వచనము భీమఖండమునందలి అన్నపూర్ణ వ్యాసాదులకు వడ్డించినప్పటి వచనమును పోలియున్నది.[12] సురుచిర వస్తు సముదాయమును బ్రహ్మాది దేవతలు ఆయా వ్యక్తుల కిచ్చినట్లును అంధక కాలకేయాదులు దొమ్మిచేసి అమృతమునపహరించి నట్లును హరవిలాసమున వర్ణితము. కరకకాయ, తులసి, నాగపల్లి,

12. గాండీవి, సాహిత్య పరిషత్పత్రిక; వికారి, సం-48.

అమృత మథన సందర్భమున వెలువడినట్లు వర్ణింపబడుట హారవిలాస మున విశేషాంశము.

సముద్రమును మథించునపుడు కల్గిన సంక్షోభమును వర్ణించుచు కవి గంగకు భంగంబును గోదావరికి ఖేదంబును, పెన్నకు విన్నబాటును గాళిందికి మాలిన్యంబును వేత్రవతికి విత్రాసంబును నాపాదించుననుటలో ఆతనికి స్వదేశాభిమానము పొండసి స్వదేశస్థ నదీనదములను గూడ ప్రస్తావన వశమున పేర్కొనెనని తెలియును.

దుర్వాస శాపము, వినాయక షోడశోపచార పూజ, దండకము, శివుని పంచకందములలో స్తుతించుట, హారవిలాసమున ప్రత్యేకముగ పేర్కొనదగిన విశేషములు. కార్యప్రయోగ రక్షకుడైనవాడు శివుడని తెల్పి ఆ మహా ప్రారంభమునకు సాధన సంపత్తిని సమకూర్చినవాడగు టచే శివపారమ్యత ఉగ్గడింపబడి శివలీలగ పర్యవసించినది. మహాకార్య ప్రారంభమున విఘ్ననాయక పూజ సవిస్తరముగ వర్ణింపబడుట విఘ్న శాంతికే యని తెలియుచున్నది.

— ••• —

# 5. కిరాతార్జునీయము

5.0. వ్యాసప్రణీత శ్రీమద్భారతేతిహాసమున వనపర్వములో నీకథ కలదు. అర్జునుని పరాక్రమమును పర్యాప్తీకరించు నివాతకవచ పౌలోమ కాలకేయ సంహారములు పార్థుని మనోనిగ్రహమును తెల్పెడి ఊర్వశీ ప్రణయ భంగ వృత్తాంతము వనపర్వమున 162, 166 అధ్యాయోపలబ్ధములు.

సంస్కృత మహాభారత వనపర్వమున చిత్రింపబడిన అర్జునుని జీవిత సంఘటనల నాధారముగ భారవి 'కిరాతార్జునీయ' మహాకావ్యమును కళాత్మకముగ '18' సర్గలలో విస్తరీకరించి సంతరించెను. కాని, ఉపకథలగు పౌలోమ కాలకేయాది సంహార వృత్తాంతము లిందులో లేవు.

ఈ కథనే నన్నయ ఆంధ్ర మహాభారతారణ్యపర్వమున సంక్షిప్తీకరించి రచించెను. మూలోపకథలను కూడ నన్నయ స్వీకరించెను. కాని, కిరాతార్జునీయ వృత్తాంతమునకు ఉపకథలకు గల సంబంధము మృగ్యము.

పైన పేర్కొనిన సంస్కృత మహాభారతము, భారవి కిరాతార్జునీయము ఆంధ్ర మహాభారతము హరవిలాసమందలి కిరాతార్జునీయ కథకు మూలగ్రంథములని పక్కాణింపనగును.

సంస్కృతాంధ్ర మహాభారతములందు అర్జునుని దేవలోకపు ప్రయాణము, అట ఊర్వశీ ప్రణయ భంగము, నివాత కవచ పౌలోమ కాలకేయులను ఇంద్రాదేశమున పార్థుడు సంహరించుట యాదిగాగల వృత్తాంతములు కలవు.

శ్రీనాథుడు హరవిలాస సప్తమాశ్వాసమున తన శివభక్తి తత్పరతను వెలార్చుట కనువుగ అర్జునుని తపముతో ప్రారంభించి, కిరాతార్జు

నీయ వృత్తాంతము ద్వారమున పాశుపత శైవమును, బ్రహ్మోపాసనా తత్పరతను తెల్పుచు ప్రత్యేక శివలీలా విలాసముగ చిత్రించెను. అర్జునుని పాత్ర పోషణమునకు సంబంధించిన అవాంతర కథా విషయాదికములగు ఊర్వశీ వృత్తాంతమును, నివాత కవచ పౌలోమ కాలకేయాది సంహారాది కథల ననుసంధించి ప్రత్యేక ప్రబంధమనదగు రీతిని వెలయించెను.

ఇంద్రతనయుడు ఇంద్రకీల పర్వతముపై ధర్మజ నిర్దిష్టుడై తొలుత ఇంద్రుని గూర్చి తపమాచరించి పిదప ఇంద్రుని నిర్దేశముననుసరించి పశుపతి నారాధించుట, అస్త్రసంపాదనమునకై మహాశివునితో యుద్ధ మొనర్చి తుదకు లోకరక్షకము, రౌద్రమగు పాశుపతమను దివ్యాస్త్ర మును బడయుట ప్రధాన విషయము. దేవేంద్రాహ్వానముతో కిరీటి స్వర్గమున వివిధ సత్కృతులను పొంది ఊర్వశీ ప్రణయ భంగ మొనర్చి తండ్రియాదేశమున నివాత కవచులను పౌలోమ కాలకేయులను పాశు పతాస్త్రముచే సంహరించుట ఇందలి అవాంతర కథాకుసుమములు.

ఈ యాఖ్యానమున నూట తొంబదియేడు గద్య పద్యములు కలవు. శివార్జునులు కిటికై మల్లయుద్ధము, ద్వంద్వయుద్ధము, ఎక్కటి కయ్యము లొనర్చుట ఈ యాఖ్యానపు ప్రత్యేకత. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు భారతారణ్య పర్వమున గల కథ కిది విస్తృతి యని శ్రీనాథుని కవితా శయ్యయిందు నిగనిగలు దేరియున్నదని యిది యొక స్వతంత్ర కృతి యనదగినదని[1] పేర్కొనిరి.

అన్ని యాశ్వాసములకంటె నీ యాశ్వాసమున శ్రీనాథ మహా కవి శబ్దార్థోభయ ప్రధానమైన, నిరర్గళ ధారాశుద్ధిగల శైలి ప్రస్ఫుట మగుచున్నది.

---

1. ప్రభాకరశాస్త్రి, వేటూరి; పీఠిక – హరవిలాసము, 1938.

శివార్జునుల సంభాషణ సందర్భమున హాస్యము యుద్ధ సందర్భమున వీరము, అర్జునుడు ఘోర తపమొనర్చునపుడు శాంత వీరములు పోషితములై శ్రీనాథుని రసపోషణా వైదగ్ధ్యమును వెలార్చినది.

హరవిలాసమున గల కథకును తదితర గ్రంథముల గల కథకును గల భేదసాదృశములను పరిశీలించినచో ఈ కథకు గల ప్రాశస్త్యమును, కథా ప్రణాళికలో నీ కథ సాధించిన ప్రయోజనమును స్పష్టముకాగలదు.

5.1. ఫల్గునునిబ్రహ్మోపాసనా తత్పరత :

"పశుపతిం గుఱించి తపంబు సేయుము తత్ప్రసాదంబున నీకుం జయంబయ్యెడు" అన్న ఇంద్రుని పల్కుల నాదరించి ధనంజయుడు అభవు గూర్చి యింద్రకీలాచలముపై నేకనిష్ఠతో ధీరుడై ఘోర వీర తప మొనర్చెను. అతని పాశుపత దీక్షారంభ మిట్టిది :-

'భసితోద్ధూళిత నిర్మలావయవుడున్ బంచాక్షరీ సంతతా
భ్యసన వ్యాప్తి పరాయణుండును, శివధ్యానాను సంధాతయున్,
మసృణ స్నిగ్ధ తరక్షు చర్మమయ కంథా భద్ర పీఠుండునై
యసమస్థేమ గిరీటి పాశుపత దీక్షారంభముం గైకొనెన్.'
(హర. 7-29)

ఆశ్వాసారంభమున ద్యూత పరాభవమున నగు చేతోదుఃఖమున, భ్రాతల యనుమతితో శత్రువ్రాత జయార్థమై మది విపస్ఫూర్తి గురిగా ధనురస్త్రముల కేల బూల్చి శరధి ద్వంద్వంబు నేర్పార వీపున బంధించి, కవచియైనను, ధర్భాంకురములు, కత్తళముతోడ పుండరీకము తోలుదాల్చి క్రీడి విరుద్ధ తప మొనర్చెను. ఈ తపో వేషధారణమునకు పై చెప్పిన పద్యమందలి పాశుపత దీక్షా వేషధారణకు భేదమొంతేని కలదు.

ఇట విభూతి నలదికొని తోలుబొంత ధరించి పంచాక్షరి జపించుచు, అనన్య స్థైర్యముతో శివధ్యాన మొనర్చు పాశుపత దీక్షను

కిరీటి చేపట్టినవాడు. అంతేగాక శివుని పలుకాలములయందును పూజించెను. అరుణోదయ తపనోదయ సంగవ, మధ్యాహ్న సంధ్యా అర్ధ నిశాసమయములలో ధూర్జటిని పూజించుటను కవి వర్ణించి తన ఈశ్వరార్చనాభిరతిని వ్యక్తమొనర్చెను. తపశ్చర్య పట్లగల అర్జును నియమ నిష్ఠాదులు, కార్యదీక్ష, ఆత్మవిశ్వాసము సువిదితములు.

శ్రీనాథుడు వీరశైవవర్ణనలనుచేసినను బ్రహ్మోపాసన నొనర్చెనని తెలియుచున్నది. శ్రీనాథుడు ప్రతిచోట శివార్చనా నిరతిని వ్యక్తపరచుచు పంచబ్రహ్మ మంత్రముల నుదాహరించెను. వీరశైవ సిద్ధాంతము ప్రకారము మున్మూర్తులలో నొకడైన బ్రహ్మకు శివునకు సఖ్యమే లేదు కాని శ్రీనాథుడు పాల్కురికి సోమన సూచింపని పంచబ్రహ్మమును సూచించి తన కావ్యములోని భక్తునిచే నీక్రింది విధముగ పంచబ్రహ్మ మంత్రమును పఠింపచేసెను.

> 'పంచబ్రహ్మ షడంగ బీజముఖర ప్రాసాద పంచాక్షరీ
> చంచన్మంత్రి పరంపరా పరమ నిష్ఠా తత్పరత్వంబునన్,
> మంచుం గొండ యనుంగు పెండ్లి కొడుకున్ మధ్యాహ్న
> కాలంబు సే
> వించున్ నిర్జర రాజసూనుడు మనోవీథీ సదా ధ్యాసితన్ !
> (హార. 7-38)

శ్రీనాథుడు హరవిలాసముననే గాక కాశీఖండ నైషధ భీమఖండ ములందు పంచబ్రహ్మముల నారాధించెను.[2] ఏతన్మూలమున శ్రీనాథుడు వీరశైవమత వర్ణనములుగా చేసియు బ్రహ్మోపాసనా తత్పరుడయ్యెనని వ్యక్తమగును.

---

2. i) భీమఖండం-4 అ-పంచబ్రహ్మ షడంగ మంత్రమాలతో ప్రాసాద పంచాక్షరిన్,
ii) కాశీఖండం-1 అ-చంచల్లీలల... ప్రాసాద పంచాక్షరిన్
iii) శృంగారనైషధం-8 అ-110-పద్మాసనస్థుడై...పంచబ్రహ్మ పంచాక్షరంబుల

కాగా, సంస్కృత వీరశైవ వాఙ్మయమున పంచస్తవిలో నొక్కటైన మల్హాణమున ఈ బ్రహ్మోపాసనకు బీజములున్నవని, వైదిక వాఙ్మయమున పంచముఖులైన ప్రాచీన దేవతలలో నొకరైన విశ్వకర్మ పరమేశ్వరునికే పంచబ్రహ్మమూర్తి యనియు, విశ్వబ్రహ్మమూర్తి యనియు ఆర్ష వాక్యమున్నట్లు తెలియుచున్నది.[3]

లింగ పురాణమును లింగ ధారణ విధిలో పంచబ్రహ్మోపాసన ప్రాముఖ్యమును తెల్పుచున్నది. ఆంధ్ర లింగ పురాణము శివునకు పంచముఖములున్నట్లు తెల్పినది.[4] శివునకు చతుర్ముఖ బ్రహ్మకు సామ్యము కుదరదు. కనుక పంచముఖుడైన విశ్వకర్మకును పంచముఖుడైన శివునకును అభేదము ప్రతిపాదింపబడి ప్రాచీనమైన విశ్వకర్మ సంప్రదాయమునకును సంబంధము సుస్పష్టముగా నున్నదని శ్రీ నాగేశ్వరరావు అభిప్రాయపడిరి.[5]

### 5.2. పాశుపత శైవ ప్రాముఖ్యము :-

హరవిలాస చతుర్థాశ్వాసమున పార్వతి తపోదీక్షితురాలగుటను "పాశుపత దివ్య దీక్ష చేపట్టె గౌరి (హర. 4-10) అనియు," పాశుపత దివ్యదీక్షా విభాసమాన

"దివ్య తేజో విశేష సందీప్త మూర్తి" - (హర. 4-13)

అనియు వర్ణించి పాశుపత శైవ ప్రాముఖ్యము నుగ్గడించెను. అట్లే కిరీటి పాశుపత దీక్షను స్వీకరించిన విధమునుకూడ వ్యక్తీకరించెను.(హర.7-29)

ఈ పాశుపత దీక్షా సంప్రదాయము ఆంధ్ర దేశమున వెలసిన ఆరాధ్య శైవమునకు సంబంధించినదని ఆరాధ్య సంప్రదాయ ప్రవర్తకులగు మల్లికార్జున పండితారాధ్యుల చరిత్రమును శ్రీనాథుడు పద్యకావ్య

3. నాగేశ్వరరావు, పెదపాటి - శ్రీనాథుని పంచప్రాణములు, పుటలు 40-41.
4. యజుర్వేద అష్టకం - 4 - పన్నం 8 - అను 2, 4. లింగపురాణము, పుట-246.
5. నాగేశ్వరరావు, పెదపాటి - శ్రీనాథుని పంచప్రాణములు - పుట 45.
[విశ్వకర్మా పరబ్రహ్మ జగన్నాథ సూత్రికః, తన్ముఖాని తుశై పంచబ్రహ్మేత్యదాహృతమ్ - వశిష్ట పురాణము - అధ్యా-8]

ముగ ననువదించి యుండుటచే నాతడు వీనినన్నింటిని చక్కగా గ్రహించెనని కీ.శే. నిడుదవోలు వేంకటరావుగారు తెల్పిరి.[6]

ఈ పాశుపత దీక్షను రావణ సంహారార్థమై రాముడు స్వీకరించి నట్లు పద్మపురాణమున నిగదితమైనదని దీనినే 'విరజాదీక్ష' యని కూడ నందురని దీని విధానము సమస్తమును భగవంతుడైన యగస్త్యుడు శ్రీరామచంద్రునకు 'శివగీత'లో నుపదేశించెనని శ్రీ టి.బి.యం. అయ్యవారు తెల్పిరి.[7]

సద్యోజాత వామదేవాఘోరేశాన తత్పురుషు లను పంచ ముఖములున్న లింగస్వరూపుని గూర్చి శైవాగమములు పేర్కొనినవి. ఈ శివుని పంచముఖములును పంచబ్రహ్మలను నామమున వ్యవహరింప బడును. పరమాత్మ, ప్రపంచము, బుద్ధి, యహంకారము మరియు భక్తి విజ్ఞాన తత్వములను ఐదు లక్షణములను ఆలింగస్వరూపునికి నాపాదించిరి. ఈ పరమేశ్వరుని గూర్చి నారాయణోపనిషత్తునందలి తైత్తిరీయ అరణ్యకమున (X-43-7) సద్యోజాతాది మంత్రములలో వివరణము కలదు. వేదభాష్యకారుడైన సాయణాచార్యులు శివుని పంచభూత శక్తి స్వరూపునిగ పేర్కొని నాల్గుముఖములు నలుదిక్కుల, పై లింగరూపము ఈశానునిగా ఆకాశమును చూచుచున్నటుల వివరించియుండెను.

క్రీ.శ. 5వ శతాబ్దినాటి విష్ణుధర్మోత్తర పురాణమున 'శంభో ర్వదన పంచకమ్'-అను సుబోధన, కారణాగమమున పంచముఖ లింగ మును 'శరాననమ్' (ఐదు ముఖములుగల బాణము) అని వర్ణితమగుట చేతను, అపరాజిత పరిపృచ్ఛమను వాస్తు గ్రంథమున ద్వాదశ రుద్రా రాధనలో పంచముఖ మూర్తుల ప్రసక్తి యుండుటచేతను ఈ సదాశివ తత్త్వము ప్రాచీనమని తెలియుచున్నది.[8]

---

6. వేంకటరావు, నిడుదవోలు – భారతి 1954.
7. అయ్యవారు, టి. బి. యం. – భారతి 1964 (ఏప్రిల్)
8. కార్తికేయశర్మ, ఇంగువ; భారతి, నవంబరు 1980.

ఈశాన్య శివుని స్వరూపము యోగీశ్వరులకు గూడ అంతు పట్టదని రూపమండనమున చెప్పబడినది. పాశుపత శైవులు సద్యోజాతాది మంత్రములను బీజమంత్రములుగ నుపాసించిరి. ప్రతి మహామంత్రమునకును ఋషిచ్ఛందో దేవతా బీజశక్తి కీలకములను ఆరు అంగము లుండును. 'ప్రాసాద పంచాక్షరి' యనగా 'హ్రీం' నమశ్శివాయ మంత్రము. అర్జునుడీ మంత్రము నేయేల జపింపవలయు నను సందేహము సాధారణముగ మనకు పొడమును. అందరును శివార్చనము చేయునపుడు జపించునది 'ఓం నమశ్శివాయ' యను మంత్రము మాత్రమే ప్రసాద పంచాక్షరిలోని 'హ్రీం' యను బీజమున హకార రకారములను రెండు వర్ణములు కలవు. ఇందు హకారము శివాత్మకము. రేఫ మగ్నిదేవతాత్మకము. శత్రు సంహారాభిలాషి గావున నగ్నిదేవతాత్మకమైన యీ వర్ణముతోడి బీజము ననుసంధించి యర్జునుడు పంచాక్షరిని జపించెను. మంత్ర శాస్త్ర పరిచయము గలవారికి అర్జునుని ప్రసాద పంచాక్షరిని జపించుటలో గల ఔచిత్యము గమ్యమానమగునని మంత్ర మహోదధిని జల్లుకించిన మనీషి శేఖరుడగు శ్రీనాథు డట్టి రహస్యములను సంప్రదాయములను హర విలాసముననే గాక కాశీ ఖండమునందును నిక్షేపించెనని శ్రీ టి. బి. యం. అయ్యవారు తెల్పిరి.[9]

హసిత గీత నృత్య వాద్య హుడుక్కా నమస్కారములతో పంచముఖు నర్చింపవలెనని, నమశ్శివాయ యనునది పంచాక్షరి యని ఓంకారముతో గూడిన పంచాక్షరిని ప్రణవ పంచాక్షరి లేక షడక్షరి యందురని కీ. శే. నిడుదవోలు వేంకటరావు తెల్పిరి.[10]

---

9. అయ్యవారు, టి. బి యం. భారతి, ఏప్రిల్ 1964.

10. వెంకట్రావు, నిడుదవోలు, భారతి 1954.

పైగా బిల్హణకవి రచితమైన బిల్హణీయ శివస్తుతి యందు ఈ క్రింది శ్లోకమునుండి శ్రీనాథుడీ "పంచబ్రహ్మ షడంగ, బీజముఖర ప్రాసాద పంచాక్షరి" నిగ్రహించెనని వారే తెల్పిరి.

'పంచబ్రహ్మ షడంగ బీజముఖర
ప్రాసాద పంచాక్షరీ
వ్యోమ వ్యాపి పురస్సరేషు మనుషు
ప్రౌఢిః కుతోవరా దృశాం' — (బి. శి-శ్లో.)

అర్జునుని 'పాశుపత వ్రతనిష్ఠా గరిష్ఠతకు' సంతసిల్లిన ఖండ పరశుడు 'త్రిపుర దైతేయ సుందరీ వదనారవింద వాసరా వసాన సంధ్యాసమయ సమారంభంబును, గరటి దనుజ కుంభ కూట కూట పాకల జ్వర శిరస్తోమంబును, జలధర వ్యూహ ఝంఝూ సమీరం బును, నంధకాసుర ప్రద్యోతిన ప్రభామండలంబును, శార్దూల దానవారణ్య హవ్యవాహంబును నగు పాశుపతాస్త్రంబు సంప్ర యోగంబు సోప సంహారంబు, సకీలకంబు సరహస్యంబుగా" (హర 7-103) నుపదేశించెను.

దేవేంద్రుడు అర్జునునితో "హిరణ్య పురవాసులు నివాత కవచ కాలకేయాదులగు దైతేయులు రాజ్యలుబ్ధులై నాకంబున కనేక ప్రకారంబుల నుపద్రవం బాపాదించుచున్నవారు. వారిం బరి మార్చి నమరావతీ పురంబున గొన్ని దినములు వ్రతోపవాస ప్రయాస ఖేదం బపనయించి మధ్యమ లోకంబునకుం గ్రమ్మఱ నేతెంచునది" (హర 7-107) అనుటవలన అర్జునుడు పాశుపతాస్త్ర లాభమొందిన మీదట అమరావతికి వెడలు అవకాశము అట ఇంద్ర ప్రార్థనచే రాక్షస నిహనన మొనర్చుట పాశుపతాస్త్ర ప్రయో గమునకు తగిన సందర్భము ఏర్పడినది. ఇట భారతమునగల ప్రథమ

చతుర్థాశ్వాసముల కథకు పొందిక నేర్పరిచి కథ ననుస్యూతముగ శ్రీనాథుడు నడిపెను. అర్జున వీరము, శీలనైగనిగ్యము ప్రస్ఫుటముగు కథాంశములను కవి జోడించెను.

ఆ పాశుపతాస్త్రము "విశ్వ భువనోపకృతి ప్రతిపాదనైక సౌభాగ్య దురంధరము "కిరీటి" తపఃక్రియా యోగ్యతచే" పొందెను. ఇంద్రాచార్యకముగ తప మొనర్చినను, "బాహాబలాటోప పరిపాటి" ఈశాను మెప్పించి పడసినట్టి దివ్యాస్త్రము పాశుపతము. అది సుపర్వ హితార్థంబై" భుజ గర్వోన్నతి ప్రాపున దేవేంద్రుని పంపున జలనిధినున్న ఘోరదానవులు, మూడుకోట్ల వారలగు నివాత కవచులనుగాక అసమాన బలులు సురలోక కంటకులను నుఱుమాడుటకై ప్రయోగింపబడినది.

కనుక దశవిధ శైవములలో నిష్ఠ లింగధారణము నంగీకరించిన శైవమే వీరశైవమని పాశుపత శైవము వీరశైవమత శాఖయేయని తెలియుచున్నది. శ్రీనాథుడు ఆరాధ్యశైవ బ్రాహ్మణుడగుటచే[11] వీరశైవమత మవలంబించెనని స్పష్టమగును.

5.3. సన్నివేశ చిత్రణము – సజీవ పాత్రపోషణము:

సన్నివేశములను కన్నులకు కట్టినట్లు రసవత్తరముగ చిత్రించుటలో శ్రీనాథుడు అందెవేసిన చేయి. ఇంద్రార్జున సంవాద ఘట్టమిందులకు తార్కాణము.

ప్రత్యనీక విజయశ్లాఘాభిలాషచే పంచానల మధ్యమున

'గాండివముతోడ నొక యోగదండ యష్టి,
యస్త్రములతోడ గొన్ని ధర్మాంబరములు,

---

11. తమ్మయ, బండారు, ఆంధ్రపత్రిక ఉగాది సంచిక; రుధిరోద్గారి 113; 1923-24

కత్తళము తోడ బుండరీకంబు తోలు
దాల్చి క్రీడి విరుద్ధపుఁదపము చేసె.' (హర 7-7)

త్రికరణశుద్ధిచే కుమారుఁడొనర్చు తపమునకు విఘ్నమాపాదింప నొక బ్రాహ్మణ వేషధారియై ఇంద్రుడు వచ్చిన తీరు అద్భుతముగ వర్ణితము:

సీ. తెల్లని గడ్డంబు తెల్లని మీసముల్
నరసిన రోమ పాండుర శిరంబు
మేధావి బొట్టును మెఱుఁగు జన్నిదముల
భూతి లలాట త్రిపుండ్రకంబు
గావి దోవతియును గంధోత్తరీయంబు
నిష్టికోలయుఁ జింక నిత్తితోలు
బంచాంగ ముష్టియుఁ బాణిబవిత్రంబు
నొక్క వ్రేలికి వెండి యుంగరంబు

జాఱుబొజ్జయు గుశ దర్భ సంచెలయును
నెడమ కేలను నిడుకోల గొడుగుదాల్చి
తనకు సజ్ఞాతిగా నొక్క తపసి వృద్ధ
బ్రాహ్మణుడు వచ్చె నొయ్యెయ్యఁ బార్థుకడకు. (హర 7-12)

ఇట ఇంద్రుని వృద్ధ తపస్వి వేషవర్ణనము సహజ సుందరము సాక్షాత్కారమునై యున్నది. జారుబొజ్జ, నరసిన మీసములు, గడ్డము, రోమపాండుర శిరము, వృద్ధాప్యమును సూచింప తపస్సన్నద్ధముగుచు త్రిపుండ్రధారియై కావివస్త్రధారియై పంచాంగముష్టి, పవిత్రములతో ఇష్టికోలతో కుశదర్భ సంచెలతో ఇంద్రుడు వచ్చినటుల వర్ణించుట స్వభావోక్తియుతమై యున్నది. శ్రీనాథుడు ఇంద్రుని తెల్లని రూపమునకు సరిపోవునట్లు అతని వ్రేలికొక వెండి

యుంగరము నుంచుటను మరచిపోలేదు. తపోవనమున తపస్విల కను రూపమగు రూపమును దాల్చెనని, కవిసన్నివేశాను గుణముగ పైవర్ణనము నొనర్చెను. పైగా ఇంద్రుని మాటతీరు చమత్కార పూరితమే నీ పంచన నేను తపముచేయ వచ్చితినని క్రూర మృగబాధ లేకుండ రక్షింపుమని వేూరకుని చందమున నీర తార చూపులతో నిష్పచ్చరంబైన భాషణములతో నాస్తికునివలె మాటాడుచు ఇంద్రుని గూర్చి తప మేల యొనర్చెదవని ఆతని గూర్చి తపము చాలింపుమని వృద్ధ విప్రవేషధారియైన యింద్రుడు అర్జునునితో నిట్లనినాడు.

ఈశ్వరునిఁగూర్చి చేసెద వేని లెస్స
మాధవుని గూర్చి చేసిన మాకు హితవు
బ్రహ్మఁగూర్చి చేసిన నది ప్రార్థ్యతరము
తగునెయిల వజ్రధరుఁ గూర్చి తపముసేయ? (హర 7-20)

మరియు ఆ తపమొనర్ప నున్నవానికి ఇంద్రుడు గౌతమునింట జేసిన కామగోష్ఠి ఎరుగడని యింద్రుడు తన్ను గురించి తానే తేలికగా పల్కుట యిట రసవత్తరమై యున్నది.

ఆ సహస్రాక్షుని యాత్మ సంశుద్ధికి
బరమ సంయమి యింటి పంచసాక్షి
యానిర్జరేంద్రు బాహా విక్రమమునకు
భుజగాంతకుని యాక పోక సాక్షి
యా సునాసీరు నహంకార గరిమకు
నిషధాచలము మీఁది సెలవు సాక్షి
యా శచీవల్లభు నౌచిత్యకలనకు
దాపసు చేతి పూదండ సాక్షి

యిట్టి దేవేంద్రు వలన నీవేమి ఫలము
వడసెదవు చాలు నీ వాంఛ పాడుగాను
వాడు నీకంటె నేమిట వాసి గలడు
తగదు చాలింపుమీ విరుద్ధంపు దపము. (హర 7-22)

ఇందు ఇంద్రుని యాత్మ విమర్శన ద్వారా శ్రీనాథుని సుకుమార పరిహాస చతురత వ్యక్తమగును. కామగోష్ఠి పద సృష్టిచేతను, 'వాడు నీకంటె నేమిటి వాసికలడను' ఎత్తిపొడుపులోను శ్రీనాథ కవి వరేణ్యుని నిండైన తెలుగు దనము తొణికిసలాడుచున్నది.

ఇంద్రుడు వృద్ధ బ్రాహ్మణ వేషముతో వచ్చి యింద్రుని నిరసించునట్టి కల్పనము, కపట వటువు పార్వతి కడకు వచ్చి శివుని దూషించిన కుమారసంభవ కథ కనుసరణ మన్పించును.[12]

కన్నడ భారత కర్తయగు కుమార వ్యాసుడు —

అరస కేళై విప్రవేషవ
ధరసి ధరెగిళిదను సురేశ్వర
తర హరిస దీమాత సెందను నిజకుమారంగె
మరిచి మౌక్తిక లోహ హేమా
భరణ చర్మదుకూల మిళిహో
దరియ మూవిన దండెగేక నివాస వేకెంద. (అర 4-44)

అని వర్ణించుటలో ఇంద్రుని విప్రవేషమున విశేషము లేదు. అట్లే కిరాతార్జునీయ ప్రణేతయగు భారవి మహాకవియు నిప్పట్టున నిర్విశేష ముగ నింద్రియ జయమును గూర్చి శమదమముల గూర్చి సుదీర్ఘోప న్యాసము నిచ్చిన ట్లీ క్రింది శ్లోకము తెల్పును.

---

12. గాండీవి, సాహిత్య పత్రిక—సంపుట—48 వికారి.

జీయంతాం దుర్జయా దేహి! రిపవశ్చక్షురాదయః
జితేషు సమలోకోయం తేష కృత్యన్త్వయాజితః.
(కిరా 11-32)

పై రెండు గ్రంథములలో శుద్ధ శ్రోత్రియుడై పరిహాస ప్రౌఢిమ నెరుగని వాక్కులతో కన్పట్టువాడే యింద్రుడు. మరి శ్రీనాథుని యింద్రుడు వాక్చతురతను వాక్పటిమను గల్గిన వాడుగ కన్పించుచున్నాడు. గడుసరియై, మాటకారియై, ఎదిరి హృదయము నొక నూపు సూపగలవాడై యొప్పినవాడ. సాధారణ పురోహిత రూపముగాక, భారవి వృద్ధ బ్రాహ్మణ కృత్రిమాలంకార ధారణ భారుడు గాక, సహజముగ జీవముతో తొణికిసలాడుచున్నాడని కుమార వ్యాసుడు సముచిత రూపకల్పననే చేయడయ్యెనని టి. బి. యం. అయ్యవారు తెల్పిరి.[13]

పై ఇంద్రార్జున సంవాద ఘట్టమేగాక, కిరాతార్జున వివాద సన్నివేశ చిత్రణములో శ్రీనాథుడు విశేష ప్రజ్ఞను, స్వతంత్రతను ప్రకటించెను. పాఠకులను శివుడు మాయాభిల్లరూపమున అర్జునుని పరాక్రమమును పరీక్షింప వచ్చెనని అదివరకె తెలియుటచే వారి వివాదము సరసమై సంతసము గూర్చును. వారు పరస్పరము ఎచట యుద్ధవిరమణ చేయబోయెదరో యని పై పందెములు వేయుచు యుద్ధమునకు తలపడి ఎక్కటి కయ్యము ముష్టియుద్ధ మొనర్చిరి. వారిరువురి వాదనము రసవంతము, సహృదయైక వేద్యము.

"కిరాత వేషధారియగు పురారి ఓంకార చాపంబు నేల నిలువబెట్టి తదీయ శిఖరమున నరచేయి మోపి యొరగి యొయ్యారంపు నిలుకడ నిలిచి వలకేల వాలము ద్రిప్పుచు గట్టెదురనున్న జగజెట్టి యగు నింద్రుని పట్టం గనుంగొని ప్రావృషేణ్య పయోవాహ గర్జా గంభీరంబైన స్వరంబున నింద్రకీల గిరిగహ్వరంబులు ప్రతిధ్వని

13. అయ్యవారు, టి బి. యం. భారతి, ఏప్రిల్, 1964.

రెుసగ సాటోపంబుగా సగర్వంబుగా సావష్టంభంబుగా సిట్లనియె''- (హర 7-49) ఈ గద్య వారిరువురి సంభాషణా వైఖరిని తెల్పు ఘట్టము లోనిది. కోపావేశములతోను, గర్వముతోను ఔద్ధత్యము తోను పురారి వివాద మారంభించునపుడు ఎట్లు నిలిచెనో, కంఠ స్వరము ఎట్లు పెంచెనో ఆ స్వరము ఎట్లు ప్రతిధ్వనించెనో యను విషయాదికములు సర్వము స్పష్టము. రసవత్తర సన్నివేశమునకు పుష్టినిచ్చు పై యంశములను శ్రీనాథుడు పూస గ్రుచ్చినటుల వర్ణించెను.

''ఎవడవురా బాహు దర్పమా? నన్నెరుగవా? నా పంది నేల వేసితివి? నా చెంచెత వేడ్క యెల్ల చెఱచితివి కదరా? తపసివై ఉండి ధనువుబట్టితి వేలరా? కపట ధార్మిక? అత్యంత కలుషాత్మ! నా పందినేయ నీ వెవ్వడవు? తపసివి కనుక తప్పించుకొంటివి లేకున్న నా బాణమెట్టిదో నీ వెరుగవులె'' అని కిరాతుడును.

''క్రూర జంతువును బాణముతో నేయ నాకు సిగ్గెందులకు? వక్రభాషణము లాడకుము; నీ దారిన నీవు పొమ్ము; పంది కావలెనో పందెము గెలువ దలచితివో; ఏల ఇట్లు పల్కుచున్నావు?''

అని అర్జునుడును పల్కిన పల్కులు సహజ సుందరముగ నాటకీయతను వెలార్చుచున్నవి. సంభాషణము మరింత కొనసాగి తుదకు ఘోరయుద్ధముగ పరిణమించెనని మన మెరుగుదుము. సంభాషణలు పొందికగనుండి సన్నివేశానుగుణమై కృతకము కాక రసాను కూలముగ వర్ణించుట శ్రీనాథుని కవితా వైఖరియని యది యనన్య సదృశమని నిరూపింపబడినది.

అందుచేతనే ధిషణాదారంధర్యము కంటె హృదయ స్పంద నమే విశిష్ట ధర్మములుగాగల రమణీయ సన్నివేశములెన్నో హర విలాసమున కలవని అందులో ప్రత్యేకించి పేర్కొనదగినది కిరాతార్జునీయమని శ్రీ టి. బి. యం. అయ్యవారు భావించిరి.[14]

---

14. అయ్యవారు, టి. బి. యం, భారతి, ఏప్రిల్ 1964.

**5.4. కిరాతార్జునీయ వృత్తాంత మూలములు — తులనాత్మక పరిశీలనము:**

5.4.0. సంస్కృత మహాభారతము.

వేద నిక్షిప్తములైన ధర్మనీతి తత్త్వార్థములను సర్వజన సుబోధములు కావించుటకు లౌకిక సంస్కృతమున కథోపాఖ్యానాత్మకములైన కావ్యములు, ఇతిహాసములు రచితములు. పంచమవేదమని ప్రశస్తిగాంచిన మహాభారతేతిహాసమున వనపర్వము - 40 వ అధ్యాయము రెండవ భాగమునుండి కిరాతార్జునీయ వృత్తాంతము ప్రారంభమగును. అనగా ద్వైతవనములో నున్న పాండవుల కడకు కృష్ణద్వైపాయనుడు వచ్చి శత్రు జయార్థము తపమొనర్చి దివ్యాస్త్ర సంపాదనము కావింపవలె ననుటతో అర్జునుడు ఇంద్రకీలాద్రిపై తప మొనర్చునపుడు ఈశ్వరుడు కిరాత వేషముగ వచ్చి కిరీటితో కిటికై వాదులాడి యుద్ధ మొనర్చుట, చివరకు అర్జునుడు పరమేశ్వరుని గుర్తించి స్తుతించుటాది వృత్తాంతములు 3-40-56 (సం. భా) లో కలవు. వెనువెంటనే ఇంద్రుడు దేవగణములతో నర్జునునకు ప్రత్యక్షమగుట అర్జును డమరావతికి పోవుట, ఊర్వశి యర్జునుని నపుంసకునిగా శపించుటాదిగాగల వృత్తాంతములు 3-43-46 లలో వర్ణితము.

పైన చెప్పిన విషయాదికములు సంస్కృత మహాభారతానుసరణముగు ఆంధ్ర మహాభారతమున అరణపర్వ ప్రథమాశ్వాసాంతమునను కలవు.

సంస్కృతమున 3-162-5 నందు ఇంద్రుడు పాండవులయొద్దకు వచ్చుట 3-166-1 నందు అర్జునుడు నివాత కవచులను రాక్షసుల జయించిన కథలు కలవు. ఆంధ్ర మహాభారతమున చతుర్థాశ్వాసమున, ఇంద్రాగమనము, అర్జునుని రాక్షస జయము వర్ణింపబడినవి.

హరవిలాసమునందు సప్తమాశ్వాసమున కిరాతార్జునీయ వృత్తాంతము. అర్జునుడు ఇంద్రాహ్వానముచే అమరావతికి వెళ్ళుట ఊర్వశీ ప్రణయభంగము, నివాత కవచ పౌలోమ కాలకేయులవధ ఆదిగాగల వృత్తాంతముల ప్రత్యేకమగు ఆఖ్యానముగ శివలీలగ శ్రీనాథుడు చిత్రించెను.

5.4.1. భేదములు:

అర్జునుడే మాయాభిల్ల రూపమున నున్న శివునితో సూకరమును గూర్చి తగవాడినట్లు భారతమున నుండగా, తపస్సు చేయుచున్న — అర్జునుడు స్వల్పవిషయమునకు తగవు పెట్టుకొనుట యుచితము గాదను తలంపున కావలయు శ్రీనాథుడు కిరాతుడే తగవు నారంభించినట్లు మార్చెను.

కాంచనద్రుమ సన్నిభుడై విభ్రాజమానుడై మేరుపర్వత రూప మన్నట్లుగ ధనుష్కాండములతో ఉమాసహితుడై కిరాత వేషధారియైన శివుడు భూతగణము లనుసరించి రాగా, స్త్రీ సహస్రములు వెంబడింప వనము ప్రవేశించినతోడనే నిశ్శబ్దము ఆవరించినట్లు సంస్కృతమున వర్ణితము [15]

హరవిలాసమున - ఇంద్ర తనయుడు పూజకై పుష్పములు కోయుచుండ తొలుత కుర్కుర రవములు వినబడినవి వేదమూర్తులు సారమేయ యూథములు కాగా ప్రమథులు వానిని బంగారు సంకెళ్ళతో పట్టుకొని రాగా శివుడు కిరాత వేషముతో అగజ చెంచెతయై తోడ నరుగుదేర ఓంకార జన్యచాపముతో విచ్చువ్వని తపోవనమున ప్రవేశించెను. ఇట ఆతని ప్రవేశముచే వనప్రశాంతతను

---

15. క్షణేన తద్ వనం సర్వం నిశ్శబ్ద మభవత్ తదా,
నాదః ప్రస్రవణానాంచ పక్షిణాం చాప్యుపారమత్, [వన-39 అధ్యా-6]

గూర్చిన ప్రసక్తే లేదు. పైగా కిరాత వేష వర్ణనమున సజీవ సాక్షా త్కారము గలదు.

> వికట పాటల మకుటికా భారంబు
>
> కలుకైన జుంజుఱు నెఱులు గాక
>
> చారుసుధా ధామ శకలా వతంసంబంబు
>
> పెడకొప్పుపై నుండు పీకె గాగ
>
> ఘన లలాటంబున గనుపట్టు కనుచిచ్చు
>
> గైరిక ద్రవ తిలకంబుగాగ
>
> భుజమధ్యమున గ్రాలు భుజగహారంబులు
>
> గురిజపూసల గుబ్బసరులు గాగ
>
> శంకరుండు కిరాత వేషమ్ము దాల్చి
>
> యగజ చెంచెతయై తోడ నరుగు దేర
>
> బాణి నోంకార దివ్యచాపము ధరించి
>
> వచ్చె విప్వచ్చు వర తపోవనము కడకు. (హార 7-41)

మూకాసురుని గూర్చిన వర్ణన సంస్కృత భారతమున[16] సాధారణముగ గలదు. హారవిలాసమున,

'జలధరనీల దేహమును, జంద్రకళాయుగళీ సమాన దం ష్ట్రాళిలు, భిదురోపమాన ముఖ సంపుట పోత్రము, ఫుల్ల మేచకో త్పల దళ వర్ణ కర్ణములుఁ బాటల వర్తుల లోచనంబులున్ గలిగి కఠోర కంఠ ఘన ఘర్ఘర ఘట్టన ఘోషజన్మమై

(హార 7-43)

---

16. 'స న్నికర్ష మాగమ్య పార్థస్యాక్లిష్ట కర్మణః
మూకం నామ దనోఃపుత్రం దదర్శాద్భుత దర్శనమ్' [వన.39.7]

ఈ సూకర వర్ణనము స్వభావోక్తియుతమై వర్ణింపబడి, ఆ సూకరమెట్లు భయంకరముగ పుట్టలను త్రొచ్చివైచినదియు విస్తరముగ వర్ణింపబడినది.

వరాహమే తన్ను చంపుమని అర్జునుని వేడినట్లు సంస్కృతమున కలదు. హరవిలాసమున నట్లు లేదు.

శివుడు ఫల్గును నపహృత గాండీవుగా నొనర్చినట్లున్న భారత కథను విడిచి యతడీశ్వరుని మూర్ధ్నిపై గాండీవముతో తాటించినట్లు శ్రీనాథుడు కల్పించెను. ఇచట 'వడకుం గుబ్బలి కుమారి' ప్రయోగము సాభిప్రాయము.

కిరాతార్జునీయ కథా సందర్భమున కిరాతరూపమున నున్నది శివుడని యెరింగిన పిమ్మట నర్జునుడు తన యపరాధమును క్షమింప వేడుకొనినట్లు మూలమందు నాల్గు శ్లోకములలో వర్ణింపబడెను.

హరవిలాసమున అర్జునుడు శంకర సాక్షాత్కారముచే ఆనంద బాష్పలోచనుడై సార్వవిభక్తిక స్తవమున శివుని స్తుతించి తన వాచాలత్వమునకు యుద్ధావేశమునకు పశ్చాత్తాప పడినట్లు వర్ణితము.

అర్జును డింద్రలోకమునుండి తిరిగి వచ్చిన పిదప తాను అస్త్రములను సంపాదించిన విధము సోదరుల కెరింగింప ధర్మరాజంతట వాటిని చూడగోరగా అర్జునుడును మరునాడు చూపెదనని కొంత భ్రాతృభక్తి లోపించినట్లుగ పల్కినట్లు సంస్కృతమున కలదు.

హరవిలాసమున అర్జునునితో యుద్ధమాడి ప్రీతుడైన శంకరుడు పార్వతీ సహితుడై ప్రత్యక్షమై భక్తుడు తన్ను సార్వవిభక్తిక స్తవమొనర్చి తన యపరాధమునకు పశ్చాత్తాప మొందిన మీదట భక్తాభీష్టము ప్రకారముగ పాశుపతాస్త్రము నిచ్చెను. పార్వతి తది

తర దిక్పాలకులు కిరీటికి దివ్యాస్త్రముల నిచ్చిరి. ఇంద్రుడు అర్జునుని ఆదిమునీశ్వరునిగ కొనియాడి అమరావతి కాహ్వానించుచు రోమక మహర్షి ద్వారా అర్జునుని కుశలవార్తతో బాటుగ పాశుపతాస్త్ర లాభమును స్వర్గగమనమును ద్వైతవనములోని పాండవులకు తెలియ జేసినట్లు వర్ణితము. ఇట్టి వర్ణన అర్జునుని అమరావతీ ప్రయాణమున కును ఊర్వశీ వృత్తాంతమునకు దోహదకారియై నాందియై యున్నది.

శ్రీనాథుడు అర్జునుని పంచాక్షరీ సంతతాభ్యసన పరాయణు డుగ శివధ్యానానుసంధాతగ, పాశుపత దీక్షా కల్పునిగ, షట్కాల శివార్చనా పరాయణుడుగ వర్ణించి అర్జునుని భక్తిప్రపత్తుల ద్వారా తన ఈశ్వరార్చన కళాభిరతిని వ్యక్తమొనర్చెను. సంస్కృతమున అర్జునుని దీక్షను గూర్చిన యిట్టి వర్ణనము లేదు. సంస్కృతమున అర్జునుని తపోవేషమును గూర్చి —

'తపస్యుగ్రే వర్తమాన ఉగ్రతేజా మహాత్మనః
దర్భ చీరః నివస్యాయ దండాజిన విభూషితః.'
(సం. భా-38 అ-22)

అని సాధారణ తపస్వుల వర్ణనవలె చేయబడినది. స్థిరచిత్తమున నాతడు తీవ్రమగు తప మొనర్చిన విధము వర్ణితము. మహర్షులు అర్జునుని ఉగ్రతపమును గూర్చి శివున కెరింగింపగా ఆతడు వారికి ధనమునుగాని, స్వర్గమునుగాని, అర్జునుడు కోరుటలేదని భక్తుని కోరి కను తా నెరుగుదునని బదులు చెప్పినట్లు కలదు.

ఇట్టి విషయము హరవిలాసమున లేదు. తొలుత అర్జునుని విరుద్ధ తపోవిధానము గూర్చి హరవిలాసమున నిట్లున్నది:

"వీర రస గర్భితం బయ్యు విస్తరిల్లె
శాంత రసమెంతయును సవ్యసాచియందు." (హర 7-10)

మూలభిన్నమైన ఇంద్ర పాత్రవర్ణన సజీవ సాక్షాత్కారముగ కలదు. సంస్కృతమున ఇంద్రుని గూర్చి శుద్ధ శ్రోత్రియ రూప వర్ణనము కలదు.

'ఆ సహస్రాక్షుని యాత్మ సంశుద్ధికి' (హార 7-22) అను పద్యమున శ్రీనాథుడు ఇంద్రుడు తన్ను తాను విమర్శించుకొన్నట్లు సరసమైన మార్పుచేసి 'మాధవ' శబ్దమునకు 'మా యేలిక' అను అర్థాంతరమును స్ఫురించునట్లుగ రచించెను. శ్రీనాథుని తెనుగు భాషాభిమానము, 'వాడు నీకంటె నేమి వాసికలడు' అనుటలో కామగోష్ఠి పదసృష్టిలోను తెలియుచున్నది.

సన్నివేశ చిత్రణమున కొన్ని భేదములు:

శివార్జునుల బాణహతిచే కిటి నేలపై బడినప్పటి వర్ణనము:

యథా అశనేః వినిర్ఘోషః వజ్రస్యేవచ పర్వతే
తథా తయోః సన్నిపాతః శరయోః అభవత్ తదా.

(సం. భా. 39-15 శ్లో)

హారవిలాసమున —

అథ వార్జున శరపాత
ప్రభవ వ్యథ దిరిగె నప్వరాహము కమ సం
క్షుభిత మయి విలయ వేళా
నభ స్వ దుద్భ్రాంత ఘన ఘనా ఘనము క్రియన్.

(హార 7-47)

దీర్ఘతర హార పరాసుగ
నిర్ఘాత నిపాత జాతనిబిడ వ్యథనం
తద్ఘూర్ణమాన మగుచును
ఘుర్ఘుర ఘోషంబు తోడ గ్రోడము గూలెన్. (హార 7-48)

అను పద్యములందు మూలములోని ఒక ఉపమానమును స్వీకరించి మెరుగులు దిద్దుచు ప్రళయకాలపు టాకాశమున మిఱుమిట్లు గొల్పు ఘనాఘనమువలె అభవార్జున శరపాత ప్రభావముచే వరాహము తిరిగినట్లు వర్ణితము. కాని నన్నయ "శరనిధి మథనమున దిరుగు శైలము పోలెన్" — (ఆం. భా. అ. 306) అని అనువదించెను. శ్రీనాథుడు "అంతర్ఘూర్ణమానమగుచు" అని మాత్రమే వర్ణించెను. శ్రీనాథుని ప్రయోగము శబ్దార్థములను రెండింటిని కలిగి యొప్పిదమై యున్నది.

యుద్ధమునకు సిద్ధమైన కిరాతుని చూచి అర్జునుడు శివుడో లేక యే మహాపురుషుడో యుద్ధమునకు కన్పించుచుండెనని యించుక వితర్కమునకు లోనయినట్లు సంస్కృతమున నుండగా హరవిలాసమున నట్టి వితర్క ప్రసక్తి లేదు.

ఇంద్ర వృత్రాసురులవలె శివార్జునుల యుద్ధ ముండెనని వ్యాసుడు వర్ణించెను. శ్రీనాథుడట్టి పోలిక తేలేదు.

5.4. సాదృశ్యములు:

సంస్కృత మహాభారత కథ హరవిలాస కథ స్థూలదృష్టితో పరికించిన నొకే విధముగ కన్పించును. నిశితముగా పరిశీలించినచో కిరాతార్జున సంవాద ఘట్టమున యుద్ధ ఘట్టమున, అర్జున తపోఘట్టమున, పాత్రపోషణమున, ఈషద్భేదములు పరికింప నగును.

ఊర్వశీ వృత్తాంతమునకు మునుపు అర్జునుడు సంగీతమును నేర్చుకొనుట మాత్రము హరవిలాసమున లేదు. ఆకాశమున సప్త స్కంధముల గూర్చి మూలములోవలె నిటను మాతలిచే వర్ణితము. నివాతకవచ, పౌలోమ కాలకేయ వధయు ఇంద్ర ప్రార్థనమున అర్జును డొనర్చుట మూలానుసరణమే మొత్తము మీద ఊర్వశీ

ప్రణయభంగ, రాక్షస వధ వృత్తాంతము లందును సాదృశ్యము కలదు.

ఇట్లు హరవిలాస మహాభారతములందొకే కథయున్నను సందర్భోచితముగ కథ, కథానుకూలముగ పాత్రపోషణ, రసపోష ణాదులందు మాత్రము కవుల దృక్పథము ననుసరించి భేద మగపడి నట్లుండినను సామ్యము మూలవిధేయమగు కథానుసరణములోనే కానవచ్చును.

5.5. భారవి కిరాతార్జునీయము—భేద సాదృశములు:

సంస్కృత వాఙ్మయమున అల్పాక్షరములందు అనల్పార్థము నిమిడించు ప్రతిభా విశేషము సౌష్ఠవ యుతమైన చమత్కృతిచే శబ్ద చమత్కృతిని అధఃకరించినట్లు కావించు శిల్పనైపుణ్యము భార వికే కలదు. అందులకే 'భారవేరర్థ గౌరవమ్' అని ప్రశస్తి వచ్చి నది. మహాకవియగు భారవియొక్క కిరాతార్జునీయము అష్టాదశ సర్గ సంభృతమైన మహాకావ్యమై రసజ్ఞులపాలిటి మాకందమై అల రారుచున్నది. భారవి కావ్యము శ్రీనాథుని ఉపాఖ్యాన వర్ణనము నకు ఆలంబముగను, ప్రోద్బలకారిగ నుండె ననుటలో సందేహము లేదు.

5.5.0. భేదములు:

భారవి - కిరాతార్జునీయము ప్రత్యేక కావ్యమై కావ్యోచిత వర్ణనా ప్రధానమై సంస్కృత భాషలో ప్రశస్తమై ప్రముఖ స్థానము నాక్రమించినది. అష్టాదశ సర్గములలో చతుర్థ సర్గమునుండి అష్టాదశ సర్గమువరకు గల ఇతివృత్తమునందు అనగా పదునాల్గు సర్గముల పరిమితిలో ఈ కిరాతార్జునీయ వృత్తాంతము వర్ణితము. అప్రతిమాన పాండిత్య విశేషమును వెలార్చు భారవి కవితాశైలి ఈ కావ్యమున

ప్రభాసితము. యక్షుడు హిమాలయముల వరకు వచ్చి అర్జునుని విడిచి వెళ్లుట, శరదృతు వర్ణనము, అర్జునుని తపోభంగార్థము ఇంద్రుడు అప్సరలను పంపుట, కుసుమాపచయ వర్ణనము, చంద్రోదయ, సురత, పాన, సాయంకాల, వర్షఋతువర్ణనములు, అర్జునునికి అప్సరల వివిధ విలాసములచే తాత్కాలిక మనోవికారస్థితి, తాపసులు శివునికడకు వెళ్ళి పార్థకృత తపోధిక్యమును తెల్పుట అతడు వారిని సాంత్వనపరచుట కిటిని చంపిన పార్థుని శివదూతలు అధిక్షేపించుట వారి విజిగీషా వచనములు, శివార్జునుల మధ్య చిత్రయుద్ధ వర్ణనము, పార్థుడు అసాధారణమగు యుద్ధ నైపుణ్యము కన్పరచిన శివుని గూర్చి వితర్కించుట – మున్నగునవి హరవిలాసమున లేని భిన్నాంశములు.

వనరక్షకుడను పేరితో ఇంద్రుడు అర్జున తపోవిఘ్న మొనర్ప జూచుటయే గాక అప్సరలు గూడ తపోవిఘ్న మొనర్ప జూచుట, అందునను వారిని గూర్చిన వర్ణనములు నాలుగు సర్గముల వ్యాప్తమై యుండుట కిరాతార్జునీయమందు గమనింపదగిన భిన్నాంశములు. ముని సామాన్యమైన అర్జునుని తపోవేషధారణము శివార్జున యుద్ధము, అర్జునుడు శివునితో పోరుటకు మునుపు శివదూతలతో యుద్ధ మొనర్చుట —— సంస్కృతమున గల విశేషము.

భారవి మహాభారతేతిహాస సంక్షిప్త కథా వృత్తమునే చేపట్టినను, ప్రతిభా పాండిత్యము లుట్టిపడినట్లుగ విస్తరించి వ్రాసియు మూలవిధేయానుసారియై యుండును. భారవి గ్రంథమున ద్వాదశ సర్గమున శివుడు తాపసులతో నరనారాయణుల వృత్తాంతము తెల్పునట్లు వర్ణించెను.

సప్తమాశ్వాసమున '100' గద్యపద్యములలో శ్రీనాథుడు ప్రత్యేక ఆఖ్యాన మనదగు రీతిని శివలీలగ వర్ణించెను. పరిమిత,

కథాసంబంధి యగు వర్ణనము లొనర్చెను. వ్యాసోపదేశాను
సారము ధర్మజుని యాదేశానుసారము యతడు ననుసరించి రాగా
అర్జునుడు ఇంద్రకీలమునకు వచ్చు విషయము హరవిలాసమున లేదు.
"పూని తపశ్చర్య యర్జును డత్యంత గరిష్ఠ నిష్ఠ నమరేంద్రుం
గూర్చి యయ్యింద్ర కీల నగాగ్రంబున బ్రత్యనీక విజయ శ్లాఘాభి
లాషంబునన్ అని (హర. 7-5) కలదు. వృద్ధ విప్రవేషమున
ఇంద్రుడు అర్జునుని తపోవిఘ్న మొనర్ప చూచి, పార్థకృత 'విరుద్ధ
తపము' చూచి ఇంద్రుడు పరమనాస్తిక భావముతో నిప్పచ్చర
భాషణములతో త్రిమూర్తులలో నొకరి గూర్చి తపమాచరించుట తగ
వని, ఆత్మసంశుద్ధి, బాహావిక్రమము, అహంకారము, ఔచిత్యము
ఎఱుగని యింద్రుని గూర్చి తపము చాలింపు మనెను. పార్థుని
యేకాగ్రచిత్తమునకు మెచ్చిన వృద్ధశ్రవుడు ప్రత్యక్షమై సమర
జయము శంభు కృపచే సంభవించునని ఆతని గూర్చి తపము చేయ
మని యుద్బోధించెను. ఇట ఇంద్రుని పాత్ర సజీవమై రసవత్తరమై
యొప్పి యున్నది.

ఇంద్రార్జున కిరాతార్జున సంవాదములు హరివిలాసమున రమ్య
మగు రీతిని వెలయింపబడినవి. పార్థుని పాశుపత దీక్ష, తొల్లిటి
విరుద్ధ తపము. పార్థుని పదాబ్జాల ప్రసాద పంచాక్షరీజపము, శివ
లీలగ వర్ణితమగుటకు తావలములైనవి. తాపసుల, అప్సరసల,
ప్రస్తావన లేదు. శివుడు, వేదములు సారమేయములు కాగా, అగజ
చెంచెతయై తోడుండ ఇంద్రకీలాద్రికి వచ్చెను.

శ్రీనాథుని శివభక్తి నిరతి ఆఖ్యానమంతట ప్రస్ఫుటము.
శివపార్థులు ఒకేసరి బాణములను మూకాసురునిపై వేసినట్లు కలదు.
శివదూతల ప్రసక్తి లేదు. శివుడే సాటోపముగ సావష్టంబుగ కిరాతు
నెదిరించుట తగదనెను. శివమాయచే శర శూన్యమగుట, అస్త్ర

సంపదకు వలయు మంత్రజ్ఞానము నశించుట, గాండీవముతో పార్థుడు శివుని తలపై మోదుట, బాహు మల్లయుద్ధములు, పార్థకృత సార్వవిభక్తిక స్తవములు — హరవిలాసమున కానవగు భిన్నాంశములు. ఇంద్రుడు నరనారాయణ ప్రశంస పార్థుని కడ శివాంతర్ధానమునను పిమ్మట చేసినట్లు కలదు.

5.5.1. సాదృశ్యములు:

అర్జునుడు శత్రుజయార్థము తపమాచరించి విఘ్నములకు చలింపక శివుని గూర్చి తపమొనర్చి కిటిని చంపి, యుద్ధ మొనర్చి పాశుపతాస్త్రమును పొందుటవరకు రెండింటికి సామ్యము కలదు. కావ్యోచితమగు వర్ణనలు, సూక్తులు, మూలవిధేయ భావానుసరణము కథాకథన వైవిధ్యములలో నుండగా, భారవికావ్యమునగను శ్రీనాథుడు శివలీలగను ఈ యితివృత్తమును ప్రత్యేక ధోరణులతో చిత్రించిరి. నివాతకవచ పౌలోమ కాలకేయ వధలును, ఊర్వశీ వృత్తాంతమును భారవి గ్రంథమున లేక యిట అర్జునుని పరాక్రమ లీల నిరూపణములకై చిత్రింపబడెనని తలపవచ్చును.

13 వ సర్గమున అర్జునుడు మూకాసురుని చూచి మృగము ఒక్కటిగా వచ్చుచున్నదేమని. గుంపుగా రాలేదేమని, రాక్షసుడా అని సందేహించినట్లు వితర్కితు డయ్యెను. రాక్షసుడు కాడని, సుయోధనుని పన్నాగమనియు భావించెను. హరవిలాసమున నట్టిది లేదు.

అథ దీర్ఘతమం తమః ప్రవేక్ష్యన్
సహసారుగ్ణరయః ససంభ్రమేణ,
నిపతం తమివోష్ణరశ్మి ముర్వ్యాం
వలయీభూత తరుం ధరాంచ మేనే. (కిరా. 3–30 శ్లో)

అని స్వభావోక్త్యలంకారములో సూర్యరశ్మి క్రిందకు వచ్చి తన పైన పడునట్లును భూమి వృక్షములతోపాటు గిరగిర తిరుగునట్లును మూకాసురుడు భావించి క్రింద పడెను.

> "సగతః క్షితిం ఉష్ణశోణితార్ద్రః
> ఖురదంష్ట్రాగ్ర నిపాత దారితాశ్మా (కిరా 3-31)
>
> అసుభిః క్షణం ఈక్షితేంద్ర సూనుః
> విహితామర్ష గురుధ్వని ర్నిరాసే, (కిరా 3-32)

పై శ్లోక భావానుసరణ మొనర్చుచు శ్రీనాథుడు వరాహము శర పాత ప్రభవ వ్యథను "విలయవేళా నభస్వ దుద్భ్రాంత ఘనా ఘనము క్రియన్" అను వేరొక ఉపమానము గూర్చినను భారవి వలె వరాహము క్రింద పడుటన్ను, "నిబిడవ్యథ సంతత ఘూర్ణమాన మగుచును ఘుర్ఘుర ఘోషంబుతోడ" కూలెనని వర్ణించుటలో సామ్యము కలదు.

> "...జ్వలదనల పరీతం రౌద్రమస్త్రం దధానమ్
> ధనురుపపదమస్మై వేదమభ్యాదిదేశ" (కి. 18-44)

అనియు "విజయి వివిధ మస్త్రం లోకపాలాదితేరుః" (కిరా. 18-46)

అనియు, భారవి పాశుపతాస్త్రము గూర్చియు, లోకపాలుర అస్త్ర దానము గూర్చియు పేర్కొనగా శ్రీనాథుడును ఆ పాశుపతాస్త్ర మహిమను లోకపాలుర యస్త్రదానము గూర్చి విపులముగ వర్ణించెను.

భారవి తపస్సు చేయబోవు అర్జునుని చూచి భాష్పములు నిండిన కనులతో స్నేహార్ద్ర హృదయమై సహజప్రేమరసముతోడి నేత్రానందకరమైన చూపుతో ద్రౌపది చూచినట్లు ఇట్లు వర్ణించెను:

"అకృత్రిమ ప్రేమ రసాభిరామం
రామార్పితం దృష్టి విలోభిదృష్టమ్,
మనః ప్రసాదాంజలినా నికామం
జగ్రాహపాథేయ మివేంద్ర సూనుః (కిరా. 3-37)

అను శ్లోకమును అమరావతి నుండి తిరిగి వచ్చిన పార్థుడు "ద్రౌపది నుపలాలించి" యని మాత్రము వర్ణించెను.

5.6. ఆంధ్ర మహాభారతము - భేద సాదృశ్యములు:

కవిత్రయమున నాద్యుడైన నన్నయభట్టు ఆంధ్రీకరించిన మహాభారతేతిహాసమున కిరాతార్జునీయ వృత్తాంతము కలదు. మూలమున అరణ్యపర్వభాగము 6981 శ్లోకముల పరిమితి గలదై యుండ నన్నయ దానిని 1299 గద్య పద్యములలో మూలములో ఐదవ వంతునకు సంక్షేపించెను. నన్నయభట్టు ననుసరించి శ్రీనాథుడు కథను సంగ్రహముగను, అవాంతరవ్యాప్తి లేకుండగను నడిపినట్లు శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు తెల్పిరి.[17] నన్నయ విరచిత అరణ్యపర్వమున గల కిరాతార్జునీయ కథ యేబది గద్య పద్యములలో నుండగా శ్రీనాథుడు రచనా వైశిష్ట్యమొప్ప, వీరశైవ సంప్రదాయ సంధానముచేతను ద్విగుణీకృతము కావించి ప్రత్యేక విశిష్టతను ఈ కథ కాపాదించెను.

5.6.0. భేదములు:

వ్యాసమహర్షి ప్రతి స్మృతి విద్యను ధర్మరాజున కుపదేశించి తద్వారా శత్రుజయార్థము తపోమగ్నులై అస్త్రసంపాదన మొనర్ప వలెననుట సంస్కృతమునను, తెలుగునను కలదు. భారవివలె నన్నయ అర్జునునకు వీడ్కోలు తెల్పుచు ద్రౌపదిచే నిట్లు పలికిం

17. లక్ష్మీరంజనం—ఖండవల్లి, ఉపోద్ఘాతము—హరవిలాసము 1966.

చెను — "అవమానాగ్నిని సహించెడి నీ కులము బ్రాహ్మణ కులము గాక క్షత్రియ కులమెట్లు అగును? శత్రు పరాభవాగ్నిలో మునిగి తేలెడి మమ్ములను కరుణతో నుద్ధరింపుము" అని తన స్నేహాలాలస విలోలాపాంగ విలోకనంబుల పార్థుని పరిగృహీత పాథేయుని" చేసెను. కిరాతార్జునీయమందు అప్సరసవలెగాక వృద్ధ విప్రుడు పార్థుని తపోవిఘ్నము చేయవచ్చెను. వీతహర్ష క్రోధులైన బ్రాహ్మణులుండెడు పుణ్యనివాసంబున నాయుధంబులు ధరించి యుండ వలదని విఘ్నవచనములు పల్కెను. ఆ వృద్ధవిప్రు డెవరో కాదు. ఇంద్రుడే. పరమాస్త్ర లాభమునకై గరళకంఠుని ప్రసన్నుని చేసికొనుమని నీ యభిమతము సిద్ధించునని ఇంద్రుడు పల్కి అదృశ్యు డయ్యెను.

నన్నయ కిరాతవేష వర్ణనములో 'కిరాతబలంబుతోడ' అని మాత్రమే యున్నది. కాని ప్రత్యేకముగ హరవిలాసములోవలె కుతూహలము లున్నట్లు లేదు. భారతమున శరశూన్యుడైన అర్జునుడు శివుని స్తుతించుట ఒక దండకములో వర్ణితము.

నన్నయ ఇంద్రలోకమునుండి తిరిగి వచ్చిన పిదప అస్త్ర లాభమును గూర్చి ప్రస్తావించుచు మూలభిన్నముగ భ్రాతృభక్తి యుట్టిపడినట్లు అప్పటి కప్పుడే అస్త్రములను వేర్వేర చూపినట్లు వర్ణించెను.

అర్జునుడు నివాత కవచులతో పోరునపుడు వారు తమ యస్త్రములన్నియు వమ్ముకాగా చివరకు తిమిర బాణమేసిరనియు, అప్పుడు భయపడుచున్న మాతలి నూరడించి అర్జునుడు మోహి న్యస్త్రము ప్రయోగించె ననియుండ నన్నయ ఔచితీ పరిపోషక ముగ సూర్యబాణమేసనట్లు వర్ణించెను.

అర్జునుడు శరశూన్యుడైన పిదప శివుని గాండీవాస్త్రముతో మోదినట్లు లేదు. (ఆ.ప. 319 ప) పార్థుడు శివునితో యుద్ధమాడి మూర్ఛితుడైనట్లు కలదు. అర్జునునకు తన రూపము దిక్పాలకుల రూపము చూడుమని దివ్యదృష్టి నిచ్చినట్లున్నది. దివ్యాస్త్రప్రదానముచే నవని దద్దిర దిరిగెనని వర్ణితము.

ఇంద్రుడు అమరావతికి "దేవకార్యము దీర్ప నర్హుండవుగాన నా రథంబు బుత్తెంచెద నమరావతికి రమ్ము" అన్నట్లున్నది.

చతుర్థాశ్వాసమున నివాతకవచ పౌలోమ కాలకేయ వృత్తాంతము కలదు. మొత్తము మీద ఈ వృత్తాంతము సంగ్రహముగ నుండి, సంభాషణములు, వర్ణనములు మితముగ నున్నవి.

హరవిలాసమున వ్యాసుని రాక యోగవిద్యా ప్రదానములు లేవు. కిరాతార్జునీయ కథ '100' గద్య పద్యములలో పార్థుడు దివ్యాస్త్ర సంపాదనోద్దిష్టుడై తపమారంభించినట్లు, శ్రీనాథుడు ప్రారంభించెను.

దర్భచీరతో, దండాజిన విభూషితుడై, భూమిపై శయనించుచు, త్రిరాత్రములు మాసమున పలాశనుడై, వాయుభక్షకుడై ఊర్ధ్వబాహుడై తీవ్ర తప మొనర్చెనని ఋషులు భయమొందిరని మూలమున నుండ శ్రీనాథుడు 'విరుద్ధతప మొనర్చె'నని వర్ణించెను. ప్రాసాద పంచాక్షరి, షట్కాల పూజ పార్థుడొనర్చెనని వర్ణించుట కవి పాశుపత మత ప్రభావము వలననే యని తెలియును. సంవాదములు, సన్నివేశ చిత్రణములు, పాత్ర పోషణ రసపోషణములు కథా కథనమున కానవగు భిన్నాంశములు, అర్జునుని పరాక్రమశీల నిరూపణమునకై యుద్దేశింపబడినవి. దండకమునకు బదులుగ సార్వవిభక్తిక స్తవము పార్థుడొనర్చినట్లు శ్రీనాథుడు వర్ణించెను.

**5.6.1.** పాదసృశములు: శబ్దానుసరణము:

ఈ కథయందు రెండుచోట్ల నన్నయ కావ్యములే పొందుపడినవి. అరణ్యపర్వ ద్వితీయాశ్వాదినున్న —

శ్రీరమ్య ధర్మ నిత్య
ప్రారంభ విభాసి రాజ పరమేశ్వర ఘో
రారి మదకుంభి కుంభ వి
దారణ దారుణ కృపాణ దక్షిణ హస్తా!

అను పద్యము చివరి రెండు పాదములు నిట్లు హారవిలాసమున సప్తమాశ్వాసమున 18 వ పద్యమున నిట్లు సమకూర్చబడినవి.

వైరి మదకుంభి కుంభ వి
దారణ దారుణ కృపాణ ధారలు పరిఘా
కారములు కందమూలో
ద్ధారములకు బాలుపడె గదా నీ కరముల్.

అరణ్య పర్వమున 1-315 వ వచనమునందు గల క్రింది వాక్యములు హారవిలాసమున పద్యరూపమున వెలయుచున్నవి.

"అగ్నిదేవుండు నా కిచ్చిన యక్షయ శరధు లిప్పుడు యుగాంత్య కాలరిక్తంబులైన శరధులుం బోలె నున్నయవి."

శరధులు యుగాంత్య వేళా
శరధులునుంబోలె నయ్యె శూన్యంబుల్
సురపతి సూతికి పరమే
శ్వర మాయా శక్తి నపుడు సమరాగ్రముననే. (హార 7-74)

నన్నయ 'కిరాత బలంబులతోడ' అని మాత్రమే వర్ణింప శ్రీనాథుడు "సారమేయములతో" వచ్చెనని వర్ణించెను. పేరుకు జాగిలము

లుండవలెనని, వీరశైవ సంప్రదాయానుసారముగ నీ కుర్కుర బల మును 4 పద్యములలో కవి వర్ణించెను.

ఆ సంప్రదాయము ననుసరించి యివి వేదమయమూర్తులు.[18]

''ప్రకట లీలనుదాత్తంపు ఫణితిగొన్ని
క్రమముతో ననుదాత్త స్వరములగొన్ని
స్వరితముల బ్రచయంబుల వరుస గొన్ని
ఘోషణము సేయ దొడగె నా కుర్కురములు.''

కనకపు శృంఖలల ద్రయీ
శునకంబుల బట్టుకొనగ సూరెల బ్రమథుల్
వనచరులై కొలువ గపటవై హరికుడై. (హర 7- 39, 40)

వేదములు శివునకు త్రిపురాసుర సంహార కాలమున రథమునకు గుఱ్ఱములు, తాండవ నృత్య కాలమున పాదమునకు నందియలు; కిరాత అవతారమున శునకములు. ఈ విషయ మీ క్రింది పద్య మున తెల్పబడినది.[19]

పాదములకు నందియలై
మోదమున కిరాత వేషమున శునకములై
నాదట తేరికి హరులై
వేదములకు నెపుడొసర్చు వినతులు శర్వా.[20]

శ్రీనాథుని అర్జున కృత పరమేశ్వర స్తుతి సార్వ విభక్తికముగా నుండుటకు ఉదాహరణ కావ్యముల ప్రభావమని తలపవచ్చును.[21]

---

18. వెంకట్రావు, నిడదవోలు, భారతి 1954.
19. వెంకట్రావు, నిడదవోలు, భారతి 1954.
20. మహాదేవుడు, పందిరి - శతకము 1873.
21. గాండివి, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - వికారి, సు - 45.

5.7. అవాంతర కథా కల్పనము — ప్రయోజనము:

ఊర్వశీ ప్రణయభంగ నివాత కవచ కాలకేయాది వర్ణనములు సప్తమాశ్వాసమున అవాంతర కథలు. ఇవి కిరాతార్జునీయమునకు పిదప అనుసంధింపబడినవి. భారవి కిరాతార్జునీయమునందు పాశుపతాస్త్రము లభించుటతో కావ్యము ముగిసినది. అర్జునుడమరావతికి పోవుట, "ఊర్వశీ ప్రలోభము ఇత్యాది కథాంశములు హరవిలాసముతో సంబంధము లేనివి. అయినను సత్కథా కథన సంవిధానమునకై శ్రీనాథు డీ గ్రంథ భాగమును పెంచి వ్రాసెను.

పాశుపత లాభానంతరము అర్జునుడు స్వర్గమున కేగుటయు ఊర్వశిచే శప్తుడగుటయు, నివాత కవచ కాలకేయాదులను జయించుటయు దేవేంద్రుడు రోమ హర్షునిచే పాండవులకు అర్జున కుశల వార్తను పంపుటయు ననెడి కథాభాగము 'పాశుపతాస్త్ర ప్రదానము' అనెడి శివవిలాస గాథకు అనావశ్యకము. భాగవతమున కలదు గదాయని పౌరాణిక పద్ధతిని శ్రీనాథు డిందు చేర్చెనని శ్రీ పింగళి లక్ష్మీకాంతం గారనిరి.[22]

భారతమున పాశుపతాస్త్ర లాభానంతరము దేవేంద్రుడు ధనంజయుం జూచి సంతసిల్లి "నీవు పరమేశ్వరు వలన పరమసిద్ధితో దేవత్వ బు వడసితివి. దేవకార్యంబు దీర్ప నర్హుడవు కాన నా రథంబు బుత్తెంచెద నమరావతికి రమ్ము. నీకు దివ్యాస్త్రంబు లందయిచ్చెద" (ఆం. భా. అ. ప. ఆ. 343 ప) నని రథము పంపెను. ఆ దేవకార్యమే నివాత కవచ కాలకేయుల వధ. అరణ్యపర్వ చతుర్థాశ్వాసమున ఆ విషయ వర్ణనము కలదు.

అమరావతియందు "ఊర్వశి అర్జునుని ప్రలోభించుట" అధికపాఠముగ భాగవతమున అరణ్యపర్వ ప్రథమాశ్వాసమున కలదు.

---

22. లక్ష్మీకాంతం, పింగళి; ఆంధ్రవాఙ్మయ చరిత్ర; 1964.

ఈ రథమెక్కి తొల్లి యమరేంద్రు డనేక సహస్ర సంఖ్య దే
వారుల వృత్ర శంబర బలాదుల నుద్ధతులన్ జయించె వీ
రారి విభేది నీవును బలాఢ్యుడవై వధియింపు ముగ్ర మా
యారతులన్ నివాత కవచాసురులన్ సమరాంతరంబునన్''
(ఆం. భా. అర 4-56)

అను పద్యభావము హరవిలాసమున

సీ॥ ఈ రథంబెక్కి మున్నింద్రుడు నిర్జించె
శుంభన్మహోద్ధత్యు జంభ దైత్యు''　　(హర 7-155)

అను సీసపద్యమున వివరింపబడెను. ముక్కాలుమ్మువ్వీసము నన్నయ రచనమే శ్రీనాథుడు గ్రహించి ఈ కథ రచించెనని స్వతంత్ర పద్యములు 7-156, 7-159, 7-166, 7-175 కలవని గాండీవి సెలవిచ్చిరి.[23]

హరవిలాసమున పార్థుని పాశుపతాస్త్ర లాభానంతరము ఇంద్రుడు తదితర దిక్పాలకులు దివ్యాస్త్రముల నిచ్చిరి. ఇంద్రుడు పుత్రుని కౌగిట చేర్చి శివుని కారుణ్యముచే దివ్యాస్త్రమును పొందినందుల కభినందించి యిట్లనెను. ''నీవు నారాయణ సఖుండవైన యాది మునీశ్వరుండవు. నరనారాయణుల వలన త్రివిష్టపంబునకు పెక్కు తోయములు రాక్షస బాధలు శాంతింబొందె, నిప్పుడు హిరణ్య పురవాసులు నివాచ కవచ కాలకేయాదులగు దైతేయులు రాజ్యలుబ్ధులై నాకసంబున కనేక ప్రకారంబుల నుపద్రవం బాపాదించుచున్నవారు వారిం బరిమార్ప నమరావతీ పురంబున గొన్ని దినంబులు వ్రతోపవాస ప్రయాస ఖేదంబపనయించి మధ్యమ లోకంబునకుం గ్రమ్మఱ నేతెంచునది.'' అదే అర్జునుడు అమరా

23. గాండీవి, 'సాహిత్య పరిషత్పత్రిక' వికారి, సంపుటి 48.

పతిని చేరుటకు కారణము. మాతలి ధవళ హయముల పూన్చిన రథము తెచ్చెను. ఆకాశమున మేఘమండలము శింశుమార చక్రము ఒక వాయుస్కంధము, సప్తర్షులు చంద్రుడు ఇల్వాలమను చుక్కలు - మాతలి పార్థునకు పేరుపేరున చూపించెను. ఇది కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలమున గల వర్ణనము వంటిదని, శ్రీనాథుని భగోళ శాస్త్రజ్ఞతను నిరూపించునదనియు తెలియుచున్నది.[24]

అర్జునుని మీదుగ వీచిన స్వర్లోక మారుత వర్ణనము ప్రౌఢ సమాస బంధురమైనది. పాశుపతాస్త్రము నుపయోగింప వలను పడిన అవకాశమే నివాత కవచుల వధ. బ్రహ్మకు కూడ అసాధ్యులైన ఈ నివాత కవచులు అర్జునుని పాశుపతాస్త్రముతో దహింప బడిరి అనగా మహాభారత యుద్ధములో గూడ అర్జును డీ పాశుపతాస్త్రమును ప్రయోగింపలేదు. ప్రాణాపాయస్థితిలో గూడ నుపయోగించని ఈ పాశుపతాస్త్రమును అర్జునుడు ఒకే ఒక్కసారి అదియు నివాత కవచులను సంహరించుట కుపయోగించుట విశేషము. ఇట్లు ఆ అస్త్ర సంపాదనము, ఉపయోగము ఒకదాని వెంట నొకటి జరిగిన వృత్తాంతములు. కనుక హరవిలాస సప్తమాశ్వాసమున కిరాతార్జునీయ కథానుబంధముగ అర్జునుని ధైర్యసాహసముల వ్యక్తమొనర్చునీ యవాంతర కథను శ్రీనాథుడు జోడించె ననవలెను. ఊర్వశీ ప్రలోభవము అర్జునునికి రాబోవు శాపవృత్తాంతమును, తదుపరి అజ్ఞాతవాసమున అర్జునుని కా శాపమొక వరముగా పరిణమించుటను తెల్పుటకై యుండును. మొత్తముమీద ఈ అవాంతర కథా కల్పనము ద్వారా శివభక్తుడగు అర్జునుని అచంచల మనో నిగ్రహము, ధైర్యసాహసములు వ్యక్తమైనవి. శ్రీనాథుని సంస్కృత

24. సత్యనారాయణ, విశ్వనాథ: హరవిలాస పీఠిక; పు. 38.

సమాస జటిలమగు కవితాశైలి ఈ నివాత కవచ యుద్ధ ఘట్టమున తెలియ నగును.

సముద్ర మధ్యమున హిరణ్యాపురము బ్రహ్మచే నిర్మితమైనది. అందులో నివాత కవచాఖ్యులు వీరులై దానవులనేగాక సిద్ధ సాధ్య నరకిన్నర కింపురుషాదులను బాధించెడివారు. వారు మూడుకోట్ల సంఖ్య గలవారగుటచే ముజ్జగముల వారికి నిరంతర బాధలు గల్గెడివి. ఆ సురలోక కంటకులను తన శరార్చులచే హతమార్పుమని సునాశీరుడు అర్జునుని కోరెను. బహుశః వాడు నీకంటె నేమిట వాసి కలడు'' అనుటలో గల రహస్య మిచట తెలియును. ఇంద్రునికి కూడ నసాధ్యులగు నీ నివాతకవచులు అర్జునుని పరాక్రమముచే పాశుపతాస్త్రముచే హతము కావలసియున్నారు కనుకనే శ్రీనాథుడు అర్జునుని వీర విక్రమోపేత గాథను చేపట్టి స్వకపోల ప్రతిభావిశేషముచే మెరుగొందు విధముగ నీ కథా ఘట్టములను తీర్చి దిద్దెను.

ఇంద్రుడు దేవదత్త శంఖమును, కిరీటమును, అభేద్యకవచమునే గాక, పార్వతీదేవికి కిరాతార్జునీయ ఘట్టమున నిచ్చిన వింటినారిని గాండీవమునకు సంధించి యిచ్చెను. సూర్యాశ్వముల బూన్చిన రథము మాతలి నడుప అర్జునుడు నిర్జరులు పొగడగా బయలు దేరెను. దేవదత్త శంఖమును పార్థుడు పూరించుటకు మునుపు శ్రీనాథుడు ఆతడు సముద్రమును సమీపించెనని ఆ సముద్రము "కరిమకర కఠోరఫూత్కార వారిధారాలవాసార పూర్యమాణ రోదసీ నిరంతరాకాల సంపాదితోడం భ్రమంబుగా నున్నదని యొక సుదీర్ఘ వచనమును (7-156) వాడెను. అందు అనర్ఘమణి కాంచన సౌధము కలదట. ఇట నన్నయ వచనమును శ్రీనాథుడీ విధముగా వర్ణించెను:

"కనియె బారంబ నర్ఘమణి కాంచన సౌధము నత్యుదగ్ర సా
ధనము, నసాధ్య శిల్ప ఘన దారుణసాలము నద్భుతైక స
జ్జన సముదగ్ర ఘట్టము, విశాలతరాట్టము, నుద్భయారిత
ర్జనము, ననల్ప గర్జన సుర ద్విపదుజ్జ్వలితమ్ము నిమ్ములన్."
(హర. 7-157)

దేవదత్త శంఖధ్వనితో అనిలస్కంధము లేదును చిక్కు వడెను. సముద్రములు ఉవ్వెత్తి ప్రవహించినవి. సురేంద్ర లోకములు విన్నబోయినవి. పాతాళలోకము స్థితి తప్పెను. భూతచయము దిశో దిశలు పర్వెను. ఇది తిక్కన భీముని కోపమును గూర్చి వర్ణించిన "నేలయు నింగియు తాళముల్ గా జేసి యేపున రేగి వాయించి యాడ" — (భా. విరా. 2-134) పద్యము వంటిది. ప్రళయకాల ధ్వనివలె శంఖధ్వనిని విని రాక్షసులు వివిధాయుధముల పూని గర్జించుచు ఆ నగరము వెలువడి అర్జునుని రథము చుట్టుముట్టి ఘన శస్త్రాస్త్రముల పరపిరి. అర్జునుడు వాలిక తూపుల వారి నెదుర్కొని భయముతో తేరు నడుపక మాతలి నిశ్చేష్టుడై యుండ రథము తోలుచు సారథియై శత్రుకోటిని పరిమార్చెను. శుక్రశిష్యులను ద్రోణశిష్యుడు గెలిచెను. అయినను శ్రీనాథుని వర్ణనావైఖరి యిట గంగానదీ నిర్ఝరపాతము బోలినది.

"జంభారి ప్రభవ ప్రయుక్త నిబిడజ్యారావ గంభీర సం
రంభ భ్రామిత గాండివ ప్రసరదస్త్రవ్రాతదీవ్యత్త్వరా
సుభిన్నాంగములై సురారి తనువుల్ సంగ్రామ రంగంబునం
గుంభద్రోణములపట్ల బిట్టు గురిసెం ఘోరంబుగా రక్తముల్"
(హర. 7-167)

అని అర్జున విక్రమము నాచన సోముని ఉత్తర హరివంశములోని ఈ క్రింది అర్జునుని పరాక్రమము తెలుపునట్టిది. ఇట్టి పద్యము లనేకములు శ్రీనాథు డిందులో వ్రాసెను:

గాండీవారావ ఝంపా ఘటిత భయదివౌకః పురాంతఃపురంధ్రీ
గండాభోగ శ్రమాంభః కణ కలుషిత గంగా తరంగాభిషంగా
ఖండాస్త్రాత్కాండపాళీక బళిత సకలాకాశసీమానిశాంతో
ద్దండాతిక్రాంత గర్భాంతక యమభట సంతానముంగానసైతిన్.

(ఉ.హ. 2-27)

చివరకు దనుజులు చేయునది లేక మాయా యుద్ధమునకు తలపడగా వడిగా పాము త్రేలగట్టిన రీతిగ వర్షము కురిసెను. మారుతాస్త్రముచే అర్జునుడు జలముల నట్టిపోచేసెను. రాళ్ళతో క్రమ్మిన రాక్షసులను పార్థుడు కులిశాస్త్రమేసి వాని ద్రుంచెను. అగ్నుల వెదజల్లెడి అస్త్రముల పార్థుని వారుణాస్త్రము లెదుర్కొనుచు తిమిరాస్త్రము చిమ్మచీకట్లు ఏర్పడగా మాతలి రథము విడిచెను. మాతలి గూడ తన జీవిత కాలములో దర్శింపనంతటి వీరమును అర్జునుడు ప్రకటించెను. చివరకు నివాత కవచులు నిరవశేషులైరి. ఇంద్రుడు రాక్షసభయముచే నిర్మించిన ఆ పట్టణమును బ్రహ్మవరముచే వారు పొంది విఱ్ఱవీగి చివరకు అర్జునునిచే నిహతులైరి.

అర్జును డట్లు విజయోత్సాహముతో మగిడినచ్చుతరి విచిత్ర శిల్ప పట్టణమును తపోవనమును చూచెను. "పులోమ గోవిక యను అసుర కాంతలు అనేక దివ్య వర్షంబులు తప మొనర్చి బ్రహ్మచే కనకమయమును, కామగమనమును నగు పై చెప్పిన పురమును పొంది తమ కుమారులు నిర్జరులచే నిహతులు గాకుండ వర మొందిరి. అదే హిరణ్యపురము. పౌలోమ కాలకేయు లనువారే

రాక్షసులు. వీర లింద్రాదుల కసాధ్యులు'' అను మాతలి పలుకు లాలకించి కిరీటి వారలతో యుద్ధమునకు తలపడెను. ఆరువేల దానవులు మాయతో ఆకాశమున కెగురగా వారల బాణహతిచే నేల బడునట్లు అర్జును డొనర్చెను. తుదకు వారిపై పాశుపతము ప్రయోగించి వారలందరిని మట్టుపెట్టెను. ఈవిధముగ అస్త్రసంపాదనము, సద్వినియోగము వర్ణించు కథనము శ్రీనాథు డొనర్చి అర్జునుని పరాక్రమమును వేనోళ్ళ కొనియాడెను.

ఊర్వశీ ప్రణయ భంగము:

భక్తపరీక్షతో ప్రారంభమైన యీ కావ్యము విజయుని సత్త్వపరీక్షతో ముగిసినది. అట్లే శృంగార రస పూరితమగు గిరిజాశంకరుల ప్రణయ కలహముతో నారంభమైన శృంగారము చివరకు ఏ పాకమునకు కాని ఊర్వశీ పార్థుల శృంగార వృత్తాంతముతో ముగిసినది. రస నిబంధనమందును, ఔచిత్య నిర్వహణమునందును శ్రీనాథుని ప్రతిభ యద్వితీయమైన దనుటకు ఊర్వశీ ప్రణయ భంగము నుదాహరింపవచ్చును. దేవదారు వనమున అచ్చర లేమల విలాసములు బహువిశదముగ వర్ణించిన శ్రీనాథుడు ఊర్వశీవర్ణనమున ''శృంగార రస వారాసి యగు నూర్వశి'' అని మాత్రమే పల్కి ఊరకుండెను. భిక్ష యొసగు ఆమెలో ప్రియము కన్పడినట్లు మాత్రమే వర్ణించెను. ఆలోచింపగ ఊర్వశికి అర్జునునిచే ప్రమొక్కింపచేయుటకై ఆమె నట్టి విలాసముల ప్రోవుగ చిత్రింప లేదనుకో వచ్చును.

అర్జును డూర్వశీ ప్రణయమును త్రోసి పుచ్చిన అరసికుడన లేము. ఆతడు ఏక పత్నీవ్రతుడు గాడు. కాని యిట ఆతని మనః పరిపక్వత, చిత్తదార్ఢ్యము అనన్యమని ఉలూపి, చిత్రాంగద

సుభద్రలవలెనె ఊర్వశిని చేపట్టగల్గినను సంయమము పాటించుటలో ఆతడుదాత్తతను కనపరచెనని కవి స్ఫుటముగ వర్ణించెను.

అర్జునుడు పాశుపతాస్త్రమునకై ఘోర తప మొనర్చి కృతకృత్యుడై వ్రతోపవాస ప్రయాస నపనయించుటకై ఇంద్రాహ్వానమున అమరావతికి చను మార్గమున గంగాలహరీ నందనోద్యాన సురభిళ సంభృత మలయానిలములచే సేవ తీరెను. అట అమరావతీ పట్టణమున ఇంద్రుడు మర్యాదలతో అర్ధాసనాసీను చేసెను. దేవేంద్రుడు కుమారు నుపలాలించునప్పటి వాత్సల్య వ్యంజక చేష్టా విశేషమును నన్నయ —

"లీలైరావత కుంభా
స్ఫాలన కర్కశ కరముల బలుమరును మరు
త్పాలకు డంటుచు నుండె గు
ణాలంకృతుడైన పార్థునంగము బ్రీతిన్" (భా.అర. 1-359)

అని సహజముగ వర్ణింప శ్రీనాథుడు

"పీడుపట్టుగ మందార విపిన వీథి
దివ్యసౌధంబునందు బ్రతిష్ఠ జేసి
గారవించె జయంత కుమారు కంటె
బాండు రాజ తనూజు నాఖండలుండు" (హర.. 7-117)

కుమారు డనక పాండురాజ తనూజు డనియు, జయంత కుమారుని కంటె మించిన గారవమును చూపెనని వర్ణించుటలో పుత్రప్రేమను చెప్పీ చెప్పక చూపినట్లున్నది.

అర్జునుడు విశ్రమింపబోయెను. విమల సుధాంశుకాంత మణి వేదికపై నవహంస తూల తల్పమున నేత్రపద్మములు మొగిడ్చి సుఖ

సుప్తి నొందియున్న పార్థునిలో శేషునిపై పవళించిన అంబుజాక్షుని భావమును ఊర్వశి పొంది అర్జున మందిరమునకు వచ్చిన తీరు కవి భావనా పటిమకు తెనుగు పదముల అల్లిక సొంపునకు తార్కాణము.

కట్టి తోడి పూసి కై సేసి కౌతుకమున
గొనలిగా నీలి పుట్టంబు ముసుగు పెట్టి
గాజు లెగద్రోసి చప్పుడు గాకయుండ
వచ్చె నూర్వశి యర్జునా వాసమునకు.

(హర. 7-119)

పై పద్యమున పదునాల్గు జాతుల త్రిదశాంగనల యందు పేరు పెంపుగల్గి నీరజనాభుని యూరు కాండమున నుద్భవించిన యుజ్జ్వలాంగి అంభోనిధానంబు నావాసముగా గొన్న అగస్త్యుని కన్నతల్లి, భూలోకమున పురూరవ చక్రవర్తికి ప్రాణవల్లభయైన ఊర్వశి యొక్క నీలాభిసారికా వేషము, వంశ ప్రాశస్త్యములే గాక ఆమె అలంకరణము చాకచక్యము తెలియవచ్చుచున్నవి. పైగా సరసమైన ధోరణిలో అభిసారికా భావము తేటపడినది. ఊర్వశి అర్జునుని పగడముల బోలు పాదములను పాణిపల్లవములతో నొత్తి మేల్కొలిపినది. మేల్కాంచిన అర్జునుని మనోభావ స్థితిని గూర్చి యోచింపగా ప్రమదనిద్రా పరాధీనత నుండి సుఖసుప్తుడై యుండినను, అప్సర స్పర్శను తత్తరపాటు నొంది వెంటనే పాన్పు డిగ్గి ఆ అచ్చర లేమకు మ్రొక్కెను. ఇది ఊర్వశీ ప్రణయమునకు ప్రథమాఘాతము. అర్జును డదివరకు సుదీర్ఘతపో వ్రతుడై పాశుపతాస్త్ర లాభము నొంది తండ్రిచే నివాతకవచ కాలకేయుల వధయను దివ్య కార్యోద్దిష్టుడై ఊర్వశీ ప్రణయమున కేమాత్రము సుముఖత చూప

లేదు. ఆమెకు భక్తితో మ్రొక్కి వచ్చిన కార్యమేమిటో తెలియ గోరెను.

సూక్ష్మగ్రాహియగు నాతడు "ఓ చేడియ! ఆపటి యుదయమున చంద్రశేఖరునుపాస్తి యొనర్చి యుపాయనముతో నిన్ను చూడగ వచ్చువాడననుకొనుచుండ "ఆడబోయినతీర్థ మెదురైనట్లు నీవే వచ్చితివి అని పల్కుచు ఆమెతో తనకు గల వావి వరుసల త్రవ్వి పోయుచు, వంశౌన్నత్యమును కొనియాడుచు ఆమె కూర్మికి సంతసించి, దర్శన మిచ్చినందుకు ధన్యుడనైతి ననుటలో అర్జును డామె నెట్లుబ్బవేసినది తెలియగలము. ఈ ప్రసంగ మామె ప్రణయలిప్సకు ద్వితీయాఘాతము. వంశ ప్రాభవము నెత్తి చూపుచు వందనీయురాలవేనని పెక్కుభంగుల వ్యక్త మొనర్చి నిర్వికారుడై యుండెడి అర్జునుని పాత్ర పోషణము మనుచరిత్రలోని ప్రవరపాత్ర శీలములకు దారితీసె ననవచ్చును. సత్యమప్రియ విషయమైనది. యుక్తికి ప్రతియుక్తివలె ఊర్వశి తన కోర్కె యీడేరదని తెలిసియు మన్మథావేశముతో అప్సరలకు వావివరుసలు లేవని, తన్ను నిరాకరించుట తగదని అర్జునుని పూర్వరసికత నెత్తిచూపి వైరస్యము మానుమని వెఱ్ఱివేసాలు వేయకు మనినది. ఇట శ్రీనాథుడు శృంగారమును వాచ్యమొనర్చెను. బ్రహ్మచర్య పరాయణుడవని, లేమొలక నవ్వులొలక, కంకణ ఝణత్కారముతో కెంగేలి కమలము విసరుటచే ఆత్మాభిమానము, తత్తరపాటు సందడింప ధీరోదాత్తతతో నిర్వికారతలో మిసిమింతుడు గాకుండుట ఊర్వశీ ప్రణయఘాతమున మూడవమెట్టు. ఊర్వశిపరాభవ దందహ్యమానయై కోపమోర్వక నిట్టూర్పుతో "నపుంసకునివలె నాన గొన్నాడ వేడుకాలంబు నపుంసకుడవుగమ్ము" (7-135) అని దిగ్గన లేచి మొగము గంటుపెట్టుకొని వెళ్ళినది.

స్థిరమనస్కుడగు పార్థు డెట్టి సంతాపము నొందక యుధిష్ఠి రానుజుడనని ఋజు వొనర్చుచు విజయ కుతూహలియై ఆ అరిష్టము తనకు శుభమే కల్గించునని భావించెను.

5.8. విశేషాంశములు:

రసాభాస ఘట్టమగు నర్జునోర్వశీ సంభాషణమును రస మధురముగ సంతరించి పెద్దనాదులకు మార్గదర్శకుడైనవాడు శ్రీనాథుడు. వాచ్యవ్యంగ్యములలో శృంగార రసమును నిబంధించి తెలుగుజాతికొక వన్నె తెచ్చిన యుగప్రవర్తకుడు జాతీయ కవియునై మన కవి సార్వభౌముడు ఆంధ్రజాతికొక రసరామణీయకతను చేర్చి 'దేశభాషలందు తెలుగు లెస్స' అనుట కాలవాలమైనాడు.[25]

రస ప్రధానముగ కావ్యసృష్టి యొనర్చిన శ్రీనాథునకు ధ్వని ప్రధాన కావ్యసృష్టికదను దొరక లేదు; కాని రసధ్వనిని వ్యక్తీకరించ ననవలెను. కుంతకుడు లోకోత్తర చమత్కార వైచిత్రియే వక్రోక్తియని కావ్యత్వ సంపాదకమని నిరూపించి అనేక విధముల దానిని దృఢపరచి కావ్యశోభాహేతువుల నన్నింటిని ఇందే యంతర్భావించునని సిద్ధాంత మొనర్చెను. మూలములోని ఇతిహాసమున ఏ రసము అంగిగా నుండెనో ఆ రసవిచ్ఛిత్తి నిమిత్తము రసాంతరముచే నూతన ప్రబంధ నిర్వహణ మొక విధమైన వక్రభావము.[26]

అవాంతర కథలచే ప్రధాన కథను విస్తృతపరచుటచే సప్తమాశ్వాస కథయందు ప్రబంధ వక్రత గలదు.

''జంభారాతి తనూజుమీద బొలిసెన్'' అన్న (7-114) పద్యమున లింగ వక్రత కలదు. నన్నయ నుభయ వాక్ప్రౌఢిమ గలవా

25. వీరభద్రరావు, చిలుకూరు, సాహితీ వాల్లభ్యము, మొ॥ భా॥ 1968.
26. ఈశ్వరత్తు, కుందూరి, శ్రీనాథుని కవితా తత్త్వము, 1964.

డని యుద్ఘోషించిన శ్రీనాథుడు ప్రౌఢ సమాస బంధురమగు కవి
తనే గాక తెలుగుదన ముట్టిపడునట్టి తెనుగు పదముల అల్లిక
సొంపుతో పద్యములల్లి హుందాతనముతో నడిపించెను. రెండు
పదములు సంస్కృతము, రెండు పదములు తెలుగు వాడుచు
నన్నయగారి పద్య రచనా శిల్పమును పుణికి పుచ్చుకొన్న కవి
సత్తము డీ శ్రీనాథుడు.

# 6. హరవిలాసము - కావ్యస్వరూపము

6.1. వేదాంగములగు సంహితలు ఋషిప్రోక్తములు. కావ్య స్వరూప నిరూపణములు. కాని పరిమితములు.

"మధుచ్ఛందో భవతి రేఖా ఇష్టా" (ఋ. 6, 11-3) అనగా మధుర కవితావలంబనమే కావ్యస్వరూపము.

కావ్యస్వరూపమన[1] కావ్యాంగ లక్షణము. దోషరహితము లును గుణ సహితములును అలంకార యుక్తములును నగు శబ్దార్థ ములు కావ్యశరీరమని సాధారణ వివక్ష.

"కవిర్మనీషీ పరిభూ స్వయంభూః" అని ఈశావాస్యోప నిషత్తు. కాలక్రమమున వ్యవహారమున పరమాత్మ సాక్షాత్కార మును పొందిన 'ఋషి' కవియైనాడు 'నానృషిః కురుతే కావ్యమ్' సాక్షాద్రష్టలైన వైదిక ఋషులు కవులు. వారి కావ్యము లుపనిష త్తులు. తదర్వాచీన కాలమున లౌకిక ప్రవృత్తులగు వాల్మీకి వ్యాసాది గ్రథిత లోకోత్తర వర్ణనాత్మక రచనములే కావ్యములు.

'కవనీయం కావ్యమ్' అని లోచనకారుడు, కవయతీతి కవిః, తస్య కర్మ కావ్యం' అని విద్యాధరుడు, 'కౌతి శబ్దాయతే విమృశతి రస భావాన్ ఇతి కవిః, తస్య కర్మ కావ్యమ్' అని భట్టగోపా లుడు, 'లోకోత్తర వర్ణనా నిపుణ కవికర్మ కావ్యం' అని మమ్మటుడు.

---

1. కావ్యస్వరూపమ్ - ఆంధ్ర వివరణ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్; సౌమ్య సం॥

ఈ నిర్వచనములను బట్టికవి కర్మకావ్యమని లోకోత్తర వర్ణనా నిపుణుడగు కవిచే, అనగా ఋషి కల్పుడగు విద్వత్కవిచే రచితమైనది కావ్యమనవచ్చును. ప్రతిభా వ్యుత్పత్తులు గల కవి, కారయిత్రి, భావయిత్రి యను యిరు తెరగుల బలిమిచే నేర్పడునదే కావ్యము.

ఉపనిషత్తులలో బ్రహ్మను నిర్దేశించు సమయములలో సత్యము, జ్ఞానము అను పదములతోబాటు ఆనంద శబ్దము వాడబడినది. కాని ఆనంద శబ్దము కవిత్వాది లలిత కళలలో కలుగు అనుభూతిని నిర్దేశించునది. కావ్యమున ప్రధానముగ రసము కలదని ఈ రసాస్వాదము బ్రహ్మానుభూతికి తుల్యమైనదని తర్వాతి ఆలంకారిక భావన. వీరికి ఉపనిషత్తులలోని 'ఆనంద' శబ్దమేగాక, తైత్తిరీయమున గల —

ఆనంద మాత్మా (2.5)

ఆనందమయు మాత్మానం (2.8)

ఆధారము లగుచున్నవి. పైగా

రసో వై సః రసగ్ం హ్యే వాయం లబ్ధ్వాఽఽనందీభవతి'

అని తైత్తిరీయ శ్రుతి. అద్వయ బ్రహ్మమే రసము. ఈ రసావగతిని పొందినవాడు ఆనందానుభూతిని పొందుచున్నాడు. ఇదే మహారసము. శృంగారాదులు దీని వివర్త రూపములు. అందుచే 'భగ్నావరణాచిదేవ రసః' అని జగన్నాథుడు పలికెను.

దివ్యదృష్టి అనబడు భావనా వ్యాపారముతో కరుణరసానుభూతిచే నుత్పన్నమైన మనోరమములగు ఉదార వృత్తములతోను, ఉదార శబ్దార్థములతోను శృంగారాది రసములతో అందరి హృదయముల కాహ్లాదనీయమగునది కావ్యమని ఆదికావ్యము.

(ఉదారవృత్తార్థ పదైర్మనోరమైః
తదాస్య రామస్య చకార కీర్తిమాన్. 1.2.42)

6.2. కావ్యలక్షణములు – ప్రయోజనములు:

అగ్నిపురాణమున కావ్యలక్షణ స్వరూపములు వివేచింపబడి నవి. అభిదాప్రాధాన్యము గల్గి దోషవర్జితమై గుణాలంకారయుత శబ్దములతో వాగ్వైదగ్ధ్య ప్రధానమై యుండునది కావ్యమని తెలియు చున్నది. అట్టి కావ్యమునకు జీవితమని నాటకాదులు శరీరముగా ఇతివృత్తమును గ్రహింపవలెను. భావహీనమైన రసముగాని రసము లేని భావముగాని లేవు, అర్థాలంకారము లేనిచో శబ్ద సౌందర్య ముండ జాలదు.

మహాకావ్యమున అష్టాదశ వర్ణనలతో బాటుగ అన్ని వృత్తులు, అన్ని ప్రవృత్తులు, అన్ని భావములు, రీతులు, రసము లుండవలెను. కావ్యము వేదాదులవలె శాసింపదు. ఇతిహాసాదుల వలె మందలింపదు. కాని విష్ణుధర్మోత్తర మనినట్లు —

తదేవ కావ్యమిత్యుక్తముపదేశైర్వినాకృతమ్. (3–15)

ఉపదేశము చేయకుండు విధముగ భాసించునదే కావ్యము. అగ్ని పురాణములోని రసోత్పత్తి విధానమును భోజుడు విస్తృత పరచెను. కవి శృంగార రసపూర్ణుడైనచో కావ్యమున రసమయమగు జగము కన్పింపగలదు. లేనిచో కావ్యము నీరసమగును. కావ్యమును గూర్చిన ప్రాచీనాలంకారికుల అభిప్రాయములు:

భరతముని నాట్యశాస్త్రమున "ఇతివృత్తంతు కావ్యస్య శరీరం పరికీర్తితమ్" అని కావ్య శరీర మితివృత్త మనెను. కాని దీని సౌందర్య హేతువు రసమనుటను బట్టి భరతుడు రస సిద్ధాంతమును సూత్రప్రాయముగ వివరించెనని తెలియును, రస

రహితమగు కావ్యముండదు. విభానుభావ సంచారీ భావ సంయోగ దశమున నిష్పన్నమగునది రసము. కావ్యార్థములైన రసములను నిష్పన్నము చేయునవి భావములు. భరతుని దృష్టిలో కావ్యమన నాటకాదులే. భామహుడు కావ్యాలంకారమున,

"ధర్మార్థ కామమోక్షేషు వైచక్షణ్యం కలాసు
చ కరోతి కీర్తిం ప్రీతించ సాధుకావ్య నిషేవణమ్"

అనియు శబ్దార్థౌ సహితౌ కావ్యమ్, అనుటను బట్టియు, కావ్యము కీర్తిని, ప్రీతిని ఇచ్చునదని కావ్యమునకు శబ్దార్థములు శరీరమనియు స్త్రీ పురుషాదులు శరీర సౌందర్యమును అలంకారములు పెంపొందించు విధమున కావ్యశరీరమును గూడ వక్రోక్త్యాద్యలంకారములు పెంపొందించుననియు కావ్యము ప్రతిభావంతుని నుండి మాత్రమే ఆవిర్భవించుననియు తెలియుచు.

భామహుని మతమున వక్రోక్తి శబ్దమునకు అలంకారమనియే అర్థము. ఈ వక్రోక్తి లేనిచే సాహిత్యమే ఉండజాలదు. కావ్యమునకు కావ్యత్వమును ఆపాదించునది వక్రోక్తి. గుణసామ్య ప్రతీతిని (3-79) చెప్పుటచే అలంకారముల వలన కావ్య సౌందర్యము గల్గునని నిర్ణయించెను.

దండి కావ్యాదర్శములో, "శరీరం తావ దిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ" (రమణీయార్థ భూషితమగు పద సంఘాతము కావ్య శరీరము) అని కావ్య నిర్వచన మొనర్చెను. శరీరముయొక్క బాహ్య సౌందర్యమును పెంచునవి అలంకారములైనను అంతస్సౌందర్యమును బెంచి ప్రాధాన్యమును వహింపజేయునవి శౌర్యాది గుణములు. అట్లే కావ్య శరీరమునకు గుణములే ప్రధానములని వాని తదుపరియె

అలంకారములని పేర్కొనెను. దండి శబ్దగత, అర్థగత గుణములు పది యని పేర్కొనెను

మాధుర్యము, ఔదార్యము, కాంతి, ప్రసాదము, అర్థవ్యక్తి అర్థగతములు, శ్లేష, సమతా, సౌకుమార్య, ఓజస్, సమాధి, మాధుర్యార్థ వ్యక్తులు - శబ్దగతములు. రుద్రటుడు - కావ్యాలంకారమున తుల్య ప్రాధాన్యముగల శబ్దార్థముల కలయిక, కావ్యమగునని. రచనా చారుత్వమను శబ్దముగల్గి పురుషార్థములను సరసుల కవగతమగునట్లు మృదువుగా రసవంతముగ బోధించునదే కావ్యమనెను. వామనాచార్యులు కావ్యాత్మను గూర్చి విచారణ సాగించి "రీతిరాత్మా కావ్యస్య" అను సిద్ధాంతము చేసెను. శరీరమున కాత్మవలెనే కావ్య శరీరమునకును ఆత్మ యుండునని అతవి సిద్ధాంతము. రీతి యనగా పద సంఘటనా విశేషము. అది గుణాధారము. గుణాలంకార సహితములైన శబ్దార్థములే కావ్యము. అలంకారముండుట చేతనే కావ్యము శ్రవణయోగ్యము. సౌందర్యమే అలంకారము. అలంకారముండుట చేతనే కావ్యము శ్రవణయోగ్యము. సౌందర్యమే అలంకారము. కావ్యము దోషరహితము కావలెను.

ఆనందవర్ధనాచార్యులు: ధ్వనియే కావ్యాత్మ అనెను. అది స్త్రీల శరీర లావణ్యమువలె కావ్యములలో అంతర్లీనమై యుండి వాచ్యము, ప్రతీయమానమను నిరుతెరగుల రూపమున నుండును, సహృదయ రంజకముగ నుండవలెను. వస్తు అలంకార రసధ్వనులను మూడింటిలో రసధ్వని సర్వశ్రేష్ఠమనెను. స్పష్టముగ కావ్య శరీరము గూర్చి నిర్వచింపక పోయినను శబ్దార్థోభయమే కావ్య శరీరమని వ్యక్తమగుచున్నది.

రాజశేఖరకవి: గుణాలంకార సహిత ఉక్తి విశేషమే కావ్యమనెను. కావ్యము విధి పూర్వకమగు ఉపదేశము చేయక నిషేధ రూపమున ఉపదేశించగలదనెను. కవుల భేదముల తెల్పెను.

భట్టనాయకుడు: రస చర్వణము కావ్యాత్మయని తెల్పెను.

తౌతభట్టు: ప్రీతిని ఆత్మగా గల్గిన రసముతో గూడిన కావ్యము అనెను. సాక్షాత్కృత వస్తుధర్మము రసప్రీతిని కల్గించు ననెను.

అభినవ గుప్తుడు: కావ్యమనగ ముఖ్యముగ నాటకమేనని ఈతని వాదము. కావ్యము వృక్షము వంటిది. ఫల పుష్పాదుల వంటిది అభినయాది నట వ్యాపారము సామాజిక రసస్వాదము ఫలము వంటిది. కావున విశ్వమే రసమయము. అందులకే ఇతడు "రస ధ్వనేర్జీవిత త్త్వమ్" (లో - 45) అనెను. అనగా కావ్య వ్యాపారముననే కన్పించు రస ధ్వనియే కావ్యాత్మ.

కుంతకుడు: లోకోత్తరమగు చమత్కారమును తెచ్చు వైచిత్ర్యము కావ్యమునకు అపూర్వాలంకార మనెను. కావ్యామృత రసాస్వాదము, చతుర్వర్గ ఫలాస్వాదము కన్న మిన్న. ఈ అనుభూతి సాలంకృత కావ్యమున కల్గినది. శబ్దార్థముల కలయిక కావ్యము.

క్షేమేంద్రుడు: 'ఔచిత్యం రస సిద్ధ స్యస్థిరం కావ్యస్య జీవితమ్' కావ్యమునకు జీవిత భూతమైన యౌచిత్యము లేకున్నచో అలంకారములు, గుణములుండి ప్రయోజనము లేదని అవి బాహ్య శోభా హేతువులేనని తెల్పెను. రసవంతమగు కావ్యమునకు జీవిత భూతము ఔచిత్యమని ఈతని మతము.

మమ్మటుడు:

'కావ్యం యశసేఽర్థకృతే
వ్యవహార విదే శివేత రక్షతయే,
సద్యః పరనిర్వృతయే
కాంతా సమ్మిత తయోపదేశయుజే. (కా ప్ర)

ఇదియే కావ్య ప్రయోజనములు. తదదోషౌ శబ్దార్థౌ సగుణా వనలంకృతీ, పునః క్వాపి'' — అని అనేక కావ్యములకు గతి కల్పించెను. శారదా తనయుడు - వాక్యార్థమగు తాత్పర్యమే రసమని, ఇది శబ్దార్థ సంబంధము ద్వారా కల్గునని. హేమచంద్ర సూరి కావ్య ప్రయోజనములును, రుయ్యకుడు ధ్వని కావ్యాత్మ యనియు తెల్పిరి. విద్యానాథుడు నగరార్ణవ వర్ణనము ప్రబంధ లక్షణమని, విశ్వనాథుడు 'వాక్యం రసాత్మకం కావ్య' మని తెల్పిరి. ఇక జగన్నాథ పండితరాయలు 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్' అని ప్రతిపాదించిరి. 'చమత్కార వత్త్వం కావ్యత్వం' అని జగన్నాథుడు; కావ్యమున చమత్కారముండవలెనని అది వస్త్వలంకారరసాది ధ్వనుల వలన నేర్పడునని తెలిపెను.

పై చెప్పిన ఆలంకారికుల యభిప్రాయము ననుసరించి కావ్య స్వరూపమనగా కావ్య శరీర లక్షణము. శరీరమునకు బాహ్యాలంకారములు శోభాహేతువులు. ఆంతరంగిక గుణసౌందర్యము అవశ్యము. అట్లే కావ్య శరీరమునకు రసధ్వని చమత్కార రీతులే ఆత్మ వంటివని రూఢము. పైగా కావ్యము ప్రీతిని, ఆనందమును యశస్సును అర్థమునిచ్చునట్టి ప్రయోజనములు గలదని సువ్యక్తము. మనోహరమగు నర్థముతో నలంకృతమైన పదసముదాయము 'కావ్యము' అని సువిదితము. దోషరహితములును గుణసహితములును అలంకార యుక్తములు నగు శబ్దార్థ యుగళము కావ్య శరీరమని ఫలితము. ఈ కావ్య శరీరమునకు ధ్వని లేక వ్యంగ్యమే ఆత్మ యని వ్యంగ్య ప్రాధాన్యమును బట్టి కావ్యభేదము లేర్పడునని రస స్వరూపముగల వాక్య సముదాయము కావ్యమనికూడ తెలియు గలము. మహాకావ్యము సర్గబంధము గల్గి ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశము లుండి, ఇతిహాసేతి వృత్తముతో చతుర్వర్గ ఫలము నిచ్చు

నదై చతురోదాత్త నాయకము గల్గి నగరార్ణవాది అష్టాదశ వర్ణనములతో పంచసంధియుతమై సర్వత్ర భిన్న వృత్తాంతము గల్గి రస భావ నిరంతరమై లోకరంజనము గల్గించునట్టిది. అభినవ గుప్తాదుల మతానుసారము కావ్యమనగా నాటకమే అనియు తేలినది. కావ్యానందము బ్రహ్మానంద సహోదరమనిరి. రసోపస్కారమునకు వృత్తులు— కైశికి, ఆరభటి, సాత్త్వతి, భారతి అనునవి కాగా, రచనాశ్రయమై యుండునది వైదర్భి, గౌడి, పాంచాలి యను మూడు రీతులు. అర్థము యొక్క పాకము ద్రాక్షా నారికేళ కదళీ పాకములని మువ్విధములు. పదముల యొద్దికను శయ్యయందురు. అర్థ శబ్దాలంకారములు ఓజో మాధుర్యాది గుణములు కావ్యమున కావశ్యకములు - రసాలంబనమునకు నాయికా నాయక భేద ప్రవిభేదము లుండును. ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత, ధీరశాంతుడను నల్వురు నాయకులు; తద్విరుద్ధ లక్షణములు గల వాడు ప్రతినాయకుడు. సాధ్వీ సామాన్యాది నాయికా భేదములు గలవు. అష్టాదశ విశిష్ట వర్ణనలు గలదే మహాకావ్యము. అందులో కొన్ని తగ్గినను ఫరవాలేదు.

కావ్యవస్తువు: 'కావ్యం హి దశరూపాత్మకమేవ' అనుటతో భరతుని మతమున కావ్యమనగా దశరూపాత్మకమే. 'ఇతివృత్తంతు కావ్యస్యం శరీరం పరికీర్తితం' అని భరత మతము. ఇవివృత్తమే కావ్యశరీరమని అర్థము. పైగా "పంచభిస్తస్య విభాగాః సంకీర్తితాః" అనుటతో పంచసంధులలో ఇతివృత్తము విభాగింపబడియుండవలెనని తెలియును. ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము అని ఇతివృత్తము త్రివిధము. కావ్యవస్తువు రసాదివ్యంజకముగ, రమణీయముగ నుండవలెను. ఇతివృత్తగతమగు అనౌచిత్యములున్న వానిని తొలగించి రసోచితముగా దానిని మార్చవలెను. రసాభివ్యక్తి నుద్దేశించి యనగా తదుపస్కారముగ సంధి తదంగములను కూర్చవలెను. ఆ

యీ ఘట్టములందు రసోద్దీపనమును, రస ప్రశమనమును సముచితము గావింపవలెను. ఆరంభింపబడి యాగిపోయిన యంగిరసమును మరల ననుసంధింపవలెను. సామర్థ్యమున్నది గదా యని అలంకారములను కూర్పక యనురూపకముగ మాత్రమే కూర్పవలెను. ఇట్టి ప్రబంధము రసాదివ్యంజకమగుటలో సందేహము లేదు.

కావ్యము సర్వవ్యక్తి సాధారణము, సర్వకాల సాధారణముసై ప్రతిభాసైపుణ్య ముట్టిపడ గుణాలంకార రసాదులతో యథాతథముగ ఆశయమును చెప్పునదై కాక వ్యంగ్యముగ బోధించునది.

శ్రవ్యదృశ్యములని యిరుతెరగుల కావ్యములు కలవు. గద్య పద్య చంపూ కావ్యములని తిరిగి ముప్విధములు గలవు. మహాకావ్యమునగానీ, ఖండకావ్యమునగానీ యొక్కడే నాయకుడుండవలెను. అతడు ధీరోదాత్తుడు. శృంగార వీరరసములలో నొకటి ప్రధానముగ నుండవలెను. కావున నాటకము నందువలెనే కావ్యమునందును శృంగారాది నవరసములు ప్రధానముగ అనగా అంగిరసములుగా నుండును. మరియు ఇష్టదేవతాస్తుతి, ఆశీర్వాదము, వస్తు నిర్దేశము గల్గియుండవలెను. కుకవినిందసర్గాంతమున భావి కథా సూచన ముండవలెను,

6.3. హరవిలాసము – కావ్యలక్షణ సమన్వయము:

హరవిలాసము గద్యపద్య సంశోధితము.

కావ్యవస్తువునుబట్టి ప్రఖ్యాతము, ఉత్పాదము, మిశ్రము అని ముప్విధములు. ఇట ప్రఖ్యాత మనగా పురాణప్రసిద్ధము – శివ పురాణాదుల నుండి కావ్యవస్తువు గ్రహీతము.

చంపూ కావ్యములకు ప్రబంధము లనియు వ్యవహారము. వర్ణనా భూయిష్ఠమగు నీ ప్రబంధమును నన్నెచోడుడు వస్తుకవిత యనియు లక్షణా దీపికాకారుడు 'విస్తర కవిత' యనియు వ్యవహరించిరి. చంపూ కావ్యమునందు వలెనె యాంధ్ర ప్రబంధములందును ఒక్కొక్క యాశ్వాసమునందును పెక్కు వృత్తములను కవులు వాడుదురు. "నానావృత్తమయః క్వాఽపి సర్గః కశ్చన్న దృశతే" అన్నట్లుగ నానావృత్తమయమగు సర్గలును గలవు. హారవిలాసము భిన్నవృత్తములు గల పంచవృత్తములు గలది. అనగా చిఱుతొండ నంబికథ, కుమారసంభవము, దేవదారు వనవిహారము, సముద్రమథనము, కిరాతార్జునీయము అనునవి ప్రత్యేక కథలైనను శివలీలోత్కర్షములు.

కథాప్రాశస్త్యము:

ద్రావిడ వాఙ్మయమున పేరెన్నిక గాంచిన పెరియపురాణము నుండి చిఱుతొండనంబి కథ స్వీకృతము. పెరియపురాణము పాల్కురికి సోమన బసవపురాణ రచనకు దోహద మొనర్చినది. కన్నడ కవి భీమయు బసవపురాణ కథకును పెరియ పురాణము ప్రోద్బలకారి యనవచ్చును. కనుక ద్రవిడ దేశమున సంచరించుచు కృతిభర్తయగు అవచి తిప్పయ ప్రీత్యర్థమీ కథను శ్రీనాథుడు స్వీకరించి ప్రపంచించి ద్రవిడ దేశస్థుల మన్నన నొందిన ఈ కథావస్తువును గైకొనెను. పెరియపురాణ మందలి శివలీలలు 'శివభక్తవిలాస'మని సంస్కృతమున గూడ ననువదింపబడుటకు కారణమా కథకు గల ప్రాశస్త్యమని తెలియును.

ఇక కాళిదాస కుమార సంభవమునకు గల ప్రాశస్త్య మనిర్వాచనీయము. ఆ మహాకావ్యవస్తువును శ్రీనాథుడు గైకొని తార

కాసుర విజృంభణముతో మొదలిడి, పార్వతీ జనన, యౌవన, తపోవర్ణనలతో కొనసాగించి తుదకు గౌరీకల్యాణ మొనర్చి కుమార సంభవ సూచనముతో ఆశ్వాసము ముగించెను. జగత్తుకే మాతా పితరులగు శివశంకరుల వృత్తాంతము ప్రఖ్యాతమేగాక జనరంజక మైనది. అందు మన్మథ విజృంభణము మన్మథ దహనము రతీ విలాస మను ఘట్టములలో శ్రీనాథుని ఆత్మీయత కొట్టవచ్చినట్లు తెలియును. కనుక కాళిదాస కుమారసంభవ కావ్యమునకు సంక్షి ప్తానువాదమయ్యు శ్రీనాథుని హరవిలాస గౌరీకల్యాణమున కొక ప్రత్యేకత, సహజసుందరత్వము కలవు. కన్నడ కవి యగు హరి హరుని గిరిజా కల్యాణము శ్రీనాథుని యితివృత్త పరిమితి, నామ కరణము కుమారజనన సూచన, ఫలశ్రుతులలో ప్రభావితు నొనర్చెను.

శివపురాణాంతరగత కథావస్తువే దేవదారు వనవిహారము. అయినను శ్రీనాథుడు సంస్కృత కవియగు ఉత్ప్రేక్షావల్లభుని భిక్షాటన కావ్యము నూతగా గొని తన కావ్య కథావస్తువును శృంగార వర్ణనా సముంచితముగ తీర్చిదిద్దెను. ఈర్ష్యాళువులగు దేవ ర్షుల మదమాత్సర్యముల తుదముట్టించుటకై శంకరుడు మామగా రింటినుండి పలాయనము చిత్తగించి దేవదారు వనమున ప్రమథ గణములతో విడిసి, ఆది భిక్షువై ఆ వనమందలి సకల మునిపత్నీ మనోవికార హేతువై తుదకు సకలలోక పూజార్హమగు లింగోద్భవ మునకు కారణభూతుడయ్యెను. ఇట్లీకథ శృంగార రస సముపేత మైనను పరమేశ్వరాలంబన విభాసితమైనదై శివలీలల దెలుపు పురాణ వృత్తాంత మగుచున్నది.

ఇక సముద్ర మథన వృత్తాంతము పురాణ ప్రథితము. దేవ దానవు లిట శివప్రేరితులై సముద్రమందలి అమూల్య వస్తు నిచయ

మునకై పట్టువదలక మథించి దివ్యవస్తు నిచయమును బడయుట ఎల్లరెరిగినదే యయ్యు దేవేంద్రునకు దుర్వాస శాపము నిచ్చుటను జోడించి శ్రీనాథు డొక ప్రత్యేక ఆశ్వాసముగ మలచుటలో పురాణ కథలను నీ కథకు వైవిధ్యమున్నదని చెప్పవచ్చును. అమృతమును పంచిపెట్టు నప్పటి మోహిని యవతార వర్ణనము నందలి హావభావ విలాసములు మైమరపించి మురిపించునవై శ్రీనాథుని వర్ణనా వైదగ్ధ్యమును తలపించునట్టివై అలరారినవి.

పంచమ వేదము, జయమను నామాంతరములతో ప్రఖ్యాతి వడసిన మహాభారతేతిహాస కథావృత్తాంతమే కిరాతార్జునీయము. భారవి కిరాతార్జునీయ మొక ప్రత్యేక కావ్యమై అలరారునది. శ్రీనాథుడు మహాభారత కథను స్వీకరించి అందునను నన్నయ మహాభారత కథానుసరణముగ తన సప్తమాశ్వాస కథను రూపొందించు కొనెను.

ఇందు అర్జునుని శివభక్తి నిరతి ద్వారా శ్రీనాథుని ఈశ్వరార్చనా కళాభిరతి పంచబ్రహ్మోపాసన షట్కాల పూజావిధులు తెలియగలవు. శ్రీనాథుని ప్రజ్ఞా పాండిత్యములకు గీటురాయి యనదగిన కిరాతార్జునీయ వృత్తాంతము ప్రత్యేక ప్రబంధమనదగినదై రస సమంచితమై సంస్కృతాంధ్ర సమాస నిబిడీకృతమై యొప్పియున్నది.

పై విధముగ హరవిలాసమున కథావస్తువు ప్రధానముగ శివలీలల దెలుపునదై పురాణ ప్రసిద్ధమై సనర్గానుబంధము కల్గినదై కావ్యనామాన్వర్థమై యలరారుచున్నది.

6.3.1. నాయకుడు:

మహాకావ్యమున గాని, ఖండకావ్యమున గాని యొక్కడే నాయకుడుండవలెను. ఆతడు ధీరోదాత్తుడు. శృంగార వీరములలో

నొకటి ప్రధానముగ నుండవలెను. హరవిలాసమున మహాశివుడు ధీరోదాత్తుడు, అత్యుదార గుణసంపన్నుడగుటచే మహాశివుడు సంబిపైనను, పార్వతి పైనను, మహర్షులపైనను, అర్జునుని పైనను కారుణ్యమును వర్షించెను. అర్జునుడు తాత్కాలికముగ ప్రతి నాయకుడువలె భాసించినను ఆతని వ్యసనాభ్యుదయములు పరిపుష్ట ములు కావు. "సర్వమును ఫలప్రాప్తి పర్యంతము ఎవరివలన నడ చునో ఆతడు నాయకుడనబడును" అను భరతాచార్యుల నిర్వచ నము బట్టి ప్రత్యేక కథలుగా భాసిల్లుచుండినను మహేశుడే అన్ని కథలందును ఫలప్రాప్తివరకు నడచును. కనుక కరుణాళువు, అవికత్థనుడు (ఆత్మ శ్లాఘ లేనివాడు) గాంభీర్యము గలవాడు సత్త్వ గుణ సంపన్నుడు అయిన శంకరుడు ధీరోదాత్తుడు.

"ఆద్యా నమస్క్రియాశీర్వా వస్తునిర్దేశ ఏవవా"

అనుటబట్టి కావ్యారంభమున నిష్టదేవతా నమస్కారము గాని ఆశీ ర్వాదము గాని వస్తునిర్దేశముగాని యుండవలెను. ఇక హరవిలాస మున కాంచీపుర వరదరాజస్వామి, ఏకామ్రేశ్వరుడు, కామాక్షీ కృతిభర్తకు ఆయురారోగ్యైశ్వర్య ప్రాభవముల నిచ్చునట్లు ఆశం సింప బడినది.

శ్రీనాథ మహాకవి పుస్తక వీణాపాణికి భక్తితో నుపాస్తి రొనర్చి "శాంభవీ శంభు మధుకేళి సంభ్రమములు వాసవాద్య మృతాశన వందితములు, వప్రక్రియా కేళి వశ విశీర్ణ మేధినీధర రత్న మేఖలములు — పొదలి వాసించుగాత నా హృదయ వీధి" అని శ్రీనాథుని పీఠికారంభ పద్య ఖండికలు గౌరీ కల్యాణ, సముద్ర మథన వృత్తాంతములను కథా వస్తు నిర్దేశ మొనర్చునవి. విద్యా నాథుడు ప్రతాప రుద్రీయమున —

'యత్రపున రుత్తమ పురుష చరితం న నిబధ్యతే తత్కావ్యం పరిత్యాజ్యమేవ, తద్విషయా చస్మృతిః' — 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అనుటబట్టి ఏది ఉత్తమ పురుష చరిత్రము నిబద్ధము కాదో యా కావ్యము పరిత్యాజ్యమే కావ్యాలాపములను విడువవలెనను స్మృతి వచనము దాని విషయమే కనుక ఉత్తమ పురుషుడైన శంకరుని చరిత్ర ఉపదేశముగా నుండుటచే ఉపదేశకమైన కావ్యముపాదేయ మగునని పై అభిప్రాయము దృఢపరచుచున్నది.

కావ్యవాఙ్మయము ఆనందమును ధర్మోపదేశమును చేయును. కావ్యానందము బ్రహ్మానంద సహోదరమని ఆలంకారికుల నిర్వచనము. హరవిలాసము భగవంతుని పట్ల విశ్వాసము గల్గించి భక్తి ప్రపత్తులతో ఆరాధించిన ముక్తిగల్గునన్న ఆధ్యాత్మిక తత్త్వ ప్రబోధ మొనర్చునట్టి కావ్యము. ''ఉద్యమేనైవ హి సిద్ధ్యన్తి కార్యాణి'' అని సముద్ర మథనము ద్వారా కార్యదీక్షను, కాలకూట విషభక్షణముచే పరోపకార పారాయణత్వమును ప్రబోధించును. పార్వతి అర్జునుల తపోదీక్షచే కార్య సాఫల్యమునకై యెట్టి శమ దమాది యింద్రియ నిగ్రహము లలవరచుకోవలెనో తెలియజెప్పును. అర్జునుని శీల నైగనిర్యము ఉత్తమ పురుషుని కుపాదేయము. ఇక చిఱుతొండనంబి స్వార్థరాహిత్యము, అచంచల భక్తి విశ్వాసములు నిర్మమమత్వము మన దేశ సంస్కృతీ ఆధ్యాత్మిక తత్త్వముల కుపబలకములైనవి. అరిషడ్వర్గముల జయింపవలెనను ప్రబోధమొనర్చునవే దేవదారువన విహారకథ. పట్టుదలతో పనులు సాధింపగలమన్న ఉపదేశ మొనర్చునది కిరాతార్జునీయము – ఇట్టి ధర్మోపదేశాత్మకమైన హరవిలాసము ఆనందమునిచ్చు ననుటలో సందియము లేదు. ఉత్తమ ప్రతిభావంతునిచే నల్లబడిన కావ్య మగుటచే ప్రఖ్యాతేతివృత్త

ముతో, శయ్యాసైగనిగ్యముగల రచనా శైలితో రసజ్ఞుల పాలిట మాకందము హారవిలాసమని చెప్పవచ్చును.

రసపోషణము:

'రసోవైసః' 'ఆనందో బ్రహ్మేతివ్యజానాత్'

అను శ్రుతి భగవంతుడు రసస్వరూపుడని, ఆనందము పరబ్రహ్మ స్వరూపమని నిరూపించినది.

'రస్యతే ఇతిరసః' — సహృదయులచేత ఆస్వాదింపబడు చున్నది కనుక రసమని చెప్పబడుచున్నది. రసశబ్దము ప్రారంభమున ఋగ్వేదమునందు సోమరసము, క్షీరము, నీరము, సారము అను నర్థములందుపయుక్తమైనది. అథర్వవేదమునను శతపథ బ్రాహ్మణ మున నీ శబ్దము 'రుచి' యను నర్థమున ప్రయోగింపబడినది. ''వేదా హి రసా తేషామేతా రసాః (చాం. ఉ. 3, 5-4) అనియు 'రసో వైనః ''రసం హ్యే వాయూలబ్ధ్వా నందీ భవతి' (తై. ఉ. 2, 7, 1) అనియు ఉపనిషత్తులలో వాడబడిన రస శబ్దము అట రుచి, సారాం శము అను అర్థములలో ప్రయోగింపబడినది.

భరతాచార్యుడు రస శబ్దమును కావ్య పరముగ వాడెను -
'న హి రసాం దృతే కశ్చి దర్థః ప్రవర్తతే' —
(నా. శా, పుట 92)

ఆలంకారికుల ననుసరించి అజ్ఞాన రూపాదరణ రహిత చైతన్యముతో గూడిన స్థాయీ భావము రససిద్ధమైనది.

రసము అలౌకికమనియు, వ్యంగ్యమనియు సామాజిక నిష్ఠ మనియు, వాసనా మూలకమనియు సాధారణీక వ్యాపారాశ్రయ మనియు, అభినవగుప్తుడు సంభావించెను.

విభావానుభావ సాత్త్విక భావములచే స్వాదుత్వము పొందింపబడిన స్థాయీభావమే రసముగ చెప్పబడుచున్నది.

హారవిలాసమున శృంగార వీరములు ప్రధాన రసములు గాకున్నను, ప్రధాన రసములవలె పోషింపబడినవి. గౌరీకల్యాణ, దేవదారు వనవిహార సముద్ర మథన కిరాతార్జునీయ ఘట్టములందు శృంగారము సమపాళ్ళలో పోషింపబడినది. అర్జున శంకర వివాద యుద్ధ ఘట్టములందు వీరరసము పోషింపబడినది. సాహిత్య దర్పణకారుడు శృంగార వీర శాంతములలో నొకటి యంగిగా నుండవలెనని నుడివెను.

ఇందు కావ్యాశ్వాసాంతములందు శాంతమే పోషితము. చిఱుతొండనంబి కథ యందు భక్తి రసమును, మృతుడైన బాలుడు సజీవుడై తిరిగి వచ్చు ఘట్టమునందు అద్భుత రసమును పోషింపబడినది. నాటకమున వలె కావ్యమున శృంగార వీర శాంత కరుణ అద్భుత హాస్యరౌద్ర భయానక బీభత్సములు ప్రధానములుగా నుండును. భక్తి వీరము లేదా దాన వీరము చిఱుతొండ నంబి యందు కానవగును. తారకాసురునిచే మునులు పడ్డపాట్లు, ప్రమథ గణముల అట్టహాసములు - జుగుప్సా పూరితములు.

ఇక శివుని భక్తి పరాధీనతను వెలార్చు ఘట్టమున నేగాక, కావ్యమునందామూలాగ్రముగ కరుణరసము పోషితము. పార్వతీ కపట విప్ర సంవాదమునను అర్జున కిరాత సంవాదమునను, శివ స్వరూప వర్ణనమునందును హాస్యరసము పోషితము. అర్జున పార్వతీ శంకరుల తపోదీక్షా వర్ణనములలో శాంతము సువ్యక్తము. అర్జునుని నివాత కవచ కాలకేయుల కథా సందర్భమున దుర్వాస శాప ఘట్టమునందును రౌద్రము కానవగును. ఇట్లు రస సమంచితమై యొప్పునదే హారవిలాస కావ్యము.

అంగిరస మిదమిత్థమని నిర్ణయింపవీలగునట్టిదే నిబద్ధకావ్యము. సురుచిర రసపోషణము నిబద్ధ కావ్యములలో కానవగును. అయిదు ప్రత్యేకములైన కథలతో కూడి శివభక్తి ప్రబోధమే ఉద్దేశింప బడిన హరవిలాసము ఒకానొక ఖండకావ్య సంపుటి యనిరి. శృంగార రస మంగిరసముగా గల శృంగార నైషధమునందలి కథా తంతువు రసపోషణమున కత్యంత మనుకూలమైనదని అట్లు హరవిలాసమున ఏకైక రసము పోషింప అనువైన కథాతంతువు లేదు.

"ఇది పురాణము కాదు కావ్యమును కాదు. కావ్యము కాదగిన వస్త్వైక్య మిందు లేదు. కథలన్నియు శివసంబంధము గల్గి యుండుటయే దీనగల నైక్యము. దానిని వస్త్వైక్యమనలేము. ఈ కథలన్నియు ఒక దారముతో విడివిడిగా ముడివేయబడిన పూదండవలె నున్నదిగాని అనుస్యూతములుగా లేవు."[2] అయ్యు 'ఈ కావ్యమున నే యెడను రసవత్తతకు మాత్రము లోటు రాలేదు. ఇది దేని కిని అనువాదము కాకపోవుటచే శ్రీనాథుని స్వతంత్ర రచనకు దృష్టాంతమై ఆ ప్రౌఢకావ్యములలో లేని స్వతంత్రతను గొన్నది.' అని పింగళి లక్ష్మీకాంతంగా రనుటలో రసవత్తర కావ్యమై వస్త్వైక్యము లోపించిన స్వతంత్ర రచన హరవిలాసమని తేలినది. కాని సమసంస్కృతాంధ్ర పద మయమై ప్రసన్నమై సుబోధకమైన హరవిలాసము శ్రీనాథ పండితుడు గాక శ్రీనాథ కవి వ్రాసిన ట్లుండుటచే కవికృతము కావ్యమేనని స్పష్టపడినది.

ఎచ్చటెచ్చట రస నిష్పన్నతకు అవకాశము గలదో ఆ అవ కాశములను సద్వినియోగ మొనర్చుకొని క్షేత్ర మాహాత్మ్యము లందు గూడ కావ్యకళా వైశారదత్వమును ప్రకటించి భక్తికి రసత్వ

2. లక్ష్మీకాంతం, పింగళి; ఆంధ్ర సాహిత్య చరిత్ర, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ హైదరాబాద్ 1974.

సిద్ధిని కల్పించిన రస జగన్నాథుడే శ్రీనాథుడు. ఆతని చేతిలో రాయి కూడ రమణీయ రత్నమై దగద్ధగిత కాంతులతో ప్రకాశించును.[3]

శృంగారము:

> దేసిక గాన మార్గముల దిన్నని రీతుల బాడి, పాడి, యాశ్వాసమునొంది, సోలి, యరవాడిన యంగన మోముదమ్మి బుష్పాసవ ఘూర్ణితేక్షణము లల్లన జుంబన మాచరించి యుల్లాస మొనర్చె గిన్నర విలాసి హిమాచల కందరంబునన్
>
> (హర - 3-62)

మన్మథుని చైత్రయాత్రా సందర్భమున రచితమైన నీ పద్యమున దేసికి గాన మార్గములలో వివిధ భంగుల పాడి పాడి అలసి సొమ్మసిలిన ప్రియ తరుణీ ముఖ పద్మమును, మధుపానముచే తిరుగుచున్న చూపులుగల నేత్రములను మెలమెల్లగ చుంబించి కిన్నర విలాసి ఆమెను ఉల్లాస పర చెననుటలో శృంగార రసమున్నది.

శృంగార నాయకుడు :

ఒక్క నాయికయందే అత్యంతానురక్తుడైనవాడు 'అనుకూలుడ'ను నాయకుడు.

> "కమలాక్షి యిది యేమిగా దలంచితి విష్ణు
> డర్ధ దేహంబు నీ యదియకాదె
> హృదయంబు పొరువున హృదయముండుట లేదె
> యేకీభవించిన యిరువురకును?

---

3. బాపూజీ - జయకృష్ణ, శ్రీనాథుని సాహిత్య ప్రస్థానము, వెల్‌కమ్ ప్రెస్, గుంటూరు 1977.

నే భావమైన నీ హృదయంబునకు దాప
నేభంగి వచ్చు నా హృదయమునకు?
నపరాధ శంక యావంత యైనను లేదు
నీ చిత్తమున కెక్క నిక్కవంబు;
తప్పు లేకుండ నేల నెత్తమ్మి మొగడ
విసరి వక్షః ప్రదేశంబు వ్రేటుకొంటి?
కేసరంబుల రజము బుష్పాసవంబు
నెఱసె నిది చూడు కన్నుల నీరుగ్రమ్మె. (హర. 1-27)

పై శివుని సంభాషణము, ప్రవర్తనము అనుకూల నాయకునకు తగి యున్నది.

II) శృంగార నాయికలు:

నాయకుడు పరస్త్రీతో గడపెనని వాని జూచి కుపితురా లగుట ఖండిత లక్షణము:

"అమర వరేణ్య! ప్రేంకణము లాడెడు వేలుపు లేమ జూచియే
చెమరిచి" తంచు గేళి సరసీరుహమెత్తి ప్రతాప మొప్పగా
హిమగిరి రాజనందన మహేశ్వరు మొత్తె మధూళికా పరా
గములు శశాంక శేఖరుని కన్నుల మూటను జిందునట్లుగన్.
(హర. 1-25)

నాయకుడు పరస్త్రీతో గడిపెనని వాని జూచి కుపితురాలైనది గనుక ఖండిత. మదనార్తయై కాంతుని వద్దకు తానే పయనమగు రమణి అభిసారిక.

పదునాల్గు జాతుల త్రిదశాంగనల యందు
పేరుపెంపును గల నీరజాక్షి
నీరజనాభుని యూరు కాండంబున
నుద్భవంబందిన యుజ్జ్వలాంగి

యంభో విధానంబునాపోశనము గొన్న
కలశ సంభవు గన్న కంబుకంఠి
వసుధ యందు బురూరవ శ్చక్రవర్తికి
బ్రాణ వల్లభయైన పద్మనయన
కట్టి తోడి పూసి కై సేసి కౌతుకమున
గొనలిగా నీలి పుట్టంబు ముసుగుపెట్టి
గాజులెగద్రోసి చప్పుడుగాకయుండ
వచ్చె నూర్వశి యర్జునావాసమునకు. (హర. 7-119)

అను పద్యమున ఊర్వశి మదనార్తయై అర్జునుని గోరి వెళ్ళినది. కనుక ఈమె అభిసారిక.

అ) విప్రలంభ శృంగారము:

సంయోగము పొందిన నాయికా నాయకుల కేదైన కారణముచే గలుగు నెడబాటు విరహ విప్రలంభన మనబడును. దీనినే ప్రవాస విప్రలంభమని సాహిత్య దర్పణకారుడనెను. నాయికా నాయకులకు ప్రవాసము ముని శాపము, రాజకోపము, సంభ్రమముచే గాని కలుగవచ్చును.

క్రొమ్ముడికై పెక్కు కుసుమంబు లుమియుచు
నవటు ప్రదేశంబునందు బొరల
జేవురించిన లేత చెక్కుటద్దంబుల
తాటంక యుగళంబు తన్నియాడ
నాక్రోశ పరిదేవనాతుర వ్రాతంబు
కంఠ గద్గదికచే గ్రగ్గు పడగ
హరినీలముల చాయనతికి గోళమ్ముల
సొబగు గాటుక నీటి సోన గురియ

ము త్రియంబుల పేరులు మఱచిసి పడగ
హస్తముల వీగు జనుదోయి యడిచికొనుచు
సంబెరం బిచ్చె రతిదేవి శంబరారి
కప్పుడు వసంతు నెదుట దుఃఖార్త యగుచు. (హర. 3-92)

పై పద్యము రతీదేవి ఏకవేణీధారిణి గాకున్నను విరబోసికొన్న జుట్టుతో నిశ్వాసోచ్ఛ్వాస రుచిత భూమి పతనములు కలదిగ వర్ణింప బడుటచే విప్రలంభశృంగారము. విప్రలంభము లేనిదే శృంగార రసము పుష్టి నందదని చెప్పుదురు. ఇట బ్రహ్మ శాపముచే మన్మథుడు శివతపోభంగ మొనర్చి భస్మీభూతుడగుటచే రతీమన్మథుల కువియోగ మేర్పడినది.

ఆ) అభిలాష విప్రలంభము:

నాయికా నాయకులకు సంభోగమునకు పూర్వము కలుగు అనురాగమున కభిలాష యని పేరు. దీనికే అయోగ విప్రలంభము, పూర్వరాగ విప్రలంభము అని నామాంతరములు. పార్వతీ శంకరుల ప్రేమ వెల్లడియై మాంజిష్ఠరాగమైనది.

హిమధరరాజ తనయ భవుని పదపద్మముల మీద భక్తిగల్గి శివజటాజూటము నందలి చంద్రుని చంద్రికచే శైత్య శాంతయైనది.

''కాలకంఠ కఠోర కంఠ హుంకార నివర్తితంబగు పుష్ప చాపుని సమ్మోహనాస్త్రంబీ కన్య హృదయంబున నాటిన నాటం గోరె లలాట చందన ధూసరాలకయై తుహిన సంఘాత తత శిలాతలంబగు జనకునింట ధృతిం జెందక మహేంద్ర ప్రభృతులగు దిగీశుల నజ్ఞగించి పినాకపాణి బతిగాగోరి తపంబుసేయ సమకట్టె; సభాష్ప కంఠస్ఖలితంబులగు సంగీతాక్షరంబులగు విరూపాక్షు చరి

త్రంబు పాడుచు వనాంతసఖులగు కిన్నెర రాజకన్యకల వగపించుచు ద్రిభాగ శేషంబులగు నిశాసమయంబుల నించుకించుక నిద్రించుచు గల గాంచి నీలకంఠ మెచ్చోటికిం జనియెద" వని "అసత్యా కంఠా ర్పిత బాహు బంధన యయ్యును విరహవ్యథా దుస్సహంబగు తపో భారంబున భర్గు వశీకరింప దలంచి యున్న యది." ఇందు పార్వతి శివుని రూపు రేఖల మనసు నిడుకొని జిగీషుల నుజ్జగించి ఆతనిగూర్చి తప మొనర్చి, ఆతని చరిత్ర పాడుచు ఆతని గూర్చి కలగని పలవ రించినది. కనుక పార్వతి, పూర్వరాగమున కుదాహరణము.

ఇ) ఈర్ష్యా విప్రలంభము:

నాయకు డన్యాసక్తుడై యుండుట గాంచి నాయిక పొందు మానము ఈర్ష్యామానము.

పార్వతి ఈశ్వరుని యొడలి స్వేదోదయము చూచి నాట్య మాడుచున్న యచ్చెర మచ్చెకంటిని చెమర్చెనని యీర్ష్య వహిం చినది.

"అమరవరేణ్య ప్రేంకణములాడెడు వేలుపు లేమ జూచియే" అను పద్యము ఈర్ష్యా విప్రలంభమున కుదాహరణము. సామోపా యముచే నామెకు శివుడు సంజాయిషీ చెప్పుకొని యామె నోదార్చెను.

ఈ) విరహ విప్రలంబము:

సంయోగానంతరము స్వల్పకాలికమగు నాయికా నాయకుల వియోగము, పార్వతి తపమునకు మెచ్చి సాక్షాత్కార మొందిన మహా శివుడు క్రీడాప్రమోద క్షమా దాక్షిణ్యాది గుణములు సంద డింప ప్రియవాక్యములతో పార్వతిని గారవించి సంప్రదాయ కన్యా దాన వివాహమునకై వేచెను. సప్తర్షులు వివాహ రాయబారము

నెరపి ముహూర్తము నిశ్చయించిరి. "పశుపతియు నెట్టకేలకు దివసత్రయంబు గడపుచుండె" హర (4-72)

అనుటలో విరహ విప్రలంభము కలదు. పై విధముగ విప్రలంభములోని నాల్గు రకములు ఉదాహరణములతో సమన్వయింపబడినది.

సంభోగ శృంగారము:

తలతే మన్మథ! గోత్ర
స్ఖలితంబుల జఘన సూత్ర కరబంధంబుల్
తలతె మదీయ వతం సో
త్పలకలకా బంధనంబు దత్సమయములన్ (హర. 3-87)

అను పద్యమునను దారుకా వన విహార ఘట్టమున ముని పత్నుల పాతివ్రత్యమును భంగించుటలోను వర్ణితము. (శృంగార చేష్టలకు శ్రీనాథుని సాహిత్య ప్రస్థానము చూడుడు)

II) హాస్యము:

ఆ సహస్రాక్షుని యాత్మ సంశుద్ధికి
బరమ సంయమి యింట పంచసాక్షి
యా నిర్జరేంద్రు బాహావిక్రమునకు
భుజగాంతకుని యాకపోక సాక్షి
యా సువాసీరు నహంకార గరిమకు
నిషధాచలము మీది నెలవుసాక్షి
యా శచీవల్లభునౌచిత్యకలనకు
దాపసుచేతి పూదండ సాక్షి

యిట్టి దేవేంద్రు వలన నీ వేమి ఫలము
వడసెదవు చాలు నీ వాంఛ పాడుగాను

వాడు నీకంటె నేమిట వాసిగలడు
తగదు చాలింపు మీా విరుద్ధంపు దపము. (హర. 7-22)

ఇంద్రుడు మనశ్శుద్ధి, పరాక్రమము, అహంకారము, వివేకము కొని యాడ దగినవి కావని ఆతని గూర్చి తపము చాలింపుమని ఇంద్రుడే పల్కుట హాస్యపూరితము.

ఇంద్రుని గూర్చి సాభిప్రాయ విశేషణములు, 'వాడు నీకంటె నేమిట వాసిగలడు' అను తెనుగుదనపు వెక్కిరింతలు హాస్యమును కల్గించునవి. వికృతములగు వేషభాషా చేష్టలచే కల్గు మనోవికారము హాస్యము. ఇట పొడుపు మాటలు హాస్యస్ఫోరకములు.

II) కరుణము:

రతిహృదయగతమైన శోకము కరుణరసముగ పరిణమించినది. ఉదా: క్రొమ్ముడి కై పెక్కు కుసుమంబు లుమియుచు నవటు ప్రదేశంబునందు బొరల — (హర. 3-92)

రౌద్రము:

కృతాపరాధముచే గల్గు మనఃప్రజ్వలనము క్రోధమనబడును. క్రోధము స్థాయీభావముగా గలది రౌద్రము.

"హుంకారం బొనరించి తుంబురునితో నోరీ! దురాచార నా
జింకల్ భుక్తి గొనంగ నేమిటికిరా చేచిట్ట ప్రామాయించి యా
తంకంబున్ ఘటియించి తిట్టి యపరాధం బేను సైరింతునే
యింకన్ మర్త్యుడవై జనింపు మహిలో నింకంగ నీ గర్వమున్.
(హర. 1-4)

జింకలకు పాయసాన్నము నిచ్చు కార్యమునకు తుంబురుడు చిటికెవేసి విఘ్న మొనర్చెనన్న అల్పాపరాధమునకె కోపగించిన దుర్వాసుని రూపవర్ణనము రౌద్రరసమునకు తార్కాణము.

వీరము:

లోకోత్తర కార్యముల నెరవేర్చుటయందు గాఢమైన ప్రయత్నమున కుత్సాహమని పేరు.

ఎందఱు జంగమ ప్రమథు లెత్తఱిసేమి పదార్థ మెంత యే
కందువ వేడినం దిరముగా నతడందఱ కాపదార్థ మా
కందువ యేపు ప్రాణమెడగా నిడిమైన ఘటించి పెట్టు బూ
ర్ణేందునిభాస్య! వాని సరి యెవ్వడు లేడు వసుంధరాస్థలిన్.
(హర. 2-5)

నంబియొక్క దాన వీరము ఇందభివర్ణితము. అర్థులడిగిన దియ్యవలె నన్న ఉత్సాహము నంబి యందున్నట్లు వర్ణితమగుటచే నియ్యది దానవీరమయ్యెను.

యుద్ధవీరము:

నివాత కవచ కాలకేయ యుద్ధ సందర్భమున కిరాతార్జున యుద్ధ సందర్భమున యుద్ధవీర మభివర్ణితము.

దయావీరము:

హరిణ వత్సంబులకు మీరు కరుణతోడ
బాయసాన్నంబు గుడిపింప భక్తి జూచి
సర్వ భూతాను కంపకు సంతసిల్లి
చిట్టమిడిచితి నిది నాకు చెట్టయయ్యె. (హర, 1-7)

ఇందు జింకలపై దుర్వాసుడు అత్యంతమగు దయను ప్రదర్శించినట్లు వర్ణితమగుటచే దయావీరమయ్యెను.

ధర్మవీరము:

నంబి తాతలు గావించిన దాన ధర్మముల గూర్చిన ఈ క్రింది వర్ణనము - ధర్మవీరమునకు సముచితోదాహరణము.

కట్టించె నొక తాత కంచి హర్మ్యంబులు
హరిణాంక మౌళికేశాగ్రమపతికి
బాలార్కమని మెడి పద్మరాగము దాచె
నొక తాత కంచి నాయకుని నాభి
నొక తాత గట్టించె యోజన త్రయ దీర్ఘ
తర తటాకాంబోధి తిరువళూర
గావేరి గట్టించె గార్పాస రాసుల
నుబ్బి చోడఁడు మెచ్చ నొక తాత
ప్రతి దినమ్మును గపుర దీపములు వేయు
వ్రతముగా నొక తాత యీశ్వరున కొసగె
నిఖిలలోక ప్రసిద్ధ వాణిజ్య వంశ
ధరులు మాతాతలుభయ గోత్రములయందు. (హర. 1-10)

భక్త్యుత్సాహముతో నంబి తాత లొనర్చిన ధర్మ కార్యములు ధర్మవీరముగ నైనవి.

భయానకము:

క్రూరకారాదులను చూచునపుడు ప్రాణుల హృదయమున కల్గు ననర్థ శంక భయమనబడును. మరణాది రూపమగు ననర్థ శంక భయము; అదియే స్థాయీభావము.

హరవిలాసమున తారక విజృంభణముచే ముని బృందారకులు పడిన పాట్లు అనర్థ శంకా సూచితమై బహు దీనముగ వర్ణితము.

అనువు దప్పిరి నొచ్చి రలసి రాపద నొంది
రదవదల్లైరి చీకాకు పడిరి
యంగలార్చిరి, విచ్చి రాఱడిబొందిరి
భ్రమసిరి, పాఱిరి, పల్లటిలిరి

బెగ్గడిల్లిరి, పికాపికలైరి, సొలసిరి
కులకులఁ గూసిరి, కుతిలపడిరి,
గ్రగ్గులకాఱైరి, కలఁగి రోటాటిరి,
వెలవెల్లనైరి, నివ్వెఱఁగు పడిరి,
యసవుసవులైరి, గుజగుజలైయెరి, డస్సి,
రొల్లఁబోయిరి, వెగ్గిరి, తల్లడిలిరి,
సిగ్గుపడి, రొచ్చువడిరి, యుస్సుస్సులైరి
తారకునిచేత మునులు బృందారకులును. (హర. 3-10)

**శాంతము:**

సంసారభ్రమ తన మదిలో లేదని సంసార పరాఙ్ముఖత్వము, ధీరత్వ స్థిరత్వములు, నిర్భయత్వము, పితృ మహేశభక్తి ఆదిగాగల బాల సిరియాల గుణవర్ణనమున శాంతము సువ్యక్తము. ఉదా.

అధ్రువంబైన మలభాండమైన దేహ
మనఘ యన్యోపకారార్థమై వ్యయించి
ప్రవిమలంబు కల్పాంతర ధ్రువమునైన
కీర్తికాయంబు గైకొంట కార్తియేల. (హర. 2-81)

**బీభత్సము:**

దారుకావన విహార వృత్తాంతమున శివుని ప్రమథ గణముల దౌష్ట్యము జుగుప్సాకరమగుటచే బీభత్స రసమైనది.

ఉదా: 'పులికలాసంబు గప్పుదూరు పాఱగ మీద
విద్యాధరాంగనా విట గణంబు
గంధర్వ కామినీ కాముక వ్రాతంబు
లాతాలగొని మోఁది లజ్జగొంద్రు

కకపాల వెలిబూది గన్నులలో బ్రామి
బాధింతు రప్సరః పల్లవులను
గరుడ భామా భుజంగ ప్రతానముబట్టి
బంధింతు రురుయోగ పట్టకముల

నాగడీలు, మహాధూర్తులగడు కాకు
లుద్ధతులు గొంట్లు పలుగాకులుదురు మిడుకు
లాకతాయలు శకులు గయ్యాళు లగుచు
నోషధీ ప్రస్థ మిల్లిల్లు నుడుకుచుండ. (హర. 5-10)

అద్భుతము:

పుత్రమాంస మర్పించినను భుజింపక మాయవేషమున నున్న మహేశుడు నంగను పిలిచి కన్నకుమారుని గొంతెత్తి పిలువుమని ఆదేశించగా ఆమె యట్లే చేసినది. తను వెల్ల తాలింపు వాసనలతో సంభ్రమాశ్చర్యాదులు ముప్పిరి గొనగ బాలసిరియాళుడు సజీవుడై తిరిగి వచ్చుటలో అద్భుతరసము పోషితము.

అత్తన్వంగి సమస్త దిక్కులకు పర్యాయక్రమం బొప్పగా
నొత్తిల్ చీఱె తనూజు నీశుదెస నత్యుచ్చైశ్రుతిం జీఱినం
జిత్తంబుబ్బగ వచ్చె బాలుడు మహాశీఘ్ర ప్రచారంబునన్
దత్తద్వ్యంజన పాక గంధ్యవయవ స్థాన ప్రతానంబుతోన్.
(హర. 2-135)

రస సంకరము:

శాంతవీరములు:

గాండివముతోడ నొక దండయష్టి
యస్త్రములతోడ గొన్ని ధర్మాంకురములు

కత్తళముతోడ బుండరీకంబు తోలు
దాల్చి క్రీడి విరుద్ధపు దపము చేసె. (హర. 7-7)

అర్జునుని తపో వేషధారణ మందు శాంతమును, వీరవేష మున వీరమును వర్ణిత మగుటచే శాంత వీరరస సమ్మేళనము.

శృంగారాభాసః:

వేసాలబోకు రమిస్మా
పూసెజ్జకు బ్రొద్దుపోయె బులియుట చాలున్.
(హర. 7-133)

అను పద్యమున ఊర్వశికి అర్జునునిపై అనురాగము, రతి కలవు కాని అర్జునునకు లేదు. ఏకత్రైవానురాగ మగుటచే శృంగారాభాస యగును.

రౌద్రాభాసము:

హరవిలాసమున కిరాతార్జునీయమున శివార్జునుల బాణ హతిచే కూలబోవు వరాహము తోలుత అరణ్యమున ప్రకాశించు నట్టి ఘట్టమున శ్రీనాథుడు 7-44, 45 పద్యములలో వర్ణించెను. అందు ఆ భయంకర వరాహము ఇంద్రకీల పర్వతప్రాంతములోని వెన్నుబ్బట్టలు ముట్టెతో పెల్లగించుచు వృక్షపంక్తిని చాపకట్టుగా నేల గూల్చుచు ఘుర్ఘుర ధ్వనులతో దిగంతములను రాపాడుచు నిప్పులు గురియుచు గిట్టల తాకిడిచే కందుకములవలె శిలలు గగుర్పొడువగా శంకర ధనంజయులు నడుమకు పరుగెత్తి వచ్చునప్పటి దాని క్రోధము రౌద్ర రసాలంబనమై తిర్యగ్గతమగుటచే రౌద్రాభాసము.

పై నివ్వబడిన ఉదాహరణములబట్టి రసప్లుతి హరవిలాస మున రసజ్ఞుల నలరించునని తెలియును.

అలంకార ప్రాముఖ్యము:

సుందరికి వలెనే కావ్యసుందరికి కూడ అలంకారము లలంకారము. కావ్యమున అలంకార ప్రయోజనమును గూర్చి ఆలంకారికులు పేర్కొనియున్నారు. అలంకార ధ్వని, వాక్యవక్రత, అలంకారౌచిత్యమందు పేర్కొనదగినవి. అలంకారములు రస పర్యవసాయములు కావలెనని రసాది రూపవ్యంగ్య శోభా సంపాదకములని తక్కినఆలంకారికులు పేర్కొనిరి. శబ్దార్థములు కావ్యావయవములు వాని నాశ్రయించి యుండు అలంకారములు అవయవియగు కావ్యమునే అలంకరించుచున్నవి. అందుచే కావ్యజీవిత భూతములైన రస ధ్వనుల కలంకారము లవశ్య ముపస్కారకములనుటలో నెట్టి విప్రతిపత్తియు నుండరాదు.

"శ్రీనాథుడు శబ్ద సౌందర్యము పట్ల చూపు గలవాడే కాని శబ్దాడంబర ప్రియుడు కాదు. అందుకే ఆయన గ్రంథములలో చిత్ర కవిత్వపు కసరత్తులు, గర్భ కవిత్వపు గమ్మత్తులు, బంధ కవిత్వపు గారడీలు మచ్చునకైన కన్పింపవు. శబ్దాలంకారములను గూడ ఎచ్చటనో తప్ప వాడడు. ఆ వాడినవియు ప్రయత్న బద్ధములు కాక సహజ సిద్ధములుగ నుండును."[4]

అర్థాలంకారములు:

ఉపమ: మగువా నీ పెంచిన లత

చిగురున ముకుళంబు ఒల్లసిల్లునె చెపుమా!

పగడపు గెమ్మోవి పయిన్

నగ వుదయించిన విధంబునం బ్రస్ఫుటమై (హర. 4-19)

---

4. బాపూజీ, జయకృష్ణ, శ్రీనాథుని సాహిత్య ప్రస్థానము, వెల్కమ్ప్రెస్.

తీవ చివురున గల మొగ్గలు పార్వతి పగడాలకెమ్మోవి మీాది చిరునవ్వులని ఉపమింపబడినది. ఇట్లే తదితర స్థలములందు ఉపమాలంకారము వాడబడినది.

విభావన:

> నీ వజ్రము సుఖముండుం
> గావు త దివ్యాస్త్ర శాలికా మధ్యమునన్
> దేవేంద్ర చెఱకు వింటం
> బూవులు శరములుగనే రిపుల నిర్జింతువున్. (హార. 3-47)

కారణము లేకుండగనే కార్యము కల్గినట్లు వర్ణించిన విభావనాలంకరము. సమర్థమైన కారణము లేకున్నను కార్యోత్పత్తిని వర్ణించుట కూడ విభావనమే. పై పద్యమున సంకల్ప మాత్రమున సహస్రాక్షుని సన్నిధిలో సాక్షాత్కరించిన పంచబాణుని ప్రగల్భోక్తులివి. శాత్రవ విజయమునకు కారణమైన చెరకు విల్లు పూలబాణములు దుర్బలములు. సమర్థములగు సాధనములు లేకుండ శత్రువిజయ రూపమైన కార్యోత్పత్తి కాంక్షించుటచే ఇది విభావనాలంకారము.

దృష్టాంతము:

రెండు వాక్యములకు బింబ ప్రతిబింబ భావము వర్ణింపబడె నేని దృష్టాంతాలంకారము. ఉదా:

> ఇక్కడ లేడె వేల్పులు సమీాప్సిత దాతలు ముద్దుగూన! నీ
> వెక్కడ ఘోరవృత్తి దప మెక్కడ యో పటు సాహసిక్యముల్
> తన్కు-శిరీష పుష్ప మవధాన పర త్వమునన్ మధువ్రతం
> బెక్కిన నోర్చునో విహగ మెక్కిన నోర్చునొ నిశ్చయింపుమా!
> (హార. 4-6)

సౌకుమార్యము దివ్యోపభోగ యోగ్యమగు పార్వతి శరీరము దారుణమగు తపోదీక్షకు పనిరాదు. పేలవము, మృదులము నైన శిరీష పుష్పము తుమ్మెద కాళ్ళను భరించును. పక్షియొక్క పాదములను సహింపలేదు. ఈ రెండు వాక్యములలో బింబ ప్రతిబింబ భావము గలదు – దృష్టాంతమైనది.

అర్థాంతర న్యాసము:

సామాన్యమును విశేషముచేతగాని విశేషమును సామాన్యముచేత గాని సమర్థించినచో అది అర్థాంతరన్యాసము.

అని నివారించె గిరిపత్ని యనుగు గూతు
బార్వతియు దల్లిమాట చేపట్టదయ్యె
నీప్సితార్థంబునకు బాఱు హృదయము రుచియు
నిమ్నమున కోడిగిలు నీరు నిలుపరాదు. (హర. 4-7)

స్థిరమైన నిశ్చయము గల పార్వతీదేవి మనస్సును మేనకయు అనేక విధములుగా నుపదేశించి వారింపలేదాయెను. నిజమే పట్టుదల గల మనస్సును, పల్లమునకు బోవు నీటిని ఎవ్వరు మళ్ళింపగలరు? ఇట తొలి రెండు పాదములలో విశేషము, తరువాత పాదములలోని సామాన్యముచే విశేషము సమర్థింపబడినది.

అచ్చరలు పాడు హిందోళ మాలకించి
యిందుమౌళి ప్రసంఖ్యాన మెడలడయ్యె
నిర్జితేంద్రియులైనట్టి నియమపరుల
నంతరాయంబు లేమి సేయంగ గలవు? (హర. 3-63)

జితేంద్రియులైన యతీంద్రులను అంతరాయము లేమియు చేయలేవు అనును. సామాన్యము ఇందు సామాన్యముచే విశేషమగు – అప్ర

రాంగన లాలపించు హిందోళరాగముచే పరమశివుని ఏకాగ్రత భంగము కాలేదు అని సమర్థించబడినది.

సారము:

దీవులందెల్ల నేరేటి దీవి లెస్స
భరత ఖండంబు మేల్ తదంతరమునందు
ద్రవిడ దేశంబు కడు నొప్పు దానియందు
గాంచి ధామ మా భూమికి గాంచిపురము. (హర. 3-3)

ఉత్తరోత్తరములకు ఉత్కర్షము వర్ణించుట సారము. ద్వీపములలో జంబూద్వీపము అందు భరత ఖండము, అందు ద్రవిడ దేశము, అందు కాంచీపురమని వర్ణితము. కనుక సారాలంకారము.

అల్పము:

సూక్ష్మమగు ఆధేయమునకంటె ఆధారమున కత్యంత సూక్ష్మత వర్ణించినచో అల్పాలంకారము. క్రమముగా వస్తువు యొక్క అల్పత్వమును వర్ణించినను అల్పాలంకారమే.

జలధరమంతయై కరటి చందము గైకొని సూకరాకృతిన్
నిలిచి, పికంబుతో దొరసి నేరెడు పండునుబోలె నుండయై
కలశ పయోధి మంథన ముఖంబునఁ బుట్టిన యమ్మహా హాలా
హాలము క్రమంబునన్ శివుని హస్త సరోరుహ మెక్కెఁజక్కగన్.
(హర. 6-69)

ఇందు కాలకూట విషము క్రమముగ మేఘమంతయై తర్వాత గజమంతయై తర్వాత వరాహమంతయై తర్వాత కోకిలయంతయై తర్వాత జంబూ ఫలమంత ఉండయైనట్లు చెప్పబడినది. హాలాహాలమున కల్పత్వము క్రమముగా నభివర్ణించుటచే అల్పాలంకారము.

సమాధ్యలంకారము:

మరొక కారణము వలన కార్య సౌకర్య మొనగూడినట్లు వర్ణించుట సమాధి.

అఖిల లక్షణ సంపూర్ణమైనయట్టి
యా లతాతన్వి జూచి పుష్పాయుధుండు
రమణ దా బూను దేవతారాధనంబు
సఫలతం జెందె నని మది సంతసిల్లె. (హర. 8-72)

ఇట శివ తపోభంగము మదనుని ప్రధాన కార్యము. ఆ కార్యము సాధింపవలసినవి అతని పూల బాణములు. ఇప్పుడు అద్వితీయ సౌందర్యరాశియైన 'గౌరి' యను మరియొక కారణము లభించుటచే కార్య సౌకర్య మొనగూడినది. కావున సమాధ్యలంకారము.

ఉదాత్తము:

శ్లాఘనీయమగు సమృద్ధిని వర్ణించినను మహాపురుషుల చరిత ముపలక్షణముగ వర్ణించినను ఉదాత్తాలంకారము.

ఉదా: వృద్ధ కచ్ఛపరాజు వీ పంఘ్రి పీఠంబు, సురతరంగిణి వెల్లి

శిరసు పాగ —— 5-20 అను పద్యమునందు ఆది కూర్మము వీపు అంఘ్రి పీఠము, ఆకాశగంగ, తలపాగ తన దేహము భూ మండలమునకు మానదండము. పూర్వ పశ్చిమ సముద్రములు పొరుగుటిండ్లు, కాత్యాయని కన్నకూతురు, త్రినేత్రుడు అల్లుడు, పర్వత సామ్రాజ్యము పాలనీయము, యజ్ఞ హవిస్సు భోజనము, మాల్యవంతము మేరువు, కైలాసము, మలయము, సహ్యము, గంధ మాదనము, మందరము, క్రౌంచము, వింధ్యము చుట్టాలు. ఆహా! సర్వ గుణాభిరాముడగు పర్వత సార్వభౌముని మహావైభవము శ్లాఘనీయమగు సమృద్ధి వర్ణింపబడినది. కావున ఉదాత్తము.

ఉత్ప్రేక్ష:

ఉపమానము యొక్క తాదాత్మ్యమును ఉపమేయమునందు సంభావించుట ఉత్ప్రేక్షాలంకారము.

ఉత్తరాభిముఖుండైన యుష్ణరశ్మి
చందమీక్షించి దక్షిణాశాపురంధ్రి
గంధ వాహంబు పేర దీర్ఘంబుగాగ
బాగ విడిచెను విరహ నిశ్వాస ధార. (హార 3-55)

సూర్యుడు దక్షిణాయన కాలమును దాటి కుబేర పాలితమైన ఉత్తర దిక్కున కేగు విషయమునందు నాయకుడు నాయికను వదలి కుత్సిత పురుషునిచే నుంచుకొనబడిన స్త్రీని గవయుట కేగుట వివక్షితము. దక్షిణదిశనుండి వీతెంచు మలయ మారుతము నాయికా దుఃఖ నిశ్వాసమోయని యుత్ప్రేక్షితము. (హార 3-23)

ప్రహర్షణము:

ప్రయత్నము లేకయే అభిమతార్థము సిద్ధించినట్లు చెప్పితిమేని ప్రహర్షణము.

"అడగబోవు తీర్థ మెదురైన విధంబున నెల్లియేను రే
పాడియ చంద్రశేఖరు నుపాస్తి యొనర్చి" — 7-124.

నందన వనములో మందార వాటికా మధ్యమున ఏకాంత మందిర ములో నున్న పాండునందను సన్నిధికి సురసుందరి ఊర్వశి అరుదెంచి నది. ఒంటరిగా వచ్చిన ఆ వాల్గంటితో నర్జునుడు పల్కు సందర్భ మిది: — రేపు ఉదయము నేనే దర్శనమునకు రావలెననుకొను చున్నాను. అడబోవు తీర్థమెదురైనట్లు నీవే వచ్చితివి. నేనెంతటి పుణ్యము చేసితినో" — తాను ఎవరికొరకు వెళ్ళవలెననుకొను

చున్నదో ఆమెయే ఆడబోయిన తీర్థము వలె తన చెంత కేతెంచిన దని చెప్పుటచే ప్రహర్షణము.

శబ్దాలంకారములు: వృత్త్యను ప్రాస:

> పాండునందవ ఘనభుజా దండ కలిత
> చండ గాండీవ తాడిత ఖండ పరశు
> పృథు జటామండలంబున బిండు గట్టి
> తాండవంబాడె మిన్నేటి తరగదండు (హర 7-80)

ఇటు వరాహామునకై కిరీటి కిరాతుల నడుమ పోరు ఘోరమై విప్వ చ్చుడు తన పింటితో ముక్కంటి శిరస్సుపై గట్టిగ కొట్టిన ఘట్ట ములో పునః పునరావృత్తమైన పూర్ణబిందు పూర్వక డవర్ణము గాండీవి గాండీవ ప్రచండతను ప్రకటించుచు విజయుని వీర విజృం భణమున కనుగుణముగ నలరారుచున్నది.

ఛేకానుప్రాసము:

> ప్రబల మున్నీటి నడుపీటఁ పాండు వికచ
> కమల కాంచన కర్ణికాగ్రంబునందు
> బ్రహ్మ దిక్పాలవందిత పాదపద్మ
> పద్మయుదయించె గన్నుల పండువగుచు. (హర 6-78)

శ్రీ మహాలక్ష్మి క్షీరవారాశిలో జన్మించు సందర్భములోని దీ పద్యము. ఇచట ''పాద పద్మ పద్మ'' అనుచో ప్రవర్తిల్లిన ఛేకాను ప్రాసము పాదాంత, పాదాది పరిస్పంద సుందరమై లక్ష్మి పాద పద్మములు శోభిల్లినవని భావము.

రీతి ప్రాశస్త్యము:

ఆచార్య వామనుడు తన కావ్యాలంకార సూత్రవృత్తిలో "రీతిరాత్మా కావ్యస్య" యను సిద్ధాంతము ప్రతిపాదించి కావ్యాత్మ తత్త్వ విచారము చేసిన అలంకారికులలో అగ్రగణ్యు డయ్యెను.

"రిణంతి గచ్ఛంతి అస్యాం గుణాః ఇతి రీచు తే క్షరతిఅస్యాం వాఙ్మధు ధారా ఇతి వా రీతిః" — దీనియందు గుణములు ప్రవర్తిల్లును అని కాని లేదా "దీనియందు వాగ్రూపమైన రసధార ప్రవహించుచుండును అని కాని రీతికి అర్థము." రీతియే కావ్యమునకు ఆత్మ. విశిష్టమైన పదరచనయే రీతి. విశిష్టమనగా విశేషముతో కూడినది. విశేషమనగా గుణాత్మకమైనది. ఈ రీతి మూడు విధములు. వైదర్భిగౌడి పాంచాలి అని వామనాచార్యుడు పక్కాణించెను. రసధర్మ నిరూపణముగా రీతిని పరిఢవిల్ల జేసినవాడు శ్రీనాథుడు. "వైదర్భిః సమగ్రైః ఓజః ప్రసాద ప్రభృతిభిః గుణైః ఉపేతా వైదర్భీనామరీతిః" అనగా ఓజః ప్రసాదులగు గుణము లన్నిటితోను కూడినది వైదర్భి అని వామన మతము —

"పల్లవ పుష్ప భంగములు పాదసరోరుహ యుగ్మకంబుపై
జల్లి శ్రవోవతంసమగు సంపఁగి మొగ్గ యొకింత జాఱఁగా
నల్లన మ్రొక్కె పార్వతి భయంబును భక్తియు సంభ్రమంబు సం
థిల్లఁగ భావి భర్తకు ఫణిప్రభు హారునకంధ కారికిన్.

(హర. 3-15)

ఒయ్యారము నొలకించుచు భవిష్యద్భర్తకు ప్రణామ మొనరించిన పార్వతి హృదయములోని ప్రణయభావమును సూచించుచు ఇందలి వైదర్భిరీతి శృంగార రస స్ఫూర్తిని మూర్తీభవింప జేయుచున్నది. సంభ్రమ సంకోచ భయభక్తులు గౌరి ముగ్ధత్వమును తెల్పినవి.

గౌడీయః — "ఓజః కాంతి మతీ గౌడీయాః" అని వామనుడు నిర్వచించెను. అనగా ఓజస్సు కాంతి అను గుణములు కలదియు మాధుర్య సౌకుమార్యములను గుణములు లేక సమాస బాహుళ్యము అత్యుల్బణ పదజాలము కలదియు గౌడీ యగున నెను.

వికట భ్రూకుటి ఫాల భాగుడును బ్రస్వేదాంబు పూర్ణాఖిలాం
గకుడుం బాటల గండమండలుడునై కల్పాంత సంహార రు
ద్ర కఠోరాకృతి దుర్నిరీక్షుడగుచున్ ధట్టించి దుర్వాసుడు
గ్ర కటాక్షంబున నింద్రు జూచి పలికెన్ గాఢాగ్రహావ్యగ్రతన్.
(హార. 6-17)

దుర్వాసుడు ఇంద్రుని శపించు ఘట్టములోనిది. పై పద్యములందలి సమాసముల పదముల అత్యుల్బణత్వము ఓజోగుణమును ప్రకటించినది. వికట భ్రూకుటి, గండమండలుడు, గాఢాగ్రహావ్యగ్రత - అన్న పదముల యందలి వర్ణ వైచిత్రి ఔజ్జల్య సంధాయకమై కాంతిని ప్రసరింప జేసినది. ఓజః కాంతి గుణోపేతమైన ఇందలి గౌడీ రీతి ఉద్దిష్ట రసమైన రౌద్రమును చక్కగా పోషించినది.

పాంచాలీ:

"మాధుర్య సౌకుమార్యోపపన్నా పాంచాలీ" అని సూత్రించెను. ఇది ఓజః కాంత్యభావమున బంధ శైథిల్యమును అనుల్బణ పదజాలమును కల్గియుండునని అర్థము.

బంగారు కంక పత్రము
గెంగేల ధరించి యొప్పె గిరినందన య
భ్యంగము తఱి భాస్కర కర
సంగతయగు విదియనాటి శశికళవోలెన్. (హార. 4-80)

ఇందలి పదములు విడివిడిగ మాధుర్యమును తోపించుచు గిరిరాజ కుమారి సౌందర్యము సౌకుమార్య మాధుర్యములతో స్ఫురింపజేయ బడినది. హరవిలాసము 7-137 లో సురసుందరుల శృంగార లీలా విశేషములను వింగడించి చూపుచున్నది.

ధ్వని ప్రాశస్త్యము:

ధ్వన్యాలోకమున ఆచార్య ఆనందవర్ధనుడు "కావ్యస్యాత్మాధ్వనిః" అను సిద్ధాంతమును చేసెను. పరిపక్వబుద్ధులైన పండితుల హృదయాంతరములందు వ్యక్తావ్యక్తముగ నుండిన సత్కావ్యతత్త్వమును సహృదయ సంతుష్టికొరకు ఆనందవర్ధనుడు వ్యాఖ్యానించెను. (పుట 552) రాజశేఖరుడు తన కావ్య మీమాంసలో ధ్వనిని నిరూపించిన ఆనందవర్ధనుని కొనియాడెను. ధ్వని స్త్రీల శరీర లావణ్యమువలె వాక్యములలో అంతర్లీనమైయుండి వాచ్యము, ప్రతీయమానము అను నిరు తెరగుల రూపమున నుండి సహృదయుల కానంద మిచ్చునని యాతడనెను. వస్తు అలంకార రస ధ్వనులను మూటిలో రస ధ్వని శ్రేష్ఠమని యాతడనెను. ఈతడు స్పష్టముగ కావ్యశరీరము గూర్చి తెల్పకపోయినను శబ్దార్థోభయమే కావ్య శరీర మనెనని గ్రహింపగలము.

శబ్దశక్తి అభిధా లక్షణ వ్యంజనాభేదముచే త్రివిధము. "పద పదార్థ సంబంధశ్శక్తిః" అను తార్కిక నిర్వచనము ననుసరించి పదమునకు దాని యర్థమునకు గల సంబంధము 'శక్తి' యనబడు చున్నది.

సంకేతితమైన అర్థమును బోధించు శబ్దశక్తికి 'అభిధ' అని పేరు. ఇదియే వాచ్యార్థము. ముఖ్యార్థమున కనుపత్తి కలిగినప్పుడు ప్రయోజనముబట్టి కాని లోకమునందలి రూఢినిబట్టి కాని ముఖ్యా

ర్థముతో సంబంధముగల వేరొక యర్థమును స్ఫురింపజేయు శబ్ద శక్తి - లక్షణా శబ్దముల కనుకూలముగా వాచ్యార్థము సరిపడిన పిమ్మట దానికి శోభాహేతువగు నర్థాంతరమును బోధించు శక్తికి ''వ్యంజన'' యని పేరు.

ఎచట అర్థము తన్నును, శబ్దము తన యర్థమును ఉప సర్జనము (అప్రధానము) చేసికొని అర్థాంతరము నభివ్యక్త మొన ర్చునో అట్టి కావ్యవిశేషణమే ధ్వనియని (ధ్వ. 1.3, 4) విద్వాం సులు వక్కాణించిరి.

''దృష్టపూర్వా అపి హ్యర్థాః కావ్యే రస పరిగ్రహాత్,
సర్వే నవా ఇవా భాన్తి మధు మాస ఇవ ద్రుమాః''

(ధ్వన్యా. 4-4)

అని ఆనందవర్ధనుని వక్కాణము రస స్పర్శవలన పాత్ర గలిగిన సంగతులను నవనవోన్మేషమును పొందగలవు. ఆ రసము వాచ్యము గాక వ్యంగ్యమైనప్పుడే రాణించును. రసధ్వనినే అసంలక్ష్య క్రమ వ్యంగ్యము లేక రసాది ధ్వని అందురు.

ధ్వని భేదములు 5304 కలవు.

వాక్యగత అర్థాంతర సంక్రమిత అవివక్షిత వాచ్యధ్వనికి—

మత్తారాతి విదారణుండు జన సన్మాన్యుండు శీతాంశు వం
శోత్తంసంబు, పురూరవుండు ప్రచలోద్యోగుండు మా తాతగా
రత్నోయాకర మేఖలాపతికి నిల్లాలైతిగా కావునన్
ముత్తోపీవ ఔ! లెస్సమన్మని పయిన్ మోహంబు వాటింపగన్.

(హర. 7-125)

— శత్రుమర్దనుడు, వందనీయుడు, చంద్ర వంశ శ్రేష్ఠజుడు, సఫల ప్రయత్నుడునగు పురూరవ చక్రవర్తి మా పితామహుడు. ఆ

చక్రవర్తికి నీ విల్లాలివి. అందుచే నాకు అవ్వగారి వగుదువు. మరి ముత్తవ్వ ముద్దుల మనుమని మోహించుట సబబుగాదని సుకుమారముగ తెల్పుచు, అవ్వా మనుమల ప్రణయము హాస్యాస్పదమని వ్యంగ్యముగ చెప్పుట ధ్వనియైనది. 'లెస్స' పదము శ్రీనాథునికి ప్రియమైన పదము. ఈ కావ్యముననే ఆతడు రెండుమార్లు వాడెను. (4-27, 4-28).

వాక్య గత కవి నిబద్ధ వక్తృ ప్రౌఢోక్తి సిద్ధ అర్థశక్తి మూల వస్తు కృత అలంకార ధ్వనిః.

రతీవిలాప ఘట్టమున "హృదయముననుండు వీవని హృదయనాథ" అను పద్యమున (హ. 3-90) నీవు హృదయమున నున్నావని చెప్పిన మాట అసత్యము. ఇట వస్తువున కారణమున్నను కార్యము జరుగలేదు. నీవు భస్మమైనను నీ హృదయములో నేను భస్మము కాలేదు అను విశేషోక్త్యలంకారముచే వస్తు కృత అలంకార ధ్వని. అర్థశక్తి మూల అలంకారకృత ధ్వని.

ఎఱుక చాలని వాడందుమే దధీచి
నల్ప బుద్ధులే మేఘ వాహానుడు శిబియు
ధర బరోపకారార్థ మిదం శరీర
మనెడు వాక్యంబు వినవె సంయమివరేణ్య! (హర 2-80)

అను పద్యమున పరోపకారార్థ మిదం శరీరమ్ - అను లోకోక్త్యలంకారముచే భాసిల్లుటచే అర్థ శక్తిమూలక అలంకార కృత ధ్వని.

అసంలక్ష్యక్రమ రసాది ధ్వనులు:

ప్రబంధ గత, అసంలక్ష్యక్రమ రసాది ధ్వని: రస భావ. రసాభాస భావాభాస భావోదయ, భావ శాంతి భావసంధి భావ

శబలతలను 'రసాది' శబ్దముచే స్వీకరింపదగును. ఇచట వాచ్య, వ్యంగ్యముల క్రమ మతి సూక్ష్మమగుటచే స్పష్టముగా గోచరింపక "ఝటితి రసవ్యక్తి" కల్గును. కనుక అసంలక్ష్యక్రమము హరవిలాసమున తృతీయాశ్వాసమున 69, 71, 80 పద్యములలో పార్వతి ఆలంబన విభావమై ఆమె చందములు, అలంకారములు, ఉద్దీపన విభావములైనవి. పిదప ఉమాగమనము వాచ్యమైనను ఉమాలంబిత పరమేశ్వరుని రతి వ్యంగ్యమైనది. ఝటితి స్ఫూర్తిచే వాచ్య వ్యంగ్యముల క్రమము అసంలక్ష్య రసాది ధ్వనిగ నున్నవి. ప్రబంధ గతమిది.

వర్ణగత అసంలక్ష్యక్రమ రసాది ధ్వని :

> జవమేపాఱగ గూలె దైత్య తనువుల్ సర్వంసహాపీఠిఁ, బాం
> డవ గాండీవ ధనుః ప్రకాండ భవ కాండ ప్రస్ఫుటోచ్చండ తాం
> డవ పాండిత్య విశేష విభ్రమ కృతాడంబ ప్రతీకంబులై
> యవనీధ్రంబుల భంగి, నింగి యద్రువన్ హాహా నినాదంబులన్
>
> (హర 7-176)

అను పద్యమున అర్జునుడు దుర్జయులైన కాలకేయాది రాక్షసులను నిర్జరించు సందర్భములోనిది. ఇందు ప్రయుక్తమైన పూర్ణబిందు పూర్వక 'డ' వర్ణ పునరావృత్తి పాండవ మధ్యముని గాండీవ కోదండ ప్రచండత్వమునకు ప్రతీకగనున్నది. అందుచే కిరీటి యుద్ధ వీరము ధ్వనించుచున్నది. కనుక ఇది వర్ణగత అసంలక్ష్య క్రమ రసాది ధ్వని.

ఇట్లు పరిశీలించి చూడ శ్రీనాథుడు రసధ్వని పూరిత కావ్యమును సంతరించె ననుట సువ్యక్తము.

వక్రోక్తి సంప్రదాయము:

భామహుని కావ్యాలంకారమున వక్రోక్తి శబ్దమునకు అలంకారమని అర్థముండుటచే ఈ వక్రోక్తి లేనిదే సాహిత్యమే ఉండజాలదని, కావ్య శరీర సౌందర్యమును వక్రోక్త్యాద్యలంకారములు పెంపొందించునని ఈతని అభిప్రాయము. కావ్యమునకు కావ్యత్వమును ఆపాదించునది వక్రోక్తి. గుణసామ్య ప్రతీతిని చెప్పుటచే అర్థాలంకారముల వలన కావ్య సౌందర్యము గల్గునని ఈతడు నిర్ణయించెను. "వక్రోక్తిః కావ్య జీవితమ్" అనునది కుంతకుం సిద్ధాంతము. కుంతకుడు లోకోత్తరమగు చమత్కారమును తెచ్చు వైచిత్ర్యము కావ్యమునకు అపూర్వాలంకారమనెను. కావ్యామృత రసాస్వాదము చతుర్వర్గ ఫలాస్వాదముకన్న మిన్న. ఈ అనుభూతి సాలంకృత కావ్యమున కల్గునని ఈతని అభిప్రాయము. ఆచార్య కుంతకుడు ప్రధానముగా షడ్విధములైన వక్రతా భేదములను పేర్కొనెను. అవి —

వర్ణవిన్యాస వక్రత, పద పూర్వార్థ వక్రత పద పదార్థ వక్రత, వాక్య వక్రత, ప్రకరణ వక్రత, ప్రబంధ వక్రత - అనునవి.

ఏకో ద్వౌ బహవో వర్ణా బధ్యమానాః పునః పునః
స్వల్పాంతరాస్త్రిధా ప్రోక్తా వర్ణ విన్యాస వక్రతా.
(వ. జీ. 2-1)

ఒక వర్ణముగాని రెండు వర్ణములుగాని యించుక వ్యవధానముతో మాటిమాటికి పునరావృత్తమైనచో వర్ణ విన్యాస వక్రత అందురు.

1. ఏకవర్ణ పునః పునరావృత్తి:

తరిగొండ దరువ దరువం
దిరుగుడు పడు......... (హర. 6-90)

అను పద్యమున రేఫము పునరావృత్తమై వర్ణవిన్యాస వక్రత్వమును తోపింప చేయును.

ద్వివర్ణ పునరావృత్తి:

రంభ రంభాామ్ర ఫల సమగ్రంబుగాగ
నమృత దివ్యాన్న భిక్ష కామారి కొసగె – (హార 5-44)

ఇందు రంభ, రారాజు పదములలో జంట వర్ణముల ఆవృత్తి కల్గు ద్వివర్ణ పునరావృత్తికి లక్ష్యమైనది.

2. పద పూర్వార్ధ వక్రత:

ఇది పది విధములు. రూఢి వైచిత్ర్య వక్రత, పర్యాయ వక్రత, ఉపచార వక్రత, విశేషణ వక్రత, సంవృతి వక్రత, పద మధ్యాంతర్భూత ప్రత్యయ వక్రత, వృత్తి వైచిత్రి వక్రత, భావ వైచిత్ర వక్రత, లింగ వైచిత్ర్య వక్రత, క్రియా వైచిత్ర్య వక్రత.

a) ఉపచార వక్రత:

హాటక గోత్ర ధీర! సిరియాల కులోద్వహా!
చంద్రమః కళాజూట పదారవింద పరిచుంబన మానస –
(హార 1-29)

చంద్రశేఖరుని పదపద్మములను ముద్దుపెట్టుకొను మానసము కల వాడా! యను అవచి తిప్పయ సెట్టి సంబోధనమున అమూర్తమైన మానసమునందు (ముద్దు పెట్టుకొనుట) మూర్త ధర్మమారోపింప బడినది కనుక ఉపచార వక్రత.

b) విశేషణ వక్రత:

విశేషణములచే ఆయా కారకముల రమణీయతను విశేషింప జేసి కావ్య సౌందర్యాతిశయ మొనర్చిన విశేషణ వక్రత.

ఉదా: ధాతు తామ్రాధరుఁడు దేవదారు భుజుడు
సానువక్షస్స్థలుఁడు వటస్కంధుఁడైన
మంచు గుబ్బలి రాజు సంభ్రమముతోడ
ఋషి సమూహంబు నతి భక్తి నెదురుకొనియె.

(హర 4-55)

కన్యావరణార్థమై నిజరాజధానికి విజయం చేసిన సప్తర్షులకు పర్వత రాజు భక్తి ప్రపత్తులతో ప్రత్యుత్థాన మొనర్చు సందర్భమున పై విశేషణములు సహజములు సముచిత శోభాసుపాదకములు.

భావ వైచిత్రి:

సాధ్యమైన భావమును సిద్ధమైనట్లు వర్ణించుట భావవైచిత్ర్య వక్రత.

ఉదా: మాటలు వేయు నేమిటికి మంగళ లక్షణ లక్ష్మియైన యీ
బోటికి భర్త కాఁగలడు సోమ కిరీటుడు సర్వదేవతా...

(హర 3-26)

ఇట హిమవంతుని సభలో నారద మహర్షి పార్వతిని జూచి ఆమె తప్పక శివునికి పత్ని కాగలదని అత్తమామలు లేని యింటికి జనునని గణాధిపతిని పుత్రునిగా, గంగను సవతిగా పొందునని తెల్పునట్టి యీ ఘట్టమున పార్వతి వివాహోత్పూర్వమే హిమవంతుని జన్మ సార్థక్యమొందెనని తెల్పుట సాధ్యమైన భావము సిద్ధమైనట్లు వర్ణింపబడుటచే భావవైచిత్రి.

లింగ వక్రత:

కావ్యములందు ప్రస్తుత శోభానిష్పత్తి కొఱకు స్త్రీలింగ పదమునే వాడుట లింగవైచిత్ర్య వక్రత. ఈ విచ్ఛిత్తి సంస్కృత పద

ములు పద్యములందు కూర్చిననాడే పరిఢవిల్లును. శ్రీనాథుడు దీర్ఘాంత స్త్రీలింగ సంస్కృత పదములు పద్యములలో నేర్చికూర్చెను.

ఉదా: వీట దమకెవ్వ రెదురని వెఱపులేక
చెల్లుబడి బ్రల్లదంబులు సేయదొడగి
రభవు లెంకలు జముని పూఱంక కార్ల
వేశ వాటీ కటీ మధ్య వీథులందు. (హర 5-8)

అట్టివే 7 ఆ॥ 109 వ పద్యమున, 113 వ పద్యమున గలవు.

కారక వక్రత:

సన్నివేశ చిత్రంగా రామణీయకతకు శోభస్కరములగునవి కారకములైనను ప్రధాన కారకమున గాక గౌణకారకమునుపయోగించుట కారక వక్రత యనబడును.

ఉదా: పక్షము పెంపునం గుసుమ బాణుని......( హర 3-39)

ఇక్షు ధన్వుడు సహస్రాక్షుని సభామందిరమున సాక్షాత్కరించునపుడు అప్రధానములైన ఇంద్రుని కన్నులకు ప్రాధాన్యమివ్వబడినట్లు అనగా మహేంద్రుని కన్నులు మన్మథునిపై వ్రాలినవి,'' అనుటలో ఇంద్రుని ఆదరమునకు గల విలువ తెలియవచ్చును.

ఉపసర్గ వక్రత:

వాక్యమునకు జీవభూతమైన రసప్రకాశము ఉపసర్గముల చేత గాని, నిపాతములచే గాని గల్గిన ఉపసర్గ వక్రత —
ఉదా: కట్టెదురన్ నిల్చిన దివ్య సంయముల సంవీక్షించి సంభావనన్
(హర 4-41)

ఇందు సప్తర్షుల ప్రత్యక్షముగా జూచుట "కస్త్వేదుర" అన్రమే డితముతోనే గాక సంవీక్షించుట అను ఉపసర్గముచే దివ్యర్షుల ఆగమమును ప్రత్యక్షానుభూతి నొందింపజేయునదై యున్నది.

వాక్య వక్రత:

సముద్ర మథన ఘట్టమున అమృతోద్భావనమగుటచే మోహినీ దేవత తన మిథ్యాసురులను మాటలతో తృప్తి నొందించినమీదట అమృత భోజనముచే తనియించుట యను సందర్భమున (హార 6-124) వాక్యవక్రతలో గల సముచిత వాక్య వైచిత్రిని కానన గును.

ప్రకరణ వక్రత:

మూల భిన్నమైన వర్షవర్ణము సన్నివేశ చిత్రణమునకై శివ పార్వతుల జోగి జోగి తెలుగ మూరి చిఱుతొండనంబిని పరీక్షించుట మున్నగునవి ప్రకరణ వక్రతకు ఉదాహరణము.

మూలకథకు విచ్ఛిత్తి గలుగక శోభాసంపాదకములగు సన్ని వేశ సంభాషణోపస్కార వర్ణనాదికములు ప్రకరణ వక్రత గల్గినవి.

అట్టిదే దుర్వాసుడు తుంబురుని శపించు ప్రకరణ కల్పనము. అద్భుత రసోత్పాదకమై మూల కథాభిన్నమై కథకొక పటుత్వ మాపాదించిన మరియొక ఘట్టము — శివపార్వతుల ప్రణయ కలహము సంభాషణ, సముద్ర మథన కథా వృత్తాంతము బహు పురాణ ప్రథితమైనను, శ్రీనాథుడు తన ప్రతిభా నైపుణ్యములుట్టిపడ శివోత్కర్షా ప్రతిభాసకమై వర్ణించుట యొక ప్రకరణ వక్రతా భేదముగా గ్రహింపనగును.

ఔచిత్య ప్రాముఖ్యము :

ఆచార్య క్షేమేంద్రుడు "ఔచిత్యం రస సిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్" అను సిద్ధాంతముచు జేసి సాహిత్య ప్రపంచమున ఔచిత్యముయొక్క ముఖ్యత్వమును నిరూపించెను. కావ్యమునందు జీవిత భూతమైన ఔచిత్యమే కరవైనచో అలంకారములతోను లెక్కకు మిక్కిలియైన గుణములతో ప్రయోజనము లేదని ఆతని యభిప్రాయము. ఈతనికి తరువాతి వాడగు ఆనందవర్ధనాచార్యులు ఔచిత్యమునకు విశిష్టస్థానమిచ్చుచు 'అనౌచిత్యాదృతే నాన్యద్రస భంగ స్యకారణమ్', ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషద్పరా" అని పల్కెను. అనగా కావ్యములో అనౌచిత్యమునకంటె రసభంగ హేతువైనది మరొక్కటి లేదని ఔచిత్య సమలంకృతమైన కావ్యము రమణీయమైన రసోపనిషత్తని ఆతని సంస్థాపనము. క్షేమేంద్రుడు విషయ వివరణ మొనర్చి ఔచితీ భేదములను యిరువది యేడుగ పేర్కొనెను.

శ్రీనాథుడు శృంగార నైషధమునను, కాశీ ఖండమునను ఔచిత్యమును గూర్చి తన యభిప్రాయమును పేర్కొనెను. ఔచిత్యం బాదరించియు ననౌచిత్యంబు పరిహరించియు, అని కంఠోక్తిగా శృంగార నైషధమున పల్కుటతో నీతడు ఔచిత్య ప్రస్థాన ఘంటా పథికుడనని సూచించెను. (క్షేమేంద్రు వేడుక జిత్తగించి —— కా.ఖం, 1-19)

వాక్యౌచిత్యము :

ఔచితీ మంతమగు వాక్యము సర్వ సమ్మతమై త్యాగోజ్జ్వల మైన ఐశ్వర్యమువలెను, శీలోజ్జ్వలమైన విద్యవలె నుద్భాసించును.

ఉదా: తటిదభిఘాత వేగమున ధారలు జోరున జాఱుచుండగా
బిటిలు పిటిల్లనం.........
దఘువ పుత్రుని పేళ్లు పదిం జంపింపగన్ (2-22)

ఇందు నంబి భక్తిని పరీక్షించుటకై పరమశివుడు దేవేంద్రుని పిలిచి కాంచీపురమున ముయ్యేడు వాసరంబుల కాల వర్షంబు కురి పింపుమని యాజ్ఞ యిచ్చి ఆతడట్లొనర్చినపుడు ప్రజలు ఆర్తులై అర్జునుని పేళ్లు పదిం జపించిరట. ఇట ఇంద్రహేతుక వర్షము ఇంద్ర సూనుని నామజపమునకు దారితీయుట ఔచితీమంతమైనది. ఔచితీ స్ఫోరక వాక్యవర్ణనమునకే వర్షవర్ణన తోడ్పడినది.

గుణౌచిత్యము :

సందర్భానుసారముగ ఓజః ప్రసాద మాధుర్య సౌకుమార్యములు కావ్యత్వ సంపాదనార్థములై శోభిల్లునవి.

మాధుర్యము:- సరసంబగు వాక్యంబులు
వరుసను వేర్వేరు మించు నగ మాధుర్యంబు
(60 ప కా.సం. 530 పుట.)

విడివిడిగా ననగా దీర్ఘసమాసములు లేక సరసములగు పదములు గూర్చుచో నది మాధుర్యగుణము. "పృథక్పదత్వం మాధుర్యం" అను వామనుని లక్షణమున కిదియే యర్థము. సరసములగు వాక్యంబులు అనుచో వాక్యమున బదమనియే లక్షణార్థము జెప్పికొనవలెను.

శృంగారములో మాధుర్యము:

పాకశాసనునకు బరిహాస వచనంబు
గాలకేయునకు శృంగారలీల
వైవస్వతునకు భ్రూవల్లరీ నటనంబు
కరటిదానవునకు గలికిచూపు

పాశపాణికి గుచప్రాంతోరు దర్శనం
బంధకాసురునకు నలతినగవు
ధననాయకునకు నుత్కంఠా విశేషంబు
మహిషునకు నర్మమర్మకలన

గంధవహునకు సిగ్గు జలంధరునకు
గలికి తనము భావకునకు గొనబులికి
వలపు నటియించుచు వారవార తనకు
బాన వారికి వారికి నైనయట్లు. (హం 6-103)

హరి మోహినీ వేషధారుడై ఆకాశంబునుండి దిగ్గి దేవాసుర లందరిని భ్రమించునప్పటి సందర్భములోనిది. సరసములైన పదము లతో మాధుర్యము నొలికించునది. ఆమె హావభావములు కలికి చూపులలో అలతినగవులతో నర్మ మర్మకలనలో పరిహాసవచన ములలో శృంగారలీలలలో తెలియవచ్చును.

ఓజస్సు:

ధీర్ఘసమాసత్వము ఓజస్సు. (విలసిత) సమాస భరితోజ్వల బంధం బోజమయ్యెసరి.

వీరములో ఓజస్సు:

జవమేపాఱంగ గూలె దైత్య తనువుల్ సర్వంసహా పీఠి బాండవ గాండీవ ధనుః ప్రకాండ ... ... (హర. 7-176)

నివాత కవచులను రాక్షసులు దేవతల బాధించుచుండిరి. దేవేంద్రుడు అర్జునుని వారిని సంహారింప బంపును. గాండీని చండ ప్రచండ పాండిత్య విశేష విభ్రమములు గొల్పు బాణములతో రాక్షసుల పరిమార్చునపుడు చెలరేగిన హాహాకారములు నింగి

ముట్టినవట. దీర్ఘ పదసముదాయముతో జంభారి సుతుని వీరమున ఓజస్సు ప్రతిబింబించును.

ప్రసాదము:

"ప్రసిద్ధ పదంబుల సలఘూక్తి ప్రసాదమయ్యె నదియెట్లన్నన్"
ప్రసిద్ధార్థముతో గూడిన పదములవాడుక ప్రసాదగుణము.

కరుణములో ప్రసాదము:

హస్తయుగ్మము మోడ్చి ప్రార్థించి పలికెద (హర 3-90)
ఇందు చితాగ్ని, ధర్మోదకము, పిండకబళము, మున్నగునవి దహనాదికముల పిదప నొనర్చు సంస్కారాదికములు. ఇట రతీదేవి శోకార్తయై భర్తతోడిదే లోకమని ఆతని ననుసరించిన పిమ్మట చితి ముట్టించి తేనెతో ధర్మోదకములిచ్చి సహకార మంజరీ చరు పిండ కబళమిడి పికము ముట్ట తేనె గొజ్జంగి నీరు చెంబులిడుమని వసంతుని వేడుకొనుచున్నది.

రసౌచిత్యము కరుణము:

చన్నిచ్చు బాగున జనయిత్రి తొడలపై
బసిబిడ్డ బవ్వళింపగబెట్టె (హర 2-115)

ఇందు సిరియాళుని జంగమ ప్రీత్యర్థము వధింపబోవు ఘట్టము వర్ణితము. చందననంగ, తిరువెణ్గాట్టునంగ, నంబి ముప్పురు చేరి వధించునప్పటి స్థితిని సిరియాలుని మనఃస్థితి వారితో నేకముగుట, కరుణరసప్లావితమై హృదయమును తాకును.

క్రియా పదౌచిత్యము:

క్రియాపదములలో ప్రసాద మాధుర్యాది గుణసంపదనే గాక ఔచితీమంతమైన వృత్తి సంపదతో కావ్యశోభ యినుమడించును.

"అనువు దప్పిరి నొచ్చి రలసి రాపదనొంది; రదపదలైరి చీకాకుపడిరి" ఇందు తారకాసురునిచే ముక్కోటి దేవతలు పడ్డపాట్లు హృదయ విదారకముగా ప్రస్తుతార్థమును సువ్యక్త మొనర్చునట్టి క్రియా పదౌచిత్య భాసితమైనది. ఆయా సందర్భముల ఔచిత్యము పాటింపబడి హారవిలాసమున క్షేమేంద్రుని ఔచిత్య సిద్ధాంతమును అమలు పఱచినట్లున్నది.

చమత్కార సంప్రదాయము:

ఆలంకారికులు చమత్కార సంప్రదాయమును గూర్చి ముచ్చటించినను పరమార్థ పరమున వినియుక్తమైనది. లోకోత్తర చమత్కారముచే సహజము అక్షరమునైన ఆనందము అభివ్యక్తము చేయుట రసాత్మక మొనర్చుట యిందు పద్ధతి. అగ్నిపురాణకారుడు.

ఆనః సహజస్తస్య వ్యజ్యతే స కదాచన
వ్యక్తిః సాతస్య చైతన్య చమత్కార రసాహ్వాయా
(అ. పు. 339-2)

అనుటలో రసాత్మకమైన చైతన్య చమత్కారము ఆనందము నిచ్చునని తెలియును. మొత్తముమీద సహృదయ చిత్త విస్తారరూపమైన విస్మయము చమత్కారమని[5] తెలియుచున్నది,

అవిచారిత రమణీయము:

సద్యస్స్ఫురితమై హృద్యమైనదే అవిచారిత రమణీయము.

ఉదా: మృదునెన్నడు తలపైగ
వ్వాడి యడుపందొడడె గాండీవంబున నెడలో

5. రామవరసింహం, కాకర్ల, వెంకట; సాహిత్య దర్శనము. పుట-106.

నుడుగక పొడమెడు భయమున
వడకుం గుబ్బలి కుమారి వడవడ వడఁకన్. (7-70)

గౌరి వడకు గుబ్బలి కుమారి. ఇతరులను వడికింప జేయు మంచుకొండ కూతురై యుండియు తానే స్వయముగా వడకిపోయెనని వర్ణించుట చమత్కారము. చెంచెతయై పార్వతి కిరాత వేషమున జను శివుని వెంటజని హరపార్థుల యుద్ధము జూచి గాండీవముచే శివుని మోదు నప్పుడు వణికిన సందర్భములోనిది.

రసగతము:

విభాను భావ రస పోషక సామగ్రీ సముల్లసితమై సహృదయ హృదయానందము గల్గించుచు రసస్ఫూర్తిని ప్రకటించుటయే లోకోత్తర చమత్కారము.

ఉదా: తలమీఁది చదలేటి దరి మీలఁ దినజేరు
కొంగలు చెలకి కొంగొంగురనగ (హర 5-16)

ఇందు శివుని భైక్షుక వేషము సహజ సుందరమై హాస్యరసస్ఫోరకమై రసగతమగు చమత్కారానందము నిచ్చుచున్నది. పై విధముగ నీ అధ్యాయమునందు హరవిలాస సాహిత్యావలోకనము గావింప బడినది. తద్వారా హరవిలాసము కావ్యమై అన్వర్థనామధేయముతో నొప్పుచున్నదని అందలి కథలు శివ సంబంధములై యొకే పుష్పపు దళములవలె విచ్చి సుమనోహరములై హరవిలాస భావబంధుర ములై రమణీయార్థ ప్రతిపాదకములై రసానంద ప్రతిపాదకములై యొప్పుచున్నవని తేలినది.



# ఉపజీవ్య గ్రంథసూచిక

తెలుగు:

అచ్యుతరావు, చేకుమళ్ళ, 'నాసికేతోపాఖ్యానము - దగ్గుపల్లి దుగ్గన; భారతి, జనవరి, 1927.

అనంత పద్మనాభశర్మ, రేవూరి, 'శ్రీనాథయుగపు సాహిత్య పరిశీలన, 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, కీలక సం॥ 1957, సంచిక 6.

అయ్యవారు, టి. బి. యం., 'హరవిలాసము - కిరాతార్జునీయము' భారతి, ఏప్రెల్, 1964.

అర్క సోమయాజి, ధూళిపాళ, కవికులపతి కాళిదాసు; సాహితీ వాఙ్మయము I, నరేంద్ర - సాహిత్యమండలి, తణుకు, 1969.

ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యము V, యం. శేషాచలం అండ్ కో, మద్రాసు, 1965.

ఈశ్వరదత్తు, కుందూరి, శ్రీనాథుని ప్రశంస, భారతి, ఫిబ్రవరి 1927.

...... శ్రీనాథుడు - బంగారు మొలక; ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక- పార్థివ 42-43.

...... శ్రీనాథుని కవిత్వతత్త్వము, ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్ రోడ్, హైద్రాబాద్, 1964.

కమలా అనార్కలి, సి. హరవిలాసము - శ్రీనాథుని స్వతంత్ర కావ్యము, సాహితీ మంజూష, కళాస్రవంతి, క్రొత్తనల్లకుంట, హైదరాబాదు, 1973.

కార్తికేయశర్మ, ఇంగువ, 'ఆంధ్రమున శైవము - చతుర్ముఖ శివ లింగము', భారతి, నవంబర్, 1980.

కుప్పుస్వామయ్య, నాగపూడి, 'శ్రీనాథుని కవిత్వము' ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, పింగళ, 1917.

కృష్ణమాచార్యులు, కోవెల, 'శ్రీనాథుడు' - ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, 1914.

కృష్ణశాస్త్రి, మంకాల కృష్ణమూర్తి, ఎన్.వి. 'సాహిత్య ప్రబోధము', 'సాహితీ సదస్సు, 40-371, విద్యానగర్, కర్నూలు, 1972.

గాండీవి, 'హరవిలాస విమర్శనము', ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, సంపుటి-48, వికారి సం॥.

గోపాల కృష్ణమూర్తి శ్రీపాద, 'నా కవిత్వము కర్ణాట భాష అంటే' భారతి, ఫిబ్రవరి, 1961.

గోపాల కృష్ణమూర్తి, శ్రీనాథుని హరవిలాసము, ఫిబ్రవరి 1961.

చెన్నారెడ్డి, జీరెడ్డి, 'సోమన రచనలలో వీరశైవమత లక్షణములు, సాహిత్య ప్రబోధము; సాహితీ సదస్సు, విద్యానగర్, కర్నూలు, 1972.

తమ్మయ, బండారు, 'శ్రీనాథుడారాధ్య బ్రాహ్మణుడా? 'ఆంధ్రపత్రిక, ఉగాది సంచిక; రుధిరోద్గారి, 1923 - 24.

తమ్మయ, బండారు, 'శ్రీనాథకవి ప్రయోగములు, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక - సం. 24, 1935.

...... శ్రీనాథుని జాతీయములు-భారతి, మార్చి, 1949.

...... శ్రీనాథ మహాకవి, భారతి, డిసంబరు, 1968.

దోణప్ప, తుమాటి, 'శ్రీనాథ యుగము - అన్యదేశ్యములు' భాషా చారిత్రక వ్యాసావళి, ఆంధ్రసారస్వత పరిషత్తు, తిలక్ రోడ్, హైదరాబాదు, 1972.

నన్నయ, 'ఆంధ్ర మహాభారతము', రవీంద్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, 1967.

నన్నెచోడుడు, కుమారసంభవము, వావిళ్ళ రామస్వామి శాస్త్రి అండ్ సన్స్, 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి-1, 1961.

నరసింహమూర్తి అయ్యంగారి, 'కుమార సంభవమున కాళిదాసు ప్రతిపాదించిన ప్రేమస్వరూపము, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, సంపుటి-52, శోభకృతు, 1963.

నరసింహమూర్తి, అప్పల, 'శ్రీనాథుడు', భారతి, జూలై 1971.

నరసింహారావు, వా. వెం.ల, 'శ్రీనాథుని కల్పనా శిల్పము' భారతి, జూన్ 1950.

నాగయ్య, జి. 'ద్విపద వాఙ్మయము', మాలికో ప్రింటర్స్, తిరుపతి, 1967.

నాగేశ్వరరావు పెదపాటి, 'శ్రీనాథుని పంచప్రాణములు', పరిశోధనా వ్యాసములు, సారస్వత గురుకులము, చిలకలూరిపేట, 1971.

నారాయణాచార్యులు, పుట్టపర్తి, 'శ్రీనాథుడు – మన స్తత్వము', భారతి, జూలై 1941.

పాపయ్యశాస్త్రి, చిలుకూరి, 'శ్రీనాథకవి జీవితము గ్రంథసమీక్ష' భారతి, డిసంబర్ 1931.

...... భీమేశ్వర పురాణము – కొన్ని స్థల విశేషములు, భారతి, అక్టోబర్ 1944.

...... శ్రీనాథుని కృతులలో ఋతువులు, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, 44 సం॥ సంచిక 5, 1955.

...... 'శ్రీనాథుని రచనలు ఐతిహాసిక విశేషములు', భారతి, ఫిబ్రవరి, 1957.

...... 'ఊర్వశీ ప్రణయభంగము', భారతి, ఏప్రెల్ 1957

...... హరవిలాసము, 'దేవదారు వనవిహారము', భారతి, ఆగస్టు 1958

...... 'హరవిలాసము - కుమారగిరి', భారతి, జూలై 1958.

...... శ్రీనాథుని రచనలలో భక్తి శృంగార శబ్దతలలు', భారతి, మే 1958.

...... '(శ్రీ)నాథుని కవితాప్రపత్తి - శివభక్తి వ్యక్తి', భారతి, ఏప్రెల్, 1960.

...... '(శ్రీ)నాథుని కవితాసమీక్ష - రెడ్డిరాజుల చరిత్ర', భారతి, అక్టోబరు, 1961.

...... 'హరవిలాసములో హరివిలాసము', భారతి, నవంబరు, 1961.

...... '(శ్రీ)నాథుని హరిభక్తి', భారతి, ఫిబ్రవరి, 1962.

...... '(శ్రీ)నాథుని కవిత్వతత్త్వ సమీక్ష' భారతి, సెప్టెంబరు, 1964.

పిచ్చయశాస్త్రి, దీపాల, '(శ్రీ)నాథుడు - యతిదోషములు', భారతి, జూలై 1964.

...... 'కుమారసంభవము - పార్వతీ శీల చిత్రణము', ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, దుర్ముఖి, 1945.

పురుషోత్తం, బొడ్డుపల్లి, 'కాళిదాస కవి, (శ్రీ)అరవింద రవీంద్ర ప్రవచనములు' (శ్రీ) గిరిజా ప్రచురణలు, విద్యాలంకార్, బి-31, శ్రీనివాసనగర్ కాలనీ, గుంటూరు, 1978.

పోతన, బమ్మెర, 'ఆంధ్ర మహాభాగవతము', రవీంద్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, 1964.

ప్రభాకరశాస్త్రి, వేటూరి, 'హరవిలాసము - శ్రీనాథకవి సార్వ భౌముడు' ఆనంద ముద్రణాలయము, మద్రాసు-1939.

ప్రసాదభూపాలుడు, వీరశైవ (లింగాయత) మతము, ఆంధ్ర విజ్ఞానము-6 వ సంపుటము.

రాధాకృష్ణశర్మ చల్లా, 'తమిళ సాహిత్య చరిత్ర' ఆంధ్రప్రదేశ్, సాహిత్య అకాడమీ, కళాభవన్, హైద్రాబాద్, 1976.

రామం, క్రొవ్విడి, 'భీమఖండం', భారతి, నవంబరు, 1943.

రామకృష్ణమాచార్యులు,'తరువాతి కవులపై ఎఱ్ఱనార్యుని ప్రభావము' ఎస్. వి. ఆర్ట్స్ కాలేజి, మ్యాగజిన్, 1974-75.

రామకృష్ణశాస్త్రి, శిష్ట్లా 'పదకవిత - సిరియాళ చరిత్ర', భారతి, ఖర, శ్రావణము సంచిక 8, 1951.

...... శ్రీనాథుని హరవిలాసము - చక్కని పాఠాంతరము', భారతి, ఫిబ్రవరి, 1961.

రామయ్య, బాడాల, 'బసవేశ్వర వచనములు - సమగ్ర సమీక్ష' మైసూరు విశ్వవిద్యాలయము, తరళబాళు జగద్గురు విద్యా సంస్థ, సిరిగిరె, చిత్రదుర్గ, 1976-77.

రామారావు, పాలావఝుల 'శ్రీ శివలీలలు', కవితా పబ్లికేషన్స్, విజయవాడ, 1968.

రామమోహనరావు, ఎ, 'విశ్వనాథవారి యతిగీతము', భారతి, మే, 1964.

లక్ష్మీకాంతము, పింగళి, 'ఆంధ్ర సాహిత్య చరిత్ర', ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు 1974.

లక్ష్మీరంజనం, ఖండవల్లి, 'శ్రీనాథ పదప్రయోగకోశము', సంపుటములు I & II.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవన్ హైదరాబాద్-4, 1966.

...... 'ఉపోద్ఘాతము' - హరవిలాసము, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవన్, హైదరాబాద్-4, 1968.

విమర్శకుడు-'కావ్యాలలో మతం' - శ్రీనాథుని శివభక్తి, పరిశోధన, ఫిబ్రవరి-మార్చి, 1956.

వీరభద్రరావు, చిలుకూరు, 'శ్రీనాథకవి జీవితము', భారతి, ఫిబ్రవరి, 1932.

వెంకట రమణయ్య, నేలటూరి, 'శ్రీనాథుని జన్మస్థానము', భారతి, ఏప్రిల్ 1933.

వెంకట రంగయ్య, మామిడిపూడి, 'భీమేశ్వర పురాణం', భారతి, మే, 1925.

వెంకట రామనరసింహం, కాకర్ల 'సాహిత్య దర్శనము', కె. హరనాథ్ అండ్ బ్రదర్స్, విశాఖపట్టణం-3, 1972.

వెంకటరావు, నిడుదవోలు, 'హరవిలాస కిరాతార్జునీయము-వీరశైవ సంప్రదాయము', భారతి, జూలై 1954.

వెంకట శేషశాస్త్రి, గడియారం, 'శ్రీనాథకవి సార్వభౌముడు', ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1975.

వెంకటావధాని, దివాకర్ల, 'ఆంధ్రవాఙ్మయ చరిత్రము', ఆంధ్రసారస్వత పరిషత్తు, 1958.

వేంకట కృష్ణారావు, కో. రా. 'హరవిలాసము - పీఠిక', శ్రీ బాల సరస్వతీ ముద్రాక్షరశాల, కర్నూలు, 1901.

వేంకటకృష్ణారెడ్డి, దేవరపల్లి, 'శ్రీనాథుని పాకనాటి కాల్పట్టణము,' భారతి, మే 1962.

వేంకట నరసింహాచార్యులు, ఉత్పల, 'హరవిలాసము-పీఠిక', వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 69 మలయ పెరుమాళ్ స్ట్రీట్, మదరాసు, 1916.

వేంకట రమణయ్య, బులుసు, 'శ్రీనాథుడు-కర్ణాటభాష', భారతి, నవంబరు 1944.

వేంకటేశ్వర్లు, వారణాసి, 'ఆంధ్రవాఙ్మయ చరిత్ర', స్టూడెంట్ ఫ్రండ్స బుక్ సెల్లర్స అండ్ పబ్లికేషన్స, నరసరావుపేట, గుంటూరు జిల్లా, 1977.

వేంకట లక్ష్మీనృసింహశర్మ, ఓలేటి, 'అష్టాదశ పురాణములు', కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్, సంస్కృతాంధ్ర బుక్ డిపో, రాజమండ్రి, 1980.

శేషాద్రిశర్మ, జనమంచి, 'శ్రీమదాంధ్ర బ్రహ్మాండ పురాణము', అనుషంగపాదము - వావిళ్ల రామస్వామి అండ్ సన్స్, 1914.

శ్రీనాథుడు, 'హరవిలాసము', ఎమెస్కో సంప్రదాయ సాహితి, ఎం. శేషాచలం అండ్ కో, మదరాసు 1, 1971.

శ్రీనివాసరావు, వేమూరి, 'పూర్వగాథాలహరి', 1976.

శ్రీరామమూర్తి, కొర్లపాటి, 'శ్రీనాథుడు, పూర్వకవితాచర్వణము', ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపుటి 54, విశ్వావసు.

...... 'శ్రీనాథుడు', కళాభారతి, గుంటూరు, 1971.

...... 'ఈశ్వరార్చన కళాశీలుడు', జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్, అరండేల్‌పేట్, గుంటూరు, 1974.

సత్యనారాయణ, విశ్వనాథ, 'కావ్య పరీమళము', ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్ - 4, మే1970.

సత్యనారాయణ, జొన్నలగడ్డ, సంపా,'శ్రీ వివేకానంద గ్రంథావళి', శ్రీరామకృష్ణ మఠము, మైలాపూర్, మద్రాసు, మే 1962.

సత్యనారాయణశాస్త్రి, మధునాపంతుల,'శ్రీనాథుని ఉపసర్గసంవిధానము', భారతి, జూలై 1947.

సాంబమూర్తి కత్తి, 'శ్రీనాథుని చిత్ర కవితా విలాసము', భారతి, జూన్ 1966.

సాంబశివరావు, పులిచెర్ల, 'శ్రీనాథుని భోజనము', భారతి, అక్టోబరు, 1971.

సుబ్బరామయ్య, గన్నవరం, 'శ్రీనాథకవిరాజకథ', భారతి, నవంబరు 1938.

సుబ్బారావు, వడ్డాది, (సంకలనకర్త) 'రెడ్డి సంచిక', 1942.

సుబ్రహ్మణ్యం, జి. వి. 'వీరరసము', విలాసకావ్యములు', అజంతా ప్రింటర్స్, సికిందరాబాద్, హైదరాబాద్, 1961.

'సారస్వత సౌరభము', ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకడెమీ, హైదరాబాద్, 1966.

సుబ్రహ్మణ్యశాస్త్రి, పోతుకూచి, 'శ్రీనాథుడు - కొన్ని ప్రయోగములు', భారతి, జనవరి 1940.

సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీపాద, 'శ్రీమహాభక్త విజయము', వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి, 1966.

సూర్యనారాయణ, జె. వ్యాసరాజి, - 'కాళిదాసు-శ్రీనాథ-నన్నెచోడులు'; శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి, 1969.

సూర్యనారాయణ శర్మ, పొంగూరి, 'శ్రీ శివభక్త చరితము' ది ప్రిమియర్ ఆర్ట్ ప్రెస్, పారసవాకం, మద్రాసు-7; 1962.

సూర్యనారాయణశాస్త్రి, మల్లాది, సంస్కృత వాఙ్మయ చరిత్ర, ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్ రోడ్డు, హైదరాబాద్, 1961.

సూర్యనారాయణశాస్త్రి, వెంపరాల, 'నాకవిత్వంబు నిజము కర్ణాట భాష' ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, చిత్రభాను, 1942-43.

సూర్యనారాయణశాస్త్రి, సన్నిధానం, 'కావ్యాలంకార సంగ్రహము', యం. శేషాచలం అండ్ కో, హిందూ ప్రెస్, మచిలీపట్టణం, 1965.

సోమన, నాచన, ఉత్తర హరివంశం, వావిళ్ళ రామస్వామి అండ్ సన్స్, తంబుచెట్టి స్ట్రీట్, మద్రాసు, 1961.

సోమన, పాల్కురికి, 'బసవపురాణము', వేటూరి వారిచే పరిష్కృతము, చెన్నపురి ఆంధ్రపత్రిక కార్యాలయము, 1926.

స్ఫూర్తిశ్రీ, 'శ్రీనాథుని దండకములు', భారతి, జూలై 1967.

హనుమచ్ఛాస్త్రి, ఇంద్రగంటి, 'కాళిదాస కళామందిరము', పబ్లిషింగ్ హౌస్, ఏలూరు రోడ్, విజయవాడ, 1972.

...... శ్రీనాథుడు, సంగ్రహాంధ్ర విజ్ఞాన సర్వస్వము, సంపుటి 4, ఆంధ్ర భాషాసమితి, 1961.

ఆంధ్ర రచయితల సంఘము, హైదరాబాదు-44, 'ఆంధ్ర దేశ చరిత్ర భూగోళ సర్వస్వము' 2, 1976.

తెలుగు భాషాసమితి, మద్రాసు-5. 'విజ్ఞాన సర్వస్వము' 4 వ సంపుటము–1961.

తమిళము:

జగన్నాథన్, కి. వా. 'నాయన్మారుల కథలు', అముదనిలయం లిమిటెడ్, చెన్నై, 1958.

తమిళవళర్చి కళగమ్, కలైకళంజియమ్, 5వ సంపుటి, 1959.

తిరుకచ్చినంబిదాసర్, 'తిరుకచ్చినంబి ప్రభావము', ఆనంద అచ్చేంద్రశాల, 1906.

రాజమాణిక్యం, 'పెరియ పురాణము – ఆరాయిచ్చి', పళనియప్ప బ్రదర్, చేపాక్కం, చెన్నై-5; 1948.

'శివభక్త విలాసము', తులసి లింగిచెట్టియార్, కైరాళి పబ్లికేషన్స్, మద్రాసు-1907.

సుబ్రహ్మణ్యముదలియార్, (వ్యాఖ్య) పెరియపురాణం, 6వ సంపుటం శైవసిద్ధాంత కూర్పు, 1974.

సేక్కిళార్, తిరుత్తొండపురాణం, శైవసిద్ధాంత సమాజ విడుదల, 1934

...... 'తిరుత్తొండ పురాణం', శైవసిద్ధాంత మహాసమాజం, 40, ముత్తయమొదలి తెరు, వేళాల తేనాంపేట, చెన్నై, 1950.

కన్నడము:

'భీమయ్య, బసవపురాణము'.

హరిహరుడు, 'గిరిజాకల్యాణ మహాప్రబంధము', కన్నడ నాటక పరిషత్తు, చామరాజ నగర్, బెంగళూర్-18, 1976.

'గిరిజా కళ్యాణప్రబంధం'; కర్ణాటక విశ్వవిద్యాలయం, 1965.

'శివశరణ సంపుటి', బెంగళూరు విశ్వవిద్యాలయము, 1973.

సంస్కృతము:

ఆపస్తంబఋషి, 'స్మార్తానుక్రమణిక'. శ్రీరాజారామ్ మోహన్ రాయ్ ప్రెస్; 48, వెల్లాలర్ వీధి, పొరసవాకం, మద్రాసు, 1896.

ఉత్ప్రేక్షా వల్లభుడు, 'భిక్షాటన కావ్యము'; తుకారాం జవాజి, నిర్ణయసాగర్ ప్రెస్, బొంబే, 1897

ఉపమన్యువు, 'శివభక్తి విలాసము'; మద్రాస్ లాజర్నల్ ముద్రాశాల, 1931.

కాళిదాసు, 'కుమారసంభవము;' వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 490, తిరుపత్తియూరు హైరోడ్డు, మదరాసు 21, 1976.

భారవి, 'కిరాతార్జునీయము'; అఖిలభట్టాచార్య ప్రణీతము, 1933.

లింగాభట్టు, నామలింగాను శాసనము; వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి, 1962.

వ్యాసుడు, శ్రీమద్భాగవత పురాణమ్; గీతాప్రెస్, గోరక్‌పూర్, 8 వ ముద్రణ, 1945.

శ్రీమన్మహాభారతం, గీతా ముద్రణాలయం 2013 (విక్రమాబ్దే)

కృష్ణయజుర్వేదీయం, తైత్తిరీయ బ్రాహ్మణము; ఆనంద శ్యామా సీరీస్ - 37, పూనా, 1938.

'కావ్య స్వరూపమ్', ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-4, సౌమ్యనామ సం॥.

'బోధాయనోక్త మహాన్యాసము'; ఆర్యానంద ముద్రాక్షరశాల, తృతీయ ముద్రణ, 1915.

'భిక్షుకోపనిషత్తు'; అడయార్ గ్రంథాలయము, మద్రాసు, 1912.

'యాజుషస్మార్తమంత్ర పాఠము'; ఆర్యానంద ముద్రాక్షరశాల, 1915.

విశ్వనాథశాస్త్రి, సరిపెల్ల, 'స్కాంద మహాపురాణం,' తిరుమల తిరుపతి దేవస్థానము - 1975.

'లింగపురాణము' - పండి పుస్తకాలయము, కాశి, 1963.

'స్కాంధ మహాపురాణము' 5 వ భాగము. ఉత్తరార్థము - క్లైవు రోడ్, కలకత్తా - 1; 1962.

**English:**

Audi Lakshmi M., Contribution of Telugu Saivaite Literature to South Indian Literature (Unpublished Thesis) University of Madras.

Devasenapathi V. A.. Audi Shankara, The Institute of Trsditional Culture, University Buildings, Madras, 1975.

.... .... Salve Siddhanthamu, University of Madras, 1974.

David DeaM Shulman, Tamil Temple Myths, Asia Pubiishing House, 1978.

George L. Hart III, Sanskrit and Indian Studies. Ridel Publishing Company, 1979.

Mythill K. L., History of Kanchi, Unpublished Thesis University of Madras.

Nallaswami Pillai, Periapuranam.

Ed. Sendilvelu Mudaliyar, Kalaratnakara Press, Madras, 1903.

Nambi Aroran K., Culture of Tamils as reveaded by the Peria Puranam, (History Thesis) 1968.

Rajamanikkanar M., The Development of Saivism in South Indian under Pallavas and the Imperial Cholas 300 to 1300 AD' unpublished Ph.d. Thesis, 1950.

Somasekhara Sarma M., History of Reddi Kingdoms Andhra University, 1948.

